# ముందుమాట

మహా కావ్యాలనుండి మనము చాలా తెలుసుకోవలసిన ఆవశ్యకతను దృష్టియందుంచుకొని ఆంధ్ర సారస్వత పరిషత్తు మహా భారతోపన్యాసముల కార్యక్రమమును మార్చి 1955 లో నిర్వహించి యుండెను. ఆ ఉపన్యాసముల నన్నింటిని కూర్చి మన్మథ నామ సంవత్సర మాఘమాసమున పుస్తక రూపమున ప్రకటించుట జరిగినది. ఆ ఉపన్యాసములకును, పుస్తకమునకు రసికుల ఆదరణ బాగుగా లభించినది. తెనుగు పత్రికలు పరిషత్తు పూనికను ప్రశంశించినవి. అయాచితముగా తిరుపతి వేంకటేశ్వర యునివర్సిటీవారు మా మహా భారతోపన్యాసములను B. A. కు వచన పాఠ్యభాగముగా నిర్ణయించి మా ఉద్దేశ్యములకు బలమును చేకూర్చినారు. ఆంధ్ర సారస్వత పరిషత్తు తిరుపతి యునివర్సిటీ వారికి, ఆ యునివర్సిటీ పాఠ్యపుస్తక నిర్ణాయకులకు హృదయ పూర్వకమైన కృతజ్ఞతలు అందజేయు చున్నది.

విద్వాంసుల సహకారముతో తెలుగు వారికి ఆదర పాత్రమైన భాగవతోత్సవములను కూడ నిర్వహింప దలచినామని భారత మహోపన్యాసము లందు ప్రకటించి యుంటిమి. దైవానుగ్రహమువల్ల విద్వాంసుల సహకారము లభించినది. ఆంధ్ర ప్రదేశావతరణ శుభ సందర్భమున కార్తీక శు॥ ౧ లు మొదలు సప్తమీల పర్యంతము 1956 నవంబరు 3 నుండి 9 వరకు తిలక్ రోడ్డున ఈ క్రింది విధముగా కార్యక్రమము కొనసాగినది.

*నవంబరు 3 వ తేది శనివారము :* పోతన చరిత్ర - స్థలకాలములు అను విషయముపైన శ్రీ మల్లపంల్లి సోమశేఖరశర్మగారు ఉపన్యసించిరి. సభకు పరిషత్తు ఉపాధ్యక్షులైన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు అధ్యక్షత వహించిరి.

*నవంబరు 4 వ తేది ఆదివారము :* పోతన - అనువాద విధానము అను విషయముపైన శ్రీఆచార్య కురుగంటి సీతారామయ్యగారు మాట్లాడిరి.

తెనుగున గర్గభాగవతము రచించిన శ్రీ చిపుకుల అప్పయ్యశాస్త్రిగా రధ్యక్షత వహించిరి.

*నవంబరు 6 వ తేది మంగళవారము* : ఆంధ్రభాగవత కవిత్వమున గురించిన రెండు ఉపన్యాసములను శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు చదివిరి. ఈ సభకు ఉస్మానియా యునివర్సిటీ తెనుగు శాఖాధ్యక్షులైన శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం గా రధ్యక్షత వహించిరి. కార్యక్రమము ప్రకారము నవంబరు 5 వ తేదీ సోమవారము వర్షాపాతమువల్ల ఆనాటి కార్యక్రమము సాగలేదు. అందువల్ల 5 వ తేదీ ఉపన్యాసము 6 వ తేదీ ఉపన్యాసము రెండు 6 వ తేదీన సాగినవి.

*నవంబరు 7 వ తేది బుధవారము* : భాగవతోపాఖ్యానములు వాని అంతరార్థములు' అను విషయమును శ్రీ తల్లావఝ్ఝుల శివశంకరస్వా గారు ముచ్చటించిరి. విజ్ఞానవర్ధనీ పరిషత్తు కార్యదర్శులైన శ్రీ కేశవసంతుల నరసింహశాస్త్రి గా రీసభకు అధ్యక్షత వహించిరి.

*నవంబరు 8 వ తేది* : రాజవంశావళులు-భువనకోశము అను విషయమును డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు వివరించిరి. ఆనాడు ఈ పరిషత్తు స్థాపకులలో ముఖ్యులు పరిషత్తు ప్రథమాధ్యక్షులైన శ్రీ లోకనంది శంకరనారాయణరావుగారు అధ్యక్షత వహించిరి.

*నవంబరు 9 వ తేది* : వాసుదేవ తత్త్వము-భాగవత వైష్ణవమును గురించి శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారు భాషించిరి. డాక్టరు దిః కర్ల వేంకటావధాని గా రీసభకు అధ్యక్షత వహించిరి.

ఈ విధముగా పదు రోజులు సభలు జరిగినవి. ఆంధ్ర ప్రదేశ్ అవతరణ సందర్భమున పెక్కు సాంస్కృతిక కార్యక్రమములు హైదరాబాదు సికిందరాబాదు జంట నగరాలలో జరుగుచున్నప్పటికి, విద్యార్థులు, ఉపాధ్యాయులు పండితులు, రసికులు సభలలో పాల్గొనియుండిరి. మా యీ ఉద్యమమునకు

సహాకరించి, సభలకు అధ్యక్షులుగా ఉపన్యాసకులుగ దయచేసి మమ్ము ప్రోత్సహించిన విద్వాంసు లందరికిని నమోవాకములు.

ఎన్నికల సంరంభము వల్ల, పాఠ్యపుస్తకముల పనుల ఒత్తిడివల్లను, ఈ పుస్తకము అనుకున్న విధమున అనుకున్న సమయమున అచ్చువేయించి పాఠకలోకమునకు అందించలేకపోయినందుకు విచారించుచున్నాము. ఈ పుస్తకమును ఈ రూపమున అచ్చువేసి ఇచ్చిన 'శివాజీ ప్రెస్సు' వారికి మా కృతజ్ఞతలు.

ఆంధ్రావళి మోదము మాకు లభించగలదన్న విశ్వాసముతో ఈ పుస్తకమును పాఠకలోకమునకు అందజేయు చున్నాము.

భాగవత పురాణ ఫలరసాస్వాదన
పదవిఁ గనుడు రసిక భావ విదులు

---

హేవిళంబి
ఆశ్వయుజ శు॥ ౧
ఆంధ్ర సారస్వత పరిషత్తు.

విధేయుడు
**పులిజాల హనుమంతరావు**
ప్రధాన కార్యదర్శి

# విషయ సూచిక

# పోతన చరిత్ర - స్థలకాలములు



ఈ యాంధ్ర ప్రదేశావతరణ శుభసమయము ఆంధ్ర సంతతికి మహోదయ పర్వకాలము. తెలంగాణా, రాయలసీమ, మధ్యాంధ్రములందలి ముక్కోటి ఆంధ్రులు రాజకీయావరోధ ప్రాకారములను భగ్నము కావించి చిరకాలాశయానుగుణముగా, సుదీర్ఘ కృషి తపఃఫలముగా ఏకైక ప్రభుత్వపతాకచ్ఛాయను కలసికొని యాంధ్ర మాతకు దివ్యపుష్పాంజలీ పూర్వక సువర్ణ కర్పూర మంగళ నీరాజనము లిచ్చుచున్న జాతీయ మహోత్సవ పర్వసమయ మిది. అలంపురాహోబల ద్రాక్షారామ క్షేత్రాధిదైవతములగు బ్రహ్మవిష్ణు మహేశ్వర పరిరక్షిత దివ్యభూమి ఈ యాంధ్ర మహీమండలి. కృష్ణా గోదావరీ పినాకినీ తుంగభద్రాది పుణ్యవాహినీ జల సంవర్ధిత కేదారఖండమరకతమణి ప్రభావిరాజితగాత్రి మనయాంధ్రి. చిరకాల వియోగవ్యథాకులితులైన ఆప్తసోదరజనము కల్యాణోత్సవములలో వలెను, శరదుత్సవములలోవలెను ఒండొరులను గలసికొని చంద్రోదయమునకు సాగరమువలె ఆంధ్ర ప్రదేశావతరణ సందర్భమున నుప్పొంగి యానంద వీచికాడోలికల నుయ్యాల లూగుచున్నది. తెలంగాణము, రాయలసీమ, మధ్యాంధ్రదేశము లను నీమూడు ప్రదేశములును కలసిననే విశాలాంధ్ర సంస్కృతికి సంపూర్ణత. అఖిలాంధ్ర సంస్కృతి వికాసమున కీమూడును సరిసమానముగ తోడ్పడినవి; భవ్యాంధ్రసరస్వతిని విశిష్టపూజా ప్రసవములతో నారాధించినవి. ఆంధ్ర సాహిత్యపరమున జూచినచో పురాణేతిహాసములును మనుచరిత్రవంటి విశిష్ట ప్రబంధములును మధ్యాంధ్రదేశ, రాయలసీమలలోనుదయింపగా ద్విపదకావ్యమవతరించినది ఈ తెలంగాణమున. ఇట్లే కళాపరముగ నాలోచించినచో ఆంధ్ర శిల్పకళాలక్ష్మి మధ్యాంధ్రదేశమున ఉషఃకుమారివలె తన సౌందర్య సంపదను వెలార్చి విశ్వమోహనగీతి నాలపింపగా ఆమె యింపు సొంపులు పుడికి పుచ్చుకొని చిత్రలేఖన సుంధరి

సువర్ణ విరాజితమై అందాలు సవరించుకొన్నది ఈ తెలుగు మాగాణి సీమా వధులనే. దేవహర్మ్య వాస్తువులో నాగర, వేసర, ద్రావిడరీతులకు తోడుగా కళింగరీతియని ఒక క్రొత్తరీతిని ప్రవేశపెట్టి ఆవాస్తుకళకు విశిష్టతను చేకూర్చినది కళింగము. నాట్యకళకు తెలంగాణము ఆలవాలముకాగా రాయల సీమ గేయవాఙ్మయమునకు పునాదులు వేసినది. అంతట కూచిపూడి నాట్యసంప్రదాయ పద్ధతిని నాటక మవతరించినది మధ్యాంధ్రదేశములో. ఆంధ్ర ప్రదేశాంతర్గతములైన మూడు సీమలును సంగీత సాహిత్యములను పోషించినవే; పెంపొందించినవే. అవి చేసిన సాంస్కృతిక కృషిలో ఏది లోపించినను అఖండాంధ్ర సంస్కృతికి కొరత కలిగినట్లే. ఈమూడు సీమలును కలిసిన ఆంధ్ర ప్రదేశము ఆయాసీమలలో జనించి వృద్ధిపొందిన కలాతరంగిణుల నేక మొనర్చి అఖండాంధ్ర సంస్కృతి వాహినికి రూప మిచ్చుచున్నది. నేడు కదా ఈ యాంధ్ర త్రయీవిషయము గంగాయమునా సరస్వతీ పుణ్యస్రోతస్వినుల త్రివేణీసంగమ పుణ్యతీర్థసదృశమై ఆంధ్ర సంతతికి సంసేవ్యమై దాని భావిభాగ్యవిధాత యగుచున్నది.

తెలుగుజాతి కొకనిగూఢమైన ధర్మపథమునుచూపి తెలుగు సంస్కృతికి రూపురేఖలు దిద్దిన యుద్గ్రంథములు రామాయణ, భారత, భాగవతములు. ముద్రితములై ఆంధ్రదేశమున ప్రచారములో నున్న గ్రంథములలో భాషా గౌరవమునను, భావగౌరవమునను, కవితాగౌరవమునను పరిశస్తిగాంచినవి ఒక వందకంటె మించియుండవేమో. వానిలోనెల్ల బహుళ ప్రచారముగలవి పైనుడివిన మూడుగ్రంథములే-రామాయణ భారత భాగవతములు. వీనిలో భారత రామాయణములు మానవ సామాన్యములగు లౌకిక విషయములను, నైతిక విషయములను ధర్మమార్గమున బోధించి ఆంధ్ర జీవితమును తీర్చి దిద్దుట కుపకరించినవి. భాగవత మాముష్మిక ధర్మమార్గ పదర్శకమై మానవ జీవితమును తరింపజేయు భక్తకల్పద్రుమము. ఈ గ్రంథ రత్నముల యందలి యితివృత్తము విశ్వజనీనము; సార్వకాలిక, సార్వదైశిక ప్రయోజనము కలది. వీనిని రచించిన మహాకవులు సరసకవితా సామగ్రిచే వీని

కమృతత్వ మాపాదించిరి. వివిధవిషయాఢ్యములు, సకలాంధ్ర లోకారాధ్యములు. ఆంధ్ర వాఙ్మయ కల్పలతికకు కూకటి వేరులగు ఈ మూడు గ్రంథములలో ఏయొక్కటియు ఏకకవిచే, ఏకకాలమున, ఏకధాటిని రచింపబడక పోవుట ఆశ్చర్య విషాదకరమైన విషయము. పదునొకండవ శతాబ్దిలో నన్నయభట్టారకు డారంభించిన మహాభారతము పదునాలుగవ శతాబ్ది మధ్యను కాని పూర్తిగా తెలుగులోనికి రాలేదు. భాస్కరరామాయణ మను పేరు ప్రసిద్ధమై యున్నను రామాయణ మొక్క భాస్కరుని రచనము మాత్రమే కాదు. కుమార రుద్రదేవ, మల్లికార్జునభట్ట, అయ్యలార్యుల రచనలుకూడ నందున్నవి. ఇక నాంధ్ర మహాభాగవతము బమ్మెరపోతన కృత మని ప్రసిద్ధియున్నను దీనిలోని కొన్ని కొన్ని భాగములను వెలిగందల నారయ, ఏర్చూరిసింగయ, గంగయలు రచియించిరను విషయము ఎల్లరకును విదితమే. అయినను భాగవతమునకు ప్రశస్తి వచ్చినది పోతనామాత్యుని మధుర భక్తిరస పరిప్లుత రచనమువలననే. ఆంధ్రదేశములో భాస్కర రామాయణము కంటెను హృదయరంజకములై శ్రవణపేయములై యఖిల జనాను రాగమును గాంచినవి ఆంధ్ర మహాభారత భాగవతములే. ఈ రెండు గ్రంథములలో తెలుగుదేశమున ప్రశస్తి దేని కెక్కువ యను విషయమును నిర్ణయించుట కష్టము. దేని ప్రశస్తి దానిదే. వాని కవితారీతులే వేరు; అలంకారముల విషయముననను విభేదమున్నది. ఈ గ్రంథములు రెండును ఆంధ్రావళికి సూర్యచంద్రులవంటివి. భారత మాంధ్రులకు ఐహికజీవనమును దిద్దుకొనుటలో లౌకిక, నైతిక ధర్మసూక్ష్మములను కర్మయోగపరముగ నుపదేశింపగా భాగవతము మానవ జీవితమును తరింపజేయుటకు భక్తి మార్గము నుద్బోధించుచున్నది. భక్తి జ్ఞానకర్మయోగములలో భక్తి మార్గమే సుగమము కదా!

ఆంధ్రజాతికి శుభోదర్కమైన ఈమంగళసమయమున రాజధానియైన ఈ హైదరాబాదు నగరమునందు శ్రీమదాంధ్ర సారస్వత పరిషత్తువారు పరమ భక్తాగ్రగణ్యుడైన పోతన మహాకవి విరచిత శ్రీమద్భాగవత సప్తాహ

మహోత్సవ సత్క్రతువును సాగింప దలపెట్టుట తెలింగాణెపు తెలుగుబిడ్డలు మీకే చెల్లినది. సుకృతులైన మీరు ఏతన్మహోత్సవారంభమును గావింప నాహ్వానించుట నామీద మీకుగల అవ్యాజానురాగము తప్ప వేరొండు కాదని నా విశ్వాసము; ఏలన, శ్రీమదాంధ్ర మహాభాగవత రచనాధురీణు డును, పరమ భాగవతోత్తముడును, భక్తాగ్రేసరుడును అయిన శ్రీ బమ్మెర పోతనగారిని గురించియు, వారి కాలమును గురించియు ముందు తెలిసి కొనుట కొంత సంభావ్యమేయైనను వానిని గురించి చెప్పవలసిన విషయ ముల నన్నిటిని విమర్శక శిరోమణులును, కవి చరిత్రకారులును, ఈ వరకే పూర్తిగా, సవిమర్శముగా తెలిపియుండుట వలన నే నంతకంటె ఎక్కువ చెప్పగలననికాని, మీరిదివరకు వినని విషయములను వినిపించగలననికాని నేనిటకు రాలేదు. పోతన మహాకవిచరితమునకు సంబంధించిన విషయములు మీకిదివరకన్నియు తెలిసినవే యైనను శ్రీమదాంధ్ర సారస్వత పరిషత్తువా రాదరపురస్సరముగ దయతో పంపిన యాహ్వానమును తిరస్కరింపలేక యంగీకరించి వచ్చుటచేత వానిని పునరావృత్తముచేసి ఏతద్భాగవత సప్తాహ మహోత్సవ సందర్భమున ఆంధ్ర జాతికి పరమ పూజ్యులైన భక్తావతంసము శ్రీమదాంధ్ర మహాభాగవత కృతికర్త పోతన కవీంద్రుని మీతోకలసి సంస్మ రించుకొనదలచి వచ్చిన నాహృదయ చాపలమును సహృదయులును, బుధ వరేణ్యులునగు మీరు మన్నింతురు గాక!

పోతన జన్మస్థానము, చరిత్ర, సమకాలికులు అన్నది నేటి ఉపన్యాస విషయము. చరిత్ర రసహీనమైన పేలపిండివంటిది. ఇత రాంధ్రకవుల విష యమున వలెనే పోతనగారి విషయమునను మనకు తెలిసినది స్వల్పము. తెలిసినదెల్ల పోతనగారు శ్రీమదాంధ్ర మహాభాగవతములో తనవంశమును గురించి, తన తాతముత్తాతలను గురించి భక్తిగౌరవ పురస్సరముగ సం స్మరించుకొన్న విషయమే. ఏది తెలిసినను, ఏది తెలియక పోయినను పోతన గారు జన్మించిన తోడనే తెలుగు దేశములో భక్తికల్పలతిక మొగ్గతొడిగి పూవులు పూచినదను విషయము మాత్రము బాగుగా తెలియును. ఆయన

రచించిన మహాభాగవతము తెనుగులోని కవతరించుటతో తెనుగువారి హృదయసీమల భక్తిరసధునులు పొంగులెత్తినవన్న విషయము తెలియును. శ్రీరామచంద్రు కరుణాకటాక్షమును పొంది భాగవతము నాధారముగా గొని తెలుగువారి మనఃకేదారములలో భక్తిబీజములు వెదవెట్టిన హాలికుడు పోతన్నగారు.

మధురభక్తి ప్రధానములైన శతకములు తెలుగులోనికి వచ్చినది పోతనగారి ఆంధ్ర మహాభాగవతావతరణమునకు తరువాతనే. కటకము గజపతి వంశజుల పరిపాలన కాలమున బంగాళ దేశమునుండి చైతన్యస్వామి తెలుగు దేశమునకు వచ్చుటతో తెలుగు శతక కవితలో నీ మధుర భావమునకు ప్రాచుర్యము హెచ్చినది.

పోతనామాత్యుడు మహాభాగవత రచనమునకు పూనుకొనునాటికి తెలంగాణములో వైష్ణవమతము ముమ్మరముగ వ్యాపించినది. ఇట్లనుటచేత తెలంగాణములో వైష్ణవ మదివరకు లేనేలేదని నా యభిప్రాయముకాదు. వైష్ణవము వాతాపి చాళుక్యుల కాలమునుండియు నున్నది. ఇందుకు వాతాపి, కల్యాణి చాళుక్యుల శాసనములును, వారికాలమున మలచబడిన విష్ణ్వవతార ప్రతిమలును తార్కాణములు. చెన్నకేశవాలయములు తెలంగాణమున ఎక్కువగా నుండెను. అయినను కాకతీయుల కాలములో శైవ మెట్లు రాజమతమై జనాదర పాత్రమయ్యెనో యదేవిధమున వైష్ణవము రాజమతమై గొప్ప వ్యాప్తిని పొందినది. వైష్ణవము విజయనగరాధీశ్వరుల కాలములోవలె తెలంగాణమున అమితవ్యాప్తి నందినది. రాచకొండ, దేవరకొండ రాజ్యాధిపతులైన రేచెర్ల వంశజుల కాలములోనే శ్రీవిద్యారణ్య శ్రీపాదులకు సమకాలికులైన శ్రీవేదాంత దేశికులవారి కుమారుడు శ్రీనైనారాచార్యులవారు సింగయమాధవేంద్రుని యాస్థానమునకు వచ్చి విమతవాదుల నోడించి యారాజేంద్రునికి వైష్ణవమతమిచ్చినట్లు వైష్ణవ గ్రంథములు నుడువుచున్నవి. రాజు వైష్ణవమతావలంబియైనప్పుడు సామంత

నృపులును తద్ధర్మము నవలంబించిరి. పోతనగారి భాగవతరచన కీవైష్ణవమత వ్యాప్తికూడ ప్రోత్సాహకరమయ్యెనేమో.

పోతన్నగారి జన్మస్థలము విషయమునను, కాలము విషయమునను, సమకాలికుల విషయమునను అన్నియు సమస్యలేయైనవి. ఆయన వంశ గోత్రాదికములనుగూర్చి తాను రచించిన ఆంధ్రి మహాభాగవతములో పోతన్నగారే చెప్పుకొన్నందు వలన వివాదము లేకుండ పోయినది. పోతన గారు కౌండిన్యగోత్రుడు; ఆపస్తంభసూత్రుడు; కేసయ లక్కసానుల కుమారుడు; తిప్పన అనుజుడు; ఎల్లన, సోమనమంత్రు లాయన పితామహ, ప్రపితామహులు; అన్నయ, భీమన లాయన ముత్తాత తండ్రి, తాతలు. కేసన మంత్రియు, లక్కసానియు శివారాధన తత్పరులు. సానియను పదమిప్పుడు నీచార్థబోధకమైనది. పూర్వమది గౌరవవాచకమే. పోతనగారు తనతండ్రిని గురించి 'శైవశాస్త్రమతము గనియె' ననియు, తన తల్లినిగూర్చి 'సదా శివపాదయుగార్చనానుకంపానయ వాగ్భవాని' యనియు, తన యగ్రజుని 'ఈశ్వర సేవాకాము' డనియు చెప్పియుండుటచే పోతన తలిదండ్రులు ఈశ్వర సేవాసంసక్త చిత్తులనుటకు సందియము లేదు. తండ్రివలెను, అగ్రజునివలెను పోతనగారును శివధ్యాన తత్పరులే; అట్లని కేశవుని మీద భక్తి లేని వారు కాదు.

శ్రీమదాంధ్రి మహాభాగవతావతరణమును గురించి పోతనగారే తమ గ్రంథమున తెలిపియున్నారు. ఆయన శ్రీమన్నారాయణ కథా ప్రపంచ విరచనా కుతూహలుడై ఒకనాటి సోమోపరాగ కాలమున గంగకు జని క్రుంకులిడి తన్నదీపులినతలంబున మహేశ్వర ధ్యానాయత్త చిత్తుడై కించిదున్మీలితలోచనుడై యున్న సమయమున శ్రీరామచంద్ర మూర్తి కన్గవకు గానబడి పేరు చెప్పి తన పేర భాగవతంబు తెనుగు సేయుమనియు నానతిచ్చి యంతర్హితుడయ్యెనట. అటు తరువాత 'శ్రీ మహాభాగవత పురాణ పారిజాతపాదప సమాశ్రయంబునను, హరికరుణా విశేషంబునను కృతార్థత్వంబు సిద్ధించె' నని తలచి మరల కొన్నిదినములకు

ఏకశిలానగరంబునకు జనుదెంచి అందు ' గురువృద్ధ బుధబంధుజనానుజ్ఞాతుడై ' పోతన కవీంద్రుడు భాగవత రచనమునకు పూనుకొనెను. బమ్మెర యని ఇంటి పేరుండుట వలన పోతన పూర్వుల నివాస స్థలము బమ్మెర గ్రామమైయుండవలెను. బమ్మెర యనునది ఓరుగల్లు చెంతనున్నదనియు, ఆగ్రామమునందు కౌండిన్యసగోత్రులగు నియోగుల కుటుంబ మొక్కటి కలదనియు, ఆ కుటుంబమువారు పోతనామాత్యుడు తమ వంశమువాడని చెప్పుకొనుచున్నారనియు, ఈ బమ్మెరలో పోతరాజుగద్దె యని నాలుగు రాళ్లు పాతిన స్థలమొకటి కలదనియు శతావధానులు శ్రీ శేషాద్రిరమణ కవులు వ్రాసియున్నారు. కాని ఏకశిలానగర మోరుగల్లనియు, గంగ గోదావరి యనియు నిరూపితమైనగాని బమ్మెర యదియే యని స్థిరపడదు. ఏకశిలానగర మేది, గంగయేది అను విషయమున కొంతకాలమునకు పూర్వము కొమ్ములు తిరిగిన పండితులలో ప్రచండ వాదోపవాదములు చెలరేగినవి. ఏకశిలానగర మన్నది కడప జిల్లాలోని ఒంటిమిట్టయని కొందరును, తెలంగాణములోని ఓరుగల్లని మరికొందరును, గంగ గోదావరియే యని కొందరును, కాదని వేరొక కొందరును ఆవేశములు పెంచుకొని వాదులాడిరి. పోతన రాయలసీమ వాడని కొందరు పోరాడగా తెలంగాణమువాడేయని మరికొందరు వాదించిరి. ప్రచండ ఝంఝామారుతమువలె రేగిన ఆవాదము చాలకాలము వరకు నుపశమింపలేదు. ఆ వాదప్రతివాదము లిట నుటంకించుట గ్రంథవిస్తరము, ననవసరమునుగూడ. విజ్ఞాన చంద్రికా గ్రంథమండలిని స్థాపించి ఆంధ్రదేశ సాంస్కృతిక, వైజ్ఞానికోద్యమములకు శ్రీకారము చుట్టిన మహామేధావి పరమపూజ్యులు అయిన కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు ఈ వాదప్రతివాదముల నన్నిటిని సాకల్యముగ విమర్శించి తుదకు న్యాయాధిపతివలె తీర్పుచెప్పియున్నారు. ఈ విషయమునుగురించి ఎవ్వరేమి చెప్పినను వారి ననువదింపవలసిన వారే. అంతటి న్యాయసమ్మతమైన దా తీర్పు. అయినను ఏకశిలానగరమును గురించియు, గంగను గురించియు ఒకటి రెండు మాటలు చెప్పెదను.

ఏకశిలానగరమన్నది కాకతీయుల రాజధానియైన యోరుగంటికే రూఢియైన పేరని కొరవి గోపరాజ కృతమైన సింహాసన ద్వాత్రింశికలోని ఈక్రింది పద్యముల వలన స్పష్టమగుచున్నది.

ఉ. ఆకడ నీతిశాస్త్రవిదుఁడై గురు పీఠ్యాని యేగె వేశ్యతో ।
గాకిత మూలశక్తి గనిగా నొనరించిన మైడిచట్టు నా
నేకశిలాభిధానమున నెన్నిక కెక్కి ధరిత్రిలోన నే
పోకలఁ బోని యట్టి సిరిపుట్టిన యింటికి నోరుగంటికిన్.

ఉ॥ చందనగంధులు న్విటులు జాణలు దాన వినోదులుం బ్రభా
సుందరమూర్తులుం గవులు, శూరులు, బెద్దలు నుల్లసిల్ల సం
క్రందన వైభవాఢ్యుడగు కాకతి భూపతి రాజ్యలక్ష్మి బెం
పొందెడు నప్పురంబున మహోత్సవలీలల నుండె నేర్పునన్.

ఈ పద్యముల వలన ఏకశిలానగరము కాకతి భూపతుల రాజధాని యైన ఓరుగల్లే కాని కడపమండలములోని ఒంటిమెట్ట కాదని తేలుచున్నది. ఇక గంగ యన్నది గోదావరి నదియే యని నిరూపితమైన గాని పై నిశ్చయము స్థిరపడదు. ఈ యంశముకూడ కొరవి గోపరాజకృత సింహాసన ద్వాత్రింశికలోని ఈ క్రింది పద్యము వలన నిరూఢమగుచున్నది.

కం. అతడు త్ర్యంబక శిఖరో
ద్భూతను విఖ్యాతఁ బరమ పూతఁ ద్రిలోకీ
మాత మహాపాతక సం
ఘాత విఘాతానుయాతఁ గని యేన్ గంగన్.

ఈ పద్యమున గంగ త్ర్యంబక శిఖరోద్భూతయనుట వలన అది నాసికా త్ర్యంబకమున నుదయించిన గోదావరీనది యనుటకు సంశయింప బనిలేదు. పోతనగారి జన్మస్థలమైనను కాకపోయినను వారిపూర్వులది బమ్మెర. ఇది తెలంగాణాలోనిది. తరువాత కొంతకాలమాయన ఓరుగంటిలో నుండెను. అక్కడ నుండగనే ఆయన మహాభాగవత రచనమునకు పూనుకొని పూర్తిచేసెను.

ఆంధ్ర మహా భాగవతము కాక వీరభద్రవిజయ, భోగినీ దండకము లును పోతనామాత్య ప్రణీతములను ప్రసిద్ధికలదు. వీనిలో నాలుగాశ్వాసము లతో గూడిన వీరభద్రవిజయమునందలి కృతి కర్తృ వంశాభివర్ణనమునను సరించియు, నాశ్వాసాంతగద్యము ననుసరించియు నది పోతనామాత్య కృతమని యున్నను దాని నతడు రచింపలేదను వారునున్నారు. వీరభద్ర విజయములోని కవిత్వమునకును, ఆంధ్ర మహాభాగవతములోని కవిత్వ మునకును వ్యత్యాసమున్నదన్నమాట నిజమే. వీరభద్రవిజయ కవిత్వము భాగవత కవిత్వమంత ప్రౌఢమైనదియుకాదు ; తప్పులును చాలగలవు. అందువలన పోతన్నగారు రచించిన గ్రంథములలో ఇది మొదటి దనవచ్చును. కాని ఈ కృతి ఆయన రచియింపనేలేదనుటకు సాహసింపలేను. జాగ్రత్తగా పరిశీలించినచో భాగవతములోని పద్యములకును వీరభద్రవిజయములోని పద్యములకును పోలికలు కలవు. ఏ పోలికలున్నను ఈక్రింది

ఉ. భాగవత ప్రబంధ మతి భాసురతన్ రచియించి దక్షుడు
ర్యాగ కథా ప్రసంగమున నల్పవచస్కుడనైతి తన్ని
మిత్తాగత వక్త్రదోషపరిహారముకై యజనైక శైవశా
స్త్రీమగ వీరభద్రవిజయంబు రచించెద వేడ్కనామదిన్.

అను పద్యము పోతన కృతము కాదనియు, ప్రక్షిప్తమనియు నా విశ్వాసము. ఇదియేకాదు, ఆంధ్ర మహాభాగవతములోని

ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు కొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట వ్రేటులం బడక సమ్మతితో హరి కిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరాజొకడు భాగవతంబు జగద్ధితంబుగన్.

అను పద్యమును ప్రక్షిప్తమనియే నానమ్మకము. పోతనామాత్యుడు మహా భక్తుడు, పరిణత హృదయుడు; ఆయన మనస్తత్వమే వేరు. భాగ వత రచనా కాలమున ఆ పద్యము నాయన వ్రాసెననుట ఆయన కపచా రము కావించుటయే. ఆయన యటువంటి పద్యము వ్రాసియుండడు; వ్రాయలేదు. ఆయన నిగర్వ చూడామణి; ఆయనది నిండైన మనస్సు;

మనస్సెంత నిండైనదో ఆయన వాక్కును అంత నిండైనదే; భాగవతమే ఇందుకు ప్రమాణము. కృతికర్త శైలియు, రచనయు నత డెట్టివాడో తెలుపు దర్పణములు. వానిలో ఆతని మూర్తిని, ఆతని హృదయమును కనుగొనగలము. భాగవతమును రచింపుమని పోతనగారి కన్నుల యెదుట సాక్షాత్కరించిన శ్రీరామచంద్రమూర్తి ఆదేశించిన వెంటనే ఆయన భక్త్యావేశ పరవశుడయినాడు :

పలికెడిది భాగవతమట
పలికించు విభుండు రామభద్రుండట నే
బలికిన భవహరమగునట
పలికెద వేరొండుగాథ పలుకగనేలా?

ఏడీ ఈ విధముగా భక్తిభావ తన్మయుడై పలికిన మరొక యాంధ్ర కవి? నన్నయ తిక్కనాది కవులు పురాణములు తెనుగుజేయుచు నంతకు మున్ను భాగవతమును తెనుగుజేయకపోవుట తన పురాకృత శుభాధిక్య మని మురిసిపోవుచున్నాడు పోతనామాత్యుడు; పునర్జన్మము లేకుండ జన్మ సఫలముచేసికొందునని ఆంధ్ర మహాభాగవత రచనమే ఒక తపస్సుగా భావించిన పరమపుణ్యశాలి ఆయన. ఆయన గంట మెప్పటికిని పూర్వోదాహృతములైన 'భాగవత ప్రబంధ మతి భాసురతన్', 'ఇమ్మను జేశ్వరాధముల కిచ్చి' అను పద్యములను వ్రాయలేదు; అట్టి పద్యములను రచించుట పోతనగారి కశక్యమని కాదు; ఆయన మనస్తత్వమట్టిది కాద నియే నా భావము.

భోగినీ దండక కర్తృత్వ విషయమునందు కూడ వివాదము కలదు. ఏతద్గ్రంథాంతమునగల

పండిత కీర్తనీయుడగు బమ్మెర పోతన యా సుధాంశు మా
ర్తాండ కులంచలాంబునిధి తారకమై విలసిల్లు భోగినీ
దండకముఌ రచియించె బహుదాన విహర్తకు రావు సింగభూ
మండల భర్తకుఌ విమత మానవనాథ మదాప హర్తకుఌ.

అను పద్యమువలన ఈ భోగినీ దండక కృతికర్త పోతనామాత్యు డనియే స్పష్టపడుచున్నను ఈ కృతి నాయన రచింపలేదని, ఆపద్య మాయ నదికాదని వాదించువారు కలరు. చాలమంది కవుల విషయమున వారి జన్మస్థానమును గురించి, వారి కాలమును గురించి, తుదకు వారు రచించిన కృతులను గురించికూడ నిట్టి సందేహము లుండుట ఆంధ్రుల దౌర్భాగ్యము. గ్రంథము స్వయంభువు; అంతియకాని కవియే లేడను స్థితి కింకను మనము రాకపోవుట మన యదృష్టము. భోగినీదండకము పోతన కృత మనియే నా విశ్వాసము. దానిని పోతన రచియించెనన్నంతమాత్రమున ఆయన ఖ్యాతికి కళంకమురాదు. ఆయనకు వాసి తగ్గదు. పోతనగారు భక్తాగ్రేసరులనినంతమాత్రమున బాల్యమునుండియు నట్లే యుండెనని భావింపనక్కరలేదు; ఆయనయు మానవుడే. ఆయనకూడ మొదట రావు సింగభూపాలుని కాశ్రయుడుగా ఉండియుండవచ్చును; ఆయనను సంతోష పరచుటకు భోగినీదండకమును వ్రాసియు నుండవచ్చును పోతన. క్రమ క్రమముగ లోకానుభవము ముదిరి మనస్సు పరిపక్వమైనకొలది అభిరుచులు మారవచ్చును; ఆశయాదర్శములు మారవచ్చును; ఆముష్మిక చింత బలపడ వచ్చును. వయసు పెరిగినకొలది పోతనగారిలో అదియే జరిగినదని నా నమ్మకము. భాగవత మాయన కడపటి గ్రంథము. దీనికి పూర్వపుది ఆయన భోగినీదండకము. ఇక పోతనామాత్యుని కాలము. దీనిని నిర్ణయించుటకు నికరమైనవి లేకపోయినను మూడాధారములున్నవి. కొండవీటి పెదకోమటి వేమారెడ్డి యాస్థానమునందు విద్యాధికారిగా నుండిన శ్రీనాథ కవిసార్వ భౌముడు పోతన్నగారికి సమకాలికుడును, బావమరిదియునని చెప్పు గాథ లుండుటవలన శ్రీనాథుని కాలము ననుసరించి పోతనగారి కాలమును నిర్ణ యించుట యొక పద్ధతి. రావు సింగభూపాలుని కాలమును బట్టి పోతన గారి కాలమును నిశ్చయించుట మరొక పద్ధతి. బమ్మెర పోతనగారి ప్రపౌత్రు లైన కేసకవి మల్ల కవులు రచియించిన దాక్షాయణీపరిణయము ననుసరించి కాలనిర్ణయము చేయుట వేరొక పద్ధతి. వీనిలో మొదటిది, అనగా శ్రీనా

థుని ననుసరించి పోతన కాలమును నిర్ణయింప బూనుకొనుట ప్రమాద భూయిష్ఠమైనది; సలన పరంపరగ వచ్చు గాథలను ప్రమాణముగా విశ్వసింప లేము; నన్నయభట్టారక, తిక్కన సోమయాజులకు మధ్య రెండు వందల సంవత్సరముల యెడమున్నను వారుభయులు నేకకాలమువారని చెప్పు గాథలుకూడ నున్నవి. అందువలన శ్రీనాథుడు పోతనకు సమకాలికుడగునో కాదో, వారుభయులకును బంధుత్వ మున్నదో లేదో నిర్ణీతమైనగాని శ్రీనాథుని ననుసరించి పోతన కాల నిర్ణయముచేయ గుదురదు. ఇక దాక్షాయణీ పరిణయ కృతి ననుసరించి పోతన కాల నిర్ణయము చేయు విషయమును గురించి యాలోచింతము. పోతనామాత్యుని ప్రపౌత్రులైన కేసకవి మల్ల కవులు తమ దాక్షాయణీ పరిణయ కృతిని గురిజాల చిన మల్లన సోమయాజి కంకితమిచ్చిరి. ఈ చినమల్లన సోమయాజి ప్రపౌత్రుడైన పార్వతీశ్వరుని కుమారుడు పేరమంత్రికి పోడూరి పెద రామామాత్యుడు ధాత సంవత్సర ఆశ్వయుజ బహుళదశమీ సోమవారమునాడు దాక్షాయణీ పరిణయమునకు ప్రతి వ్రాసియిచ్చెను. ధాత ఆశ్వయుజ బహుళ దశమి సోమవారమునకు సరియైన ఇంగ్లీషు తేది 1756 అక్టోబరు 18 వ తేదీ సోమవారమైనది. దీని ననుసరించి తరమునకు 25 లేక 30 సంవత్సరములు చొప్పున పేరమంత్రినుండి చినమల్లన సోమయాజి వరకు లెక్కించినచో యీతనికి దాక్షాయణీ పరిణయము కృతి యిచ్చినకేసన మల్లకవుల కాలము తెలియగలదు. వీరి కాలము తెలిసిన పిదప తరమున కాపద్ధతినే లెక్కకట్టి వారి ప్రపితామహుడైన పోతనగారి కాలమును నిర్ణయింపవలసియుండును. ఈ పద్ధతిని చూచినచో పోతనగారు క్రీ. శ. పదునైదవ శతాబ్ది యుత్తరార్ధములోనివాడగును. ఇక రావు సింగభూపాలుని అనుసరించి కాల నిర్ణయముచేయబూనినను ఇంచుమించుగ పోతన ఆ కాలమునకే వచ్చును.

రావుసింగభూపాలుడు రేచెర్ల వంశజుడు. ఈతడు రాజాచల దుర్గాధిపతి భోగినీ దండకమున ఈతడు కుమారాన్న పోతావనీనాథ సూనుడనియు, రావుసింగ క్షమానాథ పౌత్రుడనియు, భోగసమూంబాలసద్గర్భ సంజాతు

డనియు, వసంతావనీనాథ సోదరుడనియు చెప్పబడినాడు. ఇన్ని యానవా ళ్లియబడుటవలన ఇతనిని గుర్తించుట సులభమే. రాచకొండ రాజ్యమును పరిపాలించిన రేచెర్ల వంశజులలో ముగ్గురు రావుసింగ నామధేయులుకలరు. అనపోత, మాదానాయకుల తండ్రి మొదటి సింగమనాయకుడు; అనపోతా నాయని కుమారుడు కుమార సింగభూపాలుడు. ఇతడే రసార్ణవ సుధా కరమను అలంకార గ్రంథమును రచించెను. ఈతడు క్రీస్తుశకము పదునాలు గవ శతాబ్ది ఉత్తరార్ధములో నుండినవాడు. కుమారసింగ భూపతి పౌత్రు డును, కుమారాన్నపోత భూపాలుని పుత్రుడును అగు రావు సింగభూవరుడు మూడవవాడు. ఈతని యనుజుడు వసంతావనీ నాథుడు. ఈ రావు సింగ భూపాలుని ముమ్మడి సింగభూపాలు డనియు వ్యవహరింతురు. ఈతడు క్రీస్తు శకము 1430 మొదలు 1475 వరకు పాలించినట్లు ఆతని శాసనములు మొదలైనవాని వలన చెప్పవచ్చును. ఈ రావు సింగభూపాలునికి సర్వజ్ఞ బిరుదము కలదు. ఈ సింగభూపాలుని కోరికపైనే పోతనామాత్యుడు భోగినీ దండకమును రచించెను. ఈ విధమున జూచినను పోతనామాత్యకవి పదునైదవ శతాబ్ది యుత్తరార్ధమున నుండినట్లు స్పష్టమగుచున్నది.

ఎటుల మెప్పించెదో నన్ను నింకమీద
రావు సింగ మహీపాలు ధీవిశాలు
నిండు కొలువున నెలకొనియుండి నీవు
సకల సద్గుణ నికురంబ శారదాంబ.

అని శ్రీనాథ కవిసార్వభౌముడు శారదను ప్రార్థించినది ఈ సర్వజ్ఞ సింగభూపాలుని ఆస్థానమునకు వెళ్లినప్పుడే. అందువలన శ్రీనాథుడుకూడ పోతనామాత్య కవీంద్రునికి సమకాలికుడే; అయితే కొంచెమతనికంటె పెద్ద వాడేమో. కాని అతడు పోతన్నగారి బావమరిది యని చెప్పుట కాధారా లేవియు లేవు. రాకపోకల కానుకూల్యములు విశేషముగా ఏర్పడిన ఈనాడే మధ్యాంధ్రదేశీయులు తెలంగాణావారితో వియ్యమందుట అరుదుగా కన బడుచున్నప్పుడు ఆ కాలములలో మధ్యాంధ్ర దేశీయుడైన శ్రీనాథుడు వైవాహిక సంబంధమును వలన పోతరాజునకు బావమరిది యయ్యెనన్న విష

యము విశ్వాసపాత్రమైనదిగా తోచుటలేదు. వారుభయులును బావమరు దులని చెప్పుగాథ లన్నియు వట్టి పుక్కిటి పురాణాలే అని నా నమ్మకము.

పోతనామాత్యుడు మహాభాగవతము పండ్రెండు స్కంధములను పూర్తిగా రచియించెననియు, నందుకొన్ని భాగము లుత్సన్నములగుటచేత వెలిగందల నారయాదులు వానిని పూరించిరనియు చెప్పుదురు. ప్రకృతము మన కుపలబ్ధమగు నాంధ్రమహాభాగవతములో ఏకాదశ, ద్వాదశ స్కంధ ములు వెలిగందల నారయ కృతములు; షష్ఠస్కంధము ఏర్చూరి సింగన విర చితము; ఇక పంచమ స్కంధము నందలి ప్రథమాశ్వాస, ద్వితీయాశ్వాస ములు గంగనకృతములు.ఈ విధముగా ఆంధ్రమహాభాగవత ముత్సన్నమగు టకు చెప్పబడు ఒక గాథ మనదేశమున చిరకాలానుగతముగ వచ్చుచున్నది. రాచకొండ రాజ్యాధిపతియైన రావు సర్వజ్ఞ సింగభూపాలుడు భాగవతమును దన కంకిత మీయవలసినదని పోతనామాత్యు నభ్యర్థింపగా నాతడందులకు నిరాకరించెననియు, అందుమీదట నా రాజేంద్రుడు కుపితుడై బలాత్కార మున నా గ్రంథమును గైకొని దానిని భూమిలో పాతిపెట్టించెననియు, కొంతకాలమైన వెనుక దానిని బయటికి తీయగా అప్పటికే యా గ్రంథము నందలి తాళపత్రములు కొన్ని చివికి శిథిలమైపోయిన వనియు, ఈకారణముననే భాగవతము నందలి కొన్ని భాగము లుత్సన్న మగుట సంభవించె ననియు చెప్పుదురు. కాని యిది విశ్వసింపదగిన విషయముగా గన్పట్టదు. ఒకవేళ రావు సింగభూపాలు డాగ్రంథమును నశింపజేయ సంకల్పించు కొన్నచో దానిని సులువుగా తగులబెట్టి యుండవచ్చును. అట్లుచేయక దాని నేల పాతిపెట్టించెనో తెలియదు. మొత్తము మీద ఇది తలతోకలు లేని గాథ. భాగవతమును రచించుచుండగనే పోతనామాత్యుడు లోకాంతర గతుడై యుండునని నాయూహ. ఏకాదశ, ద్వాదశస్కంధముల నాయన రచియింపనే లేదనియు, అందువలననే భాగవత సంపూర్ణార్థము పోతనా మాత్య ప్రియశిష్యుడైన వెలిగందల నారయ, తన గురువుగారి మీదగల భక్తి గౌరవముల వలన వానిని రచించియుండుననియు ననుకొను

చున్నాను. మిగిలిన యాంధ్ర మహాభాగవతమును పోతనామాత్యుడే రచి యించి యుండవలెను. దీనిలో పంచమ, షష్ఠ స్కంధములు ఉత్పన్నములగుటకు ప్రాయికముగా ఆనాటి రాజకీయ పరిస్థితులే కారణమై యుండవచ్చునని నేనూహించుచున్నాను.

ముమ్మడి సింగమనాయకుని కాలమున కించుక పూర్వమునుండియే బీదరు రాజధానిగ పరిపాలించుచుండిన బహ్మనీ సుల్తానులకును రాచకొండ దుర్గాధిపతులకును వైరానలము ప్రజ్వరిల్లినది. అహ్మదుషా రాజ్యకాలము చివర తెలంగాణముపై మహమ్మదీయులు దండెత్తి రాచకొండ రాజ్యాధిపతుల కోటలను గొన్నిటిని బట్టుకొనిరి. అహ్మదుషా అనంతరము బహ్మనీ సుల్తానులకును, రాచకొండ రాజ్యాధిపతులకును జరిగిన యుద్ధములనేకములు. వానితో తెలంగాణము నిప్పులపుంతయైనది. రాచకొండ దుర్గాధిపతులు కటకము గజపతుల సాయముతో మరల ఓరుగల్లు, భువనగిరి మొదలైన దుర్గములను గెలుచుకొనిరి. శాశ్వతముగ ఈ దుర్గములు రేచెర్ల ప్రభువుల అధికారము క్రింద నుండలేదు. తుదకు క్రీ. శ. 1474-75 నాటికి తెలంగాణమున రాచకొండ, దేవరకొండ ప్రభువుల రాజ్య మంతరించినది. అది పూర్తిగా రెండవ ముహమ్మదుషా రాజ్యకాలమున ఆతని యధికారము క్రిందికి వచ్చినది. ఈ బహ్మనీ, రేచెర్ల వంశముల యుద్ధమున తెలంగాణమున శాంతి భద్రత లంతరించినవి. గ్రామదహనము లతిశయించినవి. భాగవతమున కొన్ని భాగములుత్పన్నమగుట కప్పటి రాజకీయ సంక్షోభమే కారణము కావచ్చును. ఇది యూహ మాత్రమే. పోతనామాత్య విరచితమైన భాగమే భాగవతమున అధికముగ నిలిచియుండుట ఆంధ్రుల యదృష్టమని చెప్పవచ్చును.

పోతనామాత్యుని కవిత్వము అతి మృదు మధుర పద సంఘటితమై, శబ్దార్థాలంకార పరిశోభితమై, వీనులకు విందొనర్చుచు అమందానందము కలిగించుచుండును. పోతనగారే చెప్పుకొన్నారు.

కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ
గొందఱకును సంస్కృతంబు గుణమగు రెండుం
గొందఱకు గుణములగు నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్.

అని. ఆయన యెంత ధైర్యముతో, ఆత్మ విశ్వాసముతో చెప్పిన మాటలో ఇవి. అందువలననే రసానుగుణముగ తెనుగును, సంస్కృతమును సరిసమానముగ సార్థకముగ వాడగలిగిన ప్రతిభాశాలి ఆయన. తెలుగు దేశములో ఆంధ్రమహాభారతమును జదువని వారుండిన నుండవచ్చును. గాని, ఆంధ్రమహాభాగవతమును జదువనివారు చదువ నేర్చిన వారిలో అరుదు. భాగవతము నందలి గజేంద్రమోక్షము, రుక్మిణీ కళ్యాణము, కుచేలోపాఖ్యానము మొదలైన కథలను నేటికిని కంఠస్థము కావించుకొని ప్రతిదినము చదువు వారున్నారు. పల్లెటూళ్ళలో సామాన్యమైనదా భాగవతము పోతనగారే దానిని కల్పతరువుతో పోల్చినారు. ఈ క్రింది పద్యమును చిత్తగింపుడు :

మ. లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతా శోభితమున్ సువర్ణ సుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాల వాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్ద్విజ శ్రేయమై.

ఆంధ్రప్రదేశావతరణ శుభసమయమున పతన్మహాభాగవత సప్తాహ మహోత్సవమును శ్రీమదాంధ్ర సారస్వత పరిషత్తువారు నిర్వర్తించుట అఖిలాంధ్ర సంస్కృతికే మంగళాశాసనముగా భావించుచున్నాను. మహోత్సవ నిర్వాహకులైన సుకృతుల కందరికి నా నమోవాకములు.



# సంస్కృత భాగవతము

## పోతన అనువాద విధానము



శ్రీ కురుగంటి సీతారామయ్యా, ఎం.ఏ.

# పోతన అనువాద విధానము

శ్రీ పోతనార్యుని యాంధ్రీకరణ పద్ధతినిగూర్చి ప్రసంగము చేయుట నా యదృష్టము. దానినిగూర్చి సమగ్రముగా చర్చించుటకీ యవసరము చాలకపోవుటయే గాక యసంభవముకూడ. కావున పోతన వాక్యములలో "విబుధవరుల వలన విన్నంత, కన్నంత, తెలియవచ్చినంత తేటపరతు" అని యే మనవి చేయుచున్నాను.

చర్చనీయాంశమునకు వెడలక పూర్వము రెండు మూడు విషయములను ముచ్చటింతును. ఇదివరలోనీ విషయమునుకొందరు పెద్దలు చర్చించి యున్నారు. వారిలో శ్రీయుతులు తం. తేవప్పెరుమాళ్లయ్యా, నాగపూడి కుప్పుస్వామయ్యా, పురాణం హయగ్రీవశాస్త్రి, రాయదుర్గం నరసయ్యా శాస్త్రి, శేషాద్రి రమణ కవులు, నిడదవోలు వెంకటరావు మొదలగు వారి వ్రాతలు నాకు మిక్కిలి సాయపడినవి. వారి కందరకు నేను కృతజ్ఞుడను. వారి చర్చలలో పోతనార్యుని నివాసస్థల మొక ముఖ్యమైన విషయము. ఇచట రెండు వాదములుకలవు. వానిలో నొంటిమిట్ట వాదమునకు కీ. శే. వావిలికొలను సుబ్బారావుగారు ముఖ్యులు. కాని యిప్పటివరకు జరిగిన వాదప్రతివాదములను క్రోడీకరించి చూచిన, నొంటిమిట్ట వాదముకంటె నోరుగల్లు వాదమే బలవత్తరమని తెలుచున్నది. ఇందులకు సహాకరించు మఱి యొక దృష్టాంతమును నేనిచ్చుచున్నాను. ఉస్మానియా విశ్వవిద్యాలయము నందలి తాళపత్ర గ్రంథ సంచయములో పంచతంత్రముయొక్క యాంధ్రీకరణము రాజనీతి రత్నాకరమనుపేర నొక యముద్రిత గ్రంథమున్నది. దాని రచయిత పేరు కృష్ణయామాత్యుడు. తద్గ్రంథ పీఠికయందలి పద్యముల వలన నీ కృష్ణయామాత్యుడు బమ్మెర పోతనార్యుని వంశము వాడ

నియు, నీయన కోవవారు బెడంవకోట (బిదరు) లో సుల్తానువద్ద 'నేబతి' (ధనము లెక్కించువాడు) పని చేసినందున వారికి "నేబతి" యని యింటి పేరు పౌరుష నామముగా వచ్చినదనియు తెలియుచున్నది. ఈ గ్రంథమున భువనగిరి, సిద్ధపల్లి, పాలమూరు మొదలగు తెలంగాణము నందలి స్థలముల ప్రశంసకలదు. ఈవంశము తెలంగాణా ప్రాంతముదనియు వీరికులమున పూర్వుడైన బమ్మెర పోతనామాత్యుడును నీ ప్రాంతము వాడే ననియు నూహాకిది బలమిచ్చుచున్నది.

౨

## శ్రీమద్భాగవతముయొక్క విశిష్టత

ఋగ్వేదమున "కృష్ణు" డను నొక మంత్రద్రష్టకలడు. "భాగవత" శబ్దమొక భక్తి ప్రధానమైన తెగకు పేరుగా మహాభారతము నందలి "నారాయణీయ" మను భాగమున గలదు. "భాగవత శబ్దము" బెస్‌నగర్ శాసనమున కలదు. ఇది క్రీ. పూ. 1, 2 శతాబ్దుల నాటిదని చారిత్రికులు చెప్పుదురు. వాసుదేవుడు పరమాత్మగా పాణిని, పతంజలులు తెల్పుచున్నారు. కాలక్రమమున వెనుకటి కృష్ణుని, తరువాతి వాసుదేవుని నేకముచేసి 'కృష్ణవాసుదేవుడు' పరమాత్మగా భాగవతులనెడి యొక మత సంప్రదాయవముకల తెగ వర్ధిల్లినట్లు స్పష్టపడుచున్నది. వీరికి భక్తిప్రధానము. క్రమముగ భక్తిముఖ్యాంశముగా గల వైష్ణవ మతము వర్ధిల్లెను. తరువాత శ్రీమద్రామానుజులు విశిష్టాద్వైతమును బలపరచి, దానికి భక్తిని ముఖ్యాంగముగ నొనర్చి యిదివరలో యవైదికమైన వైష్ణవమతమునకు వైదికత్వమిచ్చి యుదాత్తమొనర్చెను. ఆకాలమునాటికే భాగవతము భక్తి ప్రధానమైన గ్రంథముగానుండెను. ఈ భక్తి నవవిధములు.

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్ ।
అర్చనమ్ వన్దనం దాస్యం సఖ్యమాత్మ నివేదనం ॥

భక్తి నీ విధముగా నవవిధములుగా విభజించిన మొదటి గ్రంథములలో భాగవతము ముఖ్యమైనది. అందువలన భాగవతము భక్తి సిద్ధాంతమునకు పరమ ప్రమాణమైన గ్రంథము. ఈ సిద్ధాంతము మొదట దక్షిణ దేశమున వదలి, తరువాత యుత్తరదేశమునకు ప్రాకి, యావద్భారత దేశము నాక్రమించెను. ఈ సిద్ధాంతము ముఖ్య సూత్రముగా చైతన్య వల్లభాది మతము లుత్పన్నము లయ్యెను. వీనిలో చైతన్యమతము మాత్రము బెంగాల్ దేశమున జనించెను. ఈ మతమునకు శ్రీమద్భాగవతము ముఖ్య ప్రేరకమని విజ్ఞులు, విమర్శకులు తెల్పుచున్నారు. యస్. కే. డే పండితులు తమ "పద్యావళి" పీఠిక యందిట్లు వ్రాసినారు:

"The Chief and almost exclusive scripture of Chaitanyaism is the Srimadbhagavata, on whose devotional Poetry and legend, it bases its erotic emotionalism".

(Intro. P. 4.)

భాగవతమును గూర్చి వెనుక కొంత చర్చ జరిగెను. ఈ గ్రంథమును 13 వ శతాబ్దమునకు దగ్గరగా హేమాద్రి స్నేహితుడగు బోపదేవుడను పండితుడు రచియించెననియు, సంతకు పూర్వ మీగ్రంథమే లేదనియు కొందరు వాదించిరి. కాని యిప్పుడా వాదము పరాస్తమయినది. అష్టాదశ పురాణములలో చేరవలసినది దేవీ భాగవతమా? శ్రీమద్భాగవతమా? యను చర్చ కూడ జరిగి, తుదకు శ్రీమద్భాగవతమే యందులకు పాత్రమని చారిత్రికులు, విమర్శకులు సిద్ధాంతీకరించినారు. భాగవత ప్రశంస మాత్స్య పద్మాది పురాణములలో కలదు. పురాణముల సంకలనము క్రీ. శ. 6 వ శతాబ్దము నాటికి జరిగి యుండవచ్చునని పరిశోధకుల యభిప్రాయము. 6వ శతాబ్ది నాటికే రచింపబడిన శ్రీమద్భాగవతము బోపదేవ విరచితమగుట యసంభవముకదా! రచనా కాలమునుండి భాగవతము తన ప్రభావమును భారతీయులపై వెదజల్లుచునే యున్నది. కాలక్రమమున నది భక్తి సిద్ధాంతమునకు మూలాధార గ్రంథమైనది.

"It seems highly probable that the Chaitanya sect and its doctrines......had an independant origin directly from the Srimadbhagavata tradition.

(Padyavali–Intro. P.7.)

ఈ భక్తి సిద్ధాంతము పర్యాయతీగా నద్వైతమును కూడ ముట్టడించెను. తన గ్రంథములగు "అద్వైతసిద్ధి, సిద్ధాంతబిందు" మొదలైన వానిచే నద్వైతమునకు బలమొసంగిన శ్రీ మధుసూదన సరస్వతీస్వామి భక్తికిని, యద్వైతమునకును విరోధములేదని తన గ్రంథములచే సూచించెను. ఈ త్రోవనే భాగవత వ్యాఖ్యానకారులైన శ్రీధర స్వామివారును నడచిరి. వీరు వ్రజవిహారమను నొక భక్తి ప్రధానమైన గ్రంథమును కూడ రచించిరి. వీరి గ్రంథములు చైతన్య మతానుయాయులకు ప్రమాణములయ్యెను. శ్రీ చైతన్యులు క్రీ. శ. 1485 సంవత్సరమున జన్మించిరి. అదివరకా ప్రాంతములలో నున్న భక్తి మతానుయాయులు చైతన్య మతములో కలిసిపోయిరి. ఆ కాలమున నా మతము ప్రజలలో నెక్కువగా వ్యాపింపలేదు. ఈ క్రింది వాక్యములను గమనింపుడు:

"Dissatisfied with their spiritual surroundings this religious group (Vaishnavas) used to meet in certain houses to hold religious discourses, to listen to the readings of Srimadbhagavata and to satisfy their spiritual longings by an enthusiastic singing of the Praises of Sree Krishna."

(Padyavali Intro, P. 15.)

ఆ కాలము నుండి చైతన్య మతానుయాయులకు శ్రీమద్భాగవతము మూలగ్రంథమయ్యెను. ఇక వల్లభమతమున కా భాగవతమే పరమ ప్రమాణ గ్రంథము. ఉపనిషత్తులు, గీత, బ్రహ్మ సూత్రములు మొదలైన వానిలోని యనుమానములను భాగవతము తొలగించినదని వారి యాశయము. వల్లభస్వామివారు శ్రీ మద్భాగవతమునకు వ్యాఖ్యానమును కూడ

రచియించిరి. ఈ విధముగ శ్రీమద్భాగవతము యావద్భారత సంస్కృతికిని గొప్పగా తోడ్పడు గ్రంథమయ్యెను.

మరియొక విషయము. శ్రీమద్భాగవతము సాహిత్య శాస్త్రమున గొప్ప విప్లవమును తెచ్చిపెట్టెను. చాలకాలమువఱకును రసము లెనిమిదియే యను వాదముండెను. తర్వాత శాంతము రసముగా నంగీకరింపబడి రసములు తొమ్మిది యయ్యెను. భాగవత ప్రచారానంతరము మఱిరెండు రసములుగా గ్రహింపబడినవి. వత్సలభక్తులు రెండును రసములని వాదింప బడెను. కాని విశ్వనాథాదులు కొందరు వీని నంగీకరింపలేదు. చైతన్య స్వామి శిష్యులలో ముఖ్యుడగు రూపగోస్వామి యీ విషయమై చర్చించి వీనికి రసత్వము సిద్ధాంతీకరించుటయే గాక, తాను రచించిన "ఉజ్జ్వల నీల మణి, భక్త రసామృత సింధువు" అను గ్రంథములందు శృంగారభక్తి రసము నకు విభావానుభావ సాత్త్విక వ్యభిచార భావములను సమన్వయించి స్థిరీక రించినాడు. అందును ఆత్మసమర్పణము తుదిపరిణామముగా గల రాధా మాధవ భావమును సోపపత్తికముగా నిరూపించెను. భాగవతమున రాధా మాధవ భావము కంఠోక్తిగ లేకపోయినను నవవిధభక్తులకు దృష్టాంతములు కలవు. దాస్యమున క్రింది శ్లోకములను గమనింపుడు:

"వీక్ష్యాలకావృత ముఖం తవ కుండల శ్రీ
గండస్థలాధర సుధం హసితావలోకం
దత్తాభయంచ భుజదండయుగం విలోక్య
వక్షః శ్రియైక రమణంచ భవామదాస్యః॥

(10-29-39)

గోపికలు కృష్ణున కాత్మార్పణము గావించిరనుటకు సందియము లేదు. సుప్రసిద్ధ సంస్కృత చరిత్రకారులగు దాస్‌గుప్తగారి యీ క్రింది వాక్యములను గమనింపుడు:

"The Srimadbhagavata as the great scripture of emotional devotion and store-house of small legends, becomes the

starting point of the theology of the Neo-vaishnava sect and supplies the basic inspiration to the new devotional Poetry. The new stand-point vivifies religion as well as its poetry with a human element and lifts one of the most powerful impulses of the human mind into the means of glorious exaltation. It thereby brings colour and beauty into religious life; and its essential truth lies in its assertion of the emotional and aesthetic in human nature against the hard intellectuality of dogmas and doctrines."

(Hist. San. Lit. Das Gupta P. 385.)

ఈ విధముగా భక్తి రసమునకును, భక్తి సిద్ధాంతములకును శ్రీమద్భాగవతము ప్రేరకమయ్యెను. ఇట్టి మహోత్కృష్టమైన గ్రంథమును పోతనామాత్యుడు తెనిగించి యాంధ్రులకు మోక్షమార్గమును చూపినాడు.

## ౨

## పోతన మహాభాగ్యము

శ్రీమద్భాగవతము నాంధ్రీకరించుట యొక సామాన్య కవి చేయ తగిన పనికాదు. నన్నయభట్టారకు డారంభించిన భారత రచనా కార్యము తిక్కనార్యుని కొఱకై రెండు శతాబ్దములు వేచియుండవలసి వచ్చెను. పోతనకు పూర్వము కవులెందరు లేరు? తిక్కనార్యునితోఁ దులదూఁగగల నాచన సోమ నాథుడు లేడా? తిక్కనార్యుని మెప్పు వడసిన యాయన శిష్యుడగు కేతన లేడా? రామాయణమును రచించిన భాస్కరుడు లేడా? మార్కండేయ పురాణమును రచియించిన మారన లేడా? కాని వీరిలెవరికిని భాగవతము నాంధ్రీకరింపవలెనని తట్టలేదు. ఏల తట్టును? ఒక్కొక్క కార్య మొక్కొక మహామహుని కొఱకై వేచియుండును. అందులకై సుముఖములగు దేశకాల పాత్రాదులు కలియు నపుడు వారవతరింతురు. రచియింప

వలసిన భాగవతమునకు మాతృక యొక్క స్థాయి, యుదాత్తతరావలెను. సంస్కృత రామాయణము యొక్క యుదాత్తత భాస్కరరామాయణ మునకు వచ్చినదా? ఏల వచ్చును? ఇప్పుడున్న, రచియింప బడుచున్న యే రామాయణమునకును వాల్మీకి రామాయణము యొక్క స్థాయి రానేరదు. గ్రంథమునకు తగిన కర్త యుద్భవింపవలెను. ఈ విషయమునే పోతనార్యుడు తన సహజ వినయ భావముతో నిట్లు చెప్పినాడు:

"ఒనరఁ నన్నయతిక్కనాది కవు లీయుర్విం బురాణావళుల్
దెనుఁగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు తానెట్టిదో
తెనుఁగుం జేయరు మున్ను భాగవతముఁ; దీనిం దెనింగించి నా
జననంబుఁ సఫలంబుఁజేసెదఁ బునర్జన్మంబు లేకుండగఁ.

(1–21)

ఇట్లు వదలుట పోతన పురాకృత భాగ్యము మాత్రమేకాదు. ఆంధ్ర జాతి యొక్క పురాకృత శుభాధిక్యమనవలెను. భాగవత మాంధ్రుల మాన్యము. సంస్కృత మాతృక యొక్క రసము, పాశస్త్యము దీనియందు ద్విగుణముగా నున్నదనవచ్చును. తెనిఁగించుటలో పోతన యాంధ్రత్వము నుట్టిపడునట్లు చేసినాడు. గ్రంథమునందు ఆంధ్రుల యాచారవ్యవహారము లను, బాలక్రీడాదికమును బొంస్పి యాంధ్రుంజనిపించు కొనెను. ఆయన యాంధ్రాభిమానమున కొక యుదాహరణము. శుకుడు పరీక్షిత్తునకు భక్తిమార్గమును తెల్పునవసరమున మాతృకలో నీక్రింది శ్లోకమున్నది:

"కిరాత హూణాంధ్ర పుళింద పుల్కసా
ఆభీర కంకాయవనాః కసాదయః
యేన్యేచ పాపా యదుపాశ్రయాశ్రయాః
శుద్ధ్యంతి తస్మైప్రభ విష్ణవేనమః"

పై శ్లోకములోని 'యాంధ్ర' పదమును పోతనార్యుడు వదలివేసెను. చూడుడు.

"యవన వ్యాధ పుళింద హూణకష కంకాభీర చండాల సం
భవులుం, దక్కిన పాపవర్తనులు నే భద్రాత్ము సేవించి, భా
గవత శ్రేష్ఠుల డాసి శుద్ధతనులై, కల్యాణులై యుందు; రా
యవి కారుం, బ్రభవిష్ణు నాదుమదిలో నశ్రాంతముం బ్రొక్కెదన్."

(2—63)

చూచితిరా, పోతనగారి యాంధ్రాభిమానము! భాగవత రచనములో నాయనకు గొప్ప యభ్యర్హితత్వము నిచ్చినవి యాయన భక్తివైరాగ్య వినయములు. ఆయన వ్యక్తియందలి యీ మూడు గుణములును భాగవతము నందడుగడుగునకు కనబడుచుండును. గజేంద్ర మోక్షణాది ఘట్టములలో పెంచి వ్రాసిన స్థలములందలి యావద్భక్తి సన్నివేశములును, పోతనార్యుని భక్తి కుదాహరణములే యనవచ్చును. ఆయన హాలికుడై జీవితమును గడపుటయు, రాజాదరణమును నిరాకరించుటయు, నున్నదానితో తృప్తి నొందుటయు, సరస్వతి కిచ్చిన బాసటయు, మొదలైనవి యాయన వైరాగ్యమునకు తార్కాణములు. ఇక నాయన వినయమును చూడుడు.

"పలికెడిది భాగవతమఁట
పలికించు విభుండు రామభద్రుం డఁట నేఁ
బలికిన భవహరమగునఁట
పలికెద; వేఱొండు గాథ పలుకఁగ నేలా"?

(పీఠిక పద్యం 18)

"భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైనఁ దమ్మిచూలికైన
విబుధ జనులవలన విన్నంతఁ గన్నంతఁ
దెలియవచ్చినంతఁ దేటపఱతు."

(పీఠిక 19)

ఇంతకంటె వినయ ముండునా? విషయౌత్కృష్ట్యమును, నాయన యశక్తత్వము నిందు కనబడుచున్నవి. మఱియు భావి కవులకు నమస్కరించిన కవి కానరాడు.

పోతనార్యుని రచన కేవల భాషాంతరీకరణమా? స్వతంత్ర రచనయా? యను ప్రశ్నము వచ్చును. బాగుగా విచారించిన యెడల నీగ్రంథమున రెండుగుణములు నున్నవని చెప్పవచ్చును. పోతన సహజ పాండిత్యుడ నని చెప్పెను. అందువలన నాయన విద్యాభ్యాసమే చేయలేదా? అట్లనుటకు వీలులేదు. విచారించిన "సహజ కవితాధురీణు"డని మాత్రము చెప్ప వచ్చును. అతని పాండిత్యము గ్రంథము నందంతటను గనబడుచున్నది. మాతృకను శ్రీధర వ్యాఖ్యానముతో పలుమారు పోతనామాత్యుడు చదివి యుండును. అందులకు తార్కాణము కానవచ్చును.

## 3

*భాషాంతరీకరణము*

### పెరుగుదల - అందులకు కారణములు

భారతాంధ్రీ కర్తలు మాతృక నానుపూర్విగా ననుసరింపలేదు. పెంచివ్రాసిన స్థలములకంటె కుదించి వ్రాసిన స్థలములు మెండు. దాదాపు శతసహస్ర సంఖ్యాకగ్రంథములు నన్నయాదుల చేతులలో నేబది వేల గ్రంథములైనవి. ( గ్రంథమనగా ముప్పది రెండు అక్షరపరిమితము. ) అనగా సగమయ్యెను. ఇక భాగవతమా !

సంస్కృత భాగవతముయొక్క పరిమితియు, నిర్వచనమును కొన్ని పురాణములలో నున్నదని వెనుక మనవి జేసినాను.

"యత్రాధికృత్య గాయత్రీం వర్ణ్యతే ధర్మవిస్తరః
వృత్రాసురవధో-పేతం తద్భాగవత మిష్యతే ॥
అష్టాదశ సహస్రం తత్పురాణం పరికీర్తితం"

(మత్స్యపురాణము)

"గ్రంథో౽ష్టాదశ సాహస్రో ద్వాదశస్కంధ సమ్మితః
హయగ్రీవ బ్రహ్మవిద్యా యత్ర వృత్రవధస్తథా
గాయత్ర్యాచ సమారంభః తద్వై భాగవతం విదుః॥"

(స్కాందపురాణం)

పైనివ్వచనములలో భాగవతమునందు 18 వేల గ్రంథములును, 12 స్కంధములును నున్నవని తెలుచున్నది. కాని యిపుడు మనకు లభ్యమైన శ్రీమద్భాగవతమున 12 స్కంధములున్నవి గాని గ్రంథసంఖ్య మాత్రము పురాణములలో చెప్పినట్లులేదు. అందు 22 వేల గ్రంథములున్నవని పండితులు, విమర్శకులు లెక్కచెప్పుచున్నారు. పురాణోక్త గ్రంథ సంఖ్యకంటె 4 వేలెక్కువగ నున్నవి. ఇవి పోతనార్యుని తెనుగు సేతలో దాదాపు 30 వేల గ్రంథములు కలదిగ పరిణమించినవి. అనగా 8 వేల గ్రంథములు పెరిగినవి. ఇట్లు పెరుగుటకు పెద్దలిచ్చిన కారణము లిత్తును.

(1) "బ్రాహ్మ్యాద్యష్టాదశ పురాణములలో నుత్తమంబగు నీ పురాణ మత్యంత రహస్యార్థ ప్రతిపాదకంబును, పరమవేదాంత ప్రతిపాద్య భగవద్గుణ గణాపాదకంబునునైన యుత్తమ గ్రంథమగుట;

(2) ఇట్టి గూఢంబయిన గ్రంథార్థంబు తేటపరుప వ్యాఖ్యాన రూపముగా వర్ణించుట;

(3) భగవద్గుణాభివర్ణనాది ఘట్టంబులందు సంస్కృత భాగవత ప్రతిపాదితక్రమమున నభివర్ణించి, స్వకీయ భగవద్భక్త్యతిశయమున స్వానవద్య కవిత్వ విద్యాచాతురీ సంప్రాప్త నిరంకుశ స్వాతంత్ర్యముచే భగవద్గుణాదులను విశేషముగా వర్ణించుట;

(4) భాగవత గ్రంథ ప్రతిపాదితంబేగాక విష్ణుపురాణ హరివంశాది గ్రంథములనుండి కథావిశేషంబులం గొన్నిటిం దెల్పుట."

పై 4 కారణముల వలన గ్రంథము పెరిగినది. ఇట్టి గుణగణంబు లుండుటచేతనే యీ గ్రంథమునకును పోతనార్యునికిని శాశ్వత కీర్తి చేకూరినది. ఆంధ్రదేశమున శ్రీమద్రామాయణమునువలె ననేకులు ప్రతి దినమును భాగవతమును పారాయణము చేయుటకలదు. నవనిధులు గల కుబేరుడు కూడ తన ధనమును, పోతన శబ్దజాలమును వెచ్చించినంత విరివిగా వెచ్చింపడు. రాయలసీమలో దాదాపు ప్రతి గ్రామమునందును నాంధ్ర భాగవతమును ప్రతిదినము పారాయణ చేయువారు కలరని మాగురు వర్యులు కీ. శే. వాసుదాసుగారు సెలవిచ్చినారు.

౪

## రచనా వైవిధ్యము

భారతము నందువలెనే భాగవత రచనమునందును పెక్కుర చేతులు కలవు. పోతనార్యుడు రచియించిన యావద్గ్రంథము దొరకక పోవుట మన దౌర్భాగ్యము. పోతన భాగవతమునన్ని స్కంధములు రచియించెనా, లేదా యనునది యొక ప్రశ్న. దశమ స్కంధాంతము వఱకు రచియించి యుండవచ్చును గాని ఏకాదశ ద్వాదశ స్కంధములు రచియించి యుండక పోవచ్చునని యొక వాదము. కాని భాగవతమును సమగ్రముగ రచియించగా, సర్వజ్ఞసింగమ యంకితమియ్య నడుగుటయు, నిరాకరించినందున పాతిపెట్టుటయు; లేక రచించిన భాగవతమును దేవతార్చనలో పెట్టి పూజించుచు తుదకు చూడగా కొన్ని భాగము లుత్సన్నము లగుటయు నను రెండు వదంతులును, పోతన్నగారు యావద్గ్రంథమును రచియించియే యుండుననను నూహకు సహకారులుగ నున్నవి. ఇప్పు డుపలభ్యమానమైన గ్రంథమున పోతనార్యుని రచనముగ్గాక వెలిగందల నారయ, ఏర్చూరి సింగయ, బొప్పనార్యపుత్రుడు గంగయ్యయు నను మువ్వురు రచించిన భాగము లున్నట్లు కనపడుచున్నవి. వారు స్వయముగ రచియించిరా,

లేక లుప్తభాగములను పూరించిరా, యను నదొక ప్రశ్న. ఏయే స్థలముల నెవ్వరు పూరించిరో, రచియించిరో యనుటకు నిష్కృష్టమైన తార్కాణము లేవైన నున్నవాయని విచారింతము.

ద్వితీయ స్కంధమున 9 1వ పద్యము వద్ద నుండి వెలిగందల నారయ కవిత్వమని వ్రాత ప్రతుల యందున్నది. దానిని ముద్రిత ప్రతులయందును ననువర్తింపజేసినారు. కాని ద్వితీయ స్కంధాంత గద్యమున పోతనార్యుడు రచియించినట్లే యున్నది. అట్లే తృతీయ స్కంధాంత గద్యమునను పోత నార్యుడు రచియించి నట్లే యున్నది. కావున ద్వితీయ, తృతీయ స్కంధ ములు కొన్ని స్థలములలో నుత్సన్నములు కాగా పోతనార్యుని ప్రియ శిష్యుడగు వెలిగందల నారయ తద్భాగములను పూర్తి చేసెనని యన వచ్చును. కాని యతనే యారెండు స్కంధములను పూర్తిగా రచియించె ననుట విశ్వసింప వీలులేదు. అనేక స్థలములలో పోతన కవితా లక్షణము లును, పోకడలును స్పష్టముగా కనపడుచున్నవి. తృతీయ స్కంధాదిని రామాంకిత పద్యమే యున్నది. అట్లే దశమ స్కంధోత్తర భాగాదిలోను, ఏకాదశ ద్వాదశ స్కంధాదులను, నంకితము మాత్రము రాముని కనియే యున్నది. పోతన పోకడల ననుమానింప వీలులేదు. ఈ క్రింది పద్యములను పరికింప వచ్చును. కృష్ణుడు తోడి గోపబాలురకు వినోదములను చూపు సందర్భమున నిట్లున్నది:

> "వర యమునానదీ సలిల వర్ధిత సౌరభయుక్త పుష్పమే
> దుర మకరందపాన పరితుష్ట మధువ్రత యూథ మాధవీ
> కురవక కుంద చందన నికుంజములందు మయూర శారికా
> పరభృతరాజకీర మృదుభాషల భంగిఁ దెలంగి పల్కుచున్.

(3–108)

ఈ పద్యమునందు క్రింద గీటుంచిన భాగమును దశమ స్కంధము నందలి యీ క్రింది పద్యపాదముతో పోల్చవలెనని కోరుచున్నాను. గోప కాంతలు కృష్ణునిపై చాడీలు చెప్పు ఘట్టమున,

నొసటఁ గేల్సాఁచి కరించు నొక్కఁ డొకచో మృగ
పక్షి ఘోషణములు పలుకఁ జేయు"

(10 పూర్వ. 337)

పైదాని యందు వెనుకటి దాని ప్రతిధ్వని కనుపడుట లేదా? పై సందర్భముననే

వరయమునా నదీజల నివాస మహోరగ విస్తృతాస్య వి
స్ఫురిత విషానల ప్రభల సోఁకునఁ గ్రాఁగిన గోపగోధనో
త్కరముల నెల్లఁ గాచి, భుజగ ప్రవరుం వెడలంగఁదోలి, త
త్సరిదమలాంబుపానమున సంతసమందఁగఁ జేసె గోతతిన్."

(3–112)

అని యున్నది.

ఇట్లనేక పద్యములను చూపవచ్చును. ఈ విధముగా నాలోచించిన నాగయ యుత్పన్న భాగములను మాత్రమే పూరించె ననుకొనక తప్పదు. ఈ క్రింది తృతీయ స్కంధమునందలి పద్యమును పరికింపుడు.

"కంజాతకింజల్క పుంజ రంజిత పీత
కౌశేయ వాసు, జగన్నివాసు,
శక్రప్రభీకర చక్రశంఖగదాపద్మ
విహిత చతుర్బాహు, విగతమోహు,
సుభక్తలోక మనోనేత్ర వర్తిష్ణు,
లాలిత సద్గుణాలంకరిష్ణు
వరకుమారక వయః పరిపాకు, సుశ్లోకు,
సుందరాకారు, యశోవిహారు,
సకలలోక నమస్కృత చరణకమలు,
భక్తలోక పరిగ్రహ ప్రకటశీలు,
వర్ణనీయ మనోరథ దాయిఁ, కీర్త
నీయతీర్థ యశోమహనీయమూర్తి."

(3—224)

ఇక నారయ్యాయే పూరించెనని చెప్పు చతుర్థ స్కంధమునకు వత్తును. ఇచట కూడ కొన్ని యుత్సన్న భాగములను పూర్తిచేసినట్లే కన పడును గాని యంతయు వ్రాసెనని చెప్పుటకు వీలులేదు. ఈ క్రింది పద్య ములను చూడుడు.

కైలాస వర్ణనము:

"భాసురలీలఁ గాంచిరి సుపర్వులు భక్తజనైక మానసో
ల్లాసముఁ, గిన్నరీజన విలాసము, నిత్యవిభూతి మంగళా
వాసము, సిద్ధగుహ్యకనివాసము, రాజిత భూవికాసికై
లాసముఁ, గాంతి నిర్జితకులక్షితిభృత్సుమహద్విలాసముఁన్."

(4—133)

"అరవిందోదర! తావకీన ఘన మాయామోహితస్వాంతులై
పరమంబైన భవన్మహామహిమముం బాటించి, కానంగ నో
పరు బ్రహ్మాది శరీరులజ్ఞులయి; యో పద్మాక్ష! భక్తార్తి సం
హరణాలోకన! నన్నుఁ గావఁ దగు నిత్యానంద సంధాయివై."

(4—177)

పై పద్యముల యంతము లచ్చముగా పోతనార్యుని వానివలె నున్నవి.

ఈ విధముగా పరీక్షించినచో "ద్వితీయ తృతీయ చతుర్థ స్కంధము లును, దశమస్కంధోత్తర భాగమును కేవలము పరూపద్యములతో నిండి నిబిడీ కృతములై లేవని" వ్రాసిన విమర్శకులతో నేనేకీభవించుచున్నాను. పూరిం చెనని చెప్పు స్థలములు కూడకొన్ని పోతన పోకడలను కల్గియే యున్నవి. దశమస్కంధోత్తర భాగమున "కాటుక నెరయంగ కన్నీరు వరదలై" యను పద్యము నుండి వెలిగందల నారయ రచితమని పూర్వ ముద్రిత గ్రంథము లలో నున్నట్లు పీఠికాకారులు వ్రాసిరి. నూతన ముద్రణమున నామా

టలు తీసివేసి ముద్రాపకులు ముద్రించినందులకు వందనీయులు. వివాద కారణము తొలగింపబడినది.

ఏకాదశ ద్వాదశ స్కంధములు పోతనార్యుని ప్రియ శిష్యుఁడు వెలిగందల నారయ రచియించినట్లు వ్రాసికొని యున్నాడు. ద్వితీయతృతీయ చతుర్థ స్కంధములలో కొంత భాగములను పూరించినను, పంచమషష్ఠ స్కంధములను పూరించినవారు తామే వ్రాసినామని వ్రాసుకొనినట్లు, వెలిగందల నారయ వ్రాసుకొనలేదు. ద్వాదశ స్కంధాంత గద్యమున నారయ "నారాయణ" యైనాడు. బహుశః యీస్కంధములు పూర్తిగా నుత్సన్నములై యుండునని నాయూహ. పోతన పోకడ లిచట నెక్కువగా గానరావు. మరియు భాషాంతరీకరణములో కొన్ని భేదములున్నవి. వానిని కొన్ని చూపుదును. మాతృక యనేక స్థలములలో సరిగాలేదు. కొన్ని భాగములను పూర్తిగా వదలివేసెను. "మాతృకలోనున్న భిక్షు గీతాదులు తెనుగునకు రాలేదు". ఏకాదశస్కంధమున త్రయోదశాధ్యాయమున "శ్రీకృష్ణుండు హంసరూపియై చేసిన తత్త్వోపదేశ సందర్భమున" "వస్తునో యత్"అను శ్లోకమునుండి పదునేడు శ్లోకములను తెనుఁగు సేతలో నైదారు పంక్తులలో వెళ్ళబుచ్చినాడు. పదునాల్గవ యధ్యాయమున భక్తిపారమ్య ధ్యానయోగమును కొలది పంక్తులలో నిమిడ్చినాడు. మూలము నందలి యర్థమునకు భిన్నమైన తెనుఁగు సేత నొకదానిని చూపుదును.

"మనసా వచసాదృష్ట్వా దృశ్యతేన్యై రతీంద్రియైః ।
అహమేవ నిమిత్తోన్యదితి బుద్ధ్యాధ్వ మంబసా॥"

అను శ్లోకమునకు "పంచేంద్రియములకు దృష్టంబైన పదార్థంబు నిత్యంబు. అది నిత్యదృష్టిని బ్రహ్మంబని తెలియవలయును," అని యాంధ్రీకరించినాడు. షోడశాధ్యాయము నందలి విభూతులను ముఖ్యముగా మూఁడు పంతులలో ముగించినాడు. మొత్తముమీద నీ రెండు స్కంధముల తెనుగుసేత తృప్తికరముగలేదని విమర్శకు లనుచున్నారు. మఱియు

రెండవ తుదిస్కంధము లగుటచేతను, మూలమున కూడ నివి వెనుకటి స్కంధముల విశిష్టత లేకపోవుటచేతను నవి యెక్కువ శ్రద్ధతో రచింపబడి నట్లు కానరావు. వ్రాతప్రతులకును, నచ్చు ప్రతులకును పాఠభేదము లున్నట్లు విమర్శకు లనుచున్నారు. మన కా వ్రాతప్రతులు లభ్యములు కాక పోవుటచే నా విషయమునె యెక్కువగా విస్తరింపజాలము. నారయ రచన లయిన తుదిస్కంధములలో కొన్ని విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతిపాదకము లైన వాక్యములున్నట్లు చెప్పుదురు. పోతనయు శుద్ధ శంకరాద్వైతము ననుసరింపక పోయినను, కేవల విశిష్టాద్వైత సిద్ధాంతానుసారముగా వ్రాయక, శ్రీధరస్వాముల ననుసరించి యద్వైతమునకును, భక్తికిని వైరుధ్యము లేదను సారాంశముతో వ్రాసెను. జ్ఞానము భక్తిగా పరిణమించి మోక్షసాధన మగునని యాయన యభిప్రాయము. తుది రెండు స్కంధము లలో నట్లుగాక "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' యను నుపనిషత్తుల్యంబగు గీతావచన ప్రకారంబున" యనియు, "దేవతాంతర మంత్రాంతర సాధనాంతరములు వర్జించెనేని వైకుంఠంబున వసియించు" ననియు నిటులగు ననేక వాక్యములున్నవి.

(11--106; 12--39)

వీనితోపాటు కేవలాద్వైతపరములైన వాక్యములును కలవు. విశిష్టాద్వైత పరములగు వాక్యములు దశమస్కంధోత్తర భాగమునందును కలవు. ఒక యుదాహరణము నిచ్చెదను.

> "వెండియు గొందఱు సచరాచర వస్తుజాతములకు నంతర్యామివై సర్వంబు నీవయగుటం దెలియలేక, యనిత్యంబని విపరీతబుద్ధిం దలియు దురు; కాని కొందఱు జగద్భావితుండవు గాన, జగదూపకుండవైన నిన్ను కటకమకుట కర్ణికాది వివిధ భూషణభేదములం గనకంబు నిజస్వరూపంబు విడువక వర్తించు చందంబున జగద్వికారాను గతుం

డవయ్యును నిఖిల హేయ ప్రత్యనీక కల్యాణ గుణాత్మకుండవై యుండువని యాత్మవిదులైనవారు తెలియుదురు."

(ద. ఉ. 1220)

"అట్టి జీవులు దేవతిర్యఙ్మనుష్య స్థావరాది శరీరంబులు సొచ్చి యనురూపులై యుందురు. అందును నీవుందువు తదంతరాత్మవగుచు."

(ద. ఉ. 1223)

"సకల బ్రహ్మాండనాయకుండవైన నీయందు శ్రుతులు ముఖ్యవృత్తిం బ్రవర్తించు."

(ద. ఉ. 1230)

పై వాక్యములందలి యంతర్యామిత్వము, నిఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణాత్మకత్వము, అంతర్యామియెడ శ్రుతుల ముఖ్యవృత్తత్వము మొదలైనవి కేవల విశిష్టాద్వైత సిద్ధాంతములు. ఇట్లు రెండు విధముల వాక్యము లుండుటచేత నారయ కొన్ని స్థలముల శ్రీధర వ్యాఖ్యాననుసరించెననియును, కొన్నియెడల ననుసరింపలేదనియు ననుకొనవలెను.

ఇక పంచమ స్కంధమును గూర్చి కొంచెము తెలిసుకొందము. పంచమస్కంధమును బొప్పనార్యపుత్రుడైన గంగయ్య వ్రాసెనని స్కంధాంత గద్యమున కలదు. ఇది రామాంకితముగాక "నందగోప కుమారాంకితము"గా నున్నది. ఆశ్వాసములుగా విభజింపబడి యున్నది. "మహనీయ గుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుండిట్లనియె" నను పరిశీతమాత్రము పోతన్న గారిదే వాడబడినది. నేను వెనుక చెప్పినట్లు నారయ్యయేగాక గంగయ్య సింగయ్యలును పోతన్నగారి ననుకరింప యత్నించిరి. విమర్శకులు "మూలము నందలి విశేషణాదు లొక్కొకచో లేవనియు, మూలాక్షరరీతి మారినదనియు, సరసవస్తు త్యాగములున్నవనియు, మొదలగు లోపముల నీ భాగమునందు

చూపుచున్నారు. పైవానివంటి మార్పులు భాషాంతరీకరణము లగునన్న గ్రంథములయందును కనపడును. కవిత్రయమువారు పెంచలేదా? కుదించలేదా? అట్లే పెంచినాడు. పోతనామాత్యుడును కుదించినాడు. కాని యీ స్కంధమున కొన్ని స్థలములలో కూడని వివరణములు చేసినట్లు తెలియగలదు. ఒక్క యుదాహరణము: ఆగ్నీధ్రుడు పూర్వచిత్తితో సంభాషించునపుడు మాతృకలో నిట్లున్నది.

> "కాత్వం చి కీర్షసిచకిం మునివర్య శైలే
> మాయాసికాపి భగవత్పరదేవతాయాః।
> విజ్యేబిభర్షి ధనుషీ స్సుహృదాత్మనోర్థే
> కింవామృగాణ్ మృగయసే విపినే ప్రమత్తాణ్॥"

(5-2-8)

దీనికి తెనుగుసేత యీ క్రింది విధముగా నున్నది:

> "సతి! నీవెవ్వతె? వీ ప
> ర్వతమునకేమేనిఁ గోరి వచ్చిన వనదే
> వతవో? శారదవో? రతి
> పతి పంచిన మాయవో? తపస్సారమవో"

(5-ప్ర. 27)

మన్మథ పరవశుడై యట్లు పలికెనట! మన్మథపరవశుడై "నీవు శారదవో" అని సరస్వతినిగా పల్కుట యశ్లీల ద్యోతకముగా నున్నది. తరువాత నున్న మనోహర శ్లోకముయొక్క తెనుగుసేతయు తృప్తి కరముగా లేదు.

పోతన్నవలె గంగన్నయు కొన్ని స్థలముల తన స్వంతవర్ణనములను జొన్పినాడు. ఈ భాగము పోతన రచించిన భాగమువలె నద్వైత పరము గానే యున్నది. మూలార్థము నెక్కువగా విడువకుండ తెనుగు చేసిన స్థలములును కలవు. ఒక్క యుదాహరణము.

"ఇతి తేషాం వృషలానాం, రజస్తమః ప్రకృతీనాం, ధన మదరజ ఉత్సిక్త మనసాం ...... కర్మాతిదారుణం యద్బ్రహ్మభూతస్య, సాక్షాద్బ్రహ్మర్షి సుతస్య, నిర్వైరస్య, సర్వభూత సుహృదః, సూనాయా మప్యనుజ్ఞాతాయాం, అనభినుత మాలంభన ముపలభ్య బ్రహ్మతేజసాతి దుర్విషహేణ దందహ్యమానేన వపుషా సహసోచ్చచాం. సహసైవదేవీ భద్రకాళీ భృశమమర్ష రోషావేశ రభస విలసిత భ్రుకుటీ విటపకుటిల దంష్ట్రారుణే క్షణాటోపాతి భయానక వదనా హంతు కామే వేదం మహాట్టహాస మతి సంరంభేణ విముంచంతీ తతఉత్పత్య పాపీయసా మతి దృష్టానాం తేనై వాసినా వివృక్ణ శీర్ష్ణాం గళాత్స్రవం తమసృగాసవ మత్యుష్ణం సహాగణేన నిపీయ అతిపాన మదవిహ్వలోచ్చైస్తరాం స్వపార్షదైస్సహః జగౌననర్తహా, విజహారచ శిరః కందుకలీలయా.

(5–16, 17, 18)

"సర్వభూతములకు సఖుడును, బ్రహ్మభూతాత్ముడు
 నిర్వైరుడయిన బ్రహ్మ
సుతుని తేజంబంతఁజూడ దుస్సహమైన
 భయమంది వడకుచు భద్రకాళి
క్రోధంబు ముమ్మిడిగొనఁగ హుంకారంబు
 సలుపుచు నట్టహాసంబు సేసి
పాపాత్ములును దౌష్ట్యపరులును రాజస తామస
 కర్మ సంధానులగుచు
విప్రవరునట్లు హింసించు వృషల పతిని
భృత్యవర్గంబుతోఁదలఁ బృథ్విఁ గూర్చి
యపుడు వృషలాధిపుని శిరమంది లీలఁ
బాడియాడుచు నందంద క్రీడ సలిపె."

(5—1—133)

పైన గద్యములో నున్న స్వల్ప విషయములను వదలి కథాంశము

చెడకుండ తెనుగు చేసినాడు. ఈయన కొన్ని స్థలములలో శ్రీధర వ్యాఖ్యానము ననుసరించెను. ఒక్క యుదాహరణము నిత్తును. పంచమ స్కంధ ఏకాదశాధ్యాయమున రహూగణునకు భరతుడు ప్రత్యుత్తర మిచ్చు నపుడు మాతృక యిట్లున్నది.

"యావన్మనోరజసాపూరుషస్య
సత్వేనవాత మసావా నురుద్ధం
చేతోభి రాకూతిభిరాతనోతి
నిరంకుశం కుశలం వేతరం వా॥
సవాసనాత్మా విషయోపరక్తో
గుణప్రవాహో వికార షోడశాత్మా"

(5—11—4,5)

దీనికి శ్రీధర వ్యాఖ్య యిట్లున్నది
"మనోయావద్రజ ఆది భిర్గుణైరనురుద్ధం వశీకృతం భవతి, తావత్,...పురుషస్యాకుశలం ధర్మం యితర ధర్మంవా, ఆతనోతి; కైః? చేతోభిః, జ్ఞానేంద్రియైః, ఆకూతిభిః, కర్మేంద్రియైశ్చ, తతశ్చ ధర్మాధర్మ వాసనాయుక్తం...తన్మనః"

దీనికి క్రింది తెనుగు సేత.

"పురుషుల చిత్తంబు గుణములఁ జెంది, యెంత
కాలముండును, మఱియంత కాలమందు
నరయ విజ్ఞాన కర్మేంద్రియములచేత
మరగి ధర్మంబులను నధర్మంబులట్లు
తగిలి పుట్టించుచుండు నత్యంత మహిమ."
మరియు ధర్మాధర్మ వాసనా యుక్తంబు చిత్తంబు.

(5-ప-154)

శ్రీధరయవ్యాఖ్య ననుసరించిన మఱియొక యుదాహరణమునిత్తును. పూర్వ చిత్తుని వర్ణించు నవసరము నున్న గద్యమున (5-2-4) "పురట

లతారూఢః''అని మాతృకలో నున్న దానికి శ్రీధరులు'' స్వర్ణవల్ల్యాః తాస్యా రూఢాః''అని వ్రాసిరి. గంగన దానినే "సువర్ణలతారూఢ''అని యుంచెను. ఈ విధముగా గంగన్న గ్రింథాంత గద్యమున తానీ స్కంధమును రచి యించెనని చెప్పుకొన్నను పోతనమార్గమునే యనుసరించినట్లు భావింపవలెను.

ఇక షష్ఠస్కంధమును పరిశీలింతము. ఈ స్కంధమన్నిటికంటె విలక్ష ణము. దీనిని సింగయ రచియించెను. ఇందు పోతనవలెనే తన యిష్టదేవతా ప్రార్థనమును, వంశావతారమును, షష్ట్యంతములను రచియించెను. అచ్యు తుని కృతిపతిగా నొనర్చెను. పోతనకు వలెనే యితనికిని సరస్వతి కన్పడెను. క్రింది యనుకరణమును గమనింపుడు.

''భాగవతముఁ దేటపఱుప నెవ్వడు సాలు
శుకుఁడుఁదక్క. నరుని సఖుఁడుఁ దక్క
బుద్ధిఁ దోఁచినంత బుధులచే విన్నంత
భక్తి నిగిడినంత పలుకువాఁడ."

(6-23)

కథాక్రమ మిట్లు మొదలు పెట్టెను:

"హరిచరణ స్మరణ పరిణామ వినోదులైన శౌనకాదులకు నిఖిల పురాణేతిహాస నిర్ణయ విఖ్యాతుడైన సూతుండిట్లనియె'' ఈ స్కంధము నందలి యజామిళోపాఖ్యానమును, చిత్రకేతూపాఖ్యానమును చదివిన తప్పక యీ భాగములను పోతనయే రచియించెనను నభిప్రాయము పొడ మును. యమదూతల వర్ణనమును చూడుము.

''కనియెన్ బ్రాహ్మణుఁ డంత్యకాలమున వీకన్ రోష నిష్ఠ్యూమలన్
ఘన పీనోష్ఠ వికారవక్త్రి విలసద్గర్వోత్కటో వేశులన్
జన సంత్రాస కరోద్యతాయత సుపాశ శ్రేణికా హేతులన్
హనసవ్యాప్తి విశీర్ణకులన్ ముష్టుర సాత్మ్యా సేతలన్ దూతలన్."

(6-70)

ఈయనయు పోతనవలె శ్రీధరవ్యాఖ్య ననుసరించిన స్థలములును గలవు. మాతృకలో "కుంజర శౌచవత్" (6-1-10)అను దానికి శ్రీధరుల వారు "యథాకుంజరఃస్నాతోపి రజోభిరాత్మానం మలినం కరోతి" అని వ్రాసిరి. దానికి సింగన, "సలిలమందు మేని మలినంబు పోకుండ గజము గ్రుంకు వెట్టుగతియుబోలె"అని తెనుగు జేసెను. మరియొక యుదాహరణము.

హంస గుహ్యాస్తోత్రమున:

"యదోపరామో మనసోనామరూపరూపస్య దృష్టస్మృతి
సంప్రమోషాత్
య ఈయతే కేవలయా స్వసంస్థయా హంసాయ
తస్మైశుచిసద్మనే నమః"
(6-4-26)

అని మాతృకలో నున్నది.

దానికి శ్రీధరులవారు

"యదామనస ఉపరామః=సమాధిః, తదా, నామరూపే రూప్యేతే యేన తత్తథా, తస్యఉపరమే హేతుః, దృష్ట=దర్శనం; స్మృతిశ్చ; తయోః సంప్రమోషాత్=నాశాత్; తదా, యః, కేవలేన=స్వరూప జ్ఞానేన ప్రతీయతే; తస్మై, హంసాయ=శుద్ధాయ; శుచి=శుద్ధం, మనః; సద్మ=ప్రతీతి స్థానం యస్యతస్మైనమః"అని వ్యాఖ్య రచియించిరి. దానిని గంగయ్య యిట్లు తెనుగు జేసెను.

"మఱియు ననేక నామరూప నిరూప్యంబగు మనంబునకు దృష్టిస్మృతుల నాశంబు వలన కలిగెడు నుపరామంబగు సమాధియందు, కేవల జ్ఞాన స్వరూపంబున నిర్మల ప్రతీతి స్థానంబైన హంస స్వరూపికి నమస్కారములు."
(6-217)

ఈ స్కంధములో కొన్ని విశేషములు కలవు. ఒక దానిని చూపె దను. దేవతలు వృత్రునిచే నోడిపోయి విష్ణువు వద్దకు పోవు సందర్భమున దుగ్ధసముద్ర వర్ణనమున్నది. ఇది మాతృకలో లేదు. ఈ వర్ణన మద్భుత ముగా నున్నది. ఇందలి శ్లేషమూలోపమాలంకారములు, మొదటి నైమి శారణ్య వర్ణన గద్యమునందలి వానిని పోలియున్నవి. చూడుడు.

"మధువైరి మందిరంబునుంబోలె మాధవ మన్మథ మహితంబై, *బ్రహ్మగేహంబునుంబోలె శారదాన్వితంబై*, నీలగళ సభానికేతనంబునుం బోలె వహ్ని వరుణ సమీరణ చంద్రరుద్ర హైమవతీ కుబేర వృషభ గాలవ శాండిల్య పాశుపత జటిపటల మండితంబై, మరుని కోదండం బునుంబోలె పున్నాగ శిలీముఖ భూషితంబై ...శైలజా నిటలంబు నుంబోలె చందనకర్పూర తిలకాలంకృతంబై,...లంకానగరంబునుం బోలె రామమహిషీ వంచక సమంచితంబై." (1-39)

"విష్ణు కరకమలంబునుంబోలె సుదర్శనావర్త ప్రగల్భంబై, కైలాస మహీధరంబునుంబోలె నమృత కళాస్థాన శేఖర పదార్పణంబై, ఇంద్ర వైభవంబునుంబోలె కల్పవృక్ష కామధేను చింతామణి జనిత విశే షంబై, సుగ్రీవ సైన్యంబునుంబోలె అపరిమిత నిబిడ హరిసంచా రంబై, నారాయణోదరంబునుంబోలె నిఖిల భువన భారభరణ సమ ర్థంబై, శంకరు జటాజూటంబునుంబోలె గంగాతరంగిణీ మాశ్రి యంబై, బ్రహ్మలోకంబునుంబోలె పరమహంసకుల సేవ్యంబై".

(6-326)

ఈ సామ్య మసామాన్యము. పోతన వచనరచనలో కాదంబరీ కావ్యము నొరవడిగా పెట్టుకొనెనందురు. ఈ రచనము పోతనది కాదన గలమా? అజామీళ చిత్రకేతూపాఖ్యానము చదువు నప్పుడా భాగములు తప్పక పోతనార్య రచితములేనని మనకు తోచును. విమర్శకులు వ్రాసిన,

"షష్ఠ స్కంధములో 307, 326 వచనములును, అజామిళోపాఖ్యానము, చిత్రకేతూపాఖ్యానము పోతనామాత్యుని కవితయేయని సర్వవిధముల విశ్వసింప దగియున్నది. అందు పోతన యభిమానించు నంత్యనియమములు, సాంస్కృతిక దీర్ఘసమాసములు, సీసపద్య నిర్మితులు విశేషముగా కలవు. విమర్శకులు షష్ఠస్కంధమును పోతరాజు కవితయను మనోవిశ్వాసముతో మరల పఠింతురేని మాయూహతో నేకీభవింపకపోరు."

(భా. పీఠిక)

పై వాక్యములతో నేనేకీభవించుచున్నాను.

౨౪

లాక్షణికుల నింద; గ్రంథపాతము

ఇక లాక్షణికులు భాగవతముపై చేసిన నిందను విచారింతము. ఉభయరేఫ సాంకర్యము చేసెనని యానింద. దీనిని గూర్చి యొక విమర్శకు డిట్లనినాడు:

"ఆంధ్రకవులలో నొకపక్షమువారి రీభేదమును పాటించినవారుగను, నింకొక పక్షమువారు వీనిని పాటింపనివారుగను నున్నారు." ఈ విషయమున నప్పకవి చేసిన యాదోషమునకు కూచిమంచి తిమ్మకవి యిచ్చిన యీ క్రింది సమాధానమును గమనింపుడు:

"కాకుమాని యప్పకవి యహోబిలపతి
ముద్దరాజు రామముఖ్యులెల్ల
పోతరాజు కబ్బమున రాలు రేఫలు
గదిసెనంచు చెప్పిరది హుళిక్కి."

ఆ విమర్శకునే పోతన వ్రాసిన భాగవత భాగములలో నీ నియమమును పాటించుటయు, యితర భాగములలో పాటింపమియు చూపుచు

నుదాహరణములు నిచ్చియున్నారు. వ్యాకరణమునకును, అలంకారమునకును బొత్తుగా గౌరవమేలేని యీ కాలమున నీ నింద కెక్కుడను తావేలేదు. సద్గురువులగు కీ. శే. వాసుదాసుగారు తమ రామాయణ పీఠికయందీ క్రింది విధముగ సెలవిచ్చినారు.

"తుచ్ఛుడు సరిగాదని నను
స్వచ్ఛుపుఁబోతన కవిత్వ సంపద చెడునే ?
మ్లేచ్ఛ జరభి దూషించిన
నచ్ఛ పతివ్రతకు పాపమంటంగలదే?"

గ్రంథపాత వృత్తాంతమును వినుడు. దీనికి రెండు కారణములు వాడుకలో కలవు. పోతన భాగవతమును పూర్తిచేసి పూజామందిరమున నుంచి కుమారుని జాగ్రత్తగా కాపాడుమని చెప్పిపోగా తరువాత కొంత కాలమునకు దానిని విప్పి చూడనది కొంతభాగము క్రిమిదష్టమైనందున పోతనార్యుని ప్రియశిష్యుడైన వెలిగందల నారయ మొదలైనవారు దష్ట భాగములను పూర్తిచేసిరని యొక కథ. సర్వజ్ఞసింగనకు భాగవతము నంకితము నీయ పోతనార్యుడు నిరాకరింపగా నాయనకు కోపము వచ్చి, దానిని పాతిపెట్టించెననియు, నందువలన నది శిథిలమైనదనియు తచ్ఛిథిల భాగములను నారయాదులు పూరించిరనియు రెండవ కథ. వీని యాథార్థ్యమిపుడు మనకు బనిలేదు. కొన్ని భాగము లుత్సన్నములైనదియు, వానిని నారయాదులు పూరించుటయు సత్యము. ఈ పూరణ సమస్యను వెనుక కొంత ముచ్చటించినాను. ద్వితీయ స్కంధమునందలి కొంత భాగమును, తృతీయ చతుర్థ స్కంధములలోని కొంత భాగమును, పంచమ షష్ఠస్కంధములును, దశమ స్కంధోత్తర భాగమును, ఏకాదశ ద్వాదశ స్కంధములును నుత్సన్నములైనట్లు ప్రతీతి. వీనిలో పంచమ, షష్ఠ స్కంధములును, ఏకాదశ ద్వాదశ స్కంధములును నితరులు పూరించినట్లు స్కంధాంత గద్యాదులు సాక్ష్యమిచ్చుచున్నవి. కాని లేని భాగములు పూరించిరా? లేక లుప్త భాగ

ములను పూరించిరా యనునదొక ప్రశ్న. పూరణ విధానమును వెనుక మనవి చేసినాను. భారతారణ్య పర్వములోని లుప్తభాగముల నెట్లిన పూరించినట్లే వీరును చేసిరని యనుకొనవలెను. భారత విషయమున నభి ప్రాయ భేదమున్నను, నిచట మాత్రము లోపించిన భాగములనే పూర్తి చేసి నట్లు వెనుకనిచ్చిన దృష్టాంతముల వలన చాలవఱకు నిరూపించి యున్నాను. వీరి ప్రత్యేక కవిత్వ విధానములకు నిర్దిష్టములైన లక్షణ ములు గానరావు. శైలి, పదగుంభనము, దీర్ఘసమాసములు, అంత్యానియమ ములు మొదలైన లక్షణములున్నవని కొందరందురు. కాని యవి యవ్యాప్త్యతివ్యాప్తిదోషములతో కూడియున్నది. ఆ విషయమును వెనుక చూపించినాను. స్కంధాంత గద్యములందు తమ ప్రత్యేక నామముల నిచ్చి నను, నీ లక్షణ వ్యత్యాసము కానబడుటలేదు. వెనుకటి లక్షణములన్నిట కనబడుచున్నవి. విమర్శకులు కొందరు సీసపద్యములలో పోతన యొక విధమైన యతిప్రాస నియమమును పాటించెననియు, దానివలన నితరుల భాగములను కనుగొనవచ్చుననియు చెప్పినారు. కాని వారి సూత్రము కూడ యవ్యాప్త్యతి వ్యాప్తిదోష దూషితముకాదని చెప్పవీలులేదు. కాబట్టి యీ విషయమున నిదమిత్థమని చెప్పుటకు వీలులేదు. కీ. శే. తిరుపతి వేంకటేశ్వరుల కావ్యములలో నేది తిరుపతి శాస్త్రిగారును, నేది వేంకట శాస్త్రిగారును వ్రాసిరని నిర్ధారణము చేయుటకు తగు నాధారములు లేవు. ఒకమారు శ్రీ వేంకటేశ్వర శాస్త్రిగారే యట్టి సాహసము చేయవలదని మంద లించిరి. అట్టి స్థితిలో భాగవతమును గూర్చి నిష్కృష్టముగా చెప్పుట యసంభవము. ఆ విమర్శకులే యీ క్రింది వాక్యములను వ్రాసినారు.

"వీని నన్నిటిని సమన్వయించినచో పోతన గ్రంథములో పరుల కూర్పులు మార్పులు తప్ప వారి స్వంత రచన మంతగాలేదని తోచును... ...పంచమ షష్ఠస్కంధములు చాల భాగముత్సన్నము కాగా కొంత పోతరాజు రచనము మఱికొంత తమ రచనము నింపి మాతృకలోనుండి లభించిన పద్యములను చేర్చి తలలు మార్చి క్రొత్తకూర్పులు కూర్చి పూర్వ

గ్రంథస్కంధములు నిలువబెట్టినటుల తెలియును. భాగవత పూర్వ పీఠికా కారులందరును నేకముఖమున గంగన సింగనల కవిత పోతన కవితతో పోలుననుట కిదియే తార్కాణము.'' ఇక నేకాదశ ద్వాదశ స్కంధములు మాత్రము నారయ కృతులనుట స్పష్టము. ఈ వివిధ కవిత్వములును, వాని లక్షణములును, పోలికలును యీ వ్యాసాంశములు కావు. కావున నా పరీక్షను ''కవిత్వమును'' చర్చించువారికి వదలివేతును. అనువాద విధానమున పోతన దానిని తెల్పి యితరుల దానిని వదలుట పాడిగాద నియు, నితరుల యనువాద విధానమును తెల్పు వ్యాసము వేరుగా లేనందు నను నీ విషయమును కొంత చెప్పవలసి వచ్చెను. సింగయ గంగయల కవిత్వముకంటె నారయ కవిత్వము కొంత లొజ్జనియు నతని భాగములందు దోషములు మిక్కుటముగా నున్నవనియు కొందఱందురు. కాని వారు తెలిపెడి దోషముల వంటివి ప్రాయికముగా నందలి భాగములందును కొంచెమో గొప్పయో కలవు. ఆ విషయము మనకు బనిలేదు. భాగవతమును రచించి పూరించిన మహామహులందఱును వంద్యులే.

౬

## పోతన భాషాంతరీకరణము

ఇక పోతన భాషాంతరీకరణ పద్ధతిని ప్రత్యేకించి పరిశీలించవలసి యున్నది. వెనుక పోతన తెనుగు సేతలో భాగవతము 8000 గ్రంథములు పెరిగినట్లు తెలిపినాను. ఈ పెరుగుదల యితరులు తెనిగించినట్లు చెప్పు భాగము లందుకంటె పోతన తెనిగించిన వానిలోనే యెక్కువగా నున్నది. ఇందునకు కారణము కూడ వెనుక మనవి చేసియున్నాను. ఆ కారణము లెట్లు పెరుగుదలకు మూలభూతములో కనుగొందము.

1. బ్రాహ్మ్యద్యష్టాదశ పురాణములలో నుత్తమంబగు నీ పురాణ మత్యంత రహస్యార్థ ప్రతిపాదకంబును, పరమ వేదాంత ప్రతిపాద్య

భగవద్గుణ గణాపాదకంబును నైన యుత్తమ గ్రంథంబగుట;

2. ఇట్టి గూఢంబైన గ్రంథార్థంబు తేటపఱుప వ్యాఖ్యానరూపముగా నభివర్ణించుట.

పై రెండు కారణములను. కలిపి విచారింతును. భాగవత మట్టి యుత్తమ గ్రంథమనుటకు ప్రమాణములను తెల్పెదను.

"యత్రాధి కృత్య గాయత్రీం వర్ణ్యతే ధర్మవిస్తరః
వృత్రాసురవధోపేతం తద్భాగవత మిష్యతే
అష్టాదశ సహస్రం తత్పురాణం పరికీర్తితం."

(మత్స్యపురాణము)

"గ్రంథోష్టాదశ సాహస్రో ద్వాదశస్కంధ సమ్మితః
హయగ్రీవ బ్రహ్మవిద్యా యత్ర వృత్రవధ స్తథా
గాయత్ర్యాచ సమారంభః తద్వై భాగవతం విదుః"

(స్కాంద పురాణము)

"అంబరీష శుకప్రోక్తం నిత్యం భాగవతం శృణు
పఠస్వ స్వ ముఖేనాపి యదీచ్ఛసి భవక్షయం."

(పద్మ పురాణము)

"అర్థోయం బ్రహ్మ సూత్రాణాం భారతార్థ వినిర్ణయః
గాయత్రీ భాష్యరూపోసౌ వేదార్థ పరి బృంహితః
పురాణానాం సారరూపః సాక్షాద్భాగవతోదితః
ద్వాదశస్కంధ సంయుక్తః శతవిచ్ఛేద సంయుతః
గ్రంథోష్టాదశ సాహస్రః శ్రీమద్భాగవతాభిధః."

(గరుడ పురాణము)

పైన యిచ్చిన పురాణ వచనముల సారాంశమేమనగా భాగవతమున కారంభమున గాయత్రీ మంత్రమున్నదని అది యే సత్యం పరంధీమహి"

యనునది. ఈ మంత్రమును పోతనార్యుడు భాషాంతరీకరింపలేదు. ఇది యొక విశేషము. భాగవతమునకు హయగ్రీవ బ్రహ్మ విద్యయను నామాంతరము కలదు. హయగ్రీవుడు చిక్కుబడకుండ వేదములను బ్రహ్మదేవుని కిచ్చినట్లున్నది. వృత్రాసురవధ భాగవతమున కొక విశిష్ట లక్షణము. అంబరీషుడు గౌతముని మోక్షోపాయమడుగగా నాయన నిత్యము భాగవతమును వినుమనియు సంసారక్షయమును కోరినయెడల భాగవతమును పఠింపుమనియు చెప్పెను. ఏతద్భాగవత పఠన శ్రవణములు మోక్షదాయకములు. మఱి యే యితర పురాణమును గూర్చి యిట్లు కంఠోక్తిగా చెప్పలేదు. వేదాంతార్థ ప్రతిపాదకములైన బాదరాయణ బ్రహ్మసూత్రముల యర్థము భాగవతమున క్రోడీకరింపబడినది. పంచమ వేదమైన భారతము యొక్క తాత్పర్యమిందు తెల్పబడినది. మంత్రరాజమగు గాయత్రీ మంత్రమునకీ భాగవతము భాష్యరూపము. వేదములయొక్క యర్థములచే నిది నిండియున్నది. ఇది సమస్త పురాణ సారభూతమైనది. భాగవత ప్రాశస్త్యమున కింకేమి కావలెను? ఇది బ్రాహ్మ్యాది సమస్తేతర పురాణ సారభూతమనుట కేమి యభ్యంతరమున్నది? ఇందు మోక్షమునకు ముఖ్య సాధనమైన భక్తి ప్రపంచింపబడినది, ఆ భక్తి నవవిధములని దృష్టాంత పూర్వకముగా తెలుపబడినది. ఇది "సాక్షాద్భాగవతోదితము", అనగా పరమ భాగవతోత్తముడైన శుకునిచే నుపదేశింపబడినది. దీనిని విని పరీక్షిత్తు మోక్షమును పొందెను. శ్రీమద్భగవద్గీతలో తెలుపబడిన భక్తి యోగమున కిది యుపబృంహణము. అందువలననే పోతన్నగారు "పలికెడిది భాగవతమట" అనియు "పలికిన భవహరమగునట" అనియు చెప్పినారు. ఈ పురాణమును సాక్షాద్భగవదవతారమని నమ్ము వ్యాసమహర్షి తన కుమారుడైన శుకుని కుపదేశించెను.

> "సర్వ పురాణోత్కృష్టత్వేన నిఖిలోప నిషత్ప్రతిపాద్య పరమతత్త్వార్థ బృంహకత్వేనచ శ్రీమద్భాగవతం స్వయమేవ సమహర్షిః (వ్యాసః) విరచయ్య స్వసుతాయ శుకాయోపదిదేశ." (చంద్రికా).

ఈ విషయము భాగవతాదిలో నున్నది. ఇతర పురాణములు పరాశరాది ప్రోక్తములు. ఈ యర్థమునే యీ భాగవత శ్లోకము తెల్పు చున్నది.

"నిగమ కల్పతరోర్గళితం ఫలం
శుకముఖా దమృతద్రవ సంయుతం
పిబత భాగవతం రసమాలయం
ముహురహో రసికాభువి భావుకాః."

ఇప్పుడొక్క మారు భాగవతము యొక్క గొప్ప తనమును తలం పుడు. ఇంత మహాగ్రంథమగుటచేతనే పోతన్నగారు దీనిని "భవహరం" మగుటకై పల్కి, తాను మోక్షమును జూరగొని, మనకు మార్గమును చూపినాడు. పతితలు తరించుటకై మూలమున కంటె విపులముగాను సుజ్ఞేయముగా వివరించినాడు. అనగా మాతృకకు వ్యాఖ్యాన రూపముగా దీనిని రచియించుటచే నిది పెరిగినది. ఎట్లు విపులీకరించెనో ముందు తెలిసి కొనగలము.

3. "భగవద్గుణ వర్ణనాది ఘట్టములందు సంస్కృత భాగవత ప్రతిపాదిత క్రమమున నభివర్ణించి స్వకీయ భగవద్భక్త్యతిశయమున స్వానవద్య కవిత్వ విద్యాచాతురీ సంప్రాప్త నిరంకుశ స్వాతంత్ర్యముచేత భగ వద్గుణాదులను విశేషముగా వర్ణించుట."

పెరుగుదల కిదికూడ యొక కారణము. పై మూడు కారణము లకు కొన్ని యుదాహరణముల నిచ్చెదను. ఇట్టి ఘట్టములు సప్తమస్కం ధము మొదలుకొని దశమస్కంధాంతము వఱకు నెక్కువగా నున్నవి. మఱియు నచ్చటనే పెరుగుటకు నాల్గవ కారణమగు విష్ణుపురాణాదీతర గ్రంథముల నుండి గ్రహించిన భాగములును కలవు. నిజముగా పోతనార్యుని ప్రతిభా కౌశలములను తెల్పు స్థలము లచ్చట నున్నను, పూర్వస్కంధము

లందును లేకపోలేదు. భారతీయ సంస్కృతిలో నైమిశారణ్యమున కొక యున్నత స్థానమున్నది. అచ్చటనే సత్రయాగములు జరుగును. అచ్చటనే పురాణేతిహాస శ్రవణములు జరుగును. అది మహా తపస్సంపన్నులైన మహా మునుల యాటపట్టు. అది "అనిమిషులు" అనగా దేవతలకు క్షేత్రము. అందువలన మిక్కిలి పవిత్రమైన స్థలము. భాగవత కథయు నైమిశారణ్యముననే ప్రచారమైనది. సూతుడును శౌనకాది మహామునులు నెచ్చట నుందురో యచ్చట యెల్లప్పుడును హరినామ సంకీర్తనము జరుగుచుండును. అట్టి నైమిశారణ్య ప్రశంస వచ్చినప్పుడు పోతనార్యుడు తన హృదయము నాపు కొనలేక పోయెను. మాతృకలో "నైమిశేనిమిషక్షేత్రే" అని మాత్రమున్నది. వెంటనే యుద్రేకమున పోతన్నగారి హృదయ ముప్పొంగెను. పొడుగాటి సమాసములును, శబ్దార్థాలంకారములునుగల పెద్ద గద్యము నొక దానినిరచియించెను. సుందరమైన నడకతో, శ్లేషమూలమైన యుపమాలంకారములతో నతిరసవంతమై యున్న దీగద్యము. "మధువైరి మందిరంబునుంబోలె మాధవ మన్మథ మహితంబై" మొదలుకొని "జలద కాల సంధ్యా ముహూర్తంబునుంబోలె బహువితత జాతి సౌమనస్యంబై" యొప్పు నైమిశారణ్యంబు అనెను. ఒక పద్యమును కూడ వ్రాసెను.

"పుణ్యంబై, మునివల్లభ
గణ్యంబై, కుసుమఫల నికాయోత్థిత సా
ద్గుణ్య మయి, నైమిశాఖ్యా
రణ్యంబు నుతింపఁ దగు నరణ్యంబులలోనన్" (1-5)

పోతనార్యుని కవిత్వమునకు సహజాలంకారములగు ననుప్రాసలకును, శబ్దాలంకారములకును నిచ్చటనే యంకురారోపణమైన దనుకొన వచ్చును. శౌనకాది పరిప్రశ్నమున కృష్ణుని ప్రశంస వచ్చినవెంటనే పోతనార్యుని హృదయ మాగదు.

"వర గోవిందకథాసుధారస మహావర్షోరు ధారా పరం
పరలం గాక బుధేంద్రచంద్ర! యితరోపాయానురక్తిం బ్రవి
స్తర దుర్దాంతదురంత దుస్సహాజనుస్సంభావితానేక దు
స్తరగంభీర కఠోరకల్మష క నద్దావానలం బాఱునే?" (1–49)

ఇందు పాపము యొక్క దుష్కరగుణమను నది గోవింద కథా సుధారసముతో నెట్లు నశించునది బహురసవంతముగా వర్ణింపబడినది. ఇది యును, తరువాతి పద్యమును పోతనార్యుని స్వంతములే! ప్రథమస్కంధము నందలిభీష్మస్తవమున కూడ కొన్ని పోతన స్వంత పద్యములు కలవు. మాతృ కలోపంౘెండు శ్లోకములు మాత్రము కలవు. ఇందలి శ్లోకములను రెంటిని వాని భాషాంతరీకరణమును చూపెదను.

"స్వనిగమ మపహాయ మత్ప్రతిజ్ఞామృత మధికర్తు
మపప్లుతో రథస్థః,
ధృతరథచరణోభ్యయాచ్చలద్గుః హరిరివహంతు మిభం
గతోత్తరీయః॥
శిత విశిఖవతో విశీర్ణదంశః క్షతజపరిప్లుత ఆతతా
యినోమే,
ప్రసభమభిససారమద్వధార్థః నభవతుమే భగవాన్
గతిర్ముకుందః॥ (1-9-37, 38)

"కుప్పించి యెగసినఁ గుండలంబుల కాంతి
గగనభాగం బెల్లఁ గప్పికొనఁగ,
నుఱికిన నోర్వక యుదరంబులో నున్న
జగముల వ్రేఁగున జగతి గదలఁ,
జక్రంబుఁ జేపట్టి చనుదెంచు రయమునఁ
బైనున్న పచ్చని పటము జాఱ,

నమ్మితి; నాలావు నగుఁబాటు సేయకు
మన్నింపుమని కిరీడి మరలఁ దిగువఁ,
గరికి లంఘించు సింహంబు కరణి మెఱసి
నేఁడు భీష్మునిఁ జంపుదు; నిన్నుఁ గాతు;
విడువు మర్జున యనుచు మద్విశిఖ వృష్టిఁ
దెరలి చనుదెంచు దేవుండు దిక్కునాకు." (1-222)

"అపప్లుతో రథస్థః" "చలద్గుః" అనువానికి మొదటి రెండు పాదములు తెలుగు సేతలు. అతి రమణీయములు. 7 అక్షరముల కొక గ్రంథమును, 3 అక్షరముల కొక గ్రంథమును రచియించెను. ఈ సందర్భమున మరియొక చిన్న పద్యమును వివరింతును. మాతృకలో:

"లలిత విలాస వల్గు హాసప్రణయ నిరీక్షణ కల్పితోరుమానాః,
కృతమను కృతవత్య ఉన్మదాంధాః ప్రకృతిమగన్కిల యస్యగోప వధ్వః"
(1-9-110)

అని యున్నది. దీనికి పోతన సేతనుచూడుడు:

"పలుకుల నగవుల నడపుల
నలుకల నవలోకనముల నాభీరవధూ
కులముల మనముల తాలిమి
కొలుకులు వదలించు ఘనుని గొలిచెద మదిలోన్."

"తాలిమి కొలుకులు" ఎంత చక్కని నుడికారము! శుకుడు భక్తి మార్గంబును చెప్పునెడ 4 శ్లోకములను 30 పంక్తుల గద్యములో చెప్పెను. (2-24,26) మరియు నాప్రకరణముననే మాతృకలో నున్న 13 శ్లోకములను (2.4.11-24) 21 గద్య పద్యములలో తెల్పినాడు. ఇందు చాలపద్యములు పోతన స్వంతములు.

మాతృకలో తృతీయ స్కంధమున నున్న విదుర మైత్రేయ సంవాదము (3.5-12)ను పోతన 208 పద్య గద్యములలో తెలిపెను. ఇందనేకములు స్వంత పద్యములు. ఆస్కంధముననే దేవతలు మహావిష్ణువును స్తుతించు నవసరమున (3.5.37-50) నున్న 13 శ్లోకములను దీర్ఘమైన దండకములో వ్రాసెను. ఈ దండకములోని కొన్ని భాగములు శ్రీధర వ్యాఖ్యననుసరించి వ్రాసినవి. యజ్ఞవరాహస్తవములోని మాతృకనున్న 12 శ్లోకములు (3.13.35-47) పెంచి పద్యములలో వ్రాయబడినవి. ఒక్క పద్యమును మాతృకతో ననువదించెను.

"దంష్ట్రాగ్రకోట్యా భగవం స్త్వయాధృతా
విరాజతే భూధర భూస్సభూధరా
యథావనా నిస్సర తోదతోధృతా
మతంగజేంద్రస్య సపంక పద్మినీ."

"అరవిందోదర। తావకీనసిత దంష్ట్రాగ్రావలగ్న క్షమా
ధర నద్యబ్ధినదాటవీయుత సమిద్ధ క్ష్మాతలం బొప్పె భా
సురకాసార జలావతీర్ణ మదవచ్ఛుండాల రాడ్దంత శే
ఖర సంసక్త సపంక పంకజము రేఖంబొల్పు దీపింపగన్."
(3-429)

చతుర్థ స్కంధమున దక్షయజ్ఞ సందర్భమున మాతృకలో నిట్లున్నది (సతీవాక్యము).

"వ్రీడామమా భూత్కుజన ప్రసంగతః
తజ్జన్మధిక్ యో మహతామవ్యాద్యకృత్।
గోత్రం త్వదీయం భగవాన్ వృషధ్వజః
దాక్షాయణీత్యాహ యదా సుదుర్మనాః"

దీనికి రసవంతములైన రెండు పద్యములను పోతన రచించినాడు.

"నీల గళాపరాధియగు నీకుఁ దనూభవ నౌట చాలదా?
చాలుఁ గుమర్త్య! నీదు తనుజాతనన న్మది సిగ్గు వుట్టెడిన్;
ఏల ధరన్ మహాత్ములకు నెగ్గొనరించెడివారి జన్మముల్?
గాలుపనే తలంప జనకా! కుటిలాత్మక! యెన్ని చూడగన్?"

"వర వృషకేతనుండు, భగవంతుఁడునైన హరుండు నన్ను నా
దర పరిహాసవాక్యముల 'దక్షతనూభవ!' యంచుఁ బిల్వ, నేఁ
బురపురఁ బొక్కుచున్, ముదముఁ బొందక, నర్మవచః స్మితంబులం
దొఱఁగుదు నీ తనూజ నను దుఃఖముకం బెను జచ్చు టొప్పగున్."
(4-94, 95)

ఇట్లే వీరభద్రుని జనన ఘట్టమునను పెంచెను. పై పూర్వస్కంధము లలోని పెంపుడులలో కొన్నిటికి పోతన్నగారి విచిత్రి వివరణా పారీణతకు రెండుదాహరణముల నిచ్చి తరువాతి స్కంధములకు వెడలెదను. సనక సనందనాదులు వైకుంఠమునకు పోయినపుడు విష్ణువు వారికడకు వచ్చు సందర్భమున మాతృకలో "మహామునీనాం, అన్వేషణీయ చరణా చలయన్ సహాశ్రీః" అనియున్నది. "సహాశ్రీః" అను మూడక్షరములకు రెండు వృత్తములను రచియించినాడు.

"శరనిధి కన్యకామణియు సంభ్రమమొప్పఁగఁ దోడ రా, మనో
హర నిజలీలమైఁ బరమహంస మునీశ్వర వంద్యపాద పం
కరుహములన్ వినూత్నమణి కాంచన నూపురమంజు ఘోషముల్
వరుసఁ జెలంగ నార్యజనవంద్యుఁడు యోగిజనైక సేవ్యుఁడై."

"కరమణి హేమకంకణనికాయరుఘుణంకృతు లుల్లసిల్ల న
చ్చర లిడు హంసపక్షి సితచామర గంధవహోచ్చలత్సుధా
కరరుచిరాతపత్రసుభగ ప్రవిలంబితహారవల్లరీ
సరస గళత్తుషారకణజాల విరాజిత మంగళాంగుఁడై."
(3-534, 535)

ఇట్లనువదింప నంతుండదు. ఇక తరువాతి స్కంధముల నెత్తుకొని పోతనార్యు డితర గ్రంథములనుండి తీసికొనిన భాగములతో నీయన పెంపు దును వివరింతును. ఈ పెరుగుట ముఖ్యముగా సప్తమస్కంధములోని ప్రహ్లాద చరిత్రము; అష్టమ స్కంధములోని క్షీరసాగర మథనము, గజేంద్ర మోక్షము, వామనచరిత్రము; నవమస్కంధములోని పరశురామ చరిత్రము; దశమ స్కంధములోని శ్రీకృష్ణ చరిత్రము, రుక్మిణీ కల్యాణము మొదలైన వాని యందు కలదు. ఇతర గ్రంథములగు విష్ణుపురాణము, హరివంశము మొదలైన వానినుండి గ్రహించిన స్థలము ముఖ్యముగా నరకాసుర యుద్ధ ఘట్టము నందున్నది. వీని నన్నింటిలోని యావత్తు పెంపును చూపుటకు తావు చాలనందున స్థాలీపులాకన్యాయముగా చూపుదును. పోతన చేసిన ప్రతిజ్ఞను వినుడు:

"కొందఱకుఁ దెనుగు గుణమగుఁ
గొందఱకును సంస్కృతంబు గుణమగు; రెండుం
గొందఱకు గుణములగు నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్." (1-20)

ఈ పద్యము వలన పోతనామాత్యుడు పండితుడు కాడను ప్రవాదము పరాస్తమైనది. ఈ ప్రతిజ్ఞను సంపూర్ణముగా నెరవేర్చి, శాశ్వత కీర్తిని పోత నార్యుడు గడించినాడు.

## ప్రహ్లాద చరిత్రము

ఈ భాగమందఱకును ప్రియమైనది. మాతృకలో నిది 250 శ్లోక ములు అనగా దాదాపు 350 గ్రంథములున్నవి. అట్టి దానిని పోతనా ర్యుడు దాదాపు 1000 గ్రంథముల వఱకు పెంచినాడు. ఈ క్రింది మూడ నుష్టుప్ శ్లోకములను గమనింపుడు:

"ప్రహ్లాద ఉచ్యతాంతాత స్వధీతం కించిదుత్తమం
కాలేనై తావతాయుష్మన్ యదశిక్షద్గురోర్భవాన్॥

ప్రహ్లాదః —

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్॥
ఇతి పుంసార్పితా విష్ణౌభక్తిశ్చేన్నవ లక్షణా
క్రియతే భగవత్యద్ధాతన్మన్యేధీతముత్తమం॥" (7.163-171)

వీనికి పోతనార్యుడు 8 గద్య పద్యములను వ్రాసెను. 8 గ్రంథము లను 24 గ్రంథములకు పెంచెను. భక్తి భావము నుపబృంహణము చేసినాడు. ఈ పద్యము లేకొంచె మాంధ్రభాషా జ్ఞానమున్నవారికిని వచ్చునని భావించుచున్నాను. ఒక్కపద్యము ననువదించెదను.

"అంధేందూదయముల్, మహాబధిరశంఖారావముల్, మూకస
ద్గ్రంథాఖ్యాపనముల్, నపుంసక వధూకాంతల్, కృతఘ్నావలీ
బంధుత్వంబులు, భస్మహవ్యములు, లుబ్ధద్రవ్యముల్, క్రోడ స
ద్గంధంబుల్, హరిభక్తి వర్జితుల రిక్తవ్యర్థ సంసారముల్."
(7-168)

"మందారమకరంద", "కంజాతునకుగాని", "సంసార జీమూత సంఘంబు" మొదలైన పద్యములు సకలాంధ్రుల జిహ్వాగ్రముల నున్నవి గాన నేననువదింపను. శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు తమ నృసింహ పురాణ పీఠికలో, పోతన వ్రాసిన భాగవతములో నెఱ్ఱన నృశింహపురాణమున వ్రాసిన పద్యముల పోకడలును, ననుకరణములును చూపినారు. అందుక్రిందనే "యెఱ్ఱయ్య పద్యములు కొన్ని పోతనపోతలోబడి పద్మముల వలె విప్పారెను" అని సెలవిచ్చినారు. మహాకవుల యనుకరణములు ముదావహములేగదా! నరకాసుర వధాఘట్టమున నిశ్లే నాచనసోముని ననుకరించెను. అనుకరించిన రచనలకు మెరుగుపెట్టి దిద్దుట పోతనార్యుని యందలి మహాగుణము. అది యెల్లెడల కనబడును. మహాకవులు వేసిన బాటలను విడనాడక, తృణీకరింపక వానికితోడు స్వోపజ్ఞా ప్రతిభల నుపయోగించు

కవుల కావ్యములు చిరస్థాయిలుగ నుండును. పునాది గట్టిగ నుండిన గదా భవనము శాశ్వతముగా నుండుట! ఈ కాలపు కావ్యములలోను శ్రీరాజ శేఖర శతావధానిగారి రాణా ప్రతాపసింహ చరిత్రము, శ్రీగడియారం శేషశాస్త్రిగారి శివభారతము మొదలైన గ్రంథముల కళ్యర్థితత్వమందు లకే కలుగు చున్నది. ఆధునికులలో కూడ కొందఱు పోతనార్యుని ననుక రించిన వారున్నారు. మహాకవి చివుకుల అప్పయ్యశాస్త్రిగారు తమ గర్గ భాగవతమనెడి యుద్గ్రంథమున పోతనార్యుని ననుకరించుచు తమ ప్రతిభా వ్యుత్పత్తులను చూపినారు.

ప్రహ్లాద చరిత్రమునువలెనే సప్తమస్కంధమున పెంచిన యితర స్థల ములు కలవు. ఈ స్కంధముననే దాదాపు 1500 గ్రంథము లుండునట్లు కనపడును.

అష్టమ స్కంధమున నింతకంటె యెక్కువ పెంపుదల గలదు. మొదటి ఘట్టము గజేంద్రమోక్షము ఇదియు నాంధ్రులకు మిక్కిలి ప్రీతి పాత్రమైన భాగము. మాతృకలో నీ భాగము 120 గ్రంథములకంటె నెక్కువ లేదు, దీనిని పోతనార్యుడు దాదాపు 4 రెట్లు పెంచినాడు. ఈ క్రింది భాగమును గమనింపుడు. మాతృకలో,

"తంతద్వదార్త ముపలభ్య జగన్నివాసః
స్తోత్రం నిశమ్యదివిజైస్సహసం స్తువద్భిః ।
ఛందోమయేన గరుడేన సమూహ్యమానః
చక్రాయుధోఽభ్యగమదాశుయతో గజేంద్రః ॥
సోంత స్సరస్యురుబలే నగృహీత ఆర్తో
దృష్ట్వాగరుత్మతి హరిం ఖ ఉపాత్తచక్రం ।
ఉత్క్షిప్యసాంబుజ కరం గిరమాహ కృచ్ఛ్రా
న్నారాయణాఖిల గురో భగవన్నమస్తే ।
తంవీక్ష్యపీడీత మజస్సహసావతీర్య

సగ్రాహమాశు సరసః కృపయోజ్జహార।
గ్రాహోద్విపాటిత ముఖాదరిణా గజేంద్రం
సంపశ్యతాం హరిరమూముచదు స్రియాణాం॥"

(8.3.31-33)

ఈ ఘట్టమును 21 పద్యములలో మిక్కిలి రసవంతముగ వర్ణించెను. (8.95-116). మాతృకలో లక్ష్మి వెడలినట్లే లేదు. విష్ణు డెచటనున్నది, ఏమిచేయుచున్నది, యెట్టి యానందములో నున్నపుడు గజేంద్రుని యార్త నాదమాయనకు వినబడినది, యెట్టి సౌఖ్యమును వదలి గజేంద్రుని రక్షించుట కాయన వెడలినది, మొదలైనవానిని బహుహృదయంగమముగా వర్ణించినాడు. 2, 3 పద్యముల నుదాహరించెదను.

"అలవైకుంఠపురంబులో, నగరిలో, నామూలసౌధంబు దా
పల మందార వనాంతరామృత సరః ప్రాంతేందు కాంతోపలో
త్పల పర్యంక రమావినోదియగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము 'పాహిపాహి'యనఁగుయ్యాలించి సంరంభియై."

(8-95)

ఈ పద్దె మాణిముత్తెము వంటిది. మందార వనము; దానిమధ్య అమృతసరస్సు; తత్ప్రాంతమున నిందుకాంతోత్పల పర్యంకము; అందును రమావినోది, అదియెవరు పిలిచినను పలుకునట్టిస్థితికాదు. ఆయన యొక్క ముఖ్య గుణమగు నాపన్న ప్రసన్నత్వమునకు గొప్ప దనము వచ్చుటకై యెట్టి సుఖమును విడిచి యాయన వచ్చెనో వైధర్మ్యముతో దెల్పినాడు. వినిన వెంటనే యాయన సంరంభమును తెల్పు పద్యములు హృదయంగమ ములు. వీనిలో నాసంరంభ ముట్టిపడు చున్నది. మాతృకలో "ఛందోమ యేన గరుడేన సఊహ్యమానః" అని యున్నది. కాని పోతనార్యుడు అభ్రగపతిం బన్నింపడు" అని వ్రాసినాడు. చూడుడు.

"సిరికిం జెప్పఁడు: శంఖ చక్రయుగముం జేదోయి సంధింపఁ; డే
పరివారంబును జీరఁ; డభ్రగపతిం బన్నింపఁ; డాకర్ణి కాం
తర ధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు; వివాద ప్రోద్ధిత శ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు; గజప్రాణావనోత్సాహియై."

(8-96)

ఈ పద్యము శ్రీనాథ పోతనలకు వివాద స్థానమైనట్లు కథ గలదు. అది పుక్కిటి పురాణమని నమ్మక పోయినను, దాని యందు మనస్తత్వము న్నది. రక్షణ సాధనమును కూడ తీసికొనక మఱచెను. వాహనారూఢుడై వెడలినను దాని గమనవేగము చాలక భగవంతుడు దిగినట్లున్నది. "సహసా వతీర్య", "గరుడోపి మందగతిరితి తతః సహసా అవతీర్య" అని శ్రీధరుల వారి వ్యాఖ్య. అట్టి యవసరమే లేకుండ చేసినాడు పోతన్నగారు. ఇచటనే యున్నది పోతనార్యుని ప్రతిభ. తరువాత "తనవెంటన్" "తనవేంచేయు పథంబు""తాటంకాచలనంబుతో" మొదలగు పద్యములన్నియు నాసంరంభ పరిణామములే! లక్ష్మీదేవి తత్తరమును తెల్పెడు పద్యమును గనుడు.

"అడిగెద నికడువడిఁ జను
నడిగినఁ దను మగుడ నుడువఁడని నడనుడుగున్
వెడవెడ చిడిముడి తడఁబడ
నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్." (8-103)

ఇచట నామె తత్తరము మూర్తీభవించుచున్నది. "అడుగిడు నడుగిడదు" అను మాటలు లక్ష్మి మనస్సు యొక్క ముందు నెనుకలను తెల్పు చున్నవి. ఇక 3 పద్యముల ననువదించి యీ ఘట్టమును విడతును.

"పాదద్వంద్వము నేలమోపి పవనుం బంధించి పంచేంద్రియో
న్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకున్ మాఱాకు హత్తించి ని
ష్ఖేద బ్రహ్మపదావలంబన గతిం గ్రీడించు యోగీంద్రు మ
ర్యాదన్ నక్రము విక్రమించెఁ గరి పాదాక్రాంత నిర్వక్రమై."

(8-65)

"వెద వివేకించుఁ గ్రీడించు విశ్రమించు" "బుద్ధిలతకుఁ మాఱాకు హత్తించి" మొదలైన నుడికారములు పోతనకే చెల్లును. నక్రము యొక్క పట్టు నీ పద్యము వర్ణించుచున్నది. తుది పాదము పద్యమునకు మకుటాయమానము. నక్రము యొక్క కర్కశమైన పట్టు "క్ర" యను పరుషాక్షరము తెల్పుచున్నది. "క్ర"యను నక్షరమును చూడుడు. "క" గజపాదమున కుపలక్షకము. "ౣ" క్రావడి నక్రముఖమున కుపలక్షకము. 'క' ను 'ౣ' యెట్లు క్రింది భాగము నాక్రమించినదో యట్లే గజపాదమును క్రిందిభాగమున నక్రము నిర్వక్రముగ నాక్రమించినది. కేవల ధ్వనులచేతనే గాక యక్షర విన్యాసముచే గూడ పోతనార్యుడు నక్రము పట్టును వర్ణించినాడు. తర్వాత పద్యము కూడ నిట్టిదే.

"ఊహ గలంగి జీవనపు టోలమునంబడి పోరుచున్ మహా
మోహలతా నిబద్ధ పదముఁ విడిపించు కొనంగలేక సం
దేహముఁ బొందు దేహిక్రియ దీనదశన్ గజముండె భీషణ
గ్రాహదురంత దంత పరిఘుటిత పాద ఖురాగ్ర శల్యమై." (8-67)

"పరిఘట్టిత", "పాతఖురాగ్ర"అనునవి నక్రము యొక్క పట్టును చెప్పుచున్నవి. "గ్ర"అను నక్షరము వెనుకటి "క్ర"వంటిది. తరువాత లక్ష్మీదేవి వర్ణనమును తిలకింపుడు.

"నిటలాలకము లంట నివుర జుంజుమ్మని
ముఖసరోజము నిండ ముసురు దేంట్లు
నళుల జోఁకఁ గఁ జిల్కలల్ల నల్లనచేరి
యోష్ఠ బింబద్యుతులొడియ నుఱుకు
శుకములఁ ఒోలఁ జక్షుర్మీనములకు మందాకినీ
పాఠీన లోక మెసఁగు;
మీన పంక్తులదాఁట మెయిదీఁగతో రాయ
శంపాలతలు మింట సరణి గట్టు

శంపలను జయింపఁ జక్రవాకంబులు
కుచయుగంబుఁ దాఁకి క్రొవ్వుసూపు
మెలఁత మొగిలు పిఱిఁది మెఱుఁగుఁ దీవయుఁ బోలె
జలదవర్ణు వెనుకఁ జనెడు నపుడు." (8.104)

లక్ష్మీదేవి యాకాశము నుండి విష్ణువు వెంబడి భూమికి దిగుచున్నది. పైనుంచి క్రిందకు వచ్చుచున్నప్పుడు క్రమముగా నొక్కొక యవయవము కనపడు నప్పుడచ్చటి వస్తువులతో ఘర్షణజరిగినది. వచ్చుచున్న మార్గము మందాకినీ తీరము. మొదట ముంగురులు. వాని క్రింద నున్న ముఖసరోజము కొఱకై వచ్చి తోడి తేంట్లనుకొని తుమ్మెదలు వెండ్రుకలను తాకినవి. ఆ తుమ్మెదలను తోలుటకై యోష్ఠబింబమునకు వచ్చిన చిలుకలు తాకినవి. తరువాత నీచిలకలను తోలుటకై మందాకినీ పాఠీనములు చక్షుర్మివములను తాకినవి. ఆ మీనపంక్తిని తొలగించుటకై శంపాలతలు మెయి దీగెతో నొరసినవి. శంపలను జయింప చక్రవాకములును కుచములను దాకినవి. ముంగురులు, పెదవులు, ముఖము, అందలి కన్నులు, మెయిదీగ, కుచములు. ఇది వరుస. మొదట వృక్షములపై నున్న తేంట్లును, తరువాత చిలుకలును, తరువాత మందాకినిలోని పాఠీనములును, తరువాత నంతకు క్రింద నున్న మేఘములలోని మెరుపులును, తరువాత క్రిందనున్న చక్రవాకములును, పైనుంచి క్రిందికి దిగుచున్నట్లు స్పష్టము చేయుచున్నవి. ఈ పద్యము నందలి యలంకారములును, ధ్వనులును నతిరమణీయములు. ఇది లలితమై, రసవంతమై, వివిధాలంకార శోభితమై యొప్పారుచున్నది. భంగ్యంతరముచేత ముక్తపదగ్రస్తాలంకారము కూడియున్నది. సహజ కవితా ధురీణుడైన పోతనకే యిట్టి రసవద్రచనము చెల్లును. పోతనార్యుని కావ్యధోరణి గజేంద్ర మోక్షమున సమగ్రముగ కానన:గును. ఈ భాగము నందలి యన్ని పద్యములును నన్ని ముత్తెములు.

తరువాతి ఘట్టము క్షీరసాగరమథనము. ఇచ్చట మాతృకలో పంచమాధ్యాయము నుండి ద్వాదశాధ్యాయము వరకు నున్న కథ, పరిమా

ణము దాదాపు 350 గ్రంథములు. దీనిని రెట్టింపు కంటె పెంచెను. ఇందు 3 చిన్న పద్యముల నిచ్చి సంతసింతును.

"గొల్లవారి బ్రిదుకు గోఱఁ తన వచ్చునే;
గొల్లరీతిఁ జాలకుప్పఁ ద్రిచ్చి,
గొల్లలైరి సురలు; గొల్లయ్యె విష్ణుండు;
చేటులేని మందు సిరియుఁ గనిరి." (8-207)

"ఎడమఁగుడి మునువు దిరుగుచుఁ
గుడినెడమను వెనుకఁ దిరుగు కులగిరి కడలిం
గడవెడల సురలు నసురలుఁ
దొడితొడి ఫణిఫణము మొదలుఁ దుదియును దిగువన్."
(8–211)

మందరగిరి తిరుగుడును దేవాసురులు త్రిప్పెడు రీతియు నిందు ప్రతిబింబించుచున్నది.

"ఆలోల జలధి లోపల
నాలో నహివిడిచి సురలు నసురలుఁ బరవం
గీలా కోలాహలమై
హాలాహల విషముపుట్టె నవనీనాథా!"
(8–215)

విషమును చూచి దేవాసురులు వాసుకిని విడచి పారిరట! ఎంత స్వభావసిద్ధము!

తరువాత 'వామనావతార ఘట్టము. ఇదియు వెనుకటి వానివలె నతి రమణీయము. వామనమూర్తి పుట్టువునుండి మత్స్యావతారము వఱకు మాతృకలో కథ రెండువందల గ్రంథములలో నున్నది. (8.20-23) దీనిని పోతనార్యుడు దాదాపు 700 గ్రంథములుగా పెంచినాడు. ఇచటి

యాయన స్వంతకల్పన లతిరమణీయములు. మాతృకలోని యీ క్రింది శ్లోకములకు పోతన్న పెంపుదును గమనింపుడు.

"యజంతి యజ్ఞైః క్రతుభిర్యమాదృతాః
భవంత ఆమ్నాయ విధానకోవిదాః।
సఏష విష్ణుర్వరదోస్తు వాపరో
దాస్యామ్యముష్మైక్షితి మీప్సితాం మునే॥
యద్యప్యసౌసావధర్మేణమాం బధ్నీ యాదనాగసం।
తథాప్యేనం నహింసిష్యే ధృత బ్రహ్మాతనుం హరిం॥"

(8—20—11,12)

వీనిలోని యర్థము నీ క్రింది విధముగా పెంచెను.

"కారేరాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతిం బొందరే?
వారేరీ? సిరి మూటగట్టుకొని పోవం జాలిరే? భూమిపైఁ
బేరైనంగలదే? శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరేకోర్కులు? వారలన్ మఱచిరే యిక్కాలమున్? భార్గవా!"

"ఉడుగని క్రతువుల వ్రతములఁ
బొడగనఁ జనవట్టి పొడవు పొడవునఁ గుఱుచై
యడిగెడి నట? నను బోఁటికి
నిడరాదె మహానుభావ! యిష్టార్థంబుల్."

"ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ, దనువుపై, నంసోత్తరీయంబుపైఁ,
బాదాబ్జంబులపైఁ, గపోలతటిపైఁ, బాలిండ్లపై నూత్న మ
ర్యాదం జెందుకరంబు క్రిందగుట; మీఁదై నాకరంబుంట; మేల్
గాదే? రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే?"

"నిరయంబైన, నిబంధమైన, ధరణీ నిర్మూలనంబైన, దు
ర్మరణంబైనఁ, గులాంతమైన, నిజమున్ రానిమ్ము; కానిమ్ము, పో!

హరుఁడైనఁ, హరియైన, నీరజభవుం డభ్యాగతుండైన నౌఁ,
దిరుగన్నేరదు నాదుజిహ్వ; వినుమా ధీవర్య! వేయేటికిన్."

"నొడివినంతవట్టు మసలక యిచ్చుచో
నేలకట్టు విష్ణుఁ? డేటిమాట?
కట్టునేనిఁ దాన కరుణించి విడుచును
విడువకుండ నిమ్ము; విమలచరిత!"

"మేరువు తలక్రిందైనను
బారావారంబు లింకఁ బారిన, లోలో
ధారుణి రజమైపోయినఁ
దారాధ్వము బద్ధమైనఁ దప్పక యిత్తున్."

"ఎన్నఁడుం బరువేడఁ బోఁడట? యేకలుండఁట? కన్నవా
రన్నదమ్ములునైన లేరఁట? యన్ని విద్యల మూలగో
ష్ఠిన్నెఱింగిన ప్రోడగుజ్జఁట? చేతులొగ్గి వసింప, నీ
చిన్నపాపనిఁ ద్రోసిపుచ్చఁగఁ జిత్తమొల్లదు సత్తమా!"

(8—590 to 596)

చూచితిరా! పోతనార్యుని యుద్రేకపూరిత రచనము!

ఇక నొక్క పద్యమిచ్చి తరువాత ఘట్టమునకు వెడలుదును.

"రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్త్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణ కేయూరమై
ఛవిమత్కంకణమై, కటిస్థలి నుదంచద్ఘంటయై, నూపుర
ప్రవరంబై, పదపీఠమై, వటుఁడు దాబ్రహ్మాండమున్ నిండుచోన్."

(8—623)

ఇంతకంటే భావనాశక్తి యుండునా?

పోతనార్యుడు పరమేశ్వరుని విరాడ్రూపమును దర్శించెనని వేర చెప్పవలెనా ? ఎంత ధన్యుడు !

నవమస్కంధమున మొదటిది గంగావతరణ ఘట్టము. మాతృకలోని రెండు శ్లోకముల నిత్తును.

తథేతిరాజ్ఞాభిహితః సర్వలోకహిత శ్శివః
దధారావహితోగంగాం పాదపూత జలాంహరేః ॥
భగీరథోథరాజర్షిః నిన్యేభువనపావనీం
యత్ర స్వపితృణాందేహాః భస్మీభూతాశ్చ శేరతే॥"

ఈ రెండు శ్లోకముల యందలి యర్థమును దీర్ఘమైనట్టియు గంగాఝరీవేగముతో నడచునట్టి యొక గద్యముతోను, మఱియొక పద్యముతోను తెల్పెను. గద్యము 3 పుటల నాక్రమించినది. చదివిన పాఠకుల మనములను పవిత్రానందమున ముంచుచున్నది. గద్యమంతయు పోతన గద్యములకు సహజమగు శ్లేషమూలోపమాలంకార రచనలో నిండియున్నది. తర్వాతి పద్యము ననువదించి తృప్తి చెందుదును.

" జగతీనాథు రథంబు వజ్జ బహుదేశంబుల్ వడిఁ దాఁటి త
త్సగరక్ష్మాపకుమార భస్మములమీదఁ ముంచి పారఁ మరు
న్నగరావాసము వారువొందిరి నవీన శ్రీలతో, గంగ నీ
రుగతిం గాక మహోదురంత సుజనద్రోహానలం బాఱునే !

(9-231)

ఎంత చక్కని యర్థాంతరన్యాసము !

పోతన పద్యాంతము లతిరమణీయములు. పొల్లు పదములును, పడికట్టు రాళ్లు నుండవు.

తదుపరి శ్రీరామ చరిత్రము నందలి యొక్క పద్యము నిత్తును. సీతాదేవిని చూచు సందర్భమున నీక్రింది పద్యమున్నది.

"దైతేయప్రమదాపరీత, నతిభీతఁ గ్రింధి బంధాలక
వ్రాతఁ, నిశ్వసనానిలాశ్రు కణజీవం జీవదారామ భూ
జాతఁ, శుష్కకపోల కీలిత కరాబ్జాతం, బ్రభూతం, గృశీ
భూతం, బ్రాణసమేత, సీతఁ గనియెఁ భూమేశుఁ డాముందటఁ."

(9-312)

అంత్య నియమ మటుండగా నిందు సంస్కార హీన కేశయు, నుష్ణ విశ్వాసయు, కపోల ఘటితహస్తయు, రాక్షసీపరివృతయు, రామునకు బ్రాణపదయునైన సీతకండ్లకు కట్టినట్లు పాఠకులకు కన్పడుచున్నది.

ఇక భాగవతము నందెల్ల మకుటాయమానమైన దశమస్కంధమునకు వత్తును. ఇది రెండు భాగములు. శ్రీకృష్ణచరిత్రము భాగవతము నందెల్ల నిగ్గు, రసవత్తమము. ఇందు పోతనార్యుడు తన యనన్య భక్తిని, యుద్రేకమును చూసినాడు. ప్రతి పద్యమునందును పోతన భక్తి తొంగిచూచుచుండును. ఇందలిపాత్రలలో పోతన యైక్యమైపోయినాడు. తొమ్మిదవ విధమైన యాత్మార్పణమున కీ భాగము బీజభూతము. రూపగోస్వామి యీ దశమస్కంధమును మిక్కిలి ప్రశంసించినాడు.

పూర్వభాగము మాతృకలో రుక్మిణీ కళ్యాణాంతము వఱకు 54 అధ్యాయములు. మిగిలిన 36 అధ్యాయము లుత్తరార్థము. ఉత్తర భాగము నందలి "కృష్ణుండు రుక్మిణీదేవితో విరసోక్తులాడుట" వఱకు పోతనామాత్య రచనమని విమర్శకులందురు. అంతవఱకు మాతృకలో 59 అధ్యాయములున్నని. ఇక పోతన రచన కాని దనునది 31 అధ్యాయములు. అగునా, కాదా యను సంగతి తరువాత పరామర్శింతును. 69 అధ్యాయములలో శ్రీకృష్ణ చరిత్రము చాలవఱకు సమాప్తమగు చున్నది.

మొదటి ఘట్టము శ్రీకృష్ణ జన్మము. కంసుడు దేవకిని చంప బోవు సందర్భమున వ్రాసిన యీక్రింది పద్యములకు మాతృకలు లేవు.

"అన్నవు నీవు; చెల్లెలికి నక్కట! మాడలు సీర లిచ్చుటో?
మన్నన సేయుటో? మధురమంజుల భాషల నాదరించుటో?
మిన్నుల మ్రోఁతలే నిజము, మేలని చంపకు మన్న! మాని రా
వన్న: సహింపు మన్న; తగదన్న; వధింపకుమన్న; వేడెదన్."

"చెలియన్, గన్నియ, ముద్దరా, లబల, నీసేమంబ చింతించు ని
ర్మల, దీనిన్ బయలాడు మాటలకునై, మర్యాదఁ బోఁదట్టి, స
త్కుల జాతుండవు, పుణ్యమూర్తి, వకటా! కోపంబు పాపంబు; నె
చ్చెలి నోహో! తెగవ్రేయఁబాడియగునే? చింతింపు భోజేశ్వరా!"

[10-పూ-26, 28)

ఇందు "బయలాడు మాటలు", "మిన్నుల మ్రోతలు" అను నచ్చ తెనుగు పదములు మధురములై వదంతి యొక్క నిరాధారత్వమును నంతశ్శూన్యత్వమును చెప్పక చెప్పుచున్నది. దేవకీ గర్భదౌహృదము కూడ మాతృకలో వివరము గాలేదు. పోతన చక్కని పదములతో వర్ణించెను. కృష్ణ జనన ఘట్టమునందలి సీసపద్యాదులు భక్తిరస పూరితములు. గోప స్త్రీలు తమలో తామొండొరులతో కృష్ణ జన్మమును గూర్చి చెప్పుకొనుట స్వభావోక్తియై హృదయంగమముగ నున్నది.

"ఏమి నోముఫలమొ? యింత ప్రొద్దొకవార్త
వింటి మబలలార! వీనులలర;
మన యశోద, చిన్నమగవానిఁ గనెనఁట
చూచివత్తమమ్మ! సుదతులార!" (10 పూ. 184)

జన్మించినవాడు సాక్షాత్పరమేశ్వరుడని యీ క్రింది పద్యములలో ద్యోతిత మగుచున్నది. కృష్ణుని స్నానమాడించుట, నిద్రపుచ్చుట వినుడు.

"పలు తోయంబుల జగములఁ
బలుదోయములందు ముంచి భాసిల్లెడి యా

పిలుతోయగాడు వల్లవ
లలనాకర తోయములఁ జెలంగుచుఁ దడియన్."

"లోకములు నిదుర వోవఁగ
జోకొట్టుచు, నిదురవోని సుభగుఁడు, రమణుల్
జోకొట్టి పాడ, నిదురం
గైకొను క్రియ నూరకుండెఁ గను దెరవకయున్."
(10 పూ. 192, 193)

ఈ ఘట్టమున రసవంత పద్యజాలము గలదు. కాని ముందునకు నడచెదను. పూతనా హరణ ఘట్టము మిక్కిలి హృదయంగమము. పూతన యేమియు నన్నట్లు మాతృకలో లేదు. కాని పోతనార్యుడు వ్రాసిన పద్యము లివి.

"ముద్దాడి శిరము మూర్కొని పలికెన్" అని చెప్పి

"చను నీకుఁ గుడుపఁజాలెడి
చను వారలు లేరు; నీవు చనవలె; ననుచుం
జనుగుడిపి, మీఁద నిలుకడఁ
జను దాన ననంగ వేడ్కఁ, జను జనుగుడుపన్.

"నా చనుఁబాలొక గ్రుక్కెం
డో చిన్ని కుమార! త్రాగుమొయ్యన; పిదపన్
నీ చెలువ మెఱుఁగవచ్చును
నాచెలువము సఫలమగును నలినదళాక్షా! (10 పూ 220,221)

పై పద్యములో "చెలువము" పై శ్లేషించి పోతన హృదయ గతాభిప్రాయమును తెలిపినాడు. తరువాత యశోదారోహిణులు వలదని వారించు పద్యమున "కోశంబులో వాలు మెల్పునన్" "మాట మెత్తద

నము'' ''లోవాఁడి''యను పదములు పోతన చెప్పుచేతలలోనున్న వైరుధ్య మును తెల్పుచున్నవి. ఇక కృష్ణుడు పాలు త్రాగుట మాతృకలో యిట్లు న్నది.

''గాఢంకరాభ్యాం భగవాన్ ప్రపీడ్యతత్
ప్రాణైస్సమం రోష సమన్వితో పిబత్'' (10-611)

ఈ యర్థమును పోతనార్యుడు తన సహజ రసవద్ధోరణిలో నను వదించి పఠితల నానందమున ముంచినాడు.

''మేల్కొన్న తెఱఁగున మెల్లన కనువిచ్చి
కేఁగంటఁ జూచుచుఁ గిదికి నీల్గి,
యావులించుచుఁ జేతులాదరంబునఁ జాచి
యొదిగిలి యాఁకొన్న యోజనూది
బిగి చన్నుఁగవఁ గేలఁ బీడించి కబళించి
గ్రుక్క గ్రుక్కకు 'గుటుకుగుటుకు'మనుచు
నొక రెండు గ్రుక్కల నువిద ప్రాణంబులు
సైతము మేనిలో సత్వమెల్లఁ

''ద్రావె; నదియును గుండెలు దల్లడిల్లఁ
జిమ్మఁ దిరుగుచు నిలువక శిరము వ్రాల
'నితర బాలుర క్రియవాఁడ వీవుగావు;
చన్ను విడువుము; విడువుము; చాలు' సనుచు'' (10 పూ 225)

పసిపిల్లలు పాలుత్రాగునపుడు పాలిచ్చు తల్లులీ పద్యమును తప్పక భావించుకొనగలరు. ''ఆవులించి, చేతులను చాచి, గిదికి, నీల్గి, పీడించి, కబ ళించి మొదలైన వరుసకార్యములు పాలు త్రాగుపిల్లలు చేయునవి. స్వభా వోక్తి యెంత హృదయంగమము! కాని'ఆకొన్న యోజన్', 'మేల్కొన్న

తెఱంగునన్' అనుటతో కృష్ణుని కపటము వ్యక్తమగుచున్నది. 3వ పాదమునందలి ధ్వన్యనుకరణమును, 4వ పాదమునందలి యామ్రేడిత మును రసవంతములు. ఈ క్రింది పద్యమును గనుడు.

"విషధర రిపు గమనునికిని
విషగళ సఖునికిని విమల విషశయనునికిన్
విషభవభవ జనకునికిని
విషకుచ చనువిషముఁ గొనుట విషమే తలపన్."

(10 పూ. 233)

శ్రీకృష్ణ బలరాముల క్రీడాభివర్ణనము భాగవతములో నెల్ల మేలు బంతి ఘట్టములలో నొకటి. ఇచ్చటి పద్యము లన్నియు యావదాంధ్రుల నోళ్లలో మెదులుచున్నవి. ఒకవేళ యుండనిచో తప్పక వానిని పఠించి యానందింపుడని ప్రార్థించుచున్నాను.

"బాలురకుఁ బాలు లేవని
బాలెంతలు మొఱలువెట్టఁ బకపక నగి, యా
బాలుండాలము సేయుచు
నాలకుఁ గ్రేపులను విడిచె నంభోజాక్షీ!"

(10 పూ. 307)

మొదలు కొని

"ఓయమ్మ! నీ కుమారుఁడు
మా యిండ్లను బాలుఁ బెరుఁగు మననీఁడమ్మా!
పోయెద మెక్కడి కైనను
మా యన్నల సురభులాన! మంజులవాణీ!"

(10 పూ. 329)

వఱకు నున్న పద్యము లాబాలగోపాలము నెఱిగినవే! ఇవి యన్నియు నన్ని రత్నములు. ఒక్క పద్యమును ప్రత్యేకముగా ననువదింతును.

"తరుణి యొకతె పెరుఁగు ద్రచ్చుచోఁ దుదివంగి
వెన్న దీయ, నొదిఁగి వెనుకఁ గదిసి,
మగువ నీ సుతుండు మగపోఁడుములు సేయ
సాగినాఁడు; తగదె చక్కఁజేయ?"

(10 పూ. 326)

ఎంత సున్నితము? అశ్లీలద్యోతనము కూడలేదు. అనుభవించిన గోపిగాక మరియొక గోపి చెప్పుట రసవంతము. శ్రీకృష్ణుని సర్వవ్యాపకత్వ మును తెలుపు నీ క్రింది పద్యమును చూడుడు.

"కలకంఠి మావాడ గరితలమెల్ల, నీ
పట్టి రాఁగలఁడని పాలు పెరుఁగు
లిండ్లలోపల నిడి యేమెల్లఁ దనత్రోవఁ
జూచుచో నెప్పుడు సొచ్చినాఁడొ?
తలుపుల ముద్రలుఁ దాళంబులును బెట్టి
యున్న చందంబున నున్న వరయ;
నొక యింటిలోనాడు; నొక యింటిలోఁబాడు;
నొక యింటిలో నవ్వు; నొకటఁదిట్టు;
నొకట వెక్కిరించు; నొక్కొకచో మృగ
పక్షి ఘోషణములు పరఁగఁ జేయు;
నిట్లుసేసి వెనుక నెక్కడఁ బోవునో?
కానరాడు; రిత్త కడవలుండు."

(10 పూ. 327)

ఈ సర్వవ్యాపకత్వము జారత్వ మనవచ్చునా? భగవంతుడు భక్తు లను పరీక్షించును కదా? ఈ భాగమంతయు భాగవతము యొక్క సార్వ జనీనతకును సార్వకాలీనతకును తార్కాణము. ఏనాడు రచింపబడినదో భాగవతము, ఇప్పటికిని యీ పద్యము లాంధ్రులనోళ్లలో మెదలుచున్నవి.

తరువాత మృద్భక్షణ విశ్వరూప ప్రదర్శన ఘట్టము కూడ నిట్టిదే. "అమ్మా మన్ను దినంగ", "కలయో వైష్ణవమాయయో" యను పద్యములు తరుచు తెనుగువారి నోళ్ల వినబడుచుండును. కఱ్ఱ చేబూని కృష్ణుని వెంట పరుగెత్తు యశోద యాంధ్రదేశమున ప్రతి తల్లి యందును మూర్తీభవించుచున్నది.

కృష్ణుడు గోప బాలకులతో చల్దులారగించు ఘట్టము నా చిన్నతనమును జ్ఞాపకము తెచ్చుచున్నది. మేమొకవూరు పెండ్లికి పోవుచు త్రోవలో కృష్ణానదీ పులినమున మాయమ్మ చల్దిముద్దలు వేయగా తిన్న దృశ్యము నీవర్ణనము జ్ఞప్తికి దెచ్చుచున్నది. క్రింది పద్యమును చూడుడు.

"కడుపున దిండుగాఁ గట్టిన వలువలో
లాలిత వంశనాళంబుఁ జొనిపి
విమల శృంగంబును వేత్రదండంబును
జారిరానీక డాచంక నిఱికి
మీఁగడ పెరుఁగుతో మేళవించిన చల్ది
ముద్ద డాపలిచేత మొనయనునిచి
చెలరేఁగి కొసరి తెచ్చిన యూరుఁగాయలు
వ్రేళ్ళ సందులయందు వెలయ నిఱికి
సంగడీలనడుమఁ జక్కఁగఁ గూర్చుండి
నర్మభాషణముల నగవు నెఱపి,
యాగభోక్త కృష్ణుఁ డమరులు వెఱఁగంద
శైశవంబు మెఱసి, చల్దిగుడిచె." (10 పూ. 498)

భగవల్లీల దురూహ్యము. భగవంతుడు మానుష వేషము దాల్చి మనుష్యులలో మెలగుటచే కృష్ణుడు మానవజాతి కత్యంత ప్రియుడై నాడు. ఉభయుల మధ్య నున్న యీ సన్నిహిత సంబంధమును పోతనార్యుని చేత

లోనే చదువవలెను. నాకేశక్తి యున్నచో నేనీకృష్ణ భంగిమను చిత్రించి యుందును. "మీగడ పెరుగుతో మేళవించిన చల్దిముద్ద", 'ఊరుగాయలు' మొదలైనవి యాంధ్రుల ప్రత్యేక సంస్కృతి చిహ్నములు. "గోంగూరను, ఆవకాయను" చేర్చిన నాంధ్రత్వము పూర్తియగును.

తదుపరి కాళియ మర్దన ఘట్టమునకు పరుగెత్తుదును. ఇందు 70 పద్యములున్నవి. నందాదుల దుఃఖ మతి కరుణముగ వర్ణింపబడినది. మాతృకలో కృష్ణ నర్తన మిట్లున్నది.

"తన్మూర్ధరత్ననికరస్పర్శాతి తామ్రి పాదాంబుజోఖిలకళాది గురుర్న నర్త."

పోతనార్యుడంత చప్పగ చెప్పునా? చూడుడు.

"ఘనయమునానదీకల్లోల ఘోషంబు
సరస మృదంగ ఘోషంబు గాఁగఁ
సాధు బృందావన చర చంచరీక
గానంబు గాయక సుగానంబుగాఁగఁ
గలహంస సారస కమనీయమంజుల
శబ్దంబులు దాళ శబ్దములుగాఁగ
దివినుండి వీక్షించు దివిజ గంధర్వాది
జనులు సభాసీనజనులు గాఁగఁ
బద్మరాగాది రత్న ప్రభాసమాన
మహిత కాళియఫణిఫణామండపమున
నళినలోచన విఖ్యాతనర్తకుండు
నిత్యనైపుణ్యమునఁ బేర్చి నృత్యమాడె." (10 పూ. 664)

చూచితిరా పోతనార్యుని పెంపుడు సొంపు?

తరువాత శరదృతు వర్ణనానంతరము కృష్ణుడు గోవులను మేపుచు "చుకూజవేణుం"అని మాతృకలో నున్నది. ఈ ఘట్టములో పోతనార్యుడు వ్రాసిన పద్యమొక చిత్రమునకు మాతృక యైనది.

"కర్ణావతంసిత కర్ణికార ప్రభ
గండ భాగద్యుతిఁ గడలుకొలుప
భువన మోహనమైన భ్రూవిలాసంబుతో
వామభాగానత వదనమొప్ప
నపసవ్యకర మృదులాంగుళీ చాతురి
షడ్జధ్వనికి మర్మసరణిఁ జూప
డాకాలిమీఁద నడ్డముసాఁచి నిల్చిన
పదనఖద్యుతి భూమిఁ బ్రబ్బికొనఁగ
మౌళిపింఛముఁ గంఠదామమును మెఱయ
విలసితగ్రామముగ నొక వేణువందు
బ్రహ్మ గాంధర్వగీతంబు పరఁగఁజేసెఁ
జతుర నటమూర్తి గోపాల చక్రవర్తి."

(10 పూ. 769)

ఈ వేణురవము వినినప్పటి గోపీజనముయొక్క తత్తరమును వర్ణించు భాగము చదువవలసినదే గాని చెప్పిన రసహీనమగును. అపుడు యావత్ప్రకృతియు నావేణురవముతో నిండి యానందముతో స్తంభించెను. "మ్రాకులు పూదేనియ లొలికెడు, నళినాక్షుని చేతి వంశనాళముచేతన్" ప్రకృతి పురుషుని గీతిచే పులకిత యయ్యెను!

అనంతరము గోపికా వస్త్రాపహరణ ఘట్టము – ఇది రసవంతమని చెప్పబనిలేదు.

"మామా! వలువలు ముట్టకు
మామా! కొనిపోకు; పోకు; మన్నింపు; తగన్
మామానమేల కొనియెదు?
మామానసహరణమేల? మానుము; కృష్ణా!"

(10 పూ: 820)

ఈ పద్యము ప్రీతి యాంధ్రుని వీనుల ప్రతిధ్వనించుచున్నది. మాతృకలో నిచ్చట "పాణిభ్యాం యోనిమాచ్ఛాద్య" అని యున్నది. ఈ విషయమును పోతనార్యుడు పదజాలాచ్ఛా దితాశ్లీలముగా సంతరించినాడు.

"చంచత్పల్లవ కోమల
కాంచన నవరత్న ఘటిత కంకణరుచిరో
దంచిత కర సంఛాదిత
పంచాయుధ గేహలగుచుఁ బడఁతులు వరుసన్."

(10 పూ. 839)

అశ్లీలమును కప్పిపుచ్చుటలో పోతన యందెవేసిన చేయి! ఇచ్చటి యౌచితి గమనింపదగినది.

తరువాత గోవర్ధనోద్ధరణ ఘట్టమునుండి యొక్క పద్యమును మీ యెదుటనుంచి తరువాతి ఘట్టమునకు వెడలుదును.

"హరిదోర్దండము గామ గుబ్బశిఖరం బాలంబి ముక్తావళుల్
పరగన్ జారెడు తోయబిందువులు గోపాలాంగనాపాంగ రో
చరుచుల్ రత్నచయంబుగాగ నచలచ్ఛత్రంబు శోభిల్లెఁ ద
ద్గిరిభిద్దుర్మదభంజియై జలధరాక్లిన్నప్రజారంజియై."

(10 పూ. 922)

అనంతరము గోపాలకృష్ణుని గోపికలు వెదకు ఘట్టము. ఇచ్చటను తరువాత గోపికాగీతలలోను పోతనామాత్యుడు లీనుడై గోపీవిరహము

తన స్వవిరహాముగా వర్ణించినాడు. భక్తిరస మీఘట్టమున వెల్లివిరిసినది. పాశ్చాత్యులలో కూడ అందును క్రైస్తవులలో శేష శేషిభావము కలదు. భగవంతుని భర్తగాను, భక్తుని భార్యగాను ఊహించుకొని యాత్మార్పణము చేసికొనుట. రవీంద్రుని గీతాంజలిలో కూడ నిట్టి ఛాయలు కలవు. దీనిని "Doctrine of Divine Spouse" అందురు. గోపికలలో నంతర్భూతుడుగా పోతన్న గారు లేకపోయిన నీ ఘట్టము లింత రసవంతముగా వర్ణించి యుండ జాలడు. వర్ణన మీస్థాయి నందుకొనదు.

"పూతనవైై యొక్క పొలతి చరింపంగ
శౌరివైై యొకకాంత చన్నుగుడుచు."

ఇంతకంటె నాత్మార్పణముండునా? కృష్ణునందలి యాత్మ గోపికలందరి లోను స్పందించినది. వారనన్యులై పోయిరి.

"అనన్యాశ్చింతయంతోమాం యేజనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభి
యుక్తానాం యోగక్షేమం వహామ్యహం॥" (భగవద్గీత)

అని కదా శ్రీకృష్ణుడు సెలవిచ్చెను? సమస్త విశ్వమును (తమతో కూడ) కృష్ణమయ మయిపోయెను. కనపడునవి యన్నియు కృష్ణలీలలే! చూచు నవి యన్నియు కృష్ణ పాదాంకిత స్థలములే! ఈ క్రింది పద్యములు మధుర భక్తి కాటపట్లు.

"నల్లనివాఁడు, పద్మనయనంబులవాఁడు, కృపారసంబు పైఁ
జల్లెడువాఁడు, మౌళిపరిసర్పిత పింఛమువాఁడు, నవ్వు రా
జిల్లెడు మోమువాఁ, డొకఁడు చెల్వల మానధనంబుఁ దెచ్చెనో
మల్లియలార! మీ పొదలమాటున లేఁడుగదమ్మ చెప్పరే?"

"అంగజునైనఁ జూడ హృదయంగముఁడై కరఁగించువాఁడు, శ్రీ
రంగ దురంబువాఁడు, మధురంబగు వేణురవంబువాఁడు, మ

మ్మంగజుపువ్వుఁ దూపులకు నగ్గముసేసి, లవంగలుంగనా
రంగములార! మీకడకురాఁడుగదా? కృపనున్నఁ జూపరే!"
(10. పూ. 1010, 1011)

గోపికాగీతలు మాతృకలో 19 శ్లోకములు. 40 గ్రంథము లుండును. వాని నన్య సౌందర్యముతో రెండింతలు చేసినాడు. ఈ క్రింది మాతృకను చూడుడు.

"చలసి యద్వ్రజాచ్చారయన్ పశూన్ నళివ సుందరమ్
నాథతేపదం। శిలతృణాం కురై స్సీదతీతి నః కలలి
తాం మనః కాంత గచ్ఛతి" (10-31-11) దీనిని

"అరవిందంబుల కంటెఁ గోమలములై, యందంబులై యొప్పు నీ
చరణంబుల్, కఠినంబులై మొనయు మాచన్నుంగవల్ మోపఁగా
నెరియంబోలు నటంచుఁ బొక్కుదుము; నీ యీకర్కశారణ్య భూ
పరిసంచారము కృష్ణ! నీ ప్రియలకుం బ్రాణవ్యథం జేయదే?"
(10 పూ. 1053)

అని పోతన్నగారు రసప్రవణముగా దెనిగించెను. ఎంత సుందరము! ఎంత భావపూరితము! తరువాత శ్రీకృష్ణ పరమాత్మ గోపికలకు కనపడి క్షమాపణము వేడుకొనును.

"నా పాయుట తప్పుగా గొనక భామినులార! కృపన్ క్షమింపరే!" భగవంతుడు భక్తరక్షుడు! భక్తదాసుడు!

రాసక్రీడా, జలక్రీడావర్ణనము చేసిన గద్యములు మనోహరలయో పేతములై పద్య నిర్విశేషములై వరలుచున్నవి. అనువదించుట కనువైనవి కావు. ఈ క్రీడలయందు "కృష్ణుం డాత్మారాముండయ్యును గోపసతు లెందరందరకు నందరై, నిజ ప్రతిబింబంబుల తోడం గ్రీడించు బాలు పోలికం

గీ్రడించె". వేణునాదము చేయు "గోపకిశోరమునె" కదా మధుసూదన సరస్వతీస్వామి దర్శించినది!

ఉద్ధవ సందేశాదు లనేక ప్రకరణములున్నను, వానిని విడచి భ్రమర గీతలను స్పృశింతును. భ్రమర గీతలలోని ప్రతి పద్యమును రసగుళికయే! ఒక్క పద్యము ననువదింతును.

"భ్రమరా! దుర్జనమిత్ర! ముట్టకుము మా పాదాబ్జముల్; నాగర
ప్రమదాళీకుచ కుంకుమాంకిత లసత్ప్రాణేశ దామప్రసూ
న మరందారుణితాననుండ వగుటన్; నాథుండు మన్నించుఁ గా
క! మము న్నేఁపుచుఁ బౌరకాంతల శుభాగారంబులన్ నిత్యమున్"
(10 పూ. 1455)

ఈ పద్యములందలి యన్యాపదేశముల సహృదయు లనుభవింపవలసినదే! లోతుకు దిగినకొలది రసమూరుచుండును.

ఇక రుక్మిణీ కల్యాణఘట్టము. కృష్ణుని చేష్టల నెంత విన్నను తనివి తీరదు. ఏల?

"భూషణములు సెవులకు, బుధ
తోషణము, లనేక జన్మదురితౌఘ విని
శోషణములు, మంగళతర
ఘోషణములు, గరుడ గమను గుణభాషణముల్."
(10 పూ. 1683)

ఈ ఘట్టము మాతృకలో దాదాపు 200 గ్రంథములున్నది. దానిని పోతనార్యుడు తన భావనాబలంబునను భక్తి పారవశ్యమునను 500 గ్రంథములకు మించి పెంచినాడు. ఈ ఘట్టమున రసవంతము కాని పద్యములేదు. రుక్మిణీదేవి నాంధ్రబాలికగా భావించినాడు. ఆమె బాల్యమును, నప్పటి యాటలను చెప్పు సందర్భములు ప్రతి యాంధ్రుడును స్వబా

లికా క్రీడలుగా భావించుకొనును. "బొమ్మల పెండ్లిండ్లు, గుజ్జనగూళ్లు, తద్దె పండుగలలో నుయ్యాలల యూపు" మొదలైనవి యాంధ్ర బాలికల సొమ్ము. రుక్మిణీ కృష్ణుల యౌవనావిర్భావమును తుల్యయోగితాలంకార ముతో వర్ణించెను.

"దేవకీసుతు కోర్కి తీగెలు వీడంగ
వెలఁదికి మైదీగె వీడఁ దొడఁగెఁ
గమలనాభుని చిత్తకమలంబు వికసింపఁ
గాంతి నింతికి ముఖకమల మొప్పె
మధువిరోధికి లోన మదనాగ్ని పొడచూపఁ
బొలఁతికిఁ జనుదోయి పొడవుసూపె
శౌరికి ధైర్యంబు సన్నమై డయ్యంగ జలజాక్షి
మధ్యంబు సన్నమయ్యె
హరికిఁ బ్రేమబంధ మధికంబుగాఁ గేశ
బంధ మధికమగుచు బాల కమరెఁ
బద్మనయనువలనఁ బ్రమదంబు నిండార
నెలఁత యౌవనంబు నిండియుండె."

(10 పూ. 1690)

రుక్మిణి కృష్ణుని కంపిన సందేశ భాగమును పెంచినాడు. "నిక్కంబు ప్రాణేశ్వరా" యను దానికి తర్వాతి 4 పద్యములును పోతన స్వంతములే! రుక్మిణి బ్రాహ్మణుని యాలస్యమునకు దుఃఖించు నవసరమున వ్రాసిన పద్యములు యావదాంధ్రుల హృదయములందు లగ్నంబులై యున్నవి. "లగ్నం బెల్లి" (1724) నుండి 9 పద్యములు రసగుళికలు.

తరువాత "కృష్ణమార్గగత వీక్షణ పంక్తుల ద్రిప్పక" చూచు రుక్మిణీ దేవి యొక్క యరతి యను శృంగారావస్థ యీ క్రింది పద్యములో వర్ణింప బడినది.

"తుడువదు కన్నులఁ వెడలు తోయకణంబులు; కొప్పుఁ జక్కఁగా
ముడువదు; నెచ్చెలింగదిసి ముచ్చటకుం జన; దన్నమేమియుం
గుడువదు; నీరముంగొనదు; హారిమిఁ గీరముఁ జేరి పద్యముల్
నొడువదు; వల్లకీగుణ వినోదము సేయదు; డాయ దన్యులన్."
(10 పూ. 1729)

తరువాత బ్రాహ్మణుడు కృష్ణుడువచ్చినాడని చెప్ప రుక్మిణి హృదయ మాయనకిట్లు వెల్లడించెను.

"జలజాతేక్షణుఁ దోడితెచ్చితివి నాసందేశముం జెప్పి, నన్
నిలువంబెట్టితి; నీకృపన్ బ్రదికితిన్; నీయంత పుణ్యాత్మకుల్
గలరే? దీనికి నీకుఁ బ్రత్యుపకృతిం గావింప నేనేర; నం
జలిఁ గావించెద; భూసురాన్వయమణీ! సద్బంధు చింతామణీ!"
(10 పూ. 1736)

అనంతరము రుక్మి కృష్ణుని దాకినపుడు కృష్ణుడు రుక్మిని చంపబోవ రుక్మిణి వలదని వేడు పద్యమును చూడుడు.

"అని డగ్గుత్తికతో మహాభయముతో నాకంపితాంగంబుతో
వినతశ్రాంతముఖంబుతో, శ్రుతిచలద్వేణీ కలాపంబుతోఁ,
గనుదోయిం జడిగొన్న బాష్పములతోఁ, గన్యాలలామంబు మ్రొ
క్కిన, రుక్మిం దెగవ్రేయఁబోక మగిడెం గృష్ణుండు రోచిష్ణుఁడై."
(10 పూ. 1768)

ఇందు గజేంద్రమోక్షము నందలి "తాటంకాచలనంబుతో" అను పద్యముయొక్క ప్రతిధ్వని వినపడుచున్నది. తుదకు మాతృకలో "విధివదుపయేమే" అని వివాహ ఘట్టమున నున్నది. దానికి 7 పంక్తుల వచనమును, నీక్రింది పద్యమును పోతనార్యుడు రచియించినాడు.

"ధృవకీర్తిన్ హరి పెండ్లియాడె నిజ చేతోహారిణిన్, మాన వై
భవగాంభీర్య విహారిణిన్, నిఖిల సంపత్కారిణిన్, సాధు బాం

— — ధవ సత్కారిణిఁ, బుణ్యచారిణి, మహాదారిద్ర్య సంహారిణిన్,
సువిభూషాంబర ధారిణిన్, గుణవతీ చూడామణిన్, రుక్మిణిన్."
(10 పూ. 1782)

ఇందు రుక్మిణి లక్ష్మీదేవి యవతారమనెడి ధ్వనియున్నది. "నిఖిల సంపత్కారిణి" యను విశేషణము భావగర్భితము. ఇంతటితో దశమస్కంధ పూర్వభాగము ముగింతును.

ఇక యుత్తర భాగమును గ్రహింతును. ఇందు మొదటి కథ ప్రద్యుమ్న చరిత్రము. ఇందును కొంచెముగా పెంపుదలకలదు. మాతృకలో ప్రద్యుమ్నుని గూర్చిన శ్లోకమిది.

"సా తం పతిం పద్మదళాయతేక్షణం
ప్రలంబ బాహుం నరదేవసుందరం
సవ్రీడహాసోత్తభిత భ్రూవేక్షతీ
ప్రత్యోపతస్థే రతిరంగ సౌరతైః"

ఇందు ప్రద్యుమ్నుడు యవ్వనము నందుటయు, నంతవరకు పెంచిన రతీదేవి యాయనను మోహించుటయు, బహు క్లుప్తముగా చెప్పబడినది. పోతన అంతటితో తృప్తిపడలేదు. మన్మథుని వర్ణనము చూడుడు.

"చక్కనివారల చక్కఁదనంబున కుపమింప
నెవ్వఁడు యోగ్యుఁడయ్యె?
మిక్కిలి తపమున మెఱయు నంబికకునై
శంకరు నెవ్వఁడు సగముసేసె?
బ్రహ్మత్వమును బొంది పరఁగు విధాతను
వాణికై యెవ్వఁడు వాఁడి సెఱిచె ?
వేయిడాగులతోడి విబుధ లోకేశుని
మూర్తికి నెవ్వఁడు మూలమయ్యె ?

మునులతాలిమి కెవ్వఁడు ముల్లుసూపు
మగలమగువల నెవ్వండు మరులు కొలుపుఁ?
గుసుమధనువున నెవ్వండుకొను విజయము
చిగురువాఁలున నెవ్వండు సిక్కు పఱుచు."

(10 ఉ. 10)

ద్వారకానగరమునకు ప్రద్యుమ్నుడు వెడలినపుడు రుక్మిణి యాతనిని చూచి పుత్త్రునిగా గుర్తించియు, లోకాపవాద భీతిచే గ్రహింప నను మానించుచున్నప్పటి పద్యములు మిక్కిలి రసవంతములు. ఒక్క పద్యమును వినుడు.

"ఆళీ! నా తొలుచూలి పాపనికి బోర్కాడించినే సూతికా
శాలామధ్య విశాల తల్పగతనై, చన్నిచ్చి నిద్రింప నా
బాలున్ నా చనుఁబాలకుం జెఱిచి, యేపాపాత్ము లెత్త్రోవ ము
న్నేలీలం గొనిపోయిరో? శిశువుఁ దా నేతల్లి రక్షించెనో?"

10-ఉ-31)

తరువాత ఘట్టము శ్యమంతకోపాఖ్యానము. ఈ భాగమును యావదాంధ్ర దేశములోని ప్రజలు ప్రతి సంవత్సరము వినాయక చతుర్థి నాడు పురాణముగా చదువుట వాడుక. అందుచే దీని నింతటితో విడచి ముందుకు నడతును. తరువాతి రసవద్ఘట్టము నరకాసుర యుద్ధము. ఇది సంస్కృత భాగవతమున కొలదిగా నున్నది. దానిని పోతనార్యుడు విష్ణు పురాణ, హరివంశాదుల నుండి గ్రహించిన విశేషాంశములతో పెంచెను. శ్రీ వేలూరి శివరామశాస్త్రి గారిట్లు వ్రాసినారు.

"ఆంధ్రభాగవతమునకు మాతృక యగు సంస్కృతములోని విజ్ఞాన వాక్యములకును విష్ణు పురాణమునకును పోలిక కలదు." విష్ణుపురాణము భాగవతమునకు మూలమనుట వాస్తవమే! కావున పోతనార్యుడు సంస్కృత భాగవతములో లేని యంశములను విష్ణుపురాణమునుండి గ్రహించుట సమంజసమే యగును, "నరకాసురవధ, ప్రహ్లాద చరిత్రము, ధ్రువోపాఖ్యా

నము, శ్రీకృష్ణావతార ఘట్టము, రుక్మిణీకల్యాణము లోనగు కథాభాగ ములు విష్ణుపురాణమున సంగ్రహ రూపమున నున్నవి.''

(వావిళ్లవారి భా. పీఠిక పుట 9)

వీనిలో నొక్క సత్యభామా యుద్ధము తప్ప యన్నియు సంస్కృత భాగవతమున నున్నవి. రెండు గ్రంథముల యందలి కథలలోని తార తమ్యము విష్ణుపురాణ పీఠికయందు కాననగును. ఆ విషయమిప్పుడు మన కప్రస్తుతము. ఒక్కటి మాత్రము సత్యము. విష్ణుపురాణము నందు కంటెను సంస్కృత భాగవతము నందు కంటెను పోతన భాగవతము నందలి యీ కథలు రసవంతములుగా నున్నవి. వెన్నెలగంటి సూరన తన విష్ణుపురాణ మున నచ్చటచ్చట పోతన ననుకరించినట్లు కనపడును. ప్రహ్లాద చరిత్రములో నిట్లున్నది.

''ఏమి సుభాషితంబు పఠియించితి పుత్రక! రాజనీతు
లేమేమి యెఱుంగఁజెప్పె గురుఁడిప్పుడు నీ దగు పుస్తకంబు నం
దేమి లిఖించియున్నయది? యిప్పటి పాఠకశక్తి చూచెదన్
మామది కింపుగా జదువుమా యొక పద్యము వీరిముందరన్.''

(2-2-280)

విష్ణుపురాణమునందు నరకాసుర ఘట్టమున సత్యభామ యుద్ధము చేసినట్లే లేదు. ఇది హరి వంశమున కల్గిన మార్పు. ఈ మార్పును నాచన సోముడు బహురసవంతముగ వర్ణించినాడు. దానిని పోతనార్యు డనుక రించెను. ''సత్యాసంగ్రామము, కాళీయమర్దనము, రుక్మిణీపరిణయము, కృష్ణలీలలు, వామనావతారము లోనగు కథాంశములు పోతన భాగవతంబు నను, ఎఱ్ఱాప్రగడ హరివంశమునందును సమానములుగా గలవు. ఉభయ గ్రంథభాగములను పోల్చుట ధర్మముగాదు...ఒకరిది పురాణశైలి; ఒకరిది ప్రబంధశైలి. అందువలన నుభయులకు పోల్కి చెప్పనలవికాదు.'' అని శ్రీ శేషాద్రిరమణ కవులు తమ భాగవత పీఠికయందు వ్రాసినారు, నేను వారితో నేకీభవించుచున్నాను.

నరకాసుర యుద్ధఘట్టమున పోతననాచన సోము ననుకరించినమాట వాస్తవమే! భాగవత మాతృకలో కృష్ణుడు యుద్ధమునకు సత్యభామా సహితముగా పోయినట్లు మాత్రమే యున్నది. పోతనార్యు డిచ్చట 21 పద్యములను రచియించి ఘట్టమును రసవంత మొనర్చెను. వీర శృంగార రసములను తెల్పు సోముని "అరి జూచుఁ హరిజూచు" అను పద్యము వంటి పద్యమును "నరుజూచుఁ పరుజూచు" అను దానిని పోతనార్యుడు వ్రాసినాడు. కాని పోలికకు చాలదీ పద్యము. తరువాతి పద్యములు రమణీయములు. పోతనార్యుని ప్రతిభోపేతములు. ఒక్క పద్యము ననువదింతును.

"రాకేందుబింబమై రవిబింబమై యొప్పు
నీరజాతేక్షణ నెమ్మొగంబు
కందర్పకేతువై ఘనధూమకేతువై
యలరుఁ బూఁబోఁడి చేలాంచలంబు;
భావజు పరిధియై ప్రళయార్కు పరిధియై
మెఱయు నాకృష్టమై మెలఁత చాప
మమృత ప్రవాహమై, యనల సందోహమై
తనరారు నింతి సందర్శనంబు
హర్షదాయియై మహారోషదాయియై
పరఁగు ముద్దరాలి బాణవృష్టి
హరికి నరికిఁ జూడ నందంద శృంగార
వీర రసములో లివిస్తరిల్ల.

(10 ఉ. 183)

పదునారువేల కన్నియలలో ప్రతి కన్నియయు కృష్ణుడు తననే వరించుననుకొను ప్రకరణమున మాతృక యిట్లున్నది.

"భూయాత్పతిరియం మహ్యం ధాతాతదనుమోదతాం
ఇతిసర్వాః పృథక్ కృష్ణే భావేన హృదయం దధుః"

ఈ శ్లోకార్థము నిట్లు రసవంతముగ సంతరించెను.

"భూనాధోత్తమ కన్యకల్ వరుస నంభోజాత నేత్రుండు న
న్నే నవ్వెం దగఁ జూచె; డగ్గరియె; వర్ణించెఁ; వివేకించె, స
మ్మానించెఁ; గరుణించెఁ; బేరడిగె; సన్మార్గంబుతోఁ బెండ్లియాఁ;
నేనే చక్రికిదేవి నంచుఁ దమలో నిర్ణీతలై రందఱుఁ."

(10 ఉ. 213)

ఇచ్చట నుండి మరల నారయ కవిత్వమందురు. కాని తరువాత కూడ పోతన పోకడలు తప్పక కన్పడుచున్నవి.

తరువాత ఉషాపరిణయ ఘట్టమున మాతృకలో 80 శ్లోకములు, అనగా దాదాపు 100 గ్రంథము లున్నవి. పోతన దానిని 500 గ్రంథములుగా పెంచినాడు. ఇట్లింత పెంచుశక్తి నారయకున్నట్లు చెప్పజాలము. చిత్రరేఖ చిత్రములను వ్రాసి చూపు సందర్భమున మాతృక యిట్లున్నది.

"ఇత్యుక్త్వా దేవగంధర్వ సిద్ధచారణ పన్నగాన్
దైత్యాన్ విద్యాధరాన్ యక్షాన్ మనుజాంశ్చ యథాలిఖత్॥
మనుజేషుచసావృష్ణీన్ శూరమానక దుందుభిం
వ్యలిఖద్రామకృష్ణౌచ ప్రద్యుమ్నం వీక్ష్యలజ్జితా॥"

(10-62-16,17)

ఈ రెండు శ్లోకములను 14 పద్యములకు పెంచెను. వానిలోని శైలియు పోతన దానిదే నవచ్చును.
కృష్ణ వర్ణన మిట్లున్నది.

"కమనీయ శుభగాత్రుఁ గంజాతదళనేత్రు
వసుధాకళత్రుఁ బావన చరిత్రు
సత్యసంకల్పు నిశాకరోగ్ర వికల్పు
నత పన్నగాకల్పు స్వాగతల్పుఁ

కౌస్తుభ మణిభూషు గంభీర మృదుభాషు
శ్రితజనపోషు నంచితవిశేషు
నీల నీరదకాయు నిర్జిత దైతేయు
ధృతపీత కౌశేయు నత విధేయు
అఘమహా గద వైద్యు వేదాంత వేద్యు
దివ్యముని సన్నుతామోదు తీర్థపాదు
జిష్ణు వరసద్గుణాలంకరిష్ణుఁ గృష్ణుఁ
జూడు దైతేయకులబాల సుభగలీల.”

(10 ఉ. 358)

ఇక కుచేలోపాఖ్యానమునకు వెడలక పూర్వము నారయదని చెప్పు నీ భాగములోని కొన్ని పద్యముల ననువదించి వాని శైలిని మీరే పరికింప వేడుచున్నాను.

“చంచత్కాంచన రుచిరో
దంచిత వస్త్రముల నూతనార్క ప్రభలన్
మించిన రత్నములం బూ
జించెన్ ధర్మజుఁడు కృష్ణు జిష్ణు సహిష్ణున్”

(10. ఉ. 784)

ఇది వస్త్రాపహరణమునందలి పద్యమునకు ప్రతిధ్వని.

“వితతజ్యాచయటంకృతుల్, మదజలావిర్భూత శుండాలఘీం
కృతు, లుద్యద్భట హుంకృతుల్, మహితభేరీభాంకృతుల్, భీషణో
ద్ధత నిస్సాణధణం కృతుల్, ప్రకట యోధవ్రాతసాహంకృతుల్,
కుతలంబున్ దివినిండ మ్రోసె రిపుసంక్షోభంబుగా భూవరా!

(10. ఉ. 847)

“హరిభజియించు హస్తములు హస్తము; లచ్యుతుఁ గోరిమ్రొక్కు త
చ్ఛిరము శిరంబు; చక్రధరుఁ జేరిన చిత్తము చిత్త; మిందిరా

వరుఁ గనుదృష్టి దృష్టి; మురవైరి నుతించిన వాణి వాణి; య
తురు కథలాను కర్ణములు కర్ణములై విలసిల్లుఁబో భువిన్."

(10. ఉ. 963)

నేనుల్లేఖింపబోవు తుది ఘట్టము కుచేలోపాఖ్యానము. కుచేలుండు కృష్ణ మందిరమును ప్రవేశించు నపుడు మాతృకలో నీశ్లోకములున్నవి.

"గృహేన్ ద్వ్యష్ట సహస్రాణాం మహిషీణాం హరేర్ద్విజః
వివేశైకతమం శ్రీమద్బ్రహ్మానంద రతిం యథా!
తం విలోక్యాచ్యుతో దూరాత్ ప్రియాపర్యంకమాస్థితః
సహసోత్థాయచాభ్యేత్య దోర్భ్యాం పర్యగ్రహీన్ముదా."

(10,80 - 17,18)

వీనికి క్రింది పద్యములున్నవి.

"విశదమై యొప్పు షోడశసహస్రాంగనా
కలిత విలాస సంగతిఁ దనర్చి
మహనీయ తపనీయ మణిమయ గోపుర
ప్రాసాదసౌధహర్మ్యములు సూచి
మనము బ్రహ్మానందమును బొందఁ గడునుబ్బి
సంతోష బాష్పముల్ జడిగొనంగఁ
బ్రకటమై విలసిల్లు నొక వధూమణి మంది
రమున నింతులు చామరములు వీవఁ
దనరు మృదు హంసతూలికాతల్పమందుఁ
దానుఁబ్రియయును బహువినోదములఁ దనరి
మహితలావణ్యు మన్మథమన్మథుండు
ననఁగఁ జూపట్టు పుండరీకాయతాక్షు."

"ఇందీవరశ్యాము వందితసుత్రాముఁ
గరుణాలవాలు భాసురకపోలుఁ

కౌస్తుభాలంకారుఁ గామిత మందారు
సురుచిరలావణ్యు సురశరణ్యు
హర్యక్ష నిభమధ్యు నఖిలలోకారాధ్యు
ఘనచక్రహస్తు జగత్ప్రశస్తు
ఖగకులాధిపయానుఁ గౌశేయపరిధానుఁ
బన్నగశయను నబ్జాతనయను,
మకరకుండల సద్భూషు మంజుభాషు
నిరుపమాకారు దుగ్ధ సాగర విహారు
భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు
విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణుఁ గృష్ణు."

"కని డాయం జనునంతఁ గృష్ణుఁడు, దళత్కంజాక్షుఁ డప్పేద
విప్రుని నశ్రాంత దరిద్రపీడితు గృశీభూతాంగు జీర్ణాంబరుః
ఘన తృష్ణాతురచిత్తు హాస్యనిలయుః ఖండోత్తరీయుం గుచే
లుని నల్లంతనె చూచి సంభ్రమవిలోలుండై దిగెం దల్పముః."

"కర మర్థి నెదురుగాఁ జని
పరిరంభణ మాచరించి బంధుస్నేహ
స్ఫురణం దోడ్తెచ్చి సమా
దరమునఁ గూర్చుండఁబెట్టెఁ దనతల్పమునః."

(10. ఉ. 978,979,980)

ఈ రచన మెవ్వరిదిగనున్నదో చెప్పబనిలేదు. అంత్యనియమములు, పద్యాంతములు మొదలైనవి పోతనార్యుని రచనమని చెప్పక చెప్పుచున్నవి. ఈ ఘట్టమును వామనావతారాదులవలె ప్రజాదరము వడయుచున్నది. ఇపుడీ భాగములో ననువదించిన పద్యములవలె రసవంతములైన పద్యములు కుప్పతిప్పలుగా కలవు. కాని యన్నిటి ననువదించుట యసంభవము గదా! ఇంతటితో నీ యనువాదమును విడతును.

౭

## శ్రీధర వ్యాఖ్యానుసరణము

వెనుక నిచ్చిన 4 కారణములతోపాటు పోతన శ్రీధరుల వ్యాఖ్య ననేక స్థలముల ననుసరించుట కూడ కొంతకాక కొంతయైనను పెంపు దలకు కారణమనక తప్పదు. ఎచ్చట మూలము క్లిష్టమై యర్థస్ఫురణము కాదో యచ్చటను, నొక్కొకచో సౌలభ్యము కొఱకును, పోతనార్యుడు శ్రీధరస్వామి ననుసరించెను. అనుసరించిన యన్ని స్థలములను చూపుట యసంభవము. వెనుక నాంధ్రీకరణ పద్ధతి నెట్లు స్థాలీపులాకన్యాయముగా చూపితినో యట్లే యిచటను చూపెదను. కొన్ని ప్రముఖమైన యుదాహారణముల నిత్తును.

1. మూ॥ "నతేవిదుః స్వార్థగతింహి విష్ణుం
దురాశయాయే బహిరర్థమానినః ।
అంధాయథాం ధై రుపనీయమానాః
వాచీశతంత్ర్యా మురుదామ్ని బద్ధాః॥"

(7.5)

క్రింద గీటుంచిన పాదమునకు శ్రీధరస్వామి వారిట్లు వ్యాఖ్యానము వ్రాసియున్నారు.

"ఈశస్య, వాచి, తంత్ర్యాం వేదలక్షణాయాం రజ్వాం, ఉరుదామ్ని, ఉరూణిదామాని, బ్రాహ్మణాదీని యస్యాం, తస్యాం బద్ధాః" "కామ్యైః కర్మభిఃబద్ధా ఇత్యర్థః"

ఈ స్థలమున పోతన తెనుఁగుసేత యిట్లున్నది.

"కాననివాని నూతగొని కాననివాడు విశిష్టవస్తువుల్
కాననిభంగిఁ గర్మములు గైకొని కొందరు కర్మబద్ధులై

కానరు విష్ణుఁ; గొందఱటఁ గందు రకించన వైష్ణవాంఘ్రి సం
స్థాన రజోభిషిక్తులగు సంహృతకర్ములు దానవేశ్వరా!

(7-182)

ఇచ్చట సౌలభ్యము కొఱకు వ్యాఖ్యానము ననుసరించి "కర్మ బద్ధులై" యని వ్రాసెను.

2. నారదుడు ధృవున కుపదేశించు నవసరము నందలి విష్ణువర్ణనము మాతృకలో నిట్లున్నది.

"తరుణం రమణీయాంగం అరుణోష్ఠేక్షణ ధరం।
ప్రణతాశ్రయణం నృమ్ణం శరణ్యం కరుణార్ణవం॥"

(4-8-48)

ఇచ్చట "నృమ్ణం" అను పదమునకు శ్రీధరులవారు "నృమ్ణం= ధనం, సర్వ పురుషార్థనిధి మిత్యర్థః" అని వ్రాసిరి. పోతన్నగారు

"హరి నీలసంశోభితాంగుండు తరుణుండు
నరుణావలోకనోష్ఠాధరుండు
కరుణాసముద్రుండు పురుషార్థ నిధియు
ప్రణతాశ్రయుండు శోభనకరుండు"

అని భాషాంతరీకరించిరి. శ్రీధరస్వాములవారి పదములనే గ్రహించెను.

3. శుకుడు పరీక్షిత్తునకు ముక్తిమార్గంబు దెలుపు నవసరమున మాతృకలో నిట్లున్నది.

"అండకోశే శరీరేస్మిౕ సప్తావరణ సంయుతే" అని యున్నది. ఇందులకు శ్రీధరులవారు వ్యాఖ్యానము నిట్లు వ్రాసిరి.

"సప్తావరణ సంయుతే; సప్తభిః మహదహంకార సహితైః పృథివ్యాది పంచభూతాత్మకైః ఆవరణైః"

పోతనార్యుడును వ్యాఖ్యానము ననుసరించి,

"విలోక్యమానంబగు ధరణీ సలిల తేజస్సమీరణ
గగనాహంకార మహా త్తత్త్వంబు లనియెడి సప్తావరణంబులచేత."
(2-15)

అని వ్రాసెను. ఇట్లు చూపుట కసంఖ్యాక స్థలములు గలవు. ఇక నొకటి చూపి తృప్తి చెందుదును.

4. దశమ స్కంధమున కాళీయ పత్నులు కృష్ణుని స్తుతిజేయు సందర్భమున మాతృకలో,

"నమో నంతాయ సూక్ష్మాయ కూటస్థాయ విపశ్చితే
నానావాదానురోధాయ వాచ్య వాచక శక్తయే॥
నమః ప్రమాణమూలాయ కవయే శాస్త్రయోనయే"
(10-16-43,44)

అని యున్నది.

దీనికి శ్రీధరవ్యాఖ్య యిట్లున్నది.

"అనంతాయ అహంకార పరిచ్ఛేదాత్; అతః సూక్ష్మాయ, అదృశ్యత్వాత్; అత ఏవ కూటస్థాయ, ఉపాధికృత వికారాభావాత్; అత ఏవ విపశ్చితే, సర్వజ్ఞాయ;॥ నానేతి॥ నానావాదానురోధాయ అస్తి, నాస్తి, సర్వజ్ఞః, కించిజ్ఞః, బద్ధః, ముక్తః, ఏకః, అనేకః, ఇత్యాదీన్ నానావాదాన్; అనురుణద్ధి = మాయయా అనువర్తతే, యస్తస్మై; వాచ్యవాచక శక్తయే; అభిదానాభిధేయ శక్తిభేదాదపి, నానాత్వే ప్రతీయ మానాయ ॥నమఇతి॥ ప్రమాణమూలాయ = చక్షురాదీనాం చక్షురాది రూపాయ, అత ఏవ కవయే; స్వయం తన్నిరపేక్ష జ్ఞానాయ; కుతః, శాస్త్రయోనయే = వేదాత్మక విశ్వాసాయ"

ఇందులకు పోతనార్యు డిట్లు వ్రాసెను.

"........మూఢహంకృతులచే ముసుగువడక
నెరిననంతుడవై దర్శనీయరుచివి
గాక, సూక్ష్ముడవై నిర్వికారమహిమ
దనరి, కూటస్థుడన సమస్తంబు నెరుగు
నీకు మ్రొక్కెద మాలింపు నిర్మలాత్మ.

మరియు కలండు, లేడు, సర్వంబు నెఱుంగు, నించుక యెఱుంగు, బద్ధుండు, విముక్తుండు, ఒకండ నేకుండు, ననునివి మొదలుగాగల వాదంబులు మాయవలన ననురోధింపుదువుగావున, నానావాదానురోధకుండ వయ్యును, నభిధానాభిధేయశక్తి భేదంబులవలన బహుప్రభావ ప్రతీతుండవయ్యును, చతురాది రూపంబులవలన ప్రమాణ రూపకుండవయ్యు, నిర పేక్ష జ్ఞానంబు కలిమిం గవివయ్యు, వేదమయ విశ్వాసత్వంబువలన శాస్త్రయోనివయ్యు"
(10 పూ. 681, 682)

ర

పరిశిష్టము

పోతనార్యుని యద్వైత మెట్టిదో వెనుక కొంత మనవి చేసినాను. పరీక్షించినచో 'మాయ' నంగీకరించి నప్పటికిని సాక్షాచ్ఛంకరాద్వైతము నీయన యనుసరించినట్లుతోచదు. కాని తత్త్వ వివేచనము చేసిన స్థలములను పరిశీలించిన యెడల, పోతనార్యుడు తన కాలమునందున్న యొక విధమైన భక్త్యద్వైతముల కవిరోధియైన మతము ననుసరించి వ్రాసినట్లు కనబడుచున్నది. ఇదివరలో గంగయ్య సింగనల భాగములలోని యద్వైత సిద్ధాంత సూచనలును, నారయలోని విశిష్టాద్వైత సిద్ధాంత సూచనలును మనవిచేసి యున్నాను.

పోతన శివభక్తుడు, శివభక్తుల వంశము వాడైనను వాసుదేవ తత్త్వమును మిక్కుటముగా నుగ్గడించెను. అందుచేత నతడు శివవిష్ణ్వభేదమును నమ్మువాడుగా గానబడును. ఈ క్రింది పద్యములను గనుడు,

"చేతులారంగ శివుని పూజింపడేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువడేని
దయయు సత్యంబు లోనుగా దలపడేని
కలుగనేటికి తల్లుల కడుపుచేటు." అనియు
"నీ పాదకమల సేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యము నితాం
తాపార భూతదయయును
తాపస మందార నాకుదయ సేయగదే!"

అనియు చెప్పెను. శివపూజ, హరినామ కీర్తనము వలయునని నొడివెను. శివపూజ సేయుచుండగా తనకు శ్రీరాముడు ప్రత్యక్షమైనట్లు చెప్పుకొనెను. శివభక్తుడై రామునిచే పల్కింపబడి భాగవతమును రచియించెను. ఈ క్రింది యుదాహరణమును గమనింపుడు. దక్షాదులు విష్ణువును స్తుతించినయనంతరము విష్ణు విట్లుపలికెను.

"ఏనును, బ్రహ్మయు, శివుండును నీజగంబులకు కారణభూతులము. ...... మా ముప్పుర యందు నెవ్వండు వేరు సేయకుండు వాడు కృతార్థుండని యానతిచ్చిన" (4-207) శివధ్యానము చేయుచుండ శ్రీరామ దర్శనమగుట చిత్రము కదా!

పోతన భాగవతమున వ్రాసినంత శృంగార రసము నెవ్వరును రచియింపలేదు. కాని యావద్గ్రంథమును పఠించిన తరువాత పర్యవసించునది భక్తి రసము. శృంగారము అంగరసము. భక్తియంగి. దీనిని మధుర భక్తి యందురు. భక్తికి రసత్వమును గూర్చి వెనుక తెల్పియున్నాను.

నాకర్తవ్యమును యథాశక్తిగా నిర్వర్తించినాను. నాకీ యవకాశము నిచ్చిన ఆంధ్రసారస్వత పరిషత్తు వారికి నేను కృతజ్ఞుడను. పోతనార్యుని దలచుటయు, నాయన రచియించిన భాగవతమును గూర్చి ముచ్చటించుటయు నను పనులవలన నేను పవిత్రుడనుగ భావించు కొనుచున్నాను. ఆంధ్ర సాహిత్యాకాశమున తిక్కన పోతనలు సూర్యచంద్రులవలె ప్రకాశించుచున్నారు.

## పోతన కవిత్వము ౧

"వేద కల్పవృక్ష విగళితమై శుక
ముఖరసార్ద్రవమున మొనసియున్న
భాగవత పురాణ ఫలరసాస్వాదన
పదవిఁ గనుఁడు రసికభావవిదులు." (భాగవతము)

అధ్యక్ష మహాశయులకు నమస్కారము. సరసులైన సదస్యులకు కృతజ్ఞతాంజలి.

పోతనామాత్యుఁడు — అతఁడొక పవిత్రుఁడు, కవితానిర్మాణ దక్షుఁడు. తన తపస్సును — వచస్సును — చక్కని నియమకుల్యలతోఁ బండించికొని "మానవుఁడు దివ్యగుణములు సంపాదించికొన్న యిట్లుండు"నని ప్రపంచమునకుఁ జూపి — తాను తరించి — దేశమును తరింపఁజేసినవాఁడు. ఆంధ్రజాతి కాతఁడిచ్చిపోయిన భాగవతము — అమృతభాండము. ఆ కావ్యమునకు లక్షణమైన జీవితము — అమృతముకన్నను మధురమైనది. ఆ బ్రదుకర్థము గాక కన్నులుఁ దేలవైచు మనవంటివారిపై నా మహనీయుఁడు జూపిన పరమానుకంపయే భాగవతము. సత్యము జెప్పినచో పోతన్నను కవిగా మాత్రమే అంచనావేయుట అతనియెడ మనము గావించు నొక యపరాధమే! కారణమేమన 'కవి' యను పదమునకు—నేటి వ్యాఖ్యానమెంతయో మందగించినది. మొన్న మొన్నటివరకు — నలువది పుస్తకములు జదివి — నాలుగు నిఘంటువులు వల్లెవేసినవారు కవులగుచుండిరి. ఈ నాఁడా బెడద గూడలేదు. నేటికవికి నాల్గు నిఘంటువు లక్కరలేదు. నలువది పుస్తకముల యూసేలేదు. వానికిఁ గావలసినది నాగరవేషము. నలుగురు భజనపరుల యనుగ్రహము. పత్రికలలో ప్రచారము వీని కీర్త్యపకీర్తులు — యీ పరివార దేవతల నిగ్రహానుగ్రహములఁ బట్టి యుండును. అందుకై వారి యాదరము నెప్పుడును — యీ కవి జాగ్రత్తగ రక్షించికొనవలెను. అవకాశము

దొరకినంజాలు – జారవిడువక – మేరువంతవాఁడనని – యెదుటివారే మనుకొన్ననుసరే! ఆత్మశ్లాఘకు దిగవలెను. పూర్వమును యిట్టి రజోగుణ పూరితులకు గొదువలేదు. కాని – వారికిని – పీఠకిని యొక భేదముమాత్రము గద్దు! ఆడినమాటలో నర్థమైనను నెగ్గించుకొనగల సామర్థ్యము వారిది. ఈ కవి గ్రామణుల కాఁజవాబ్దారీలేదు. వీరినెవ్వరును అడుగరుగూడ! ఒకవేళ నడిగి రాదనిపించిరి పో – ఆ ధైర్యమునకు మెచ్చి – వారికంబరాభరణాదు లొసంగెడు దాతలేరీ? కనుక నేటి యీ దృష్టితో మనము జూచి యాతని నొక "కవి" యని తేల్చివేసినచో – నంతకంటె నన్యాయముండదు. ఈ విషయము నా కంటెను రసికులైన మీకే బాగుగదెలియును. పోతన్నవంటి వారికి 'కవి' శబ్దమన్వయించునప్పుడు – దానికింకను గొంత గంభీరమైన యర్థము గావలెను.

ఆ మహనీయుని గురించి వివరించుటకు మీరు నన్నెందుకు వినియో గించికొన్నారో నే నెఱుంగను. ఆ నియమశీలకుండిన శీలిసంపదలో – శతాం శము – సహస్రాంశము నాకులేదు. ఆ విద్వాంసుని పాండిత్యమును అను కరింపకున్నమానె – అర్థము జేసికొను సత్తువయు సున్న. తపస్విలైన వేదాంతదేశికులు – 'పాదుకాసహస్రము'న గాబోలు "కిమాశ్చర్యంపంగోరు పరియది గంగానిపతతి" యన్నారు. భగవంతునిదయ యున్నప్పుడు కుంటి వానిపై వానియింటికే వచ్చి గంగ ప్రవహించునట! దేశికులు భగవంతుని యెడఁ జేసిన యీ వినయానుసంధానము ఔపచారికమే! వారి తపో మహిమ యట్టిది. నాయెడ మాత్రము యీ మీయనుగ్రహము కుంటి వానిపై గోదావరి బారుటయే! ఇది నా గొప్పయదృష్టము. ఇంతకు నా భాగ్యమునకేమిగాని – మీకు నిరాశ తప్పదేమోనని నా భయము. ఈ పనికి నా కన్నను గొప్పవారి నెన్నుకొనవలసి యుండెను.

'కవి' శబ్దమునకు నేటి వ్యాఖ్యానమేమో కొంత మనవిజేసితిని. పోతన్న జీవితమిందుకు నేరుగా నపవాదము. మన మతనిని 'కవి' యన్నచో నాతనికి క్రొత్త తృప్తిపొంగుటయులేదు. కాదన్న నది కుంగుటయులేదు.

ఆతని జీవితమును - రచనమును - మననగావించికొనుట - మనము పవిత్రుల మౌటకే! కవితా రచనమునకుఁ గొందఱు ప్రాచీనాలంకారికులు 'విశ్వ శ్రేయము'ను ఫలముఁగాఁ జెప్పిరి. పోతనామాత్యుఁ డుద్దేశించిన ఫల మంతకన్నను భిన్నమైనది. ఆతఁడు తాను భాగవతమెందుకు వ్రాయవలసి వచ్చెనో వివరించుచుః

మ॥ ఒనరన్ నన్నయ తిక్కనాది కవులీ యుర్విన్ బురాణావళుల్
తెనుఁగుంజేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దానెట్టిదో
తెనుఁగున్ జేయరు మున్ను భాగవతమున్ దీనిన్ దెనింగించి మ
జ్జననంబున్ సఫలంబు సేసెద పునర్జన్మంబు లేకుండఁగన్॥

అని పలికెను. ఆతఁడాశించిన ప్రధాన ఫలము - జన్మరాహిత్యము. దీనిని మరియొక మార్గమున నాతపస్వి సాధించికొని యుండవచ్చును. కాని - యా మహాకవి 'పురాకృత శుభాధిక్యంబు ఆతనికి భాగవతమును జూపిన దట! నిజమునకది యాతని పూర్వపుణ్యముగాదు. దేశముయొక్క శుభా ధిక్యము. లేకున్నచో - నా పరమసాత్వికుని హృదయపదమునుండి - యీ దివిజగంగ జారియుండెడిదిగాదు.

పోతనామాత్యుని విమర్శించువారిలో స్థూలముగ రెండు తెగలవా రున్నారు. కొందఱు వ్యాసుని భాగవతమునకు పోతనామాత్యుఁ డడు గడుగునను మెఱుఁగును పెట్టెననువారు మరికొందరున్నారు వారి దృష్టిలో పోతన్నకవియే గాఁడు. ఆతని భక్తి మాత్రము గొప్పదని తలపంకించి - దూరపు మ్రొక్కులు మ్రొక్కుదురు. దానినైనను గౌరవించుట పోతన్న వీరికి ననుకాలికుఁడుగాదు గనుక మొదటివాద మతివృష్టి. రెండవది యనా వృష్టి. ఈ నడుమ - ఆంధ్రులలోఁ గొందఱికి - హఠాత్తుగఁ దమ భాషపై నభిమానము పుట్టుకొని వచ్చుటచేఁ గాఁబోలు - వ్యాస భగవానునిపై నొక యేహ్యాభావ మారంభమైనది. వారి దృష్టిలో నొకరిని తిట్టనిది - వేరొకరిని దీవించినట్లుగాదు. ముఖ్యముగ గడచిన దశాబ్దములలో నీ

ప్రచారము తిక్కనామాత్యుని భారతము విషయమున బహుళముగ జరిగెను. అడుగడుగునను వ్యాసుఁడు తక్కువ — తిక్కన్న యెక్కువ - యని ఋజువు చేయనిది యీ విద్వాంసులకు నిద్రబట్టినట్లు గానరాదు. ఈ విజ్ఞాన వృద్ధుల యాసరా జూచికొని కొందఱు ''ఆంధ్రాంగ్లేయపులగపు'' విమర్శకులు మరికొంత విపరీతముగ గంతులువేసిరి. స్వకపోల కల్పితమైన కవిత్వమెంత యున్నను - తిక్కనామాత్యు డొనర్చినది యను వాదమే నను విషయమును వారు పూర్తిగ మఱచినారు. మూలకారుని భావములేవో - తిక్కన భావములేవో వింగడించు పరిశ్రమయే - వీరికక్కఱలేని పనియైనది. సభావేదికలపైనిలచి - అయినది - కానిది - యంతయు తిక్కన్న దేనని యద్భుతముగ పొగడ్తలు సాగించిరి. ఒక్కొక్కసారి వీరి వాదములు జూచి నపుడు భావుకులకు పట్టరానంత నవ్వు వచ్చును. ద్రౌపది సైరంధ్రియైనపుడామె ధరించిన దుస్తు లచ్చముగ తెలుఁగువారివేనట! అర్జునుఁడు కల్తీలేని యాంధ్రనాయకునివలెనే మాట్లాడునట! అభిమానము దురభిమానమై వెర్రితలలు వేసినపుడు చేయు విమర్శనము లిట్లేయుండునని నా మనవి. నేనీ మాటలన్నచో తిక్కనపై నా కభిమానము లేదని తమరు తలపరాదు. ఆతఁడు 'కవిబ్రహ్మ' యనుటకు నా కెట్టి సందేహమునులేదు. ఆ యుభయ కవిమిత్రుడు కవితాశిల్పమునందు — పారగుఁడనుటలో — సంశయమున్న వానికి కవిత్వమేమి దెలిసినట్లు? కాని నేను విన్నవించునదేమనఁగా — వ్యాసుల నెంత నిందించిన తిక్కన నంత వందించినట్లుగాదని మాత్రమే! ఒకానొకఁడు తొల్త నొక పదార్థమును దయారుచేసిపెట్టినపుడు - దానిపై మెఱుగులు దిద్దుట మొదటిదాని యంతకష్టముగాదని మర్మజ్ఞు లెరుగుదురు. పాండవులు — భారతము — ఒక్క ఆంధ్రులకే కాదుగదా! వారి కథ భారత దేశపు సొమ్ము. అట్టి వారికి తెలుఁగు రూపురేకలుదిద్దు నధికారము తిక్కన కెవరిచ్చిరి? అని యెవరైన నడిగిరనుకొందము. దానికి మన సమాధానమేమి? మఱియట్లొనర్చుట తిక్కన దోషమేనా? ఆమాట నేనను ఏకవికైన నది స్వభావమని మాత్రమే నేను చెప్పఁదలఁచినది. కవి యెంత స్వతంత్రుఁడైనను — వ్రాయుచున్నది యే కాలమునకు సంబంధించిన కావ్య

మైనను — అతఁడు జీవించిన సమాజము — దాని యభిరుచులు — వాని కావ్యమందెట్లో యొక రీతి చోటు చేసికొని ప్రవేశించును. ఎంతటి వానికే గాని యీ గుణముదాఁచికొనుట యసాధ్యము. అనావశ్యకముగూడ! కుమార వ్యాసుఁడు రచించిన కన్నడపుభారతములోని పాండవులు కన్నడి గులే! మళయాళమున 'ఎజుత్తచ్ఛ' భాగవతకర్త. ఆ పురాణమున నవ కాశము దొరకినపు డంతయు — పనస రసముల యూటలు - టెంకాయ తోఁటలు - కదళీవాటులు - చోటు చేసికొన్నవి. ఆ బాల కృష్ణున కరఁటి పండు దిననిది పూట గడువదు. స్వభావమిది గనుకనే తిక్కన హృదయము నుండి 'ఆంధ్రావళి మోదముంబొరయ' ననుమాట హఠాత్తుగ కావ్యమున దూకినది. పైగా - తిక్కనామాత్యుని కాలమున నందు కవసరము గూడ నుండెను. నాటి తెనుఁగు జాతి - దేశము — చెక్కలు ముక్కలుగఁ జేయ బడినది. కాకతీయుల ప్రతాప మొకవైపు జెలరేగుచున్నను - నాటి కింకను వారి ప్రభ యుచ్ఛస్థితికి రాలేదు. జైనులు - వీరశైవులు - అద్వై తులు - మేము గొప్ప మేము గొప్ప యని వాదించుకొనుచుండిరి. జాతి యందు లాలసత మొదలైన ధర్మములు తొంగిచూచు ప్రమాదముండెను. ఈ దుస్సంప్రదాయముల నరికట్టుట కమాత్యుఁడైన తిక్కన మహాభారత రచనమునకు బూనుకొన్నాఁడు. తులసీదాసు రామాయణము వ్రాయుటకు గూడ నిట్టి పరిస్థితులే కారణము. కనుక తెనుఁగు జాతికిఁ గర్తవ్యము బోధింప దొరకొన్న తిక్కనామాత్యుని గ్రంథములో నాంధ్రజాతిగాక మరేది ప్రతిఫలించును? పఠితలమైన మనముగూడ — నొక గ్రంథమునందు- మనజాతి — స్వభావము దేశము - యెంతగా ముద్రితమైన నంత యాత్మీయ తనుభావింతుము. తీక్ష్ణమగు తార్కిక బుద్ధితోఁ జూచినపుడిది దౌర్బల్యమే గావచ్చును. కాని — కావ్యమున మాత్రమిది యొక గుణమే! పైగా వ్యాసమహర్షి వ్రాసిన దేశకాలములు వేఱు. అతనిని గలఁచిన యావేశములు వేరు. మనుష్యులు వేరు. రాగద్వేషములు మొదలైన మాన సిక వికారములు — వారికిని మనకును సామాన్యములే యైనను - అవి

యుద్రేకించు సన్నివేశములు - వానిని వెల్వరించు తెనుఁగులు — భిన్న భిన్నములు. అట్టిచో వ్యాసభగవానుఁడు 'మనమనుకొన్నట్లే' వ్రాయ వలెననుట - "మనకు గావలసిన గుణములే" యాతనిలో నుండవలెనను కొనుట - విజ్ఞతకంటెను అజ్ఞతనే యెక్కువగఁ దెలుపును. తిక్కనకు గల్గిన యీ సర్వతోముఖమైన పొగడ్త - నన్నయకు దక్కలేదే యని మరికొందరి బాధ. ఈ కుస్తీపట్లకు సాహితీదృష్టి యొకకారణమైనను - తెలుగు వెనుకల భాగవతము గంపెడంత. వీరును యథాప్రకారము-యిది వ్యాసుని 'తగ్గు'- యిదినన్నయ'నిగ్గు' యని ప్రారంభించినారు. మొన్న మొన్నటివరకు మేధా వంతుల మనుకొనువారికి -నన్నయను దిట్టుటయొక నాగరకముగనుండెను. ఈ ప్రచారమునకుఁ జదువు - కొన్ని యితర యోగ్యతలు - వీనినిబట్టి - మూలస్తంభములు గొందఱే! తక్కిన వారు వీరికి పలుకుబండలు. సీస పద్యములలో నొయ్యారినడకలు లేవని - అతఁడు శబ్దసిద్ధుండే గాని యర్థ రసికుఁడుగాఁడని నన్నయ భట్టుల నాక్షేపించిరి. చెప్పవలెనా వీరిప్రతాపము! ఆ 'జపహోమతత్పరుని' పాపము! తోచిన వన్నియు ననిరి.

ఈ నడుమ గాలి యిటు దిరిగినది. ఈ వాదములను విని మన మొక చిఱునవ్వునవ్వి — యూరకుండవలె; నంతే! ఇంతకును — ఆ ముసలి వ్యాసునివైపు వాదించు 'వకీ' లొక్కడును గూడ నేటికి దయారుగాలేదు. నిజముగ వీరి విమర్శనములు - ఆ నన్నయయు - యీ తిక్కనయు — యే యోగశక్తిచేతనైనను బ్రదికి వినుటయే దటస్థించినచో - వీరి యకాండ తాండవమునకు వారెంతయో నొచ్చుకొందురని నాతలఁపు.

కనుక-"సంస్కృత కవిభాగవతమును చాలరసహీనముగ వ్రాసెను. ఆంధ్రకవి - ఆ కవిత్వము నెంతయో హృదయంగమముగఁ జేసెను." అని డప్పులు వాయించుపని - పోతన్నవంటి పరమసాత్వికుని విషయమున మాత్రము జేయువలదని వారికి నా వినయపూర్వక నమస్కారము. ఆతనికి వ్యాసభగవానునిపైనున్న గౌరవ మింతింతగాదు. అందుకే కంఠోక్తిగ-

శా॥ పుట్టంబుట్ట శరంబునం దొలువ నంభోయాన పాత్రంబునం
బెట్టం గల్గను గాలి గ్రోల్వను బురాణింపం దొరంకొంటి మీ
దెట్టే వెంటఁజరింతు దత్సరణి నాకీవమ్మ! యోయమ్మ! మే
ల్పట్టున్నాకగుమమ్మ! నమ్మితిజుమీ! బ్రాహ్మీ! దయాంభోనిధీ!

అని తన వినయానుసంధానమును జూపి - పరమ భాగవత ధర్మమును వెల్లడించెను. కాళిదాసుగూడ నాతని దృష్టిలో నొక పురాణకర్తయై - ఋషికవియునైనాఁడు. అంత మాత్రమేగాదు. ఏకవిని కించపరచినను పోతన్నకు గలుగునది బాధయే! అందుకే యాతఁడు పూర్వకవి జన సంభావన మొనర్చెను. వర్తమాన కవులకు బ్రియముబలికెను. భావికవులను బహూకరించెను.

ఇంకొకరి తలఁపున పోతన్నది కవిత్వమేగాదు. కారణమేమనఁగా- నతనిలో మూలానుసరణములేదట! మూలానుసరణ మనఁగా దాని యర్థ మును వీరే వ్యాఖ్యానింపవలెను. వ్యాసుని రచనలో 'చ' కారమున్న నిచ్చటను చకారమును - నచ్చట 'వ' యున్న నిచ్చటను వకారముండుట యేనా? అట్లయినచో వ్యాసభాగవతమునే కాపీ వ్రాయుట మంచిది. పూర్వ మొక నవాబుండెడివాఁడట! వానిదగ్గఱ నొక వ్రాయసకాఁడుం డెను. వాఁడు యథాశ్రుతగ్రాహి. ఒకనాఁడేదో యొక 'రికార్డు' నా నవాబును జూచి వ్రాయవలసినదిగా వానిని గోరెను. వాఁడా పనిజేయు చుండగా - నొక గడ్డు సమస్య యేర్పడినది. ప్రాతరికార్డులో నొక యక్ష రముపై నీగయొకటి జచ్చియుండెను. వెంటనే యావ్రాతగాఁడును కష్టపడి యీగను సంపాదించి - దానిని చంపి యక్కడబూసెనట! నాకు వీరి వాదమును విన్నపుడంతయు నీకథ జ్ఞాపకమునకు వచ్చుచుండును.

వ్యాసభగవానుని గూర్చి యింతకు ముందే గొన్ని విమర్శనము లున్నవి. వ్యాసుఁడొకఁడు గాదనియు — ఆ పేరు గలిగిన వారు పలువు రనియు నొక యభిప్రాయము, వారి వాదము ప్రకారము వ్యాసుఁడను

నది బిరుదమేగాని యొకని పేరు గాదు. శ్రీమద్భాగవతమును వ్యాసుఁడు వ్రాయలేదనుటయు మరియొక యూహ! ఆ గ్రంథకర్త 'బోపదేవుఁడో' మరియెవ్వరోనట! ఆ గ్రంథవ్యాప్తికై వ్యాసుని పేరు బెట్టెనట! మరి వ్యాసులు రచించిన భాగవతమేదీ? అది దేవీభాగవతమే! ఈ వాదము లీనాటివేఁగావు. చాల ప్రాచీనములుగూడ! సనాతనులు - యీ రెండు భాగవతములు వ్యాసకృతములేనని యంగీకరించినను — ఒకటి యుప పురాణము - మరియొకటి మహా పురాణమని - 'చెన్నంపల్లె' పంచాయతీ జెప్పిరి. ఇంతతోఁ దీరెనా? తీరనిత్తురా? ఉపపురాణ మహాపురాణ నిర్ణయమున మరల మతభేదము లేర్పడినవి. విష్ణుభక్తులు విష్ణు భాగవతమే మహా పురాణమన్నారు. "కాదు దేవీభాగవతమే"నని శాక్తులు వాదించిరి. ఈ వాదము తెగుట యెప్పుడు? ఇదిగాదని కొందరు మూఁడవ మార్గమును ద్రొక్కినారు. కారణభేదముతో రెండును" నుపపురాణములేనట! రెండును మహా పురాణములేనట! ఇది సులభమైన పరిష్కారము.

నవీన చారిత్రకులు భాగవతము వ్యాసకృతము గాదనుటలోఁ జూపు కారణములలో నొకటి శైలిలోని భేదము. తక్కిన పురాణములలోఁగనపడువ్యాసుని శయ్యకును — భాగవతము నందలి ధారకును - భేదమున్నదని వాదము. శైలీభేదమున్నమాట నిజమేగాని—నా మనవి యేమనగా- ఒక్కొక్కరి కొక్కొక్క శైలియని ముద్రవేసిన వాఁడెవఁడు? నాకుఁజూడ నిదిసామాన్య లక్షణమేగాని - విశిష్ట లక్షణముగాదు. ఒక కవి వ్రాసిన కావ్యమందే - సందర్భముల ననుసరించి శయ్యాభేదము లేర్పడుచుండుట మన మెఱిఁగిన విషయమే! వ్యాసుఁడు గొప్ప తార్కికుఁడు. ఆతని కవితలో కవి హృదయమునకన్నను గొంత విమర్శనాదృష్టి యెక్కువ. చెట్లుచేమలు- మొదలైన ప్రకృతిని వర్ణించు తహతహ కంటెను మానవహృదయముల లోనికిఁ దొంగిచూచి వాని నిజమైన రంగును బయటపెట్టుటలో నాకాంక్ష గొప్పది. ఈ వాసన భాగవతమునందు గూడ లేకపోలేదు. భారతము లోసు నీపోకడలే యున్నవి. కొంత కర్కశమైనశైలి — అన్వయ కాఠి

న్యము — యాతనిరచనకు సామాన్య లక్షణములుగ గనపట్టును. ఈ గుణ ములు భాగవతము నందెంకను ముదిరినవని చెప్పవచ్చును. అంతేగాక - అడుగడుగునను వృత్తములుమార్చు నలవాటొకటి యాతనిభాగవతమున గొత్తగ సంక్రమించెను. అందుకే సాధారణముగ పండితులు గూడ భాగ వతమును పారాయణముసేయు మన్నచో - భయపడుదురు. పూర్వకాల ములో నొక పండితుని వ్యుత్పత్తిని గమనించుటకు భాగవతమున కర్థము జెప్పుమనెడివారట! కొన్ని చోట్ల భాగవత కవిత్వము కార్కశ్యమున బరాకాష్ఠ నందినది. ఆతని పురంజనోపాఖ్యానము మొదలైన ఘట్టములు- అర్థమగువేళకు తల పగులఁగొట్టు కొనవలసినంత పనియగును. వాల్మీకుల శైలి కలవాటుపడిన వారికి వ్యాసుల రచన కొంత క్లిష్టముగనే యుండును. వాల్మీకిది శరత్కాలపు ప్రవాహమువంటి చల్లని శైలి. అన్వయ క్లిష్టత - బరువైన భాష - యివి వారికంత ప్రియమైనవిగావు. మానవహృదయము కెదుకుటకంటెను - కనుల ముందున్న జడప్రకృతిని వర్ణించుటలో వారి కాకాంక్షయెక్కువ. అడుగడుగునను వజ్రపు తునుకలవంటి యుపమాన ములు. వ్యాసు లనేకాలంకారములను వాడుదురు. ఇంతకును, యీ రెండును రెండు సంప్రదాయములు. సంస్కృత వాఙ్మయమునందే యీ భిన్న పంథలు బాగుగ ప్రచారములోనికి వచ్చినవి. వాల్మీకి ననుసరించిన మహాకవులు - భాసుఁడు - కాళిదాసు - మొదలైనవారు, లీలాశుకుఁడు, జయదేవుఁడు, మురారి మొదలగు కొందరు వ్యాస భగవానుని రచనను గౌరవించినారు. ప్రాచీన కాలమందును వ్యాసుని రచనను గేలిచేసిన వారు లేక పోలేదు. వారాతనిని 'చకారకుక్షి' యనిరి. అనఁగా - వ్యాసులు తమ కవిత్వములో సముచ్చయ చకారము నెక్కువగ వాడుదురని యా క్షేపకుల యభిప్రాయము. ఈ వాసనయే — భవభూతికిఁగూడ నంటినది. వాల్మీకుల రచనమునందును - అక్కడక్కడ చకారములు గుప్పలు తెప్ప లుగ వచ్చును. ఇంతకును నీ విమర్శన మభిరుచి భేదమునకు సంబంధించినది. ఇట్టి యపకీర్తియే తెనుఁగులో దిక్కనకుఁ దప్ప - దక్కినవారి కందఱకు

కొద్దియో గొప్పయో యున్నది. తిక్కనామాత్యుఁడొక్కఁడు మాత్రము మందునకైనను వ్యర్థపదము వాడఁడట! తక్కిన కవులలో నిదిసామాన్యముగ గనుపించుచుండునని వారందురు. నిజమే గావచ్చును. ఎంతటి సిద్ధుఁడైన కవికైనను వాని హృదయము మొకదానియందు లీనమై యున్నప్పుడు తక్కిన గుణములలోఁ గొంత తరుగు గన్పడుట తప్పదు.

తిక్కనామాత్యుఁడు వాగర్థములలో భావసంపదనే చక్కగఁ బోషింపవలెనను చూపుగలవాఁడు. శబ్దమనునది యాతనిదృష్టిలో భావము నందించుట కుపకరణముమాత్రమే! శబ్దమునకే ప్రత్యేక సౌందర్యమున్నదనియు దానిని సాధించుటగూడ నొక తపస్సనియు నాతఁడంగీకరింపఁడు. శబ్దమును మఱచి యర్థముపైఁ బరిపూర్ణముఁగ గన్నుంచినప్పుడే తిక్కన కవిత్వమున గలుగు నానందము. మరియాతనిలో నాదశుద్ధి లేదన్నప్పుడు వారొసఁగు సమాధానమేమి? నన్నయ-శ్రీనాథుఁడు విద్యానగర కవులు. శబ్దమునకే యొక ప్రత్యేక సౌందర్యమున్నదని నమ్మిరి. నమ్మిన దానిని తనివిదీఱ ననుభవించి-మనచే ననుభవింపఁజేసిరి. కవి కులగురువని కలము బట్టి ప్రతివాని చేతను—నాటి నుండి నేటి వఱకు ముప్రొద్దు మ్రొక్కులు గొనుచున్న కాళిదాసు గూడ శబ్దార్థములను సమానముగ గౌరవించెను. తన యభిప్రాయమును కావ్యారంభముననే 'వాగర్థా వివసంపృక్తౌ' అను నుపమానముచే ధ్వని మార్గమున సూచించెను. పోతనామాత్యుఁడు నాచన సోముని వలెనే యీరహస్యము నెంతయో గౌరవించినాఁడు. దేవత లోక వైపు—పూర్వదేవతలోకవైపు బంతులు దీరి కూర్చున్నారు. ఆ యిఱు మూకలకును-అమృతమును బంచుటకై ముద్దులు కుప్పవోయుచు;

కం॥ శ్రోణీభర కుచయుగభర
వేణీ భరములను డస్సి వివిధాభరణ
క్వాణయయి యువిద వచ్చెను
పాణి సరోజమున నమృత భాండము గొనుచున్. (8-318)

ఆ వచ్చినది యెవ్వరు? ఆమె మోహినీ మూర్తి. అప్పుడు పోతన్న;

కం॥ భాసుర కుండల భాసిత
నాసాముఖ కర్ణగండ నయనాంచలయై
శ్రీసతియగు సతిగ నిదే
వాసుర యూథంబు మోహమందె నరేంద్రా! (8-314)

యనుచున్నాఁడు. వారికే గాదు. మోహమాక్రమించి కొన్నది మనకుఁగూడ. దేవాసురులను మరులు గొన జేసినది మోహినీ మూర్తి. మన శరీరములను పులకింపించినది సర్వమోహనమైన పోతనామాత్యుల వాగ్దేవి. మొదటి పద్యమున "భర" శబ్దము మూఁడు సారులు వచ్చినది. కాని యాయావర్తి మనకేమియు బరువుగా లేదు. చదివిన దానినే-మఱల మఱల చదువుకొందుము. ఇట్టి ఘట్టములు 'కవిబ్రహ్మ' కవిత్వమున నఱుదుగా వచ్చును. లేక రానేరావు.

ఇంతకును పెద్ద సృష్టి యొనర్చునపుడు-భావమును ఛందస్సులను "పడికట్టు"లలో బిగింపవలసి వచ్చినప్పుడు అక్కడక్కడ నొకటి రెండు వ్యర్థపదములు రాక తప్పవు. వాల్మీకిలోను నప్పుడప్పుడు "తథైవ హి-తథైవచ"లు వచ్చుచునే యుండును. ప్రాచీనులది- అదియొక యుదారమైన రచన. రాఁగరాఁగ నాపరిపాటి సంస్కృతమునను-తెనుఁగునను గూడ నశించినది. ఈ దృష్టితోఁజూచినపుడు సంస్కృతములో పురాణ కవులే ధారాశుద్ధిని సాధించిన వారనిపింతురు రాఁగరాఁగ 'చిత్తారి'పను లెక్కువయి పోయినవి. ఈ 'చిత్తారి'పని నింకను సాగబీకిన మహానుభావులు మొన్న మొన్నటి భావకవులు. లాలిత్యమును సాధింపవలసినచో-పూవుల కన్నను మెత్తగ నుండవలయునని వారి యూహ. ఇతర రసములను జెప్పు పట్టులందును-అడుగడుగునను పరాకాష్ఠతయే యగుపించవలెనని వారాశింతురు. దీని పరిణామమేమైనది? "దినమును జచ్చువానికి నేడ్చువాఁడె వఁ"డను నొక సామెత గలదు. మనస్థితి యట్లైపోయినది. ఈరచనములు

మనహృదయమునకున్న స్పందన శక్తినే బాధుచేసినవి. చేయుచున్నవి. మాటిమాటికిని గిచ్చినచో నేమగును? క్రమక్రముగ దానిచే గలుగవలసిన బాధయు-భావవికారమును మాయమగును. సదా యేడ్చుచున్నచోఁ గొన్నాళ్ళకుఁ గన్నీరుగూడ నాగిపోవునేమో? మావైపు-పూర్వమున నెఱుకలు దొంగతనమును విద్యగా సాధించెడి వారు. వారిలో నొక యల వాటుండెడిదట! తండ్రి కుమారుని రోజును గట్టైలతోఁ జావమోదుచు "నేనుచేయలేద"ను పలుకులను వల్లింపించెడివారు. ఇట్లొనర్చుటెందు కను కొన్నారు? వాఁడెప్పుడైన పోలీసులచేతికి దొరకిన వారి దెబ్బలు వాని శరీ రముపై పనిచేయకుండుటకు. వాఁడు దొంగతన మొప్పి కొనకుండుటకు. మన ప్రాచీనకవులకు-ముఖ్యముగా-పురాణ కవుల కీ రహస్యము జక్కఁగ దెలియును. వారెక్కడో తప్ప సూక్ష్మతరములును-గంభీరతమములును నగు భావములను మాటిమాటికిని పని గట్టికొని వ్రాయరు. అందుచే వారి వ్రాతలలో నిట్టిపట్టులు వచ్చినప్పుడు మనహృదయములధికముగ స్పందిం చును. ఆయుదారశయ్యను జేపట్టుట మన కన్నను వారికి భావతీవ్రత లేకకాదు. సరస్వతీ తత్వమైన వారిభావరసికత-సామర్థ్యము-మన మింకను తపస్సుచే సాధింపవలసిన సిద్ధి. తలఁచినచో వారు పాషాణములనుండి పీయూషమును స్రవింపఁజేయుదురు. వారియట్టి సామాన్యరచనకు గార ణము పాఠకులపైనున్నదయయే. మన కన్నను ప్రాచీనులకు మానవుల మనోధర్మములు బాగుగ దెలియును.

పైని మనవి చేసినట్లు-వ్యాసులది పక్వమైన పురాణశయ్య. తరు వాతి వారిలో నీశైలి మందగించినది. పురాణశయ్య యన్నచో-వ్యాసుఁడు శుష్కతార్కికుఁడని నాతలఁపుగాదు. ఆహృదయమున నెంతయో లాలి త్యము గలదు. ఎంతయో యావేదన యున్నది. దశమస్కంధమునందలి-శరద్రాత్రి ఘట్టము-అవమానితుఁడైన బ్రహ్మ కృష్ణపరమాత్మని వర్ణించిన పట్టు-మొదలైన సన్నివేశములు మన హృదయమును జేయివెట్టి కలఁచును. కృష్ణభగవానుని భావించినపుడా మహర్షి పసిపిల్లవానివలె, యొకానొక

ప్రియలాలసయైన నవోఢవలె మారిపోవును. వారి యీ క్రింది "భీష్మస్తుతి" శ్లోకముల దయతోఁ దిలకింపుఁడు. పవిత్రిఁడైన పోతనామాత్యుని తెనిగింపును గూఢ రుచి జూతము గాక!

ఇది వ్యాస భగవానుని శ్లోకము:—

"త్రిభువన కమనం, తమాల వర్ణం రవికర గౌరవరాంబరందధానే
వపురలక కులావృతాననాబ్జే—విజయ సఖే రతిరస్తుమేఽన వద్యా"

"త్రిజగన్మోహన నీలకాంతి తను వుద్దీపింప, ప్రాభాత నీ
రజ బంధు ప్రభమైన చేలముపయిన్ రంజిల్ల, నీలాలక
వ్రజ సంయుక్త ముఖారవింద మతి సేవ్యంబై విజృంభింప, మా
విజయుం జేరెడు వన్నెకాఁడు మది నావేశించు నెల్లప్పుడున్."

"రవికర గౌరవరాంబర" సమాసమునకు "ప్రాభాత నీరజబంధుఁ" డనుట యొక తొడవు. "గౌర" శబ్దమును ధ్వనిగా వదలుట పోతన్న మెలఁకువ. "వన్నెకాఁడ" ను మాట యీ పద్యములోని వరాలమూట. "తమాల వర్ణ"మనుట తెనిగింపులో బోయినది.

శ్లో॥ యుధి తురగ రజో విధూమ్ర విష్వ-క్కచలులిత
శ్రమవార్యలం కృతాస్యే
మమ నిశితశరై ర్విభిద్యమాన త్వచి-
విలసత్కవచేఽస్తు కృష్ణ ఆత్మా॥

"హయరింఖాముఖ ధూళి ధూసర పరి న్యస్తాలకోపేతమై
రయజాతశ్రిమ తోయబిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో
జయమున్ పార్థునకిచ్చువేడ్క నినా శస్త్రాహతిం జాల నొ
చ్చియు పోరించు మహానుభావు మదిలోఁజింతింతు నశ్రాంతమున్"

'నాదశుద్ధి' యం దిర్వురును సిద్ధహస్తులే; కాని-పోతన్నకు హాయి

రింఖాముఖ ధూళీధూసర” యనుటలో మంచి పాటు గుదిరినది. 'శ్రీమ వారి' కంటెను 'తోయబిందువులు' కృష్ణునిరూపమున కలంకారములు. భీష్ముని బాణములచే పరమసుకుమారుఁడైన వల్లవీ వల్లభుని శరీరము ఛేదింపఁబడిన దృశ్యమును భావించుట లలితుఁడైన యాంధ్రకవికిఁ గష్ట మయ్యెను. పైగా 'విలసత్కవచే' అనునది దానికి బాధకమై-వ్యాఖ్యాన సాపేక్షమైనది. పోతన్న 'బాలనొచ్చియు'నని కృష్ణున కాబాధ తొలఁగించి నాఁడు. కవచము కథ యెత్తనే లేదు. "జయముఁ బార్థున కిచ్చువేడ్క" నని హేతువును జూపి "పోరించు" అనుటలోఁ గ్రొత్త దృశ్యమును ప్రదర్శిం చెను. 'పార్థ' శబ్దమియ్యెడ చాల బాగున్నది. మూలకారులు దొడ్డ సమాసమువేసి కచములకు – శ్రమవారికిని సహభావమును గల్పించిరి తెనుగులో పాదములు విఱుగుటచే–నాస్ఫూర్తిపోయినది. 'విష్వక్'శబ్దము వర్తమానార్థకము. "విష్వంచః" ఇతస్తతశ్చలంతః అని వ్యాఖ్య. అనఁగా- భీష్ముఁడు దర్శించునపు డావెండ్రుకలు జలించుచున్న వన్నమాట. ఆస్ఫూర్తి పరిన్యస్తములో రాలేదు. 'కచ' శబ్దమునకు 'అలకల'అని వాడుట మంచి తెనిగింపు.

"సపది సఖివచో నిశమ్యమధ్యే-నిజపరయోర్బల యోర థంప్రవేశ్య
స్థితవతి, పరసైనికాయురక్ష్ణా హృతవతి, పార్థసఖేరతిర్మమాఽస్తు"

"నరుమాటల్విని నవ్వుతోనుభయసేనామధ్యమక్షోణిలో
పరు లీక్షింప రథంబు నిల్పి పరభూపాలావళిం జూపుచుం
బరభూపాయువు లెల్ల జూపులన శుంభత్కేళి వంచించు న
ప్పరమేశుండు వెలుంగుచుండెడు సుహృత్పద్మాసనాసీనుఁడై"

" నరు మాటల్విని " పోతన కృష్ణుఁడు చిఱునవ్వు నవ్వు చున్నాఁడు ."పరులీక్షింపరథంబునిల్పి" యనునది–వర్ణితమైన సన్నివేశమున కింకను మెఱుఁగు. 'పరభూపాయువు' లను జూపులచే వంచించు వాఁడు "పార్థసఖుఁడనుట కంటెను – పరమేశుఁ డనుట బాగున్నది. పరమేశుఁడు

హృత్పద్మాసనమున గాక నిలుచునదెక్కడ? శత్రువులనుటకు 'పర' శబ్దమునే మూఁడుసార్లు 'సహజ పాండిత్యుఁ' డావర్తించెను. ఈ యామ్రేడన మనధారణా స్ఫూర్తిని ధ్వనిగా దెలుపును. కాని 'స్థితవతి' పరసైని కాయు రక్షాహృతవతి యను శబ్దసిద్ధి - తెనుఁగులో నెగిరిపోయినది.

"స్వనిగమ మపహాయ మత్ప్రతిజ్ఞాం - ఋతమధికర్తుమవప్లుతో రథస్థః ।
ధృత రథ చరణోఽభ్యయాచ్చలద్గు-ర్హరిరివహంతుమిభం గతోత్తరీయః
"శితవి శిఖవతో విశీర్ణదంశః క్షతజ పరిప్లుత ఆతతాయినోమే।
ప్రసభ మభిససార మద్వధార్థః-సభవతుమే భగవాన్ గతి ర్ముకుందః॥"

ఈ రెంటికి దెనిఁగింపే పోతనామాత్యుల

సీ॥ కుప్పించి యెగసినఁ గుండలంబులకాంతి
గగనభాగం బెల్ల గప్పికొనఁగ
నుఱికిన నోర్వక నుదరంబులోనున్న
జగముల వ్రేగుకు జగతి గదలఁ
జక్రింబుఁ జేపట్టి చనుదెంచు రయమున
పైనున్న పచ్చని పటముజాఱ
నమ్మితి నాలావు నగుబాటు సేయకు
మన్నింపుమని క్రీడి మఱల దిగువఁ

తే॥ గరికి లంఘించు సింహంబు కరణిమెఱసి
నేఁడు భీష్ముని జంపుదు నిన్నుగాతు
విడువు మర్జునయనుచు మద్విశిఖవృష్టి
దెరలి చనుదెందు దేవుండు దిక్కునాకు।

యను పద్యము తెన్గుదేశమున నీ పద్యము నోటికిరాని వారుండరను కొందును. ఇందులో మొదటిపాదము "అవప్లుతః" యను దానికిఁ దెనిఁ గింపు. ఈ శబ్దములోని స్ఫూర్తిని 'కుప్పించి యెగసిన' యనుట-నిండుగాఁ

దెలుపుచున్నది. ఆ 'కుప్పించి యెగురు' నప్పుడు-గుండలములు చౌకళించి-వానికాంతి గగనమున వింతరంగు బూయుట పోతనామాత్యుల భావనయే. 'చలద్గుః' యనెడు సంస్కృతమున కాంధ్రీకరణము రెండవపాదము. మూలమునందు భూమి చలించుటకుఁ గారణములేదు. శ్రీధరు లాకొఱఁతను 'ఉదరస్థ సర్వభువన భారేణ' యని పూరించిరి. ఆ విషయమును ఆంధ్రకవి యందికొన్నాఁడు. "గతోత్తరీయః" యనుటకు 'పైనున్న పచ్చని పటము జాఱుట' తెనుఁగు. 'పచ్చని' యను విశేషణము పోతన్నదే. కృష్ణభగవానుఁడు ధరించిన యుత్తరీయ మేలజాఱినది? దీనికి సమాధానము స్పష్టముగ వ్యాసులు జెప్పలేదు. దానిని సమర్థించుట శ్రీధరులవంతు. వారి కిది చిక్కుగాఁ గన్పడినది. 'తేనైవ సంరంభేణ' యని శ్రీధరులు-తిన్నగాఁ జారుకొనిరి. ఇక పోతనామాత్యులు దానిని సవరించు కొనవలెను. ఆ 'సంరంభము' రెండవ పాదములో రానే వచ్చినది. మరల నదే జెప్పినచో-సనిగానుండదు. అందుకై- "చక్రింబు జేపట్టి" యన్నారు. ఇది- "ధృత రథచరణః"అను దానిని హేతువుగ నన్వయించుటయే. దీనితో నా యుఱుకుటకు- నీ రయమునకు భేదమేర్పడినది. భూమి చలించుటకు "వ్రేగు" హేతువు. పటము జారుటకు పరుగు కారణము. నాల్గవపాదము- అమాత్యుల స్వకపోల కల్పితము. "నేఁడు భీష్ముని......విడువు మర్జున!" యన్నమాట తెనుఁగు కవిదే. పద్యము చాల యందముగ గుదిరినది. కాని- "మత్ప్రతిజ్ఞాం ఋతమధికర్తుం" యనునది తెనుఁగున రాలేదు. రెండవ శ్లోకము- మొదటిదానితోనే గతార్థమగుటచే పోతన్న వదలిపెట్టెను.

శ్లో॥ "విజయ రథకుటుంబ ఆత్తతోత్రే-ధృతహయ రశ్మిని తచ్ఛ్రియేక్షణీయే
భగవతి రతిరస్తుమేము మూర్షోర్యమిహ నిరీక్ష్య హతాగతాస్సరూపం"

"తనకున్ భృత్యుఁడు పీనిఁగాచుట మహాధర్మంబు వొమ్మంచు న
ర్జున సారథ్యము పూని పగ్గములు చేఁ జోద్యంబుగాఁ బట్టుచున్
మునికోలన్ వడిబూన్చి ఘోటకములన్ మోదించి తాడించుచున్
జనులన్ మోహము నొందఁజేయు పరమోత్సాహుం బ్రశంసించెదన్,"

ఈ పద్యము మూలమునుండి వేఱైనది. నాల్గవ చరణములోని వైష్ణవ మతాభినివేశము పోతన్న యద్వైత భావన కడ్డువచ్చెనో? "తచ్ఛ్రియేఽస్తు ణీయే" యనునది తెన్గున రాలేదు.

శ్లో॥ లలిత గతివిలాస వల్గుహాస-ప్రణయ నిరీక్షణ కల్పితోరుమానాః
కృత మనుకృతవత్య ఉన్మదాంధాః-ప్రకృతిమగన్ కిలయస్య గోపవధ్వః

కం॥ పలుకుల నగవుల నడపుల
నలుకల నవలోకనముల నాభీరవధూ
కులముల మనముల తాలిమి
కొలుకులు వదలించు ఘనుని కొలిచెద మదిలోన్॥

ఈ పద్యములో శబ్దసౌందర్యమున నిరువురును పరాకాష్ఠ నందికొన్నారు. కాని-మూల భావమున కన్నను పోతన్న సృష్టి వేఱై పోయినది. ఒకానొక నాఁడు కృష్ణపరమాత్ముఁడు నిజమునకు మన్నుదిన్నాఁడో-లేదో కాని-బలభద్రాదులు 'తిన్నది సత్య'మని తల్లితో దూరులు జెప్పినారు. మాతృదేవి దండింపఁబోయెను. అపుడు శ్రీకృష్ణులు నోరుదెఱచిరి. అందామెకు గనపడిన దృశ్యమిది—

"సాతత్ర దదృశే విశ్వం జగత్స్థాస్నుచ ఖం దిశః
సాద్రిద్వీపాబ్ధి భూగోళం సవాయ్వగ్నీందు తారకం॥
జ్యోతిశ్చక్రం జ్వలత్తేజో వివరాణి రసాతలం
వైకారికాణీంద్రియాణి మనోమాత్రా గుణాస్త్రయః॥

(10-8)

ఈ భాగమునకుఁ దెనిగింపు—

క॥ ఆ లలితాంగి గనుంగొనె
బాలుని ముఖమందు జలధి పర్వత వన భూ

గోళ శిఖి తరణి శశి ది
క్పాలాది కరండమైన బ్రహ్మాండంబున్.
(10-పూ. 340)

యను నొక పద్యముతోనే పోతనామాత్యులు ముగించిరి. వారి స్వభావ మును బట్టి పోతన్న అట్టి ఘట్టములో యొక దొడ్డచూర్ణికను వ్రాసి పద సంపత్తితోఁ బరవళ్లు దొ్రక్కవలసియుండెను. మరి- యెందుకో-'నిమ్మకు నీరెత్తిన'ట్లయి పోయినారు. ఇంతవరకు నేనుద్ధృతీకరించిన శ్లోకములు-వాని తెనిఁగింపుతో వ్యాసుఁడు- పోతన్న సమానమైన యుద్దీలని మీకుఁ దట్టి యుండుననుకొందును. ఏదో ప్రసంగవశమున చాలదూరము నడచి వచ్చితిమి.

పోతనామాత్యుఁడు శ్రీమద్భాగవతము వ్యాసకృతమేననియు-అది మహాపురాణమేననియు నమ్మెను. దానికాతఁడు జూసిన యుపపత్తి యిది—ఈ విషయము శ్రీధరీయములోనిది.

వ॥ ఇట్లు "సత్యం పరంధీమహి" యను గాయత్రీ ప్రారంభంబున– గాయత్రీ నామ బ్రహ్మస్వరూపంబై మత్స్య పురాణములోన గాయత్రి నధిక రించి ధర్మవిస్తరంబును – వృత్రాసుర వధంబును నెందుఁ జెప్పంబడు నదియ భాగవతంబని పలుకుటం జేసి యీ పురాణంబు శ్రీమహాభాగ వతంబన నొప్పుచుండు—

(భాగ. ప్ర. స్కం. 35 వ)

పోతనామాత్యునకు "సహజ పాండిత్యుఁడు" అను బిరుదుండెను. దీనికి– "శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర" యనునదాతఁడే జేసిన వ్యాఖ్య./దీనితోఁగొందరాతఁడంత చదువుకొన్నవాఁడు గాఁడనియు-కేవలము పరమేశ్వరుని యనుగ్రహమే భాగవతాంధ్రీకరణమునకు మూల కారణమనియు—వాదింప మొదలుపెట్టినారు. భగవంతుని యనుగ్రహము లేనిది భాగవతరచన సాఁగలేదనుటలో నా యాక్షేపణము లేదు, ఇది

మాత్రమేగాదు. ఎవఁడీపని జేయఁదలఁచినను-సర్వేశ్వరుని దయలేనిది యది సాగదు. కాని-యంతమాత్రముతో పోతన్న వట్టి 'దద్దమ్మ' యనుట భగవంతునిపై-మన బాధ్యతను మఱచిన భక్తి. 'చదువు' బ్రహ్మవిద్య యంతటి కష్టము గాకపోవచ్చును. కాని - భగవద్విశ్వాసముతో మాత్రమే - రాని చదువు వచ్చుననుటకల్ల. అట్లైనచో - మా పోతులూరి వీరబ్రహ్మముగారు గూడ-ఒక యుద్గ్రంథమునే వ్రాసియుండవచ్చును. అతనికి చదువురానిది వట్టి మాటలతో శ్రీధరీయ మన్వితమగుటయు — భాగవతమువంటి ప్రౌఢ గ్రంథము అర్థమగుటయు నా యూహకందని విషయములు. నాటి మర్యాద ననుసరించి పోతన్నకు సంస్కృతమున చక్కని పాండితి యుండును. శాస్త్రబలములేని దానాఁడు సాహిత్యములేదు. ఆతని చిత్తవృత్తి కనువైన వేదాంత శాస్త్రమున గొప్ప పరిశ్రమ యొనరించి యుండును. తర్కములేనిది వేదాంతము లేదు కనుక—న్యాయ వైశేషికము లా మహాకవికి దోడుగ నుండెడివి. పోతనామాత్యుల ప్రతిభ చాల తీక్ష్ణమైయుండి యుండవలెను. వారు — గురుముఖమున జదువని విషయములలోఁ గూడ నది 'నల్లేరుపై బండిగా' సాఁగుచుండుటచేఁ జుట్టుపట్టుల నున్న వారాయనను "సహజ పాండిత్యుఁ"డని యందురు. ఈ శక్తి గొందఱి కుండును.

మొన్న మొన్న తిరుపతిలో నరకంఠీరవ శాస్త్రులవారుండిరి. వారు మహా తార్కికులు. ఇంతకును ఆయన గురుముఖమున జదివినది కొద్దియే నట! కాని—యా ప్రతిభ యప్రతిహతము. వారికడ నొక చిత్రమైన శక్తి యుండెడిది. అలంకారమున వారు — 'కావ్యప్రకాశ' మను పాఠము జెప్పుచున్నా రనుకొందము. అప్పుడాగ్రంథముపై నవీనాలంకారికు లొనర్చిన పూర్వపక్షము లెన్నియున్నవో వాని నన్నిటిని - 'సవ్యసాచి'వలె ఖండించెడి వారు. ఇట్టి కౌశల్యమే - బాలసరస్వతులు బుక్కపట్టణము శ్రీనివాసాచార్యులకు గూడ నుండెనని వినికిడి. ఇట్టి వారిని గూర్చియే భవభూతి—

శ్లో॥ వితరతి గురుః ప్రాజ్ఞే విద్యాం యథైవ తథాజడే
నచఖలు తయోః జ్ఞానే శక్తిం కరోత్యపహంతి వా

భవతి హి పునర్వ్యాయాక్ష భేదః ఫలం ప్రితితద్య థా
ప్రిభవతి శుచిర్బింబ గ్రాహీ మణిర్నమృదాదయః॥

కనుక నా బిరుదమునుబట్టి యాతనికి చదువే రాదనియు - సర్వమును పర మేశ్వరుని కరుణచేతనే యుపపన్న మయ్యెననియు వాదించుట చాల యన్యాయము. అట్లు యేకాలమునను - యెవ్వరి విషయమునను — పర మేశ్వరుని కరుణ పనిచేయదు. ఆయన దయ - పిచ్చివాని చేతి'రాయి' గాదు. నిజముగ - నట్లేయైనచో పురుషకారమునకు వెలయేదీ? పురుష కారము పనికిమాలిన దైనచో మానవజన్మమే పనికిరానిదగును. ఒకటి సత్యమై యుండును. వైరాగ్యము ముదురుకొలఁదియు- కేవలము భగవ చ్చింతనలో సక్తుఁడైన పోతనామాత్యునకు శాస్త్రవ్యాసంగమున రక్తి మందగించి యుండును. కృష్ణవిరహముతో బాధపడుచున్న చైతన్య ప్రభువు నకు - పాణిని వ్యాకరణములోని ప్రితి సూత్రమును - నారాయణపరముగ నన్వయించెడిదట! శాస్త్రముల స్వభావము మనకుఁ దెలియదు గాని - ఆ వ్యాసంగ మెఱిఁగిన పెద్దలు - ఒక దినము వల్లింపకున్న తర్కము మఱచి పోవుదురనియు - క్షణము వల్లెవేయకున్న వ్యాకరణ వాసన మిగులదనియు చెప్పుదురు. కనుక - వయసు గడచుకొలఁదియు - చదివిన శాస్త్రమాతనికి యుపస్థితిలో లేకపోయెనేమో? కాని వ్యుత్పత్తితో సానలుదీరిన సంస్కా రమే నశింపదుగదా! ఈ విషయమంతయు నాతఁడు పాపము! "జనక శిక్షిత విహితాభ్యాసుండనై" యను ముక్కతోఁ జెప్పనే చెప్పెను. శ్రీ నాథుని విషయ మిట్లుగాదు. అతని శరీరము నిండుగ "కీర్తికండూతి"యే. జీవితమనఁగా - వాదిజయములు - ప్రితిపక్షభయములు. దినదిన పరిశ్రమలేని దామహాకవి పరిస్థితి క్లిష్టమగును. పైఁగా "బహుదేశ బుధులతో భాష ణలు" విద్యాపరీక్షలు. దీనితో చదివిన చదువున కడుగడుగునను నొర పిడులు. అడుగుటచే నాతని పాండిత్యమంతయు బాగుగ నుపస్థితిలో నుండియే కావలెను. శ్రీనాథుఁడు - బాహ్యజగత్తు నంతయు బాగుగ నవలోకించెను, పోతన్న యంతర్జగత్తును మథించెను, ఆతనిది పరినిష్ఠితమైన

ప్రవృత్తి భోగము. పోతన్నది సర్వతో వికసితమైన నివృత్తిభోగము. అంతే గాని / పోతన్నకు చదువే రానిచో—

కం. కొందరికి తెనుఁగు గుణమగు
గొందరికిని సంస్కృతంబు గుణమగు రెండుఁ
గొందరికి గుణములగు నే
నందఱ మెప్పింతు గృతుల నయ్యైయెడలన్॥

అని చెప్పికొను ధైర్యమెక్కడనుండి వచ్చును! "నీ వాదమంతయు సరే నయ్యా!-మరి, యా పోతన్నయే దన గ్రంథములో

కం॥ పలికెడిది భాగవతమట
పలికించెడి వాడు రామభద్రుండట నే
పలికిన భవహర మగునట
పలికెద వేఱొండు గాథ పలుకగనేలా!

యని చెప్పెను గదా! అంతేగాక,

"అల వైకుంఠపురంబులో నగరిలో నామూల సౌధంబు దా
పల, మందార వనాంతరామృత సరఃప్రాంతేందుకాంతోపలో
త్పల పర్యంక రమావినోదియగు, నాపన్న ప్రసన్నుండు, వి
హ్వల నాగేంద్రము పాహి!పాహి! యన గుయ్యాలించి సంరంభియై॥

ఇత్యాది పద్యముల వ్రాయుఘట్టములందు రాముఁడే సాయపడెనను కథలున్నవి. ఈ గాథలన్నియు కల్లలందువా? "పలికించెడు వాఁడు రామ భద్రుండట" యని యాతఁ డన్న యనుభవము మృషావాదమా? యందు రేమో!. అవి కల్లలనియు నివి చెల్లవనియు నెవరన్నారు! "అలవైకుంఠ పురంబులో" యిత్యాది పద్యములు రామభద్రుఁడు వ్రాసెనని యనుటతో మా పని యింకను సులభమైనది. తక్కినవి పోతన్న వ్రాసెనని యొప్పు

కొన్నట్లేగదా! ఇఁక నిందులో చిక్కేమున్నది? పోగా — రెండవ పక్ష మెత్తికొందము. ఒక పోతన్నకే గాదు. సమస్తమానవులకును హృదయ పద్మమున నిలచి పలికించువాఁడు రామభద్రుఁడే!. నా నుండి యిప్పు డుప న్యాస రూపమునఁ బల్కుచున్నవాఁడు రామచంద్రుఁడే!. రేపు మీతోఁ బలి కింపఁబోవు వాఁడును వాఁడే. ఈ సత్యము మనకు నేఁడా! వేలాది వర్షముల నుండి ఋషులు చెప్పినదే. కాని — మన మీ యథార్థమును పెదవులపై మాత్రమే నిల్పికొంటిమి. పోతన్న హృదయమున జీర్ణించికొనెను. మనకు నాతనికి భేదమింతే. కాని - యిప్పుడు మనము — భావించుచున్నది వ్యావహారిక దశలో — అందుకే పరమార్థముగా — రామభద్రు డే వ్రాసి నను పోతన్న వ్రాసెనని పలుకుదుము. కేవలము జ్ఞాన దృష్టితోనైనచో తిక్కన భారతము వ్రాయలేదు. నేను చెప్పలేదు. మీరు వినలేదు. "గజము మిథ్య — పలాయనము మిథ్య."

నానా లౌకిక వేషములలో బాధపడు మనము గూడ - నప్పుడప్పుడీ మాయలో — మన స్వస్వరూపమును జ్ఞాపకము చేసికొనుటవలె గొన్ని మాటలాడుచుందుము. ఎవరైనను పెద్దలు మన యింటికి వచ్చినారను కొందము. అప్పు డౌపచారికముగ "నిది మీ యిల్లే" నందుము. వెంటనే యా పెద్ద మనుష్యుఁడు - యిల్లు తన పేరిట వ్రాసికొని చేవ్రాలుపెట్టు మని యడుగు ననుకొందము. నిమ్మళముగ సంతకము జేయుదుమా!. "పోయిరమ్మందుము". సర్వవిషయములు నింతే. పరమార్థదశలో నన్నిటికి- నందరికి అభేదమైనను — వ్యావహారిక దశలో భిన్నదృష్టి తప్పదు.

సంస్కృత భాషలో పోతన్నను గొప్పగ బ్రేమించిన వారు గొంద ఱున్నారు. భట్టబాణుని కాదంబరిపై పోతన్నకు పరమాదరము. కాదంబరి సంస్కృత భాషా సముద్రమున బయలుదేరిన గొప్ప తళ్కు. అన్ని భాషల యందును - ననేకులు దాని పలుకుఁబడితోఁ దమ వ్యక్తిత్వమును గోల్పో యిరి. మన కవిసార్వభౌముఁడు మొదలైన యుద్దండులకుఁ బట్టుగొమ్మ

యిదియే. బాణుఁడేగాక - కాళిదాసు - మాఘుఁడు - మయూరుఁడు - మొదలగు గీర్వాణ కవులెందరో పోతనామాత్యునకు నచ్చినవారు. గౌరవ పాత్రులు అన్నిటికిపైగా - వ్యాసుని రచనాప్రభావ మొకటి యుండనే యున్నదిగదా! ఆంధ్రసాహిత్యమున నన్నయ - తిక్కనలపై నందరి కవులకువలెనే పోతన్నకును ఆదరాభిమానములు. నాచనసోముఁ డాతనికి దగ్గరివాఁడు. భాస్కరుని రామాయణమును గూడ పోతన్న జదివి యుండెను. రామాయణము నాతఁడు జూచి చప్పరించి "భాస్కరుఁడు చేయివేసి చెఱచెను గాని - రామాయణమును బండ్ల కెత్తించి యుండునా" యని పల్కెనని యొక గాథ. పోతన్న చిత్తవృత్తినిబట్టి యీ ప్రవాదము - సత్యమను ధైర్యము నాకు లేదు. కాని — భాస్కరుని రచనను పోతన్న జూచి యుండు నన్నంత వఱకిది మనకుఁ బనికివచ్చును. భాగవత కవి కనుప్రాసలన్న - నమితప్రీతి. వీనిని కొంత యెక్కువగ వాడినవాఁడు భాస్కరుఁడే. సోముఁడు గూడ నడపదడప యుపయోగించినాఁడు. నాచనసోముఁడు నరకాసురవధలో సత్యభామను గొంత ప్రౌఢముగఁ జిత్రించెను. అతఁడు విద్యానగర కవి. ఆచిత్రణము పోతన్న హృదయము నాకర్షించినది. అతఁడు గూడ నట్లే యామెను - బోషించెను. ఈ సందర్భమున రెండు గ్రంథములలోని పద్యములను గొన్ని యందికొన్నట్లుండుట మన యభిప్రాయమున కింకను బలము. భారత కవులలో పోతన్న స్వభావమునకు నన్నయ నచ్చినంత యితరులు నచ్చలేదేమో!. తిక్కనామాత్యుని గుఱించి యాతఁడు "హరిహర చరణారవింద వందనాభిలాషి దిక్క మనీషిఁ భూషించి" యని మాత్రమే పలికెను. ఇట - 'మనీషి' శబ్దము సాభిప్రాయమేమో!. వీరశైవ కవులకు స్వభావమైన రజోగుణముపై నాతనికి గౌరవము లేదు. కాని - శివభక్తిపై నాసక్తి యున్నది. అందుచేఁ జిన్ననాటఁ బాలకుఱికి సోమనాథుని రచనల నెంతయో యాదరముతోఁ జదివి యుండును. కాలక్రమమున నాయాకర్షణము బోయినది.

వీరశైవముపై నభిమానము గతించి పోయినను విశ్వేశ్వరునిపై నా

కవికి భక్తి ప్రపత్తులు అణువు గూడ దగ్గలేదు. శివుని ద్వేషించు విష్ణు భక్తుఁడును - విష్ణువును ద్వేషించు శైవుఁడును యెండమావులలో నీరు వెదకువారన్న నీతి పోతన్న కెంతో ప్రియమైనది. వయసుతో గూడ నీ విశ్వాసమును బెరిగినది. రాగరాగ కృష్ణపరమాత్మయందే యాతఁడు శివావ తారమును వీక్షించి భావింప మొదలు పెట్టెను. ఇట్టివాఁడు గనుకనే - కృష్ణపరమాత్ముల బాల్య లీలలు వర్ణించుచు-

సీ॥ తనువున నంటిన ధరణీపరాగంబు
పూసిన నెఱ బూది పూతగాఁగ
ముందఱ వెలుఁగొందు ముక్తాలలామంబు
తొగల సంగడిగాని తునుకగాఁగ
ఫాల భాగంబుపైఁబరగు కావిరి బొట్టు
కాముని గెల్చిన కన్నుగాఁగ
కంఠమాలికలోని ఘననీల రత్నంబు
కమనీయమగు మెడ కప్పుగాఁగ
ఆ॥ హారవల్లులురగ హారవల్లులుగాఁగ
బాల లీల ప్రౌఢ బాలకుండు
శివుని పగిది నొప్పె శివునికిఁ దనకును
వేఱులేమి దెల్ప వెలయునట్లు"

(10. పూ. 297)

నని యెంతో యార్ద్రముగ వర్ణించి పరమ భాగవతుల ధర్మమును బ్రదర్శించెను. స్మార్తులలో నంతటి పట్టింపులేదు గాని - శ్రీవైష్ణవులలో మాత్రము శివుని బెడ దిట్టువారిని జూచి యున్నాను. తనకు భక్తి జెల్లింప కున్నను - శివుని దిట్టిన జాలును. విష్ణువు సంతోషించునని వీరి మిథ్యా జ్ఞానము. శివభక్తి యింత యున్నది గనుకనే పోతనామాత్యుఁడు యతని నెంతో యుదారునిగ జిత్రించెను. పాలసంద్రమునందు హాలాహాలము

బుట్టినది. దేవదానవులు దిక్కుతోచక - తెలమొగములు వేసినారు. వారంద రంబుజాసన పురోగములై - కైలాసమునకేగి ఖండేందు భూషు నెదుట మొఱవెట్టికొనిరి. ఆ దేవతల బాధ చూచి ప్రమథేశ్వరుఁడు ప్రాణ సతితో—

"కంటే! జగముల దుఃఖము
వింటే - జలజనిత విషము వేడిమి - ప్రభువై
యుంటకు నార్తుల యాపద
గెంటింపగ ఫలముగాదె కీర్తిమృగాక్షీ!"

"ప్రాణేచ్ఛ వచ్చి చొచ్చిన
ప్రాణుల రక్షింపవలయుఁ బ్రభువుల కెల్లన్
బ్రాణులకిత్తురు సాధులు
ప్రాణంబులు నిమిష భంగురములని మగువా!"

కం. "పరహితము సేయునెవ్వఁడు
పరమహితుండగును భూతపంచకమునకున్
బరహితమె పరమధర్మము
పరహితునకు నెదురు లేదు పర్వేందుముఖీ."

కం. "హరిమది నానందించిన
హరిణాక్షి! జగంబు లెల్ల నానందించున్
హరియును జగములు మెచ్చఁగ
గరళము వారించుటొప్పుఁ గమలదళాక్షీ!"

"శిక్షింతు హాలహలమును
భక్షింతును మధురసూక్ష్మ ఫలరసముక్రియన్
రక్షింతును బ్రాణి కోట్లను
వీక్షింపుము నీవు నేఁడు వికచాబ్జముఖీ!"

యని యెంతో గంభీరముగ - ప్రసన్నముగ - ఉదారముగ - బలికెను. ఆ పార్వతి యాతనికన్నను వెట్టి బాగులది. ఆమె—కానిమ్మన్నదట! ఈ కథా భాగమును వినుచున్న పరీక్షిత్తునకు గుండె బెదరెను. అతఁడు

మ. అమరఁ లోకహితార్థమంచు నభవుండౌగాక యంచాడెబో!
యమరుఁ భీతిని మ్రింగవే యనిరిబో! యంభోజగర్భాదులుఁ
దము గావఁ హర! లెమ్ము లెమ్మనిరివో! తాజూచి కన్గంట న
య్యుమ ప్రాణేశ్వరు నెట్లుమ్రింగుమనె నయ్యుగ్రానల జ్వాలలఁ."

(8—239)

యని ప్రశ్నించెను. అందులకు జిఱునగవుతోఁ దల పంకించి శుకయోగి.

కం. మ్రింగెడు వాఁడు విభుండని
మ్రింగెడిదియు గరళమనియు మేలని ప్రజకుఁ
మ్రింగుమనె సర్వమంగళ
మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో!

(8. 241)

యని పలికి పరీక్షిత్తుతో బాటు తానుగూడ నాశ్చర్యరసమున నోల లాడెనట! ఈ ప్రశ్నోత్తరములు పోతనామాత్యులవే! ఈ పెంపునకుఁ గారణమాతనికి శివునిపై నిగల భక్త్యతిశయమే! ఇంతేగాక—పరమశివుఁడు- హాలహాలమును 'హుమ్మ' ని యదలించి—త్రావిన వాలకమును - ఆసమయ మున నాతని నిర్వికారస్థితియు (8-244) నెంతో సమర్థముగ వర్ణించెను.

వీరశైవమునకంటె నాతనిని వైష్ణవము బాగుగ నాకర్షించెను. వేదాంత దేశికులనాటికే యాంధ్రదేశమున నాతత్వము మెల్లగానల్లుకొన నా రంభించినది. 'కోరుకొండ' వారు,'రాచగొండ' రాజులు విష్ణుభక్తులై నారు. సంగమ వంశములోని మల్లికార్జునుఁడు 'పటూరి' గురువుల ప్రేరణముచే- వైష్ణవమును స్వీకరించెను. కాని తెనుఁగుదేశమున వైష్ణవము నవలంబిం చుట బాగుగఁ బ్రచారములోనికి వచ్చినది, 'యహోబిలమఠము' పాదుకొని

తాతయ్య పీఠము వెట్టిన పిదపనే. అంతయైనను - నాటి జనుల కందులో ముష్కరత లేదు. విజయనగరరాజులలో 'నారవీటి' వారొక్కరే వైష్ణవము నందు వీరత్వమును స్వీకరించిరి. పోతన్న వైష్ణవుఁడుగా మారలేదు. అప్పటికాసంప్రదాయము బహుళముగ తెనుఁగు దేశమున వచ్చినదిగాదంటిని. ఇంతకు నాతఁడు చక్కని యద్వైతి. పోతన్న తల్లి దండ్రులకు మాత్రము శైవమందు గాఢ-తాత్పర్యము. అతని తండ్రి కేసన 'శైవశాస్త్ర మతము' గన్నవాఁడు. అన్నయైన తిప్పన్న 'ఈశ్వరసేవాకాముఁడు' తాను 'సాధునయయుక్తుఁడట! తండ్రి తాతల శైవముపై నాతనికి మనసు బోకుండుటకుఁ గారణమేమో! ముఖ్య కారణమాతనికి జన్మసంస్కారమైనను కొన్ని చారిత్రక కారణములుగూడ లేకపోలేదు. ప్రతాప రుద్రుని కాలమున వీరశైవులు జైనులు, బ్రాహ్మణులు, వీరు జేసిన గోలయింతంత గాదు. మూర్ఖములైన వీరి మతకక్షలే యాసామ్రాజ్య నాశనమునకు గారణములని కొందరు చారిత్రకులయూహ. నాటి మతోన్మాదుల వీరవిహారము లన్నియు — పోతనామాత్యుని చెవులలోఁ బడియుండును. పాలకురికి సోమనాథుని ద్విపద లెంత యాకర్షించినను - ఆతఁడు వర్ణించిన కథలు మాత్రము—పోతన్న చిత్తవృత్తికి భయంకరములైనవే. దీనితో రజోగుణ ప్రధానమైన శైవముపై-గాల క్రమమున నాతని కభిమానము పోయె ననుటలోఁ జిత్రములేదు. తల్లియైన లక్కసాని యన్న పోతన్నకు మిగుల మక్కువ యేమో! కొడుకులలో కడగొట్టు వానిపై కన్న తల్లికి మమత యెక్కువట! ఆమె నాతఁడు రెండు పద్యములలో పొగడెను.

పోతన్న రచించిన యితర గ్రంథములు 'భోగినీదండకము', 'వీరభద్ర విజయము' అనునవి. నారాయణ శతకము గూడ నొకటి గలదు. వీనిలో భోగినీదండకము పోతన్న వ్రాసిన దనుట నిర్వివాదాంశము. నారాయణ శతకమును పోతనామాత్యునిదే యైయుండును. వీరభద్ర విజయము ఆతనిదా! కాదా! యనుటలో నభిప్రాయభేదములు గలవు.

భాగవత మాతని జన్మతపస్సని ముందే మనవిజేసితిని. పరమ పవిత్ర మైన యీభాషాంతరీకరణముకై - మూలభాగవతము నాతఁడు-కొన్ని నూఱుల తడవలు—జదివెను. ప్రతిరోజును భాగవత మాతనికి పారాయణ గ్రంథమై యుండునని నాయూహ! ఇది చాలక-తీరిక గలయపుడెల్లను-వ్యాఖ్యానమును మథించెను. సందేహములు గల్గినచోట యనుభవరసికుల నడిగి తెలిసికొనెను. వారు జెప్పిన విషయములను—యేకాంతమున జిలికి చిలికి-నిగ్గుదేల్చికొనెను. భాగవతమంతయు నామహామహునకు గంఠస్థమై యుండెననుటలో - అణువుసందేహములేదు. నారాయణావతారుఁడైన వ్యాసభగవానుఁ డాపవిత్రునకు-'కనుమూసిన యప్పుడు-విచ్చునపుడు-దరిసె నమొసఁగు చుండెను. ఇంతగా - భాగవతమును సుశోధించి, సాధించి నప్పుడు-ఆ ధర్మములు పోతన్న జీవితములో-పాదుకొని యుండవనుట-నమ్మరానిమాట! కనుక భాగవత రచననుసరించియే-యాతని చిత్తవృత్తు లను-బాహ్యా జీవితమును-ఊహింపయత్నించుటబాగు.

పోతనామాత్యుఁడు చల్లని గృహస్థుఁడు. ఆతనియింటిలో కంటి కింపైన తులసీ బృందావనము-బ్రాహ్మణులన్నచో నాతని కెంత భక్తియో, గోవులపై కూడ నంత భక్తి కద్దు. ఆతఁ డొనర్చు నిత్యకృత్యములలో గోపూజయు నొకటి. పోతన్నకుగల ఈ బ్రాహ్మణభక్తి-యితర వర్ణములపై నాయనకుగల యాదరమున కడ్డు రాలేదు. జన్మచేతనే బ్రాహ్మణుఁడు. పరమ పవిత్రుఁడు-యితర వర్ణములలో గుణవంతులున్నను-వారు గౌరవము నకుఁ బాత్రులుగారను శుష్కమైన యభిప్రాయముపై పోతన్నకు కన్ను లేదు. ఏ జాతివాఁడైనను సాధువు-భగవద్భక్తుఁడు-ఉత్తముఁడని యామహా కవి విశ్వసించెను. ఆతనియింటిలో గోవులతోపాటు-పరమేశ్వరుని నందివంటి వృషభ సంతానము గూడ నుండెడిది. ఆగోవులను-అవృషభములను జూచి నపుడంతయు-కృష్ణపరమాత్మునకు వానిపైగల యవ్యాజాను రాగము ఆయన మనస్సులో మెఱుపువలె మెరసెడి దేమో! "మానవునకు సుఖదుఃఖ ములు, తాను తాను ముందు జేసికొన్న పుణ్యా పాపముల ననుసరించి

వచ్చును. ధనము-ఆలు-బిడ్డలు-వీరందఱుగూడ తనకర్మ పండించికొన్నపం టయే! వీరిలో నెవ్వరినిగాని వదలిపోవుటకు తన కధికారములేదు. అవసర మునులేదు." ఇట్టిది యాతని విశ్వాసము. అందుచే "యిల్లు గుల్ల జేసి-యే చెట్టుగుట్టలనో జేరి-దేబిరించుట-వల్లమాలిన పని యనియు" నతఁడు భావిం చెను. ఆతని దృష్టిలో సంసారము-భగవద్భక్తికి-భంజకము గాదు-రంజకము గూడ! కామక్రోధాదులను సంపూర్ణముగ విసర్జించుటయే ధ్యేయమైనను హఠాత్తుగ వానిపై దండెత్తక-కొంతనియమబద్ధములుగ జేసికొనుటయు-ఆ ప్రక్రియలో కొంత వానిబలము సడలించి-నిమ్మళముగ నిగ్రహించు టయు వివేకమైన ప్రయత్నముగదా! పైగా సన్యాస మొక్కటే-భగ వత్ప్రాప్తికి మూలమనుటయు పోతన్నకంత సమ్మతముగాదు. "సర్వమును భగవత్స్వరూపమే యైనపుడు-సంసారము మాత్ర మేల కాక పోవలసి వచ్చినది? అపుడు-లేని సన్యాసమునుదలపోసి యంగలార్చుటకంటె-ఉన్న సంసారమున నూఱట యెందుకు జెందరాదు? "కర్మతంత్రముల నొనర్చుచు కమలాతు గొల్చుట, అసాధ్యమా? సాధ్యాసాధ్యములు మనోభావములే" ఇవి యాతనితలఁపులు - ప్రాప్తమైన సంసార సుఖములను గూడనతఁడు-తృప్తిగ ననుభవించియుండునని నాయూహ! కొందఱు వేదాంతుల మను కొనువారు-స్త్రీని జూచిననే భయపడినట్లు నటింతురు. మీరాకాలమున నిట్టి సన్నివేశమే యొకటి జరిగినది. ఎవరోయొక గోస్వామి-రూప గోస్వామి యనుకొందును-బృందావనమందుండెను. మీరాబాయి-వారిని దరిసింపనేగి నది. వారికొక నియమముండెను. స్త్రీల ముఖమును వారు జూడరట! వారి శిష్యుఁడు-దారిలో నామెనడ్డి-మఠములోనికిఁ బోనివ్వక పోయెను. ఆమెశిష్యుని మాటలువిని 'నేనింతవఱకు నఖండ బ్రహ్మాండములలో కృష్ణ పరమాత్ముఁడొకఁడే మగవాఁ డనుకొనియుంటిని. నేటికి మీ గురు వొకఁడు దయారయ్యెనా?"యని నవ్వుచు వెనుదిరిగినది. ఈ మాటలు-రూప గోస్వా మికిఁదెలిసి-పశ్చాత్తాపపడెనట! స్త్రీలపైనిట్టి యేహ్యాభావము-సుఖములపై శుష్కమైన ద్వేషము-పోతనామాత్యులకు లేదు, కనుకనే

కం॥ అనఘు విరక్తుల కిన్నీ
దనయంత లభించుసౌఖ్యతతి వర్ణింపన్
జనదట!......... (తృ. స్క. 783 ప)

అని తన మనస్సును సమాధాన పెట్టుకొన్నాఁడు. చక్కని గృహస్తున కుండవలసిన గుణములన్నియు నాతని కున్నవి. అతిథి పూజ ఆమహాకవికి ప్రాణముతో సమానమైనది. ఆయాదరమునకు పోతన్న దృష్టిలో నీయాజాతిలేదు. భగవంతుఁడు విశ్వాత్ముఁడన్న సత్యము అతని నరనరమునను జీర్ణించినది. అన్ని దానములకంటెను-అన్నదాన మాతనికి-చాలప్రియమైనది. నిజమే! ధనములిచ్చి యతిథినితృప్తిపఱచుట యసాధ్యము. అన్నము బెట్టి యెట్టివానినైనను "దృప్తిపడినా"నని పింపవచ్చును. అందుకే యట్టి ఘట్టములు వచ్చినపుడు పోతన్న యెంతయో సానుభూతితో వర్ణించును రాజవంశోత్తముఁడైన రంతిదేవుఁడు తపస్సు జేయుచుండెను. అతఁడు నలువది యెనిమిది దినములు నిరుపాసమొనర్చినాఁడు. మఱుదినమునఁ గొంత యన్నము దినసంకల్పించెను. తొలుత నొక బ్రాహ్మణుఁడు వచ్చి యాచించినాఁడు. కలిగిన యన్నములో రంతిదేవుఁడు సగమాతనికిచ్చెను. మఱియొక శూద్రుఁడు వచ్చినాఁడు. ఆరాజు మిగిలిన యన్నములో నొక భాగమిచ్చెను. ఇంతలో వేఱొక్కఁడు కుక్కల గుంపుతోఁ గూడవచ్చి యన్నమడిగెను. రంతిదేవుఁ డణుమాత్రమైనను విసిగి కొన్నవాఁడుగాడు. అన్న శేషమిచ్చి 'సన్నయము' లాడిపంపెనట! అంతతో పరీక్ష దీరిపోలేదు. మంచి నీళ్ళు మిగిలినవి. వానినైనను ద్రావుదమని రంతిదేవుఁడు తయారయ్యెను. ఇంతలో నొక చండాలుఁడు సాక్షాత్కరించినాఁడు. వాఁడనెను;

కం॥ హీనుఁడ చండాలుండను
మానవ కులనాథ! దప్పిమానదు, నవలన్
బో నేర, నీకు జిక్కిన
పానీయము నాకుఁ బోసి బ్రతికింప గదే!

ఈ మాటలు విన్న రాజు హృదయము దయారసముతోఁ బొంగి పోయినది. అతఁడెంతో యాదరముతో-

ఉ॥ అన్నములేదు కొన్ని మధురాంబువులున్నవి, త్రావుమన్న! రా
వన్న! శరీరధారులకు నాపద వచ్చిన వారి యాపదల్
గ్రన్నన మాన్చి వారికి సుఖంబులు చేయుటకన్న నొండు మే
లున్నదె! నాకుదిక్కు పురుషోత్తముఁ డొక్కఁడ సుమ్ము పుల్కసా!
(న. స్క. 647)

అని పలికి—

మ॥ బలవంతంబగు నీరు వట్టున నిజప్రాణాంతమై యున్నచో
నలయండేమియు వీని హృజ్జ్వరము నాయాసంబు ఖేదంబునా
జలదానంబున నేఁడు మానుననుచున్ సర్వేశ్వరాధీనుఁడై
జలమున్ బోసెను రంతిదేవుఁడు దయన్ చండాల పాత్రంబునన్.

ఈ సన్నివేశము నింత మధురముగా పోతన్న వర్ణించుటకుఁ గారణము - ఆ గుణముపై నాతనికి గొప్ప సానుభూతి యుండుటయే!

తన కాంతపై నెంత మక్కువయో పరకాంతలన్న నాతనికంత భయము. స్వర్గము - నరకము - పాపము - పుణ్యము - మొదలైన వన్నియు నాతఁడు నమ్మెను. పాపము వినాశ హేతువనియు - పుణ్యమభ్యుదయ కారణమనియు పోతన్న విశ్వాసము. కౌరవు లోడిపోవుటకు కారణము - ఇతరము లెన్ని యున్నను - "పాంచాలీ కబరీ వికర్షణ మహాపాపమే" ముఖ్యమైనదట! బ్రాహ్మణులు వారి ధర్మమునుండి తొలఁగినను సరే - యితరులు వారి నగౌరవపరుపరాదనియు పోతన్న విశ్వసించెను. 'నీ ధర్మమున నీవులేవు గనుక - నా ధర్మము నాకు లేదను'పోటీ యా సాత్వికునకుగిట్టదు. ధర్మము వినిమయ రూపమైన లౌకిక పదార్థముల వంటిదిగాదని యాతని తలఁపు, ప్రాప్తమైన దానితో తృప్తిపడుటయు,

రాని దానికి వేకారకుండుటయు - పోతన నైజగుణములు. ధనముచేత మదము గల్గుననుట పోతన్న యితరులను జూచి నేర్చుకొన్న నీతి. అందుచే నాతఁడు - అర్థమునకై వారి నాశ్రయించుట - అమర్యాదకరమను భావమును వయసుతోఁబాటు బాగుగ బెంచికొన్నాఁడు. మఱి ధనికుల నాశ్రయింపకున్నచో మన బ్రతుకు లీడేరుటెట్లు? ఈ ప్రశ్న కాతఁడు చక్కని యుపాయమును జెప్పెను. అది యిది.

సీ॥ కమనీయ భూమి భాగములు లేకున్న వే
పడియుండుటకు దూదిపరపులేల?
సహజంబులను కరాంజలులు లేకున్న వే
భోజన భాజన పుంజమేల?
వల్కలాజినకుశావళులు లేకున్న వే
కట్ట దుకూల సంఘంబులేల?
కొనికొని వసియింప గుహలు లేకున్న వే
ప్రాసాద సౌధాది పటలమేల?
తే॥ ఫలరసాదుల గురియవే పాదపములు!
సాధుజలముల నుండవే సకల నదులు!
పొసఁగ భిక్షము వెట్టరే పుణ్యసతులు!
ధనమదాంధుల కొలువేల తాపసులకు!

ఇది యపాయములేని యుపాయమే! కాని యిట్లు బ్రతుకుటకు యాత్మశక్తి గావలెను. మనవంటి వారి కీబ్రదుకందని మ్రానిపండ్ల కట్టులు సాఁచుట వంటిది. అందుకే - అహోరాత్రములు ధనికులు - అధికారులు - వీరి పంచలుగాచి - వారి తిట్లు దీవనలుగా - చీదరింపులు శృంగారములుఁగా - బ్రదుకవలసిన దౌర్భాగ్య మేర్పడినది. కడకు మనస్థితి యెక్కడకు వచ్చినదనఁగా "పైపద్యమున చెప్పినట్లు బ్రదికిన వారుండిరి" - అని యెవరైన అన్నను "ఆ! యివియన్నియు కట్టుకథలు లెమ్మ"ని చప్పరించి వేయు

షము. ఇట్టి విశ్వాసముగలవాఁడు గనుకనే ఆనాఁడు పోతన్న యితర బ్రాహ్మణులవలె పౌరోహిత్యము సేయుట - హిరణ్య దానములు పుచ్చుకొనుట - యిటువంటి పనులకుఁ దయారై యుండఁడు. ఈ యభిప్రాయమునే యాతఁడు శృంగి కథలో—

ఉ. ఆడఁడు తన్ను దూషణము లాశ్రమవాసులగాని వైరులన్,
గూడఁడు, కందమూలములు గూడు గదించు సమాధి నిష్ఠుఁడై
వీడఁడు లోని చూడ్కులను, విష్ణునిదక్క పరప్రపంచమున్
చూడఁడు, మద్గురుండు - ఫణిఁ జుట్టగ నేటికి రాచవానికిన్॥

ఉ. పోము హిరణ్యదానములఁ బుచ్చికొనంగ, ఫలంబు లేమియున్
దేము సవంచనంబులుగ, దీవనలిచ్చుచు వేసరింపఁగా
రాము, వనంబులన్ గృహవిరాములమై నివసింపజెల్లరే!
పామును వైవఁగాఁ దగునె బ్రహ్మమునీంద్రు భుజాగ్రళంబునన్॥

అను పద్యములచేత సూచించెను. ఈ రెండును పోతన్న సొంతముగఁ జెప్పినవే! నాటి రాజులను జూచినను, - ఆతనికంత యాదరములేదు. వారొనర్చుచుండిన యక్రమములు - ఆ నియమశీలి హృదయమును బాకులవలె బాధించుచుండినవి. ఈ వేదననే యాతఁడు ధ్వనిఁగా—

"పుడమిగల జనులు వొగడఁగ
గుడుతురు కట్టుదురుగాక కువలయపతులై
అడవుల నిడుమల బడియెడి
బడుగుల మెడనిడగఁ దగునె పన్నగశవమున్॥

(ప్ర. స్క. 469)

అను పద్యముచేత నిరూపించెను. "బలవంతపు దైవమును" యింత గాఢముగ నాతఁడు నమ్మినను - పురుషకారముపై గూడ నాతనికిఁ బట్టుదల కద్దు. మానవుని శక్తి యెంత పరిమితమైనను అది పూర్తిగఁ దృణీకరింపఁ

దగినదిగాదని - పోతన్న తలంపు. పురుషకారము సర్వకాలములయందును జయించి తీరుననుటకు వీలులేదుగదా! దానికి జయములకంటె పరాజయములే యెక్కువ. కనుక - ఆ గెలుపునకును - యీ యోటమికిని వెరుగక - తరుగక - ప్రయత్నము నిరంతరము చేయుచుండుటయే మానవజన్మ సాధింపవలసిన గొప్ప యోగము. దీనిపై యాతనికి సంపూర్ణ విశ్వాసముండెను. జయము లపజయములు - సంపదలాపదలు - అనిలచలితదీపికాంచలములని వాని వెల నాతఁడు స్పష్టముగఁ దేల్చివేసికొన్నాఁడు. మానవుఁడు ప్రపంచమున జన్మనెత్తినందులకు వాఁడు సాధింపవలసిన ప్రధాన పురుషార్థము జన్మరాహిత్యమే! అనఁగా మోక్షమన్న మాట! అందుకై వాఁడు చేతులారంగ శివపూజ చేయవలెను. "నోరు నొప్పిబుట్టినను విడువక హరికీర్తిని నుడువవలెనట! ధర్మార్థ కామమోక్షము లను చతుర్విధపురుషార్థములలో — మొదటి మూటికి - పోతన్న దృష్టిలో దమ్మిడీ వెలలేదు. "అన్నియును పురుషార్థములేగదా! మొదటి మూఁడింటికిని లేని ప్రాధాన్యము-నాల్గవదానికి మాత్ర మెక్కడనుండి వచ్చినది? మానవుఁడన్నిటిని సమగ్రముగ సాధింపవలెనేగాని — పుట్టినప్పటినుండి "ముక్తి ముక్తి" యని దానినే పట్టుకొని వ్రేలాడినచో రక్తి యేమున్నది? 'ముక్తి' యనగా - జన్మరాహిత్యమనియే గదా వ్యాఖ్య! అనంతమైన యీ జగల్లీలలో పాల్గొనక ప్రాణి ముక్తినొంది - మూలకూర్చొని యేమి సేయును? మాటిమాటికిని ప్రపంచమున బుట్టి సుఖము - దుఃఖము మొదలగు ద్వంద్వముల ననుభవించుటలోనే గదా యానందమున్నది? ఈ మొదలగు వాదములకు పోతనామాత్యుఁడేమియు ప్రత్యుత్తర మొసఁగఁడు. ధర్మార్థ కామమోక్షములలో దేని నెక్కువగ మానవుఁ డాదరించినను — నది తౌల్యమేనని చాణక్యుఁడు స్పష్టముగఁ జెప్పెను. ఆతనిది సామాజికదృష్టి. ఇట్టి వాదముల్పై మన కవికి సానుభూతిలేదు. జన్మరాహిత్యమును సాధింపక కేవలము — ఉదరపూజయే పరమార్థముఁగ మరగినవాని పుట్టుక - పోతన్న దృష్టిలో తల్లుల కడుపుచేటు. ఇతర విషయములలో వారెంత గొప్పవారయినను పుండరీ

కాదు నెఱుఁగనివారందరిని పోతన్న — లేని రెండు కాళ్ళను పూరించి పశువులగుంపులోనే జేర్చెను. (ద్వి. 49). అతఁడు చేపట్టిన యీ జన్మ రాహిత్య సిద్ధాంతము కొందఱికి సంకుచితముగఁ దోఁపవచ్చును. "పోతన్న వంటివాఁడు ఇతరుల క్షేమము నే మాత్రము గమనింపక తన ముక్తిని మాత్రము వెదకికొని వెళ్ళిపోవుట యేమంత బాగుగలేదు. ఇది తన కాళ్ళకుఁ దాను మ్రొక్కుకొనుట వంటిది" అని యడుగుదురేమో! కాని మానవతత్వములో - ఎవరెన్ని జెప్పినను - స్వార్థములేనిది పరార్థములేదు. స్వయంతీర్ణః పరాన్ తారయతి యనుమాట పరమసత్యము "తాను-తనది - తనకు" అను నీభావములు పైకెంత సంకుచితములుగ కనుపించినను యవియే మహాకార్యములను సాధించి - తమకును - తమతోడివారికిని - క్షేమమును గల్పించినవి. ప్రాచీనకాలమున నీ భావమున్నవారే మహా కార్యములఁ జేసినవారు, చేయించినవారు పూర్వకాలముననే గాదు! నేఁడు గూడ నంతే! ప్రాతఃకాలమున బావులో - సత్రములో గట్టించినచో పుణ్యమో - కీర్తియో వచ్చునని - వానిని నిర్మించుచుండిరి. నేఁడు 'రావు బహదూరో', 'రావుసాహేబో' పేరు వెనకతగిలించుకొనవచ్చునని జేయు ధుము. ఆశలో తేడాయున్నను - మూలధర్మమే మో యొకటే! ఈజన్మ రాహిత్యమునకు మార్గమేది? దీనికొక్కటే మందు. శ్రీ మహావిష్ణువు పాదములను ప్రపన్నుఁడై సేవించుట ఇతర దేవతలు త్రిగుణములకు లోఁబడినవారు. వారిని సేవించినచో బలము - అధికారము - మొదలగు ఫలములను బడయవచ్చునేగాని - ముక్తి నొసఁగుటకు మాత్రము వారికి - పోతన్న దృష్టిలో - నధికారములేదు. విష్ణువు త్రిగుణాతీతుఁడు. అతఁ డొక్కఁడే భక్తులకు ముక్తి నొసఁగుట కధికారి. అందుచే - యెయ్యది పొందరాదు - అట్టి మేలు సిద్ధించుటకు హరిభజన సేయవలయునట! ఇతర దేవతలందరును విశ్వమయతలేనివారు. వైయక్తికమైన యభిమానము గలవారు. విష్ణువున కివియేవియులేవు. అందుకే యితఁడు విశ్వమయుఁడు. శ్రీమన్నారాయణుని సేవించు భక్తుఁడుగూడ త్రిగుణాతీతుఁడు గావలెను.

కనుక విష్ణుభక్తులెల్లరును - దయ - శాంతి - దాంతి మొదలగు సాత్విక గుణములను అలవాటు జేసికొందురు. ఆ పిదప వానిని గూడ వదలి వేయుదురట! ఈ గుణములపై పోతన్న కభిమాన మెక్కువ. అందుకే యిట్టి భాగవత ధర్మములను వివరింపవలసి వచ్చినపుడు - ఆ సన్నివేశములతో నాతఁడెంతయో యాత్మీయతను గల్పించికొనును. "సుదాసుఁ"డను నొక మహారాజుండెను. ఆతనికడకు వసిష్ఠుఁ డొకనాఁడు దయచేసినాఁడు. అతని నాతిథ్యమునకై సుదాసుఁ డాహ్వానించెను. వశిష్ఠుఁడంగీకరించెను. అంతకు ముందొకసారి సుదాసుఁడు వేఁటకుబోయి యొక రక్కసుని జంపి యుండెను. వానితమ్మునిని - ఆ మహారాజు కరుణించి వదలివేసెను. అన్నను జంపిన సుదాసునిపై యా రాక్షసునికి పగ. కపటోపాయమున వాఁడు దానిని సాధింపనెంచెను. వాఁడు మాఱువేషమున సుదాసునింట వంటలవాఁడై కొల్చుచుండెను. వశిష్ఠుఁడు వచ్చినాఁడు. ఆ వంటవాఁడు సుదాసుని కనుగప్పి మనుష్యమాంసమును వండి వశిష్ఠునకు బెట్టెను. దానితో వశిష్ఠుఁ డుగ్రుఁడైపోయి - తప్పు రాజుదేనని నిర్ణయించికొని "నీవు పండ్రెండేండ్లు రాక్షసుఁడవుగ"మ్మని శాపమిచ్చెను. సుదాసునకు తాత్కాలికముగఁ గోపము వచ్చినది. ఆ కథను పోతన్న యిట్లు జెప్పినాఁడు.

మ॥ గురువుల్ మారు శపింతునంచు జలముల్ గోపంబుతో దోయిటన్
నరనాథుండు ధరింపఁ, దత్సతిపతిన్ వారింప, మిన్నున్ దిశల్
ధరయున్ జీవమయంబకా నిఖిలమున్ దాఁజూచి చల్లెన్ ధరా
వరుఁ డాత్మీయ పదంబులన్ కరపుటీవాఃపూరమున్ మ్రొక్కుచున్.

ఇట పోతన్న కథనే జెప్పెను. కథను జెప్పినను సుదాసుఁడప్పుడు పట్టిన శాంతి యాతని కెంతయో ప్రియమనుట - ఈ పద్యము నడకయే దెలుపుచున్నది. ఇంతకన్న స్పష్టముగ యిట్టి సన్నివేశము చిత్రకేతుని కథలో వచ్చును. చిత్రకేతుఁడు విష్ణుభక్తుఁడు. అతఁడొకసారి హిమాలయ ప్రాంత

ముల నేగుచుండెను. అక్కడ నొకచోట పార్వతీపరమేశ్వరుల నిండుకొలువు- కన్నుల పండువుగఁ గన్పించినదట! ఆ కొల్వులో - భవానిని గౌఁగిటం జేర్చికొని పరమశివుఁడు గూర్చొని యుండెను. ఆ దృశ్యమును జూచినదే తడవు చిత్రకేతుఁడు పకపకమని నవ్వినాఁడు. పరమశివుఁడు ప్రాకృతునివలె నిర్లజ్జుఁడై నలుగురిలో పార్వతిని - యెంత పెండ్లామైనను - కౌగిలించి కొని కూర్చుండుట చిత్రకేతునకు గిట్టలేదు. వాని నగవు జూచి పార్వతికిఁ గోపమువచ్చినది. "నీవు రాక్షసయోనియందు జన్మింపు"మని యామె, ఘోర మైన శాపమిచ్చెను. వెంటనే వాఁడు విమానమునుండి దిగి - పార్వతీ పర మేశ్వరులకు నమస్కరించి - తన దారిని బోయినాఁడు. వాఁడు పోయిన వెనుక పరమశివుఁడు పార్వతితో నన్నాఁడట. "దృష్టంబయ్యెగదా! నారా యణ దాసదాసాను చరుల నిస్పృహాభావంబు? హరితుల్యార్థదర్శనులైన నిస్పృహులైన భాగవతులకు స్వర్గాపవర్గనరక భేదభావంబులు లేవు. ప్రాణు లకు దేహసంయోగంబు వలన నారాయణ లీలం జేసియుండి ద్వంద్వాది సుఖదుఃఖములాత్మయందు నజ్ఞానంబున భేదంబు సేయఁబడియె, ఇట్టి విపర్య యంబుభగవంతుండయిన వాసుదేవుని భక్తి గలవారిం జెందవు, మరియును-

ఉ॥ "నేను గుమారనారదులు నీరజగర్భుఁడు దేవసంఘముల్
మానితయోగివర్య మునిమండల మిట్లగువారమందఱుల్
దానవ విద్విడంశ జనితంబులమయ్యుఁ దదీయతత్త్వముం
గానఁగనేర మీశు ఘనగర్భమునం దలపోసి చూచుచున్."

క॥ "ఆతనికిం బ్రియుఁ డప్రియుఁ
డే తెఱఁగునలేఁడు నిఖిల మెల్లను దానై
భూతముల కాత్మయగుటయు
భూతప్రియుఁ డొక్క డాదిపురుషుఁడు తన్వీ."

ఆ. వె॥ "అరయఁ జిత్రకేతుఁ డతిశాంతుఁ డతిలోక
సముఁడు విష్ణుభక్తిసంగతుండు

నీతని నేమి సెప్ప! నీశుండనగు నేను
నువిద! యచ్యుత ప్రియుండ జుమ్మి."

క॥ "కావున భగవద్భక్తుల
భావమునకు విస్మయంబు పనిలేదు మహా
ధీవిభవ శాంతచిత్తులు
పావన పరతత్వనిపుణ భవ్యులు వారల్."

ఈ కథలన్నియు పోతనామాత్యుఁడెన్ని సారులు జదివెనో యెరుఁగము. అందుచే నాతని జీవితమున నీగుణములన్నియు నైజములైనవి. అన్ని మాయలకంటెను-వైష్ణవమాయా ప్రభావము చాల గొప్పది. తక్కిన మాయలన్నియు నీమాయకు క్రిందే! దీని యాజ్ఞను దాటుటకు దేవేంద్రాదులకును సాధ్యముగాదు. యశోదాదేవి—యీమాయకు జిక్కి కృష్ణపరమాత్మని కేవలము తన కొడుకని భావించినది. విశ్వరూపమును బొందిస వెంటనే యామెకు ప్రజ్ఞగలిగెను. ఆ యశోద కృష్ణుని పరమాత్మునిగ స్తుతింప మొదలు వెట్టెను. తన యవతార కార్యమునకు భంగమువచ్చునేమోనని కృష్ణునకు భయమయ్యెను. అందుకై యాతఁడు వైష్ణవమాయను బొందించినాఁడట! వెంటనే యామె:

క॥ "జడను పడి, యెఱుక సెడి, యా
పడతుక సర్వాత్ముఁ డనుచు పలుకక, యతనిఁ
గొడుకని తొడపై నిడికొని
కడువేడుకతోడ మమతగావించినదట!

(ద. 348)

అందరికన్నను యెక్కువగ వైష్ణవ మాయతో దెబ్బ దిన్నవాఁడు పరమశివుఁడు. దేవరాక్షసుల కమృతమును పంచుటకయి హరి మోహిన్యవతార మెత్తినాఁడు. అమృతమును సాధించి దేవతలకొసఁగెను. ఈసమాచారము పరమ శివునకు తెలిసినది. అతఁడు విష్ణుమూర్తి యొక్క "మగ

పోఁడుములే" గాని "యాఁడు చంపంబు" నంతవరకుఁ జూచినది లేదట! ఆస్వరూపమును జూతమని యాతని కౌతుకము. "మగవాఁడై జగములను దగిలిచి చిక్కులను బెట్టుదంట మగువ తనము ధరించినచో నీ జగములెట్ల గునో? చూడవలె" ననుకొని శ్రీమహా విష్ణువును ప్రార్థించినాఁడట! అపుడు విష్ణువు భావగంభీరమగు నవ్వునివ్వటిల్ల వామదేవునితో నిట్లనెను.

శా॥ శ్రీకంఠా! నినునీవ యేమఱకుమీ! చిత్తంబు రంజించెదన్
నాకద్వేషుల డాగురించుటకునై నాఁడేను గైకొన్న కాం
తాకారంబు జగన్నిమజ్జనము, నీకై చూచెదే, చూపెదన్
గైకో నర్హములందు రీ కాముకులు సంకల్ప ప్రభావంబునన్.
(6. 391)

అంతే! కమలలోచనుఁడు మఱి లేఁడు. ఉమాసహితుఁడైన భవుఁడు విష్ణుఁ డెట బోయెనోయని దిక్కులు జూచుచున్నాఁడు. ఎదుట నొక స్త్రీ మూర్తి గనుపడినది. పరమశివుని కిక మతిబోయినది. పార్వతి యెదుట నున్నది గూడ మఱచి-యా మగవాఁడు-మగువ వెంటఁబడెను. పార్వతి యపు డెట్లయ్యెనో-యేమనెనో కవి చెప్పలేదు. పోతన్న పార్వతి మంచిది పాపము! శివుఁడు వెంటఁబడి మోహినిని బట్టుకొనెను. ఏమున్నది? విష్ణువు పకపక నవ్వెను. అట్టిది వైష్ణవమాయ!

దురంతమైన యీ వైష్ణవమాయ దాటనిది ముక్తిలేదుగదా! మరి దీనిని తరించుట కుపాయము? ఉపాయ మాతనిదయయే! ఆయన దయ కలుగుటకు మార్గము? మార్గ మొక్కటే! శరణాగతి! జ్ఞానము-మొదలగు మార్గాంతరములపై పోతన్నకు-గౌరవమేమోగాని-అనుసరింతమను ఆశ లేదు. అవి యపాయకరములైనవని గూడ యాతని భావము. అందుచే-

క॥ "ఎఱిఁగిన వారలమనుచును
కొఱమాలిన యెఱుకలెఱిఁగి కొందరు నీపే

రెఱఁగియు దలపఁగ నొల్లరు
పఱతురథో గతులజాడ పద్మదళాక్షా"

(ద. స్క. 94)

అని హృదయమును వివరించి పలికెను. యమము–నియమము - మొదలగు యోగములందు గూడ పోతన్నకు శ్రద్ధ తక్కువ. వీనిచేత బల వంతముగ నియంత్రితమైన యాత్మ శాంతి వహింపదట! మరలమరల కామ రోషములచేత ప్రచోదితమే (ప్ర. స్కం. 132) యగునట! భగవద్భజన మొక్కటే వైష్ణవ మాయను తరించుటకు నిజమై మార్గము. కులధర్మము- జాతిధర్మము మొదలైనవి భగవచ్ఛేవలేనిది శోభింపవు. కులధర్మమును వదలిన వాఁడు భక్తిని సాధించినచో మఱుజన్మ నందైనను సిద్ధినిబొందును. భక్తి లేని కులధర్మ గౌరవము ఊసరక్షేత్రమున విత్తిన విత్తువంటిది (ప్ర. 100) ఈ తత్వము నెఱిఁగినవారు గనుకనే – ధీరులు–నిరపేక్షులు-ఆత్మారాములు నైనమునులు–(ప్ర. 138) హరిభజనమును నిష్కారణముగనైన జేయు చుందురు. కాయక మానసికములైన సేవ లెన్నియుననున్న,

"నీ యధీనములుఁగా నిఖిల కృత్యంబులు
ప్రియభావమున సమర్పింపఁడేని...

(స. 367)

అను సేవయే పోతన్న దృష్టిలో నుత్తమోత్తమమైన సేవ. ఈ సేవకు శాంతిదాంతు లంగములు. భగవంతుని సేవించుటలోఁగూడ బాహ్య వస్తు వుల యాడంబరము కంటెను సాత్వికమై - మానసికమైన పూజ - పోతనా మాత్యులకు చాల ప్రియమైనది. ఇతరులు తన్ను నిందించినను మరల బదులు సేయవలెననుట - అతనికంత ప్రియమైన యూహగాదు. దాని నోర్చుకొనుటయే పోతన్నకు సమ్మతమైన మార్గము. పైగా మానవునకు కష్టములు ప్రాప్తించుటయు - ఆ మానవుని జక్కదిద్దుటకేనని యాతఁడు నమ్మెను. అందుకే పోతనామాత్యుఁడు దయారుచేసిన పరీక్షిత్తు తనకు శాప మిచ్చిన శృంగిపై గోపపడినవాఁడు కాదు. శృంగి దనకు శాపమిచ్చినాఁడని తెలిసినది. అపుడు పరీక్షిత్తు యిట్లనుకొన్నాఁడట!

కం॥ ఏ పారున హంకార
వ్యాపారములందు మునిగి వర్తింపంగా
నా పాలిటి హరి, భూసుర
శాప వ్యాజమున ముక్తసంగుఁ జేసెఁ. (ప్ర. 500)

కవిదృష్టిలో కలియుగము నందలి మానవులు మందబుద్ధి తరులు. అల్పతరాయువులు. చాలనిదానికి నుగ్రరోగ సంకలితులు గూడ. వారికి భక్తిదప్ప యితర మార్గము లాశ్రయించుటకు కావలసిన మనశ్శక్తియు - నాత్మశక్తియు తక్కువ.

"కాలము భగవత్స్వరూపముగదా! అందుచే నాకాలము మంచిది; యిదిచెడ్డదని వింగడించుటలో - సుజ్ఞానముకన్న అజ్ఞానమే యెక్కువ యున్నది. గొప్ప వారు ప్రతికాలమునను బుట్టుదురు. అట్లే యల్పులు గూడ! కలియుగమునఁ బుట్టినవాఁడెల్ల పాపియనుట - తాటిచెట్టు క్రింద గూర్చున్న వాడంతయు తాగుబోతే యన్నట్లుండును." ఇట్టి హేతు వాదములపై నామహాకవికి శ్రద్ధలేదు. మనముగూడ నంతబాధ పడవలసిన పనిలేదని నా మనవి. కారణమేమనఁగా నీ వింగడింపులో మనకొక గొప్ప లాభమున్నది. ఇతర యుగములలో సాక్షాత్తుగ మంచి పనులు జేసినగాని పుణ్యములేదట! కలియుగములోఁ బుట్టిన మనవంటి వారికి మాత్రము - ఆబాధలేదు. గుట్టుచప్పుడుగా మంచి పనులు జేసెదనని మనసులోఁ దలఁచు కొనుచున్న జాలును. రావలసిన పుణ్యము యొక్క వాటా నిరాక్షేపముగా లభించును. ఇది చాల సులభమైన యుపాయము! ఇపటినుండి మనమందర మిండ్లలో గూర్చొని-యదిచేయవలె, నిదిచేయవలెనని యనుకొనుచున్నచోఁ జాలును. మన పొరుగింటి వానికిఁగూడ దెలుపక పుణ్యమును ప్రోవుజేసికొన వచ్చును వైకుంఠ ద్వారములు తప్పక దెఱచికొని తీరును. (ప్రి. 442)

పరకాంతలవలెనే పరధనము లన్నను - అతనికి భయమే! తననుండి యే పీడ యెవ్వరికిగలిగినను మేరువు నెత్తిపైఁబడినంత వేధ యామనస్సునకు!

తాను నమ్మిన విశ్వాసములపై నాతనికి సందేహములేదు. అవి హేతు వాదములకెంత యాగనివైనను - వానిని మనస్ఫూర్తిగ నమ్మి యాచరించెను. ఆచరించి తరించెను. మనమీనాఁడు హేతువాదమును గౌరవించి నంత హృదయమును మన్నించుటలేదు. దాని పరిణామమేమైనది? దేని పైనను జూపులేదు. ప్రామాణ్యా బుద్ధిలేదు. జీవితము తెగిన గాలిపటము వలె యెక్కడకుఁ బట్టిన నక్కడకు బోవుచున్నది. పోతన్న విశ్వాస శీలి గనుకనే యావిషయలము జెప్పవలసి వచ్చినపుడెంతయో స్పష్టముగఁ జెప్పును. ఒక్కొక్కసారి యాస్పష్టతకు మనమనస్సులు బాధపడును. పడినను - ఆతనికి లెక్కలేదు. తనతలఁపు నెదుటి హృదయముపై స్పష్టముగ ముద్రింపవలెనని యాతని యాశ! ఈక్రింది పద్యమును జూడుఁడు—

మ॥ హరి జింతింపక మత్తుఁడై విషయ చింతాయత్తుఁడై చిక్కి వా
సరముల్ దోసెడివాఁడు కింకరగదా సంతాడి తోరస్కుఁడై
ధరణీశోత్తమ! దండభృన్నివసన ద్వారోప కంఠోగ్రవై
తరణీవహ్ని శిఖాపరంపరలచే దగ్ధుండు గాకుండునే॥

(2-24)

కం॥ మొత్తుదురు గదల, మంటల
కెత్తుదు, రడ్డంబు దేహమింతింతలుఁగా
నొత్తుదు, రసిపత్రికలను
హత్తుదురు కృతాంతభటులు హరివిరహితులఁ॥

(ద్వి. 25)

ఈ పద్యములలో జెప్పిన నరకము - యమకింకరులు - వైతరణి యను పదార్థములను మనము నమ్ముచున్నామా లేదా? యను విషయమాతని కక్కఱలేదు. తాను నమ్మెను. మనమును నమ్మవలెనని యాతని యాశ. మహారాష్ట్రమందలి తుకారాముఁడు గూడ యిట్టి విషయములఁ జెప్పునపుడు మానవులను భయపెట్టుచు మాటాడును. తేలికఁగాఁ జూచి పలుకరించును. అట్టిచోటులలో మన యహంకారమును గౌరవించికొని వారిపైఁ

గోపించిన లాభములేదు. లేక "వీనిని చదువ" మని బహిష్కరించినను నష్టము మనకుగాని వారికిగాదు. హేతువాదైకప్రాణులమైన మనము వీనికి వెల యిచ్చినను - యివ్వకున్నను - యిట్టి విశ్వాసములతోనే వారు మహనీయులైరి. మనము సంశయములతో - అపనమ్మకములతో దినదినమును - యమయాతనలు సత్యమైనను - కాకున్నను - వానివంటి బాధలనే యనుభవించుచున్నాము. ఒక మానవుఁడు మఱియొకనిని యుద్ధరించుటకో - క్రిందదీయుటకో సమర్థుఁడని పోతన నమ్మలేదు. అంతేగాక యరక్షితులైన భక్తులను సంరక్షించుటకు సర్వదా భగవంతుఁడు సన్నద్ధుఁడై యున్నాఁడు గనుక - తనవంటి మానవుని "నీవు నాకు తోడుపడు"మని యర్థించుట భగవంతునియెడ నపచారమనియు నాతని యూహ ! అందుకే

కం॥ రక్షకులు లేనివారల
రక్షించెదననుచు చక్రి రాజై యుండన్
రక్షింపుమనుచు నొకనరు
నక్షము బ్రార్థింపనేల నాత్మజ్ఞులకున్ ॥

(ద్వి. 22)

అని ధైర్యముగఁ జెప్పినాఁడు. లోకసుఖములు - వానికొఱకు చేయు సకామభక్తి - దానికొఱకేర్పఱచు కొన్ని యన్యదేవతలు - వీనిపైగూడ నతనికి తాత్పర్యము శూన్యము. "ఎయ్యది పొందరాదు? అట్టి మేలు నేకూరుటకు హరిసేవ సేయవలయు" అనునది యా మహానుభావుని విశ్వాసము. కాని దేవతాంతర నింద చేయగూడదనుటయు - ఆతని నియమమే! అట్లే తన యభిప్రాయముతో నేకీభవింపని వారిపైగూడ దండెత్తవలెనను పట్టుదల యాతనికి లేదు. అట్టివారిని జూచి "పొందొల్లనివారు కర్మపుంజముపాలై" యని పోతన్న యుపేక్షించును. భాగవతము నందంద జెఱఁగిన ప్రసిద్ధమైన పద్యమిది—

కం॥ నీ పాద కమలసేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం

తాపార భూతదయయును
తాపసమందార నాకు దయసేయగదే॥

మూఁడు మాటలలోఁ జెప్పవలెనన్నచో యీ పద్యమే పోతన్న జీవితము నకు వ్యాఖ్య. అతఁడిట్లే బ్రదికియుండును. ఇంతవరకును మనము విశదీక రించుచు వచ్చిన విషయముల బట్టి పోతన్నకు వచ్చినది చదువేగాదనియు — ఆతని యితరములైన యోగ్యత లంతకన్నను గొప్పవనియు జెప్పినట్లయి నది. ఇట్టివారే ఋషులు – భవభూతి మహాకవి జెప్పిన—

"లౌకికానాం హి సాధూనాం అర్థం వాగనువర్తతే
ఋషీణాం పునరాద్యానాం వాచమర్థో నుధావతి॥"

అను శ్లోక మీకోవకు జెందినవారిని గుఱించిరయే! పోతనామాత్యుఁడిట్టి ఋషికవియే యను నిశ్చయము నాటికిని నేటికిని జనులలో ప్రచారము నందున్నది. అందుకే యట్టి కథలు కొన్ని బయలుదేరినవి. వానిలో నొకటి యిది.

"పోతన్న భాగవతమున రుక్మిణీ కల్యాణఘట్టమును వ్రాయు చుండెనట!" దానిలో

"హరికి ప్రేమబంధ మధికంబుగా కేశ
బంధ మధికమగుచు భామకమరె"...

ఈ సమయమునకు సరిగా వంటయింటిలో బ్రొయ్యిదగ్గఱ నాడుకొనుచున్న పోతన్న బిడ్డ పొయ్యిలోఁ బడినది. ఆమె శరీరమంతయు కమరునట్లు కాలి నది. భార్య యా విషయమును పోతన్నకు దెలిపెను. అతఁడు తన వ్రాఁత నుండి లేవనేలేదు. వెంటనే మూఁడవ చరణము.

"పద్మనయనువలన ప్రేమదంబు నిండార"యని పూరించినాఁడు. అంతలో నాపిల్లకు దగిలిన గాయములన్నియు మాయమైపోయినవి."

ఏదో కట్టుకథ. పోతన్నకు బిడ్డయుండెనో లేదో మనమెఱుఁగము. 'బాలకు + అమరె' అనుచోట 'కమరె' అను అమంగళార్థము – పని గట్టు కొని యీడ్చిననే తప్ప – తోఁచునదిగాదు. నిష్కర్షగా నీ కథ యెవరో యజ్ఞుని కల్పనయని దానిముఖమే జెప్పుచున్నది. కాని దీని నిట నెందుకు జెప్పితిననఁగా జనసామాన్యమునకు పోతన్న పైనున్న దృష్టి యిట్టిదని చూపుటకు వారి తలఁపులలో నాతఁ డేదోనాల్గు ఛందస్సు ముక్కలు చప్పరించి – తోఁచినదెల్ల కవిత్వమని కలిపి కొట్టినవాఁడుగాఁడు. "మహా తపస్వి","వశ్యవాక్కు", "శాపానుగ్రహవతుఁడు". ఇంతయయ్యును పరమ సాత్వికుఁడు. మరి యీ స్థితికాతఁడు వచ్చుట కెన్ని సంవత్సరములు బట్టి నది? ఏమో! ఒక్కటి మాత్రము నిజము. ఆతఁడు పొందిన యీ సిద్ధి మూఁడునాళ్ళలో సాధించినది మాత్రిముగాదు. కామక్రోధాధులతో – బాహ్యమైన సమాజముతో– యౌవనముతో – పోతనామాత్యుఁ డెంతయో బాధపడియుండును. గజేంద్రమోక్షములో కరిరాజు యీ పద్యములఁ జెప్పెను—

కం॥ కలఁడందురు దీనులయెడ
కలఁడందురు పరమయోగి గణములపాలఁ
కలఁడందు రన్నిదిశలను
కలఁడు కలం డనెడువాఁడు గలఁడోలేడో?

కం॥ వినుదట జీవుల మాటలు
చనుదట చనరానిచోట్ల, శరణార్థులకో
యనుదట పిలచిన, సర్వము
గనుదట! సందేహమయ్యో! కరుణావార్ధీ!

ఈ పద్యములు జెప్పినది గజరాజని మనమనుకొనుచున్నను – యీ భావములు పోతనామాత్యుఁ డెన్నియోసారులు హృదయమున శంకించు కొన్నవే! ఏ సాధకునికైనను యీ స్థితి తప్పదు. కాని యింతలో యన్ను

త్సాహము జెందక నతఁడు ద్విగుణీకృతమైన పట్టుదలతో జన్మాయంతయు సాధించెను. సాధించి భాగవతము నంపలి సుతలాధీశ్వరుఁడైన యిందిరి నేనుఁ డన్నట్లు—

మ. కో. కంటి కంటి భవాబ్ధి దాటక గంటి, ముక్తి నిధానముఁ
కంటి, నీ కరుణావలోకము కంటి, పాపమువీడ, ము
క్కంటి తామర చూలియుఁ బొడగాన నట్టిమహాత్ము, నా
యింటికిఁ జనుదెంచి తీశ్వర యే కృతార్థతఁ బొందితిఁ.

(ద. ఉ. 1152)

అని తృప్తిగ నానంద భాష్పములు రాల్చగలిగెను. ఆతనికి—

“హరిమయము విశ్వమంతయు
హరి విశ్వమయుండు సంశయము పనిలేదా!
హరిమయముగాని ద్రవ్యము
పరమాణువు లేదు......

(ద్వి. 17)

అన్న భావము - అడుగడుగునను భాసింపదొడగెను. మన ప్రాచీను లది భల్లూకపుఁబట్టు, రక్తివిరక్తులలో నేది బట్టిననుసరే - వారు కడజూతురు. నేటి మనయావేశములు — 'సోడా పొంగు' వంటివి. చూచుచుండగనే పొంగినంత కుంగిపోవును. మనకుఁ గావలసిన ప్రతి చిన్న పనియు - నెవఁడో వీరభోగ వసంతరాయలు - చేసిపెట్టవలెను. ఈ సోమరి తనమును సమర్థించికొనుటకు - వేయి కారణములను ద్రవ్వెదము.

ఇంతవరకును మన మూహించికొన్నంత దంతయు పోతనామాత్యుల యూహాచిత్రము. అంతే గాని చారిత్రికముగా నాతని గుఱించి మన కేమియు దెలియదు. ఒక్క విషయము మాత్రము గట్టిగఁ జెప్పవచ్చును. అతఁడు దరిద్రుఁడు. ఇది మాత్రము నీ కెట్లు తెలియునందురా? అందున

కుపస్ఫోరకమిది. కృష్ణ భగవానుఁడు ద్వారక కువచ్చినాఁడు. ఆ సంవర్భ మున వ్యాసు లిట్లు వర్ణించిరి.

"పత్న్యః పతింప్రోష్య గృహానుపాగతం
విలోక్య సంజాత మనో మహోత్సవాః
ఉత్తస్థురారా త్సహసాసనాశయైః
సాకంవ్రతైః వ్రీడితలోలలోచనాః
తమాత్మ జైర్దృష్టి భిరంతరాత్మనా
దురంతభావా, పరిరేభిరేపతిం
నిరుద్ధమ ప్యాస్రవ దంబునేత్రయో
ర్విలజ్జితానాం భృగువర్య! విక్లబాత్!

– వ్యాసుడు కృష్ణుని యంతఃపురమును 'సర్వకాంత' యనియు 'అనుత్తమ' యనియు బలికెను. పోతన్నయును పురుషోత్తమునకు సువర్ణసౌధమునే గట్టినాఁడు. కాని యంతతో నూరకున్న బాగుండెడిది. అతఁడు భార్యల యోగక్షేమముల విచారింప మొదలు పెట్టెను. అందులో మొదటి పద్యమిది–

మ॥ కొడుకుల్ భక్తివిధేయు లౌదురుగదా కోడండ్రు మీ వాక్యముల్
గడవంజాలక యుందురా! విబుధ సత్కారంబు గావింతురా!
దొడవుల్ వస్త్రములుఁ బదార్థరససందోహంబులుఁ జాలునా
కడమల్గావుగదా! భవన్నిలయముల్! కల్యాణయుక్తంబులే!

– దీనిని జదివినప్పుడు వైభవావతారుఁడైన కృష్ణుని భార్యలకు గూడ – కూడు గుడ్డల కొఱత దప్పక పోయెగదా – యని నాకుమాత్రము పట్ట రానంత నవ్వు వచ్చినది. ఇందులో నున్న దారిద్ర్యము నిశ్చయముగ పోతన్నదే! అది – వాసుదేవుని యంతఃపురమున గూడ దొంగిచూచినది,

పోతన్న జీవితము - అతని కాలము - మొదలైన విషయములను గుఱించి మనకెన్ని సందేహము లున్నను - అట్టి మహావ్యక్తి యొకఁ డుండుట మనభాష కలంకారము. దినమున కొక్కసారియైన నామహ నీయుని పేరుదలఁచి నమస్కరించి కొన్నచో మానవుఁడు కృతార్థుఁడగు ననుటలో సందేహము లేదు, మనమింత వరకును జేసిన దా పనియే.



# సంస్కృత భాగవతము

## పోతన కవిత్వము – ౨



శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు.

మ. లలిత స్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు మం
జులతా శోభితముఁ సువర్ణ సుమన స్సుజ్ఞేయముఁ, సుందరో-
జ్వల వృత్తంబు, మహాఫలంబు విమల వ్యాసాలవాలంబునై
వెలయుఁ భాగవతాఖ్యకల్పతరువుర్విఁ సద్విజశ్రేయమై॥

(భాగవతము)

వ్యాసమహర్షి యెన్ని పురాణములు వ్రాసినను చిత్తమునకు శాంతి చిక్కలేదట! ఒకనాఁడాయన-చింతతో-మొగము వ్రేల వేసికొని కూరుచున్నాఁడు. నారదుఁడప్పుడు దిన్నగ రంగమునఁ బ్రవేశించెను. దేవతలలో నాతఁడొక విచిత్రవ్యక్తి. ఎంతహాస్య ప్రియుఁడో-అంత జ్ఞానదాత. చింతతో చీకాకు పడినట్లున్న వ్యాసుని మొగమును జూచి-యాతని మనో వైకల్యమునకు కారణమును నారదుఁడు బ్రశ్నించెను. తన మనస్సుకలఁత పడుచున్నదని వ్యాసుఁడు బదులు పలికినాఁడు. అప్పుడు నారదుఁడు 'ఓయి! మునీ! నీవు వేదార్థములనన్నిటిని ప్రపంచించితివి. పాపము! వేదములను విభాగించితివి. కాని-వానిలో "నించుకయైన విష్ణు కథలేర్పడఁ జెప్పిన" వాఁడవు గావు. ధర్మములు ప్రపంచించినంత మాత్రమున-చిత్తమునకు శాంతి లభించుననుటకల్ల! భక్తిరస ప్రధానమైన గ్రంథమును వ్రాయు"మని చెప్పెను. అపుడు-జ్ఞానమే సర్వశ్రేష్ఠము. మేధయే సర్వమను కొన్న యాబుషి-హృదయమును గ్రుమ్మరించి భాగవతమును-రచించెను. అది బ్రహ్మసమ్మితమైనది. నిజమే! హృదయ సంవాదములేని మేధ-ఆకాశ ప్రయాణము లెన్ని చేసినను-అవనికి దిగిరావలసినదే! ఈ భావమే భాగవత రచనకు మూలము, అందుకే యిది పురాణ రత్నమైనది. పోతన్నయు,

"భాగవతము దెలిసి పలుకుట కష్టంబు
శూలి కైన తమ్మిచూలికైన
విబుధ జనులవలన విన్నంత గన్నంత
దెలియవచ్చి నంతదేఁట పఱతు"

- అని స్పష్టముగ జెప్పెను. కృష్ణుని యవతారమందఱు కర్థముగాదు. ఆతఁడు పూర్ణపురుషుఁడు. అడుగడుగునను — పరిమితమైన బుద్ధి నాతఁ డపహాస్యము సేయును. అట్లే భాగవతము గూడ - యెత్తిన వారిచేతి బిడ్డగాదు. "ఒక మాట - ఒక బాణము" గల రామపరబ్రహ్మము - అంద రకు నందుబాటులో నుండువాఁడు. రామునివలెనే-రామాయణ రచనయు నొకచే తిన్నని మార్గము నాశ్రయించినది. కృష్ణపరమాత్ముఁడట్టి — సుల భుఁడుగాఁడు. ఆ జీవితమున నెన్నియో యెగుడుదిగుడులు. అతఁడు మహా యోధుఁడు. పిఱికివాఁడు. పదునాఱు వేలమంది భార్యలతో కాపుర మీడ్చిన వాఁడు. ఇన్ని యుండియును బ్రహ్మచారియట! త్యాగభోగముల రెంటిని గడఁ జూచినవాఁడు అతని ధర్మాధర్మముల వింగడింపు మన మనుకొనునది గాదు. కృష్ణుని పాప పుణ్యములకు - అడుగడుగునను — అతఁడే భాష్యము జెప్పవలయును. రాముఁడభిమానించి — యాదరించినది - దాస్యభక్తి యొక్కటే! అతని యాశ్రితులు — హనుమంతుఁడు — సుగ్రీవుఁడు - విభీష ణుఁడును — అందఱు శరణాగతులు. కృష్ణుని పరివారములో - నాకస మున నెన్ని చుక్కలో — యన్ని భేదములు. అతని వంటిదే — యతని కథయైన భాగవతమును. ప్రాకృతకావ్యములను జదివి యానందించుటకును కుందపుష్పమాల గుచ్చుటకును - కుపితయైన ప్రియురాలి నోదార్చు టకును - తెలిసిన యదృష్టశాలురు కొందఱేనట! ఒకానొక ప్రాకృత కవి సవాలు! అట్లే కృష్ణభక్తి నెఱపుటకును — భాగవతమును పఠించుటకును - అధికారులు కొందఱే! భాగవతమన్ని భాషలయందును గలదు. కాని - కొన్నిటిలో మాత్రమేయది — సమర్థులైన కవులచేతఁ బడినది. కన్నడము నందును భాగవతము గలదు, కాని - దానియునికి - సదసత్సంశయ

గోచరము. కుమారవ్యాసుని భారతమునకు – యితర వీరశైవ కావ్యము లకు వచ్చినంత ప్రచారము – భాగవతమునకు రాలేదు. తమిళ భాగవతము నకు గూడ నింతేగతి. ఆ భాషలో నాయనార్లు, ఆళ్వార్లు – వీరురచియించిన భక్తిరచనలకే ప్రథమ తాంబూలము. వానితరువాత నట్టి గౌరవము కలిసి వచ్చినది కంబరామాయణమునకే! భారత భాగవతములకు గాదు! భార తమున కంటె భాగవతమునకు మఱియు వ్యాప్తిదక్కువ. కేరళ దేశమున మాత్రము – భాగవతము ప్రజాదరమును – గౌరవమును – జూరగొన్నది. దానిని రచించిన మహా కవి "ఎజుత్తచ్చన్". మహారాష్ట్రము నందేక నాథుఁడు–భాగవతమును రచించెను. హిందీలోని 'సూరసాగరము' ప్రసిద్ధమే. ఒరియాభాషయందును – అచల దాసనుకొందును – భాగవతమును వ్రాసి నారట! అది ప్రసిద్ధమైనదేనని వారందురు. కాని – యిన్ని భాగవతము లున్నను–వీనిలో నేనికిని బట్టనియదృష్టము – ఆంధ్ర భాగవతమునకే బట్టిన దని నా యూహ!

> పాయియకత్వం పడిడం, గుంఫేఉం, తహాయకుజ్జ పసూణం
> కునియంచ పసాయేవుం, అజ్జని బహవేణ యాణంతి (వజ్జలగ్గ)

ఏకనాథుఁడు తన భాగవతమునందు బ్రహ్మాండముగ పెంచి వ్రాసినది కృష్ణోద్ధవ సంవాదమునే! తక్కిన కథాభాగము నంతయు జాల టూకీగా వెళ్ళగొట్టినాఁడు. 'ఎచుత్తచ్చ౯' వ్రాసిన భాగవతమునకు – వర్ణనావైపు ల్యమునను–కథాసంవిధానమునకు పోతన్నతో పోటీలేదు. అతని రచనలోను దశమస్కంధ మొక్కటే పెద్దది. ఇఁక సూరదాసు ప్రేమోన్మాది. అతని భావములు సముద్రమునలేచు నుత్తాలతరంగములవంటివి. హృదయ లాలి త్యమునకు – భావోన్మాదమునకు ప్రతీకమైన సూరదాసునకు భావ ముల నదుపులోనుంచుకొను వశిత్వము తక్కువ. తలఁపు లెట్లీడ్చిన నాతఁ డట్లు పరువెత్తి పోవును. ఒక దశమస్కంధము మాత్రమే యాతని కవితో ద్యానమున విరిసిపూలు బూచినది. తక్కినవన్నియు రసమును మూతిముట్ట వెలిచినవే. దశమస్కంధము నందును యొక దారి యొక తెన్నునిలేదు.

తోఁచినది తోఁచినట్లు వర్ణింపఁబడెను. ఒరియాలోని భాగవతమును నేను చదువలేదు. అరవము, కన్నడము వీనిలో భాగవతము లున్నవనిగూడ చాలమందికి దెలియదు. కారణమేమన నా గ్రంథకర్తలు తపస్వులు గారు. కవితా నిర్మాణమున నందెవేసిన వారునుగారు. రెంటను సమర్థుఁడైనవాఁడు తెనుఁగునందలి పోతనామాత్యుఁ డొక్కఁడే! అతఁడు పవిత్రుఁడైన తపస్వి! కవితలో నెన్ని పోకడలైనను బోఁగలవాడు. పైఁగా – భాగవతముల నదుపులోనుంచికొన్న నియమశీలి! పోతన్న జీవితమును రామోపాసానతో నారంభించుట మనపుణ్యము. ఉపాసన యనఁగా – దానునమ్మి రామునినో కృష్ణునినో – 'పాడుచు, పొగడుచు నాతని దివ్యచరిత్రములను వినుచు జూచుచుండుటయేగదా! అట్లు సేయుటలో నా యుపాసనామూర్తి యొక్క గుణములు – అభిరుచులు – భక్తున కత్యంత ప్రియములై కొంత కాలమునకు – వానిస్వభావము గూడ నట్లే మారుటయు గలదని పెద్ద లందురు. ఆ భావములు ప్రచండముగ నెదిగినపుడు – రూపురేకలు గూడ నట్లే యగునట! భ్రమర కీటక న్యాయమిదే! ఈ విషయములు – మన యూహ కందవు గాని – హనుమంతుని దీవ్రముగ భావించిన వాళ్ళలో – రామకృష్ణ పరమహంసకు – తిన్ననితోఁక యొకటి బయలుదేరెనట! రాధా దేవీధ్యానమునందు నిమగ్నుఁడైన 'చైతన్య ప్రభువు'నకుఁ దాను మగ వాఁడనుట – యెప్పుడోదప్ప జ్ఞాపకమునకు వచ్చెడిదిగాదట! రెండవ దేమో గాని – మొదటి విషయము మాత్రము – పిల్లల కందటి కనుభవములో నున్నదే! వారప్పుడప్పుడు – తోఁకలేకయే హనుమంతు లగుదురు. కొన్ని వేళలలో – పెద్దలము గూడ.

అట్టి యుపాసకులు – భక్తులు – కవులైనపుడు – వారి రచనలలో నా విభిన్నతత్త్వములును – ప్రతిఫలించుననుటలో – పెద్ద విశేషమేమియు లేదు. ఇట్లు – అద్దమునందు నీడవలె – ప్రతిఫలించిన పట్టులు – సంస్కృత కవులలోను గలవు. దేశభాషా కవులయందును నున్నవి. లీలాశుకుని కృష్ణ కర్ణామృతమునకుఁ దెలిసినదే! అట్టిది మారాముసకేల లేకపోవలెనని

యెవరో రామకర్ణామృత మల్లిరి. కాని 'కర్ణామృతము' మాత్రమడీగా లేదు. దానిపోకడ వేరయినది. రామోపాసకులైన కబీరు - తులసీ - రహీము మున్నగు వారి రచనలకును - మీరా - సూర - రసఖాఁ మొదలగు కవులకును పోలికలే యుండవు. త్యాగయ్య, క్షేత్రయ్యలకు పోలిక లేవీ?. కృష్ణభక్తులు విశృంఖలులు — ఉన్మాదులు. అందుకే కృష్ణోపాసకుల రచనలు — అపుడపుడు జదివి యానందించుటకు మాత్రమే పనికివచ్చును. గాని—ఓతప్రోతముగ వానియందేమున్నటయు కష్టము. మునిగి ప్రపంచమునకుఁ బనికివచ్చుటయు కష్టమే! వాని రసము వెక్కసమైనది. 'రేరాణి' పూలవాసన వంటిది. ఒకసారి రెండు సార్లకు బాగుండును. ఎక్కువైనచో మనవంటి నరముల పటుత్వము లేనివారికి — ఓర్చుకొనుటకు శక్తి చాలదు. పోతన కవిత్వమున మన కీ భయము లేదు. అతని దైవము - నియమశీలమైన రామభద్రుఁడు. అందుకే భాగవతమందు — రామాయణ ఘట్టము వచ్చినదే - యాతనికి ఱెక్కలు మొలచినవి. కన్నులు మూసి యొకసారి- మనసార ధ్యానించికొని - తిన్నగ వ్యాసుని మూలమును జూచినాఁడు. అందు-

"తస్యాపి భగవానేష సాక్షాద్బ్రహ్మ మయోహరిః
అంశాంశేన చతుర్భాగాత్పుత్రత్వం ప్రార్థితస్సురైః॥,

- అని యున్నది. దానినందికొని యుత్సాహముతో-

మ॥ అమరేంద్రాశకు బూర్ణచంద్రుఁడు దితుండైనట్లు నారాయణాంశమునం బుట్టె మదాంధ రావణ శిరస్సంఘాత సంఛేదన
క్రమణోద్దాముఁడు రాముఁడా గరికకుఁ గౌసల్యకుఁ సన్నుతా
సమనైర్మల్య కతుల్య కంచిత డినుస్సంసార సాఫల్యకుఁ॥

అని వన్నెలు - చిన్నెలతో - క్రొత్త 'ఫక్కి' నారంభించినాఁడు రామకథను ముగించుచు పోతనామాత్యుఁడు——

ఉ॥ నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు మహాశుగంబులన్
విల్లును దాల్చువాఁడు – గడువిప్పగు వక్షమువాఁడు మేలుపైఁ
జల్లెడువాఁడు నిక్కిన భుజంబులవాఁడు యశంబు దిక్కులన్
జల్లెడువాఁడునైన రఘు సత్తముఁడిచ్చుత మాకభీష్టముల్॥

(9–361)

– అని రామభద్రు నెంతయో ముచ్చటగ వర్ణించెను. ఇదియాతని సొంత పద్యము. పోతన్న పూజా గృహమునుండి – యతని భక్తికి మూల మైన – రామచంద్రుని మూర్తి యిట్టిదేనేమో! "భాగవతమును వ్రాయు నాటికి – పోతనామాత్యునకు శివకేశవాద్వైత మేర్పడినది. అట్లే యా మహానుభావునకు రామకృష్ణాద్యవతారములందును – నభేద ప్రతిపత్తి కాదు కొన్నది. "గ్రంథమును వ్రాయుటకై యా మహానుభావుని బ్రేరేచిన వాఁడు రామభద్రుఁడేగదా! ప్రతిస్కంధమునందును తొలుటి పద్యమురా మార్పణముగ వ్రాసెను. షష్ఠ్యంతములు – కృష్ణపరముగ నభివర్ణించి నాఁడు." ఇట్టి యభేదజ్ఞానమును – పరిపూర్ణముగఁ బండించికొన్న యాజ్ఞా నైకనిధికి – రామావతారమందే యేకతాత్పర్యము – సిద్ధావస్థయందును – నుండుననుట పొఱపాటు అని కొందఱనవచ్చును. కాని యొక మూర్తి భేదముపైఁ గొంత ప్రేమ యెక్కువగ నుండెననుటలో నితరములపై దృష్టిలేదనియు – ప్రీతిగౌరవడెననియు నర్థము గాదుగదా! ఒక తల్లికి - చిన్నకొడుకుపై మక్కువ కొంత యధికమన్నచో - తక్కినవారి నందరిని - అడవులకుఁ దోలునని భావమా? సమర్థ రామదాసస్వామి యద్వైత సిద్ధిని కానమొనర్చిన మహానుభావుఁడు. అతఁడాంజనేయుని యవతారమని యా సంప్రదాయస్థుల విశ్వాసము. వారొకసారి పండరికిఁ బోయిరి. 'కటీతట విన్యస్తహస్తుఁడై, పాండురంగఁ డొయ్యారముగ నిలచియుండెను. వారి కావాలకము సరిపోలేదు. దేశమంతయు నధర్మ దూషితమై యున్నప్పుడు- 'యీ నడుముపై చేతులేమనుకొన్నారు. వెంటనే రంగఁడు చాపపాణియై వారికి దరిసెన మొసఁగెనట! తులసీదాసుల విషయమునను నిట్టి కథయే

బ్రిచారమున నున్నది. వారొకసారి మధురకు గాబోలు వెళ్ళినారు. అక్కడ 'జగన్నాథుని' సేవింపఁబోయిరి. రామాయత్తమైన తులసీదాసుల మనసు – రసికతాసర్వస్వమైన కృష్ణుని విషయమున నార్ద్రిముగాలేదు. "ఓయికృష్ణా! నీవెంత గొప్పవాఁడవయినను–ధనుర్బాణములులేని మూర్తికి నా శిరస్సు వంచ"నన్నారట! మరి వీరి కద్వైతసిద్ధి పండలేదా? పోతనామాత్యుఁడు గూడ నిట్టివాఁడే!

పోతనామాత్యుఁడు - రామ పరాయత్తమతియంటిమి. అందుచే నడుగడుగునను — నా తపస్వికి నియమమే! ఈ నియమబద్ధమైన జీవితముతో – భావముతో - భాగవతమును వ్రాయుట నిజముగా మన పుణ్యము. అట్లుగాకున్నచో – తెన్గు భాగవతముగూడ – అదుకుల బొంతగదయ్యాౖ - యుండెడిది. కాకున్న తెగిన గాలి పటమువలె గాలి వీచినకెల్లబోయి యుండెడిది. నియమ శీలుఁడైన వ్యాసుఁడు-పోతనా మాత్యుఁడు-వీరి గాంభీర్య మెట్టిదో-యొక చిన్నయుదాహరణమిత్తును. కృష్ణ భగవానుఁడు—బృందావనమునుండి – మధురానగరమునకు వెళ్ళినాఁడు. ఆతనిని గొంపోయిన వాఁడ కూౢరుఁడు. వెళ్ళిన కృష్ణుఁడు రాచకార్యములతో మరల—బృందకు రానేలేదు. కొంతకాలమున కాతని మనసులోఁ జిన్ననాటి—చిలిపి చేఁతలు–బారాడ నారంభించెను. మఱపునకుఁ దట్టిన గోపికలపై మనసు పోయినది. ఒకనాఁడాతఁడే కాంతములో.

శా॥ నాపైఁ జిత్తములెప్పుడుఁ నిలుపుచుఁ నారాకగాంక్షించుచుఁ
నాపే రాత్మల నావహించుచు వగఁ నానా ప్రకారంబులఁ
గోపాలాంగన లెంత జాలిపడిరో కోపించిరో దూఱిరో!
వేపల్లెఁ నిజధర్మ గేహములలో విభ్రాంత చైతన్యలై॥

(ద. పూ. 1431)

అని యాలోచించుకొన్నాఁడు. బృందకుఁ బంపుట కర్హులెవ్వరని యూహించి యుద్ధవుని బిలచి

శా॥ రమ్మా! యుద్ధవ! గోపకామినులు నారాకన్ నిరీక్షించుచున్
సమ్మోహంబున నన్నియున్మఱచి-యేచందంబునన్ గుందిరో
తమ్ముం నమ్మినవారి డిగ్గవిడువన్ ధర్మంబుగాదండ్రు వే
పొమ్మా ప్రాణములే క్రియన్ నిలిపిరోప్రోద్యద్వియోగాగ్నులన్॥
(ద. పూ. 1434)

అని పనకి పంపినాఁడు.

ఈ సందర్భమున వ్యాసుఁడు

శ్లో॥ గచ్ఛోద్ధవ వ్రజంసౌమ్య! -పిత్రో ర్నః ప్రీతిమావహ!
గోపీనాం మద్వియోగాధిం-మత్సందే శైర్వి మోచయ!

అనితల్లి దండ్రులను గూడఁ జేర్చెను. వ్యాసునిఫక్కినే యనుసరించి మళయాళములోని 'ఎచ్చుత్తచ్చన్' మహాకవియు.

"తాతనుంమాతాక్కళుక్కుం శోక తైక్కళయేణం" అని యొక ముక్కను జేర్చెను. ఈ పని పోతన్న గూడ చేసియుండిన బాగుండెడిది. ఆతని కెందుకు దట్టలేదో! ఈసందర్భమున 'ఎచ్చుత్తచ్చన్' మహాకవి చాల చక్కగ వ్రాసినాఁడు ఆభాగమిది.

"కేశవ భక్తనాయి-జ్ఞానసంపన్ననామ్
సత్యబుద్ధి మానాయి-మేవీడు ముద్ధవనె
సత్త్వరం విళిచ్చతి మంద హాసేనకృష్ణన్
ఉద్ధవ కరంపి డిచ్చీవణ్ణ మరుళ్ సెయ్తు
బుద్ధి శుద్ధియుం జీవజంతు క్కళ్ తన్నిల్ కృప
కేవలం సమత్వవుం-దైవ విశ్వాసమతుం
కేవలసత్వ గుణలక్షణం గళుయువ
పరె యుళ్ళోరు భవానెన్నుడె జీవనెక్కా
ళేరె యుండెడో! నిన్న స్నేహ మెన్న జ్ఞాలుం.

-కృష్ణుఁడుద్ధవుని బిలచి తొలుత మందహాసము జేసినాఁడు. అతఁడు ప్రయోగించు మొదటి బ్రహ్మాస్త్రమదే! ఆపై యుద్ధవుని చేయి పట్టుకొని-మైత్రి నెఱపి పలుకనారంభించెనట! "ఉద్ధవా! నీవు బుద్ధిశుద్ధిగలవాఁడవు. జీవ జంతువులపై దయగలవాఁడవు. సమత్వము-దైవ విశ్వాసము-నీసొత్తు. సత్త్వగుణములు నీవి. ఇన్నిటితో నీవు నాకు ప్రాణాధికుఁడ వైతివి. కనుకనీయెడనాకు గలస్నేహమును బట్టి నిన్నంపు చున్నాను." అన్నాఁడు. ఈ సందర్భమున-కృష్ణుఁడీమాటలాడుటెంతయో యుచితముగ నున్నది. ఇట్లే యీ కథలోని-నందుని వాక్యములు గూడ నెంతయో యార్ద్రములు. నందుఁడు-కృష్ణుని వాక్యములుదలఁచిపనవి నపుడు-యశోద యెట్లున్నది? వ్యాసుల శ్లోకమిది.

శ్లో॥ యశోదా వర్ణ్యమానాని - పుత్రస్య చరితానిచ
శృణ్వంత్య శ్రూణ్యపా స్రాక్షీత్ స్నేహస్నుతపయోధరా!

"ఎచ్ఛుత్తచ్ఛ" యశోదయు—

"పుత్రనె గుణగణం వర్ణికున్న తుక్కేట్టు
చిత్తవుమలిఞ్ఞుడ్ఞ ములయుంచు రన్నిట్టు
చిత్తత్తిల్ కృష్ణ తన్నె ధ్యానిచ్చు నేత్రాంబువుం"
ఎత్రయుం పీత్తిపిత్తి నిన్నితు యశోదయుం॥

పోతన్న మహాకవి యశోదయు—

క॥ పెనిమిటి బిడ్డని గుణములు
వినుతింప యశోద ప్రేమ విహ్వలమతియై
చను మొనలఁ బాలుగురియగఁ
గనుగొనలను జలము లొలుకఁగా బెగ్గిలియెన్॥

(ద. పూ. 1443)

-ఈ సందర్భమున సూరదాసువంటివాఁడు — తన హృదయమును గుదించికొని - యశోదాదేవి నింత యుజ్వలముగఁ జేసియుండలేదు. హరిహరా

ద్వైతము భారతమైనట్లు - రామకృష్ణాద్వైతము భాగవతముగ దక్కుట మన భాగ్యము. ఆ తపస్వి తెన్గువారి యిలువేల్పు.

తెన్గున నాయదృష్టము రామాయణమునకు — బట్టలేదు. అందుకే నాటినుండి నేటివరకు 'మేము మే'మని రామాయణమును వ్రాయుటకు ప్రతికవియు ముందుకు దూకుచున్నాఁడు. కాని నాదృష్టిలో - రామ కథను వ్రాయవలసిన యుదాత్త చరిత్రుఁడింకను - తెనుఁగునఁ బుట్టవలసి యున్నది. ఇటుకలు, గార - యీ రెండే యిల్లుగానట్లు, చదువు - ప్రతిభ మాత్రమే రామాయణమువంటి యుదాత్త కథకు సమగ్రమైన సామాగ్రి గాదు. తపస్సుతోఁ బరిపక్వమైన కొంత యాత్మశక్తియును గావలెను. కాని మనకు నేఁడిది బొత్తిగా నర్థము గానిమాట! అర్థమైనను అనవసర మైన పరిశ్రమ. మనుచరిత్ర - వసుచరిత్రలవంటి గ్రంథముల కథ వేరు. వానిని చదివి యానందింతుమేగాని - పూజింపము. అట్లున్నను - వారుగూడ - మనకంటె యాత్మశక్తి గలవారె!

వారిలో నొకరొకరి జీవితగాథలు విన్నపు డొడలు పులకరించును. ధ్వన్యాలోక వ్యాఖ్యాత - అభినవగుప్త డందఱికిఁ బరిచితుఁడే! అతనికిఁ దపస్విగా గొప్ప ప్రఖ్యాతిలేదు. కాని - యాతని జీవితచరిత్రను జదివి నపుడు నాకొడలంతయు గగుర్పొడిచినది. కాశ్మీరదేశ ప్రత్యభిజ్ఞావాద మున కాతఁడు మూలస్తంభము. ఆ బ్రహ్మచారి - మరలివత్తునని శిష్యు లతోఁ జెప్పి యొకసారి బ్రహ్మాండమైన కొండగుహాలోనికి దూరెనట! శిష్యులు కాచికాచి విసిగి వెనుదిరిగినారు. అభినవగుప్తుఁడు - తిరిగి రానే లేదు. ఈనాటికిని కాశ్మీరదేశస్థులు "యీ గుహానుండి యభినవగుప్తుఁడు గడ్డకువచ్చు"నని యమాయికముగ ననుచుందురట! తులసీరామాయణము - త్యాగరాజుకృతులు — మొదలగు వానిలో నాత్మశక్తి యున్నంత కవితా శిల్పములేదు. కాని - వానికున్న ప్రభావము అసామాన్యము. భాగవత మును మాత్రము - యే కొంచెము పరేంగితజ్ఞానమున్నను - యేకవియు వ్రాయ సాహసింపఁడు. వ్రాసినను దాని నెవ్వరును జదువరు.

మన భాషతో సంబంధములేని యితరులకును దెలిసిన కవులు దెనుఁగులోఁ గొందఱున్నారు. వారిలో మొదటివాఁడు పాలకురికి సోమనాథుఁడు. రెండవవాఁడు పోతనామాత్యుఁడు. సోమనాథుని పేరు కన్నడిగలకుఁ బరిచితమైనది. అతఁడు వీరశైవుఁడు గనుక, విధిగా కన్నడము నేర్వవలసియు వచ్చెను. బసవేశ్వరుని యుత్తాలవాఙ్మయ విహారమంతయుఁ గన్నడముననే సాగినది. తక్కిన వీరశైవుల వచనము లా భాషలోనే గలవు. వీరశైవుల వచనవాఙ్మయము - అదియొక విచిత్రమైన ఛందో రచన. వారి నొరవడిగ నుంచుకొని - మొన్న మొన్నటి వైష్ణవకవులు - తెనుఁగులో నా పోకలఁబోయిరి. కాని యవి పాకమునకు రాలేదు. సోమనాథుఁడు కన్నడములో - తెలుఁగులోవలె ప్రసిద్ధకవి కాకపోయినను - కవిత్వమును వ్రాసెను. తమిళమునగూడఁ గొంత యాతని పేరు ప్రాకినది. కాని - యీ ప్రాకుటయంతయు - మతాభినివేశముతోనే - పోతనామాత్యుల స్థితి యదిగాదు అతఁడు తెన్గుదేశపుటెల్లలు దాటిపోలేదు. తెన్గుదేశమునను - నలుమూలలు దిరిగియుండఁడు. అతఁడు విరక్తుఁడు. ప్రాప్తమైన దానితో తృప్తిపడువాఁడు. అతని కితరభాషలలోఁ బ్రవేశముండెనని యూహించుట - కారచనలో గుర్తులులేవు. కాని యాతనికిఁ గవిగా వచ్చినదానికంటె భక్తుఁడుగా గల్గిన కీర్తి దొడ్డది. ఆనాటి భాగవతులలో నాతఁడు నాయకరత్నము. ఈ ప్రసిద్ధిమాత్రము హనుమంతుని తోఁకవలెఁ బెరుగుచునే బోయెను. సమర్థ రామదాసస్వామివారి సాంప్రదాయిక గ్రంథములలో — మహాభక్తుఁడుగ పోతన్న వర్ణింపఁబడినాఁడు. ఆసన్నివేశమిది. సమర్థ రామదాసు 'మేరుపర్వతము'ను దర్శించివచ్చెనట!! అదెట్లు సాధ్యము? అంతవఱకును బోవుటకు - వారెంతవారైనను - మానవులకు శక్తిలేదే! యను శంక శిష్యులకుఁ బొడమెను. దానిని సమర్థించుటకు వారు పోతన్న నుదాహరణముగ దీసికొన్నారు. 'అల వైకుంఠపురంబులో' అని పోతన్న పద్యమారంభించెనట! తరువాత నాతనికిఁ దోఁచలేదు. రామభద్రుని దయతో - వైకుంఠము నాతఁడు జూచివచ్చి శేషమును బూరించి

నాఁడట! పోతన్న వైకుంఠమును - జూచివచ్చెనా? లేదా? అట్లు చూచి వచ్చుటకు సాధ్యమా? యను ప్రశ్నలకిక్కడ చోటులేదు. ఈ కథ నుదాహరించుటలో నా యభిప్రాయము - పోతనామాత్యుఁడు మహారాష్ట్రులకుఁ బరిచితుఁడని దెలుపుటనరకే! ఉత్తర హిందూస్థానమున 'తెలాంగు'లను నొక శాఖవారున్నారు. రాజస్థానము - గుజరాతులలో వారెక్కువ. ఆ బ్రాహ్మణులు దాక్షిణాత్యులు. వల్లభాచార్యుల కాలమున దక్షిణము నుండి యార్యావర్తమునకు కదలిపోయిరి. వారికి - మన భాగవతముపై నభిమానముగద్దు. ఈ విషయమును నేను ఢిల్లీలో వింటిని. త్యాగరాజు తమిళదేశమునందు తెనుఁగు భాగవతమునకు ప్రచార మెక్కువ యిచ్చి నట్లున్నది. నాఁడు ప్రచారమనఁగా - దానిని తాననుష్ఠించి చూపుట. త్యాగయ్య దినమును - తెనుగు భాగవతమును పారాయణ మొనరించెడు వాఁడట! ఈనాటికిని మన కామాత్రి మభిమానము - ఆంధ్ర గ్రంథములపై నేర్పడలేదు. తెనుఁగు కవిత్వము నెంత మెచ్చుకొన్నను - మడుగు గట్టికొన్నప్పుడుమాత్రము - మనకు జ్ఞాపకమునకు వచ్చునవి సంస్కృత గ్రంథములే. ఉత్తర హిందూస్థానమున నొక సంప్రదాయమున్నది. వాఁడు చతుశ్శాస్త్ర పండితుఁడైనుసరే- రామాయణమన్నంతనే-తులసీరామాయణమునే పారాయణము సేయును. ఇంత ముష్కరత మన కక్కఱలేకున్నను - సంస్కృత గ్రంథములలోనే మోక్షము గలదనియు - వానినుండి మూటలు గట్టికొని రావచ్చుననియు — తలఁచు పేరాసమాత్రము — నవ్వవలసినంత మూర్ఖత. భావశుద్ధి ఫలసిద్ధికి ప్రధానకీలకము.

ప్రాచీనులలో—అప్పకవి—మొదలైన మహామహులకు పోతన్న కవిత్వము—లాక్షణికముగఁ గనుపింపలేదు. అతఁడొనర్చిన పాప మేమనఁగా— లఘ్వలఘు రేఫములకుఁ-ప్రాస గూర్చుట. ఇట్టి పనికిమాలిన యెత్తిపొడు పే- పాలకురికి సోమనాథునిపైఁగూడగలదు. ఈ జాతివారందరును—కల్ప వృక్షములను దెగనఱికి—వంటకట్టెలు దయారు చేయుదమను రకము. అప్పకవి వంటి వారికే గాదు, కవుల మనుకొన్న వారిలోను — చాలమందికి—పోతన్నా

మాత్యులపై-యనుగ్రహాము మట్టమే! అందుకే-ప్రాచీన కవి ప్రశంసల చిట్టాలలో-నెక్కడోదప్ప-పోతన పేరు గనుపింపదు. ఈ నడుమ పోతన్నను గుఱించి-సాఁగిన విమర్శలు—ఆయన యూరేది? తండ్రి తాత లెవ్వరు? మొదలగు విషయములపైననే కొందరు విద్యార్థికులాతని కవిగా—తూఁచిన వ్రాఁతలును గలవు. కాని—వీరిలోఁ జాలమంది-యాంగ్ల విద్యాభక్తులు. వారిసు లోచనములు ధరించియే—ప్రతి విషయమును జూతురు. ప్రాచీను లది-అదొక గొడవ. కల మందికొన్నంతనే-వారికంటఁబడునది-మమ్మటుఁడు రుయ్యటుఁడు. తప్పులు బట్టుటలో నున్నంత చొరవ—యొప్పులను గ్రహిం చుటలో లేదు. ఇంతకును—నీ యిరుదెగలవిమర్శనములతోను-మనకు జరిగిన న్యాయము సున్న. 'గజేంద్రమోక్ష' కథలో నడవిని వర్ణించుచు—పోతన్న యొక దీర్ఘవచనము వ్రాసినాఁడు. దీని నొక ప్రసిద్ధ విమర్శకుఁడు వెక్కి రించెను. అమర కోశమును-దగ్గఱనుంచికొని పోతన్న-వనౌషధి వర్గలోని చెట్ల పేర్లన్నియునిందుఁజేర్చినాఁడట!! నిఘంటువును దగ్గఱఁ బెట్టుకొని—పదములకు వెదుకవలసిన దురవస్థ—ప్రాచీనకవులకులేదు. వారు బాల్యము ననే-వానినెల్ల వల్లించెడు వారు. పూర్వకవులలోఁ గొందఱు సంస్కార హీనులైన నుండ వచ్చునుగాని-యవ్యుత్పన్నులులేరు. అట్టి ప్రబుద్ధులున్నది మనలోనే! ఆంగ్లభాషాభ్యాసము-మనకు గొంత స్వతంత్ర భావముల నొసఁ గినది. అట్టి వారును దక్కువయే! మనపూర్వులు ప్రాచీన సంప్రదాయ ములకు బానిసలని—మనము వారిని నిందింతుము. కాని—మనకథ యేమై నది? మన మాంగ్ల సంప్రదాయములకు దాసులము. ప్రాచీనుల దాస్య ములో 'మా'యనుకొని సంతోషపడు నాత్మతృప్తియైన నున్నది. మన కది యులేదు. పోతన్న వ్రాసిన వచనమంతయు గ్రిచ్చపాదవలె—చెట్ల పేరులే గాదు-ఇతర విషయములు గూడ నాతఁడు వర్ణించెను. అతఁడు చేసిన దోషము—మొదటిలో నొకపడిచెడ్లను జేర్చుటయే. వానికర్థ మెఱుఁగుట యీ విమర్శకునకుఁ గష్టమైనది. ప్రతిదానికి వనౌషధి వర్గ జూడవలసినదే గదా! మరియడవిలో—చెట్లు గాక—హింస తూలికాతల్పము లెక్కడ నుండి

వచ్చును? పోతన్న సృష్టించిన పాత్రలలో వైవిధ్యముండదనుట రెండవ యాక్షేపణము. వారి వాదమిది: "భాగవతములోనందఱును భక్తులే! ప్రతి వారికి-శ్రీమహావిష్ణువు-చతుర్భుజములతో సాక్షాత్కరించును. అతఁడగుపడినదే తడవు-యీభక్తుఁడు "శ్రీమద్రమారమణ గోవింద"యని జాగంట వాయింప మొదలు పెట్టును. ఈ పాత్రలందఱును-మనవలె ప్రపంచమునఁ దిరుగువారుగారు. ఏదో కల్పిత జగత్తులోనివారు. ఎంతసేపు చెప్పినను-భాగవతము మానవ జీవితములోని యొక భాగమును మాత్రమే దెలుపును." ఇదివీర వరుస. వైవిధ్యమనగా-వీరియర్థమేమో స్పష్టముగఁ జెప్పిన బాగుండును. భాగవతము భక్తుల చరిత్రలు వ్రాయుటకుఁ బుట్టిన గ్రంథము. అందులో రక్తులనెట్లు జేర్పవచ్చును? భారతములోఁగూడ ననేకులు వత్తురు. వారందఱును వీరులేగదా! లేక పాత్రల యాకార వికారములలో-వైవిధ్యమును గనపఱుప వలెనని వీరి భావమా? ఆకారములోని భేదమే-వైవిధ్యమగుచో-నట్టివారు-రామాయణమును ఒకటికి పది సారులు చదువవచ్చును. అక్కడ నైనచోఁ దృప్తిగా-కోఁతులు-యెలుఁగుగొడ్లు-కాకులు-గ్రద్దలు-వీరికి కావలసినన్ని సారులు, గనబడును. భాగవతమున నా వైవిధ్యమెట్లు వర్ణింపవచ్చును? కంసునకు కాలిమెడిమలు వెనుకకున్నట్లు చెప్పవలెనా? లేక-జరాసంధుని మీసములు పెనుగొండ చేత్రాడంతటి-పొడుగుగ నుండెనని వర్ణింపవలెనా? కాని-భాగవతమున - వీరికిఁగూడ - నొక యాసరా యున్నది. ఇట్టి భావుకులు - కుబ్జావృత్తాంతమును దృప్తిదీర-జదివికొనవచ్చును. కావ్యములందలి పాత్రలందరును-మనము దినమును జూచువారివలెనే యుండవలెనన్నచో-కావ్యములను జదువుట పనిలేని పని. ప్రపంచమునే జూచుకొనవచ్చును. కవి యెంతస్వభావవాది యైనను-ఉన్నదున్నట్లే చెప్పఁడు. చెప్పరాదు. వాస్తవముగఁజూచినచో-నేకావ్యమందైనను పాత్ర కల్పితమే! అనుభవములు-వాని నావిష్కరించు పద్ధతులు, వీనిలోని భిన్నత' యే వైవిధ్యమైనచో-నది భాగవతమున మాత్రమేల లేదు? భారతములోని పాత్రలన్నిటికిని విక్రమ ప్రదర్శనము సామాన్య ధర్మమై

నట్లు-భాగవతమునందును భక్తి సామాన్య ధర్మమైనను—దానిని బ్రదర్శించుటలో-ననుభవించుటలో—వైవిధ్యముగా వలసినంత యున్నది. ప్రేమోన్మాదమున నొడలు మఱచి-కృష్ణుని మురళీగానము విన్నంతనే గృహములను విడచి-శరద్రాత్రియందు పరువెత్తికొనివచ్చు గోపికల భక్తికిని—నియమశీలియై, వినయశీలియైన యంబరీషుఁడు సాధించిన దాస్య భక్తికిని భేదమేల లేదు? మధురానగరమందుఁ గృష్ణునిగామించి-చందనాదుల నొసంగు-త్రివక్రయైన కుబ్జదృష్టియు, పరమాత్ముని పాదములచేత సదమదమైన పడగలుగల కాళియుని గాంచికృష్ణుని పతిభిక్షవేడు యురగాంగనల తలఁపులును నొకటియేనా?" అది గాదయ్యా! ప్రతి యొక్కఁడును కృష్ణుని బొగడుట కారంభింతురు. ఆపొగడ్తలో—నెక్కడ జూచినను-ఒక్కటే-వేదాంతపుగోల "యని యందురేమో"! భారతములో దిక్కులేనన్ని యుద్ధములు వర్ణింపఁబడునుగదా! ప్రతిదాని యందును-పగిలిన పుర్రెలు - పాఱిన రక్తములేగదా యున్నది? చెప్పినదే మాటిమాటికిఁ జెప్పుచున్నాఁడను విసుగు మన కేలఁగలుగదు? కారణమేమనఁగా-కామక్రోధాదులు సహజముగ మనకున్నవి. వానిని బాగుగ ననుభవింపవలెనను నాకాంక్షయుగలదు. వీని నుద్రేకింపఁజేయు ఘట్టములు వచ్చినపుడు-లోకమునవలెనే-కావ్యమునను—సులభముగ-లీనమై పోదుము. భాగవతము వంటి గ్రంథములు కామక్రోధాదులను దమించికొమ్మనును. దమించికొను మార్గములనే దెలుపును. ఈపద్ధతి మనకంత యిష్టముగాదు. అందుకే - భాగవతమును జదువుటకును-వినుటకును - అధికారులు గావలెనంటిని. భారతము పురాణము జెప్పునప్పుడు - వేలకొలఁది జనులు చేరుదురు. భాగవతమును జదువఁబూనినచో-పట్టుమని పదిమంది యుండరు. ఇది నా యనుభవములోని విషయము.

పోతన్న వర్ణించు పాత్రిలలోను - కావలసినంత వైవిధ్యమున్నది. మనము కను గలిగి చూడవలయు నంతే! బలిచక్రవర్తి భార్యపేరు వింధ్యావళి. 'ఈమెకు నోరేలేదా' యనిపించును. అంత దీర్ఘమైన బలిచక్రవర్తి కథలో - నామె మనకగుపించునది రెండుమార్లులే! బలి - వామనునకు -

మూఁడడుగుల మేరదానమిచ్చినాఁడు. ఎదుటనున్న కులాచార్యుఁడు — వామనునికి రహస్యములు విప్పిచెప్పి - వానికి దానమిచ్చినచో సర్వనాశన మగునని - హెచ్చరించెను. బలి వినలేదు. ఆచార్యుఁడు ఘోరముగ శపించెను. తన యెదుట నింతకథ జరుగుచున్నను - వింధ్యావళి పల్లెత్తు మాటనలేదు. వటునికాళ్ళు గడుగుటకు — నీరుమాత్రము తెచ్చినది. ఆ సన్నివేశమును పోతన్న యిట్లు వర్ణించెను :

ఆ. వె॥ దనుజలోకనాథుదయిత వింధ్యావళి
రాజవదన మదమరాళగమన
వటుని కాళ్ళుగడుగ వరహేమఘటమున
జలము దెచ్చె భర్తృసన్న యెఱిఁగి.

ఈ సందర్భమున మూలములోని 'జాలకమాలినీ' యను విశేషణ మును పోతనామాత్యుఁడు వదలెను. వింధ్యావళి స్వభావమునకు — రాజస మునకుఁ బొత్తు గుదురదని యేమో! 'భర్తృసన్న యెఱిఁగి' యను చేర్పు పోతన్నదే! దీనితో కథకు ప్రాణమువచ్చినది. వామనమూర్తి బలిని బంధించి నపుడు మాత్రము—ఆమె యూరకుండ లేకపోయినది.

మ॥ తతమత్తద్విపయానయై, కుచనిరుంధచ్చోళ సంవ్యానయై
ధృత భాష్పాంబువితానయై, కరయుగాధీ నాలికస్థానయై
'పతి భిక్షాంమమదేహి,' కోమలమతే! పద్మాపతే! యంచు త
త్సతి వింధ్యావళి చేరవచ్చె త్రిజగద్రక్షామనున్ వామనున్ !

వచ్చి యచ్చేడియ వామనమూర్తి చరణ సమీపమున బ్రణతయై నిలుచుండి యిట్లన్నదట !

కం॥ నీకున్ క్రీడార్థములగు
లోకంబులు జూచి పరులు లోకులు కుమతుల్

లోకాధీశుల మందురు
లోకములకు రాజవీవ ! లోకస్తుత్యా !

కం॥ కాదనఁడు పొమ్ము ! లేదీ
రాదనఁడు ! జగత్త్రిత్రయైక రాజ్యము నిచ్చెన్
నాదయితు గట్ట నేటికి
శ్రీదయితా చిత్తచోర ! శ్రిత మందారా !

ఈ రెండవ పద్యము పోతన్న స్వకపోల కల్పితమే ! మొదటిపద్యము ఆమె మనోనిశ్చయమును దెలుపును. సర్వమునకును భగవంతుఁడే కర్తయను విశ్వాసమామె ప్రతియూహలోను గలదు! అందుకే 'వింధ్యావళి'-శుక్రుఁడు బలి — వీరినడుమ జరగిన రగడలోఁ బ్రవేశింపనేలేదు. రెండవ పద్యములో వింధ్యావళిని పాపము ! స్త్రీత్వ మావేశించినది. తన పతినే వామనుఁడు గట్టెను. ఆ పరీక్షకామె నిలువలేక పోయినది. "అయ్యా ! మాట తిరుగక నా పతి — మూఁడు లోకములను దానమిచ్చినాఁడే ! ఇట్టి వానిని నీవు గట్టుట న్యాయమా ?" యని నేరుఁగా — వామనమూర్తి హృదయమునకే యామె బ్రశ్న వేసినది. వింధ్యావళి—భగవంతుని గుఱించి-వాడిన రెండు విశేషణములును — రెండు ముత్యములు. "శ్రీదయితా చిత్తచోర !" యనుటలో "నీకును భార్యయున్నది. భర్తకుఁ గష్టము ప్రాప్తించినపుడు భార్యకెంత దుఃఖముండునో — యా లక్ష్మి నడిగి చూడు మనుచున్నది. "నిన్ను జేరిన భక్తులకుఁ గల్పవృక్షమువలె కోరికలనెల్ల దయ సేయువాఁడవని బ్రసిద్ధియున్నదే ! నా భర్తను సర్వనాశము జేసితి వేమయ్యా !" యని యెత్తి పొడుచుచున్నది. ఆ యడుగుటయు గొంత గడుసుగనున్నది. వింధ్యావళి మహోగంభీరమైన చిత్తవృత్తిగలది. ఆమె యెప్పుడును బలుకదు. పలికిన బ్రతిమాటయు తూచి పలుకును. గోపికలట్టి వారు గారు. కృష్ణుఁడొకటి యన్న - వారు పది మాటలాడుదురు. మనసు లోనిభావమున్ను మాటుస్సేయుట్ట ఖా శైన్నడెఱుఁగన్ని విద్య. గోపికత్త

యసూయలు-ప్రేమలు-యీర్ష్యలు - ప్రణయకోపములు సర్వమును మఱు
ఉణమే గృష్ణునకుఁ దెలియవలసినదే! ఇఁక సత్యభామ - ప్రణయగర్విత -
రూపగర్విత - ద్రౌపది - కరుణాలులిత. సుస్వభావ. గురుపుత్త్రుఁ
డైన యశ్వత్థామ నర్జునుఁడు బట్టికొని వచ్చినాఁడు. ఆమె ద్రౌణిం
జూచి వినయమున మ్రొక్కినది. ఆమెకుఁ బ్రతీకార కాంక్ష లేదు. అమితమైన
యధర్మభయముగలది. ఆమెకును—

ఉ॥ యాదవులందు పాండవులయందు నధీశ్వర నాకు మోహ వి
చ్ఛేదము సేయుమయ్య" —

అని ప్రార్థించిన కుంతీదేవికిని భేద మేమాత్రమును భావింప లేమా ? ఇట్టి వాని
కంటెను - మఱి యేవిధమైన వైవిధ్యము గావలెనో నాకర్థమగుట లేదు.
వీరాశ్రయించిన భక్తిలో వైవిధ్యము లేదందురా! అట్లయినచో - నెందులో
భేదమున్నది. అంత యెందుకు ? మనము దినదినము దిను నన్నములో భేద
మున్నదా? శృంగారమున భేదమున్నదా? వాని నావిష్కరించు రీతులలో భేద
మున్నది! తినెడు నన్నములో భేదము లేదు. వ్యంజనములలో నున్నది.
అట్లే - భక్తిలో భేదము లేదు. భిన్న భిన్న చిత్తవృత్తులు - దానిని భావించి-
యనుభవించుటలో భేదమున్నది.

పోతన్న కవిత్వములో నౌచిత్యముచాలతక్కువ యని-యనేకులాతనిపై
వేయు మఱియొక యభాండము. అట్లు జూచినచో-తిక్కనవలె నౌచిత్య
మును బోషింపఁగల వారెందరున్నారు? కావ్యమున కౌచిత్యము కావలెనని
ప్రాచీనాలంకారికు లందఱును జెప్పినను - దానికెక్కువ ప్రాశస్త్య
మిచ్చినవాఁడు క్షేమేంద్రుఁడే! కాని - యాతని విషయముననే ప్రాచీనా
లంకారికులలోనే యేకవాక్యత లేదు. ఇంతగా నౌచిత్యమును బట్టి పెనగు
లాడిన క్షేమేంద్రుడు సంస్కృతములో - పదిమందిలో నొక్కఁడేగాని గొప్ప
ప్రశస్తికి వచ్చిన వాఁడుగాఁడు. ఇంతకును నా మనవి యేమనగా - నౌచిత్య
మనునది - కవిత్వమునకు గావలసిన గుణములలో నొక్కటియే గాని -

యౌచిత్యమే కవిత్వముగాదు. "ముక్కు మొగమునకుఁ గావలసిన యంద ములలో నొకటిగాని - ముక్కే మొగము గాదు గదా ! ఔచిత్యమనఁగా నేమి ? ప్రపంచమున నెట్లు జరుగుచున్నదో యట్లే జెప్పుట ! ఎట్లు జరుగు టకు వీలున్నదో యట్లు జెప్పుట ! ఇవి రెండును - ముఖ్యముగ — దేశకాల ములఁ బట్టి - హృదయ ధర్మమునుబట్టి - మారునవే ! తిక్కనామాత్యులదే యొక ఘట్టము జూడుఁడు. రాయబారమునకు వెడలుచున్న కృష్ణునితో పాండవు లైదుగురును — దమతమ యభిప్రాయములఁ జెప్పినారు. ద్రౌపది గూడఁ జెప్పఁదలచుకొన్నది. కృష్ణునకు రాయబార మిష్టములేనట్లే — ద్రౌపదికిఁ గూడలేదు. కాని కృష్ణుఁడు రాయబారమను వింత - యంత ర్నాటక మొకటి యాడుచున్నాఁడు. అతఁడు రాయబారము నంగీకరించు నేమో నని ద్రౌపది భయము. ఆ భయముతో నామె బ్రహ్మాండముగ విజృం భించినది. "వరమున బుట్టితిఁ భరత వంశము మెట్టితి" నను పద్యము మొదలుకొని - సుమారొక పది పద్యములతో ద్రౌపది యుత్తాల తాండవ మునే జేసెను. ఈ సన్నివేశము — నిజముగ - తిక్కనామాత్యుని గొప్ప సృష్టులలో నొకటి. ఆమె జుట్టు విరియఁబోసికొని కృష్ణునితో —

కం॥ ఇవి దుస్ససేను ప్రేళ్లం
దవిలి సగము త్రెవ్విపోయి, తక్కిన యవి కౌ
రవులకడ తీరుమాటల
యవసరమునఁ దలపవలయు నచ్యుత వీనిఁ॥

యని పలికినది. అపుడు కృష్ణుఁ డామె నోదార్పఁదలఁచి "కన్నీరు దుడువను-పెన్నెఱివేణి ముడువను"దగువారిని నియోగించెను. సాహితీ పరు లనేకులిక్కడ తిక్కనను తెగ బొగడుదురు. "ఆహా! తిక్కన యెంత యుచితజ్ఞుఁడు! ఎంత బాంధవ్యమున్నను-వయసులో నున్న స్త్రీని పర పురుషుఁడు తాకఁడు. తాకరాదు". ఈ లోకాచారము నిక్కడ చక్కగా కృష్ణుఁడు నిర్వహించినాఁడు. బ్రహ్మాండమైన యావేశముతో-కథ సాగిం

చీన తిక్కనామాత్యుఁడు—అంతటి రసోద్రేకమునఁగూడ నౌచిత్యమును మఱువలేదు. కవి రసమునందు లీనుఁడై పోయి-తన్ను మఱచిపోవు స్థితికి రారాదు. తక్కిన కవులెల్లరు నట్లైపోయి సన్నివేశమును జెఱతురు. ఇతఁ డొక్కఁడే సన్నివేశమును వెలయించును" అని నావంటి వాఁడొకఁడుండు ననుకొందము. ఏమయ్యా! కృష్ణుఁ డింతదయలేనివాఁడు! కృష్ణునకు—ద్రౌపదికిని-అన్నా చెల్లెండ్రవరుసగాదా! ఆమె తన యెదుట 'బావురు' మనియేడ్చుచుండగా-దటుకున లేచికన్నీరు దుడుచుటయో-యోదార్చుట యోజేయక—యింటి యల్లునివలెఁ గూర్చున్నాఁడు. ఆ పనిని దాసీలేసేయ వలెనా? ధర్మమునకు హృదయములేదా?"యని యాక్షేపించు ననుకొం దము. వానికి మన మొసఁగు సమాధానము? అట్లే "శరదాత్రిలో వేణు గాన మొనర్చు కృష్ణునికడ కున్మాదినులైన గోపికలు "పరాయత్తచిత్తలై-తత్తరించి పారుట నామనసున కంత బాగుగలేదు'' అని మఱియొకఁ డాక్షేపించును. వానికిని సమాధానము మన మూకీభావమే! ఏదో యొకరీతి కష్టపడి యౌచిత్యస్వరూపమును సాధించికొన్నను - ప్రతి సన్నివేశమందును - తీవ్రభావోద్రేకముతో బ్రతుకుట యెంత కష్టమో! అట్లే ప్రతి విషయమున నౌచిత్యమును పాటించుటంత కష్టము. పైగా నొక కావ్యమును విమర్శించునపుడు - వాని హృదయ తత్వమేదో మనము చక్కగా గ్రహింపవలయును. అంతేగాని - యే తిక్కననో, నన్నయ్యనో - మనసులోఁ బెట్టుకొని - "యీగుణము లీతనిలో లేవే!" యని విమర్శించుట యాకవికిఁజేయు ప్రబలమైన యన్యాయము. ప్రబంధ కవులకు తిక్కనలోని కావ్యగుణములు లేవు. వారందుకు వ్రాయలేదు. రాయలు తన వర్ణనావైశారద్యమును గన్పఱచుటకు కవిత్వమును రచి యించెను. కథ వొకచోట గూర్చుండుమని యాతఁడు వర్ణన లారంభించును. ఆతని ఋతువర్ణనముల గొడవలో - యామునాచార్యుఁ డేమైనాఁడో రాయలకుఁ గాబట్టదు. మనకును గాబట్టదు. తిక్కనామాత్యుని గుణములు రాయలలో లేవు. ఇతని గుణములు తిక్కన్నలో నున్నవా? యని నా

ప్రశ్న. ఔచిత్యమే కావ్యస్వరూపమైనచో నిన్ని యేండ్లనుండీ - యీ జాతికిం జెందిన గ్రంథముల నిందఱు సహృదయులెందుకుం జదువుచున్నారు? ఇంత కును జెప్పవచ్చినదేమనఁగా - నీ గుణములలోనే - కావ్యత్వమున్నదని తూకమువేయుట చాల కష్టము. అభిరుచి భేదములు ప్రబలముగఁ బని సేయును. ఉన్నంతవరకు తృప్తిపడి పోవుచుండవలసినదంతే! ఔచిత్యము నకుఁ బట్టాభిషేక మొనర్చిన తిక్కనయును - "అరవిందనయన, చంద్రముఖి" యిత్యాది శబ్దముల బహిష్కరింపలేదుగదా! 'అరవింద చరణ' యను విశేషణము నతఁడు గూడ వాడును. ప్రపంచమున నెంత యందకత్తెయైనను దానికి - పద్మములు పాదములుగ నుండవు. ఒకవేళ నుండినను - ఆమె నడచుటయును - మనము చూచి సహించుటయును పచ్చియబద్ధము. స్వభావవాదమును సాగబీకినఁ గలుగు ప్రయోజనమింతే! ద్రౌపదిదగ్గఱ కశ్వత్థామను బట్టుకొనివచ్చినారు. అపుడామె యతనిని వదలిపెట్టుమనెను. అందఱు సమ్మతించిరి. భీముఁడు మాత్ర మొప్పికొనలేదు. అతఁడు—

చ॥ కొడుకులఁ బట్టి చంపెనని కోపముచెందదు బాల ఘాతకున్
విడువు మటంచు జెప్పెడిని వెఱ్ఱిది ద్రౌపది వీఁడువిప్రుఁడే
విడువగనేల చంపుడిటు వీనిని మీరలు జంపరేని నా
పిడికిటిపోటునన్ శిరము భిన్నముసేసెద జూడుఁ డిందఱున్॥

అని యశ్వత్థామపైఁ బడినాఁడు. అపుడు వ్రాసిన వచనమిది :

"వ. అశ్వత్థామకు ద్రౌపది యడ్డంబు వచ్చె. భీముని సంరంభంబు సూచి హరి చతుర్భుజుండై రెండు చేతుల భీముని వారించి- కడమ రెంటను ద్రుపదపుత్త్రికను దలంగించి నగుచు నిట్లనియె."

— యీ వచనమును జదివిన యెవరైనను - "ఏమయ్యా! మీ కృష్ణుఁడు గొప్ప మంత్రవాదివలె నున్నాఁడే!. అంతకుముందతనికి రెండు చేతులేగదా యుండెను? భీముఁడు కోపించినవెంటనే చిటికలో - మంత్రమువేసి మరి

రెండు చేతులు తగిలించికొన్నాఁడే? అవి యట్టచేతులా? నిజమైన చేతులా?" యని యడుగవచ్చును. వారిదృష్టిలో నిట నౌచిత్యము చెడినది. అందుకే యొక కావ్యమును విమర్శించునపుడు కవి విశ్వాసముపై మనకు సానుభూతి యుండవలెనని మనవిజేసితిని. పోతన్న దృష్టిలోఁ గృష్ణుఁడు — మన మనుకొన్నట్లు మనుష్యుఁడుగాఁడు. ఆయన సర్వశక్తుఁడు. సర్వాత్ముఁడు. సర్వనియంతయైన పరమేశ్వరుఁడు. కనుక తన కిష్టమువచ్చినట్లు చేయగలఁడు. ఈ భావమును మనము మనసులో నుంచికొన్నచో — హరి — హఠాత్తుగ చతుర్భుజుఁడైనాఁ డనినప్పుడు ఔచిత్యము సెడవలసిన పనిలేదు.

ఇది యొకటేగాదు. ఇట్టి ఘట్టము లడుగడుగునను పోతన్నలో నగుపడును. కృష్ణుఁడు ద్వారకకుఁ బ్రయాణమగుచు — పాండవుల వీడ్కొని రథారోహణము సేసెనట! తిక్కనామాత్యుఁడైనచో — నీ వీడ్కొనుట యెట్లో — పరస్పర సంభావనము లెట్లు నడచెనో — మన కన్నుల యెదుట జరగుచున్నట్లు చిత్రించియుండును. పోతనామాత్యున కట్టివానిపై దృష్టి లేదు. ఇంతలో నొక సన్నివేశమేర్పడినది. ఉత్తరాగర్భమును భేదించుటకై యశ్వత్థామ బ్రహ్మ శిరస్సును బ్రయోగించెను. ఆ యాపద నెఱిఁగిన గృష్ణుఁడు - దానిని జక్రముతో భేదించినాఁడు. అపుడు — కుంతి కృష్ణుని సమీపించినది. ఆమె యతనికి మేనత్త. వయసున బెద్దది. న్యాయముగ గృష్ణుఁడామెకు నమస్కరించుటయు - కుంతి యాశీర్వదించుటయు లౌకికమైన యౌచిత్యము. కాని — యామెదృష్టిలో — గృష్ణుఁడు మేనల్లుఁడు గాఁడు. "సకలప్రాణి హృదంతరాళముల భాస్వజ్జ్యోతియైయుండు సూక్ష్మకళుఁడు." ఆమె వచ్చుటయే తడవు.

కం॥ పురుషుం డాద్యుఁడు ప్రకృతికి<br>
బరుఁడవ్యయుఁ డఖిలభూత బహిరంతర్భా<br>
సురుఁడును లోకనియంతయు<br>
బరమేశ్వరుఁడైన నీకుఁ బ్రణతులగుహరీ!॥

అని యారంభించి ప్రణతు లొనరించినదట! ఆ ప్రణతికిఁ గృష్ణుఁ డియ్యకొన్నాఁడు. లోకములో - మేనత్త - అల్లుఁడు, వీరినడుమ నిట్టి ప్రవృత్తి యెక్కడనైన నుండునా? కాని — యాక్షేపణకు ముందు — కుంతి - కృష్ణుని మేనల్లునిగా నర్థము సేసికొనలేదనుట మనము మఱచి పోరాదు. అపు డీ యనౌచిత్యమంతయు నౌచిత్యముగ మారిపోవును. ఇట్టి ఘట్టములు - అనుభవములు ప్రపంచములో జరుగుట యరుదైనను జరుగక పోవు. విరక్తుఁడై వనములకు వెళ్లుచున్న తులసీదాసు భార్యకుఁ బ్రదక్షిణ మొనరించి - నమస్కరించి వెడలిపోయెనట! అతని దృష్టిలో నామె భార్య గాదు. జ్ఞానదాత్రి. మొన్న మొన్నటి రామకృష్ణ పరమహంసయు శారదా దేవిని దేవిగానెంచి - పూజలొనర్చెడువాఁడట! "కాదయ్యా! మనము మానవులము. పాత్రలయందు మన ప్రవృత్తులెంతగా జితములైన వారు మనకంత దగ్గరవత్తురు. అపుడే మనకు వారితో తాదాత్మ్యము బొందు నదృష్టము గల్గును. లేకున్న వారిపై మనకు సానుభూతు లేర్పడవు" అని యందురా! మానవులలోను, అందరికిని నన్నిభావముల యందును - అను భూతి సమానముగ నుండునా? కాళిదాసు కుమారసంభవములో - పార్వతీ పరమేశ్వరుల ప్రణయలీలలను - విస్తరించి వర్ణించెను. ప్రాచీనాలంకారికుల లోనే - కొందరిది యనౌచిత్యమని నిందించిరి. ఇది బాగుగనున్నదని యభి నందించినవారును లేకపోలేదు.

చదివిన వారికి - చదువుతోపాటు - తక్కిన యన్ని గుణములును మెండేనేమో! ప్రాచీన కాలమున - చాల మందికవులు-పోతనామాత్యు నకు — చూపవలసినంత గౌరవము జూపలేదు. అప్పకవివంటి తిమ్మప్ప లాతనిలో - 'అది లేదిది లే'దని - వ్రేళ్లుబెట్టి చూపుట మానినవారు కారు. ఎంతచేసినను - ప్రజాసామాన్యమున - భాగవతమునకున్న పలుకుఁబడి— యద్వితీయమైనది. భద్రాద్రిరాముని తరువాత—ప్రజలు గౌరవించునది— బమ్మెర పోతన్ననే. కవితా దృష్టితోను - భారత కవుల తర్వాత—జ్ఞాపక

మునకు వచ్చునది భాగవతమే. కొన్ని విషయములలో పండితులకంటెను— పత్రికాసమాజము–న్యాయమును చక్కఁగా నిర్ణయించును.

ఈ నడుమ పండితులలో యీ దృష్టి కొంతతగ్గు మొగము వడినది. సంతోషింపఁ దగిన విషయమే! కాని యాతని కవిత్వముపై తీసికొన వలసినంత దయను మాత్రము–విమర్శకు లీ నాటికిని గైకొనుటలేదు. తిక్కన్నపై నెన్నియో చక్కని విమర్శనములు జరిగినవి. శ్రీనాథుఁడు – రాయల యుగము మొదలగు వానిపై – తత్త్వజ్ఞులు తోడితోడి రహస్య ములను దవ్వియెత్తుచున్నారు. ఈ పట్టుదలలో—అర పాలైనను పోతన్నకై ఖర్చుబెట్టిన పుణ్యాత్ములు లేరు. భాగవతము శుద్ధమైన ప్రతి – యిప్పటికిని లేదన్నచో – యిదియే చాలును మన రసికతకు! సాధారణముగ ఆంధ్ర గ్రంథములే తప్పుల ప్రోవులు. పాఠములను సవరించుటలో పండితులు సవ్య సాచులు. ఎవరో వేటూరి ప్రభాకర శాస్త్రులవంటివారు పరిష్కరించిన యొకటి రెండు గ్రంథములకుఁదప్ప — తక్కిన వాని కన్నిటికిని యీ శని దోషముండనే యున్నది. అందులోను భాగవతమునకుఁ బట్టిన ఘోరదశ యింతంతగాదు. దీనికి బాధ్యులెవ్వరు? ఈ విషయమున మన యూనివర్సిటీ లను తప్పుబట్టుటకు వీలులేదు. కారణమేమనఁగా – ఆంధ్రభాషకు సరియైన నిఘంటువును దయారు చేసికొనవలె నననంతవరకైనను – వారి దివ్యచిత్త ములకు నేటికిని రాలేదు. అట్టిచో గ్రంథములను బరిష్కరించి ప్రకటించు బాధ్యతఁగూడ వారిపై నుంచిన – పాపము చాలకష్టపడుదురు. పోతనా మాత్యుఁడు గావించినది భాషాంతరీకరణమే ననుట– అందరకును దెలిసిన విషయమే! ఈ పరివర్తనలో నాతఁడు జూపిన మెలకువలెన్నియోయున్నవి. పరివర్తన మనఁగా నాతనిది కేవలము బల్బజమైన – అన్ని రీతులుగను మూలమునకు పరమ విధేయమైన — పరివర్తనముగాదు. వ్యాసభగవానుని యీక్రింది శ్లోకమును గమనింతము గాత!

"అతఃతుమ స్వాచ్యుత మేరజోభు వో
హ్యజాన తస్త్వ త్పృథగీశమానినః

అజావలే పోంధ తమోంధ చతు షో
హ్యాషోను కం ప్యోమయి నాథవాని తి
క్వాహం తమోమహదహం ఖచరాగ్ని వార్భా
సంవేష్టి తాండఘట సప్త వితస్తి కాయః
కే దృగ్విధాఽవిగణి తాండ పరాణు చర్యా
వా తాధ్వరోమ వివరస్య చ తే మహిత్వం !
ఉత్క్షేపణం గర్భగతస్య పాదయోః
కింకల్ప్యతే మాతు రథోక్షజాగసే ?
కిమస్తి నాస్తి వ్యపదేశ భూషితం
త వాస్తి కుక్షేః కియదప్యదంతః (ద. 10-14)

-పై శ్లోకములకు పోతన్న యొనర్చిన తెనిఁగింపు యిది.

సీ॥ సర్వేశ! నే రజోజనితుండ! మూఢుండ
ప్రభుఁడ నేనని వెట్టి ప్రల్లదమున
గర్వించినాఁడను, గర్వాంధకారాంధ
నయనుండఁ గృపఁజూడు నను బ్రధాన
మహదహంకృతి నభోమరుదగ్ని జలభూమి
పరివేష్టితాండ కుంభంబులోన
నేఁడు జేనలమేన నెనయు నేనెక్కడ!
నీ దృగ్విధాండంబు లేరికైన

తే॥గీ॥ సంఖ్య సేయంగ రానివి సంతతంబు
నోలి బరమాణువుల భంగి నొడలి రోమ
వివరములయందె వర్తించు విపుల భూతి
నెనయుచున్న నీ వెక్కడ! యెంత కెంత॥ (ధ. పూ. 557)

తర: కడుపు లోపలనున్న పాపఁడు గాలఁదన్నినఁ గిన్కతో
నడువబోలునె క్రాఁగి తల్లికి, నాద్య! సన్నము దొడ్డనై

యడఁగి కారణకార్య రూపము లైన యీ సకలంబు నీ
కడుపులోనిది గాదె పాపఁడఁ గాక నే మఱి యెవ్వఁడన్ ।

'పాపఁడఁగాక నే మరియెవ్వఁడన్' అని బ్రహ్మదేవుఁడు కృష్ణ పర మాత్మ హృదయమును బళ్ళించు ప్రశ్న పోతనామాత్యులు తయారు చేసి నదే! సీస పద్యములోని "నే నెక్కడ! నీ వెక్కడ?" అని తెచ్చిపెట్టిన పలుకు బడి పోతనామాత్యునిదే! సంస్కృతములో నున్నదే యైనను ఆస్వారస్య మును చెఱుపక తెనుఁగునకు తెచ్చుట యొక చాతుర్యమే! 'ఎంత కెంత' అనునది ఆంధ్రకవి వేసికొన్న కొసరు. ఈక్రిందిది వ్యాసుల మరియొక శ్లోకము.

"శ్రేయ స్సృతిం భక్తిముదస్యతే విభో
క్లిశ్యంతియే కేవలబోధ లబ్ధయే
తే షామసౌక్లిశలయేవ శిష్యతే
నాన్యద్యథాస్థూల తుషావ ఘాతినాం॥

దీనికిది తెనిఁగింపు.

కం॥ శ్రేయములు గురియు భక్తిని
జేయక కేవలము బోధసిద్ధికి దపముల్
జేయుట విఫలము పొల్లున
నాయము సేకురునె తలఁప నధికం బైనన్. (10-541)

'స్థూల తుషావఘాతినాం' అను పదమును-దాని స్వరూప యోగ్య తను పాడుసేయక 'పొల్లున ఆయము సేకురునె?' అను తెనుఁగు తనముతో గూడ ఆంధ్రమునకు కొని తెచ్చిన పోతనామాత్యుల చాకచక్యము-ఎంతై నను కొనియాడఁదగినది. మరికొన్ని యెడల - అనఁగా మూలము క్లిష్టము గనో - అనన్వితముఁగనో యున్నచోట వ్యాఖ్యానమును తోడు గైకొని యా విషయముల నాంధ్రమునఁ జొప్పించుటయు నాతఁడొనర్చిన పద్ధ తులలో నొకటి. ఇంతేగాదు. 'సామాన్యమైన చోటులలో గూడ శ్రీధరు

లొక నూత్న ఫక్కితో వ్యాఖ్యానించి మూలమునకు మెఱుగు వెట్టుదురు. అప్పుడు పోతనామాత్యులును - శ్రీధరుల ప్రతిభకు మెచ్చుకొన్న వారు వోలె - వారిమార్గమునే యనుసరించి పోదురు. ఇదిగో వ్యాసభగవానుల శ్లోకము.

నైమిశేఽనిమిష క్షేత్రే మునయశ్శౌనకాదయః
సత్రం స్వర్గాయ లోకాయ సహస్రసమమాసత!

సామాన్యముగఁ జెప్పినచో 'అనిమిష క్షేత్రే' అనుశబ్దమునకు 'దేవతలు వసించుచోటు అని మాత్రమే యర్థము. 'స్వర్గాయలోకాయ' అనుటకును 'స్వర్గఫల ప్రాప్తి' కవి వ్యాఖ్యానము. ఇంతమాత్రమే వ్యాసుల యభిప్రాయమైయుండునని నాయూహా! ఈయర్థము శ్రీధరులకు రుచింప లేదు. వేయియేండ్లు సత్రయాగమును జేసి ఋషులు స్వర్గమునుగోరుట అతని దృష్టిలో మూఁడేండ్లు కసరత్తుజేసి మూలనున్న ముసలమ్మను గొట్టి నట్లున్నది. అందుచే నాయన "స్వః = స్వర్గే గీయత, యితి స్వర్గాయోహరిః = సయేవలోకః-భక్తానాం నివాసస్థానం-తస్మైతత్ప్రాప్త్యయ యిత్యర్థః" అని వ్యాఖ్యానించెను. 'అనిమిష' శబ్దమునకు గూడ అతనికి వేరు వ్యాఖ్యానముగావలసి వచ్చినది. 'అనిమిషుఁ'డను పదమునకు శ్రీవిష్ణువని శ్రీధరుని వ్యాఖ్య. కాని యీయర్థము ప్రసిద్ధముగాదు. ఆ కొదువను పూరించుటకై "అలుప్తదృష్టిత్వాత్" అను ముక్కను తగిలించెను. దీని కుపస్కారకముగ "క్షేత్రేస్మిఀ వైష్ణవేవయం" అను శ్లోకాంతరమును గూడ యీచోట నుట్టంకించినాఁడు. శ్రీధరుఁడు చేసిన యీ వ్యాఖ్యానము పోతన్న కెంతయో రుచించెను. అతఁడుగూడనట్లే.

"శౌనకాది మహామునులు స్వర్లోకగీయమానుండగు హరిం జేరు కొఱకు సహస్రవర్షంబు లనుష్ఠానకాలంబుగాగల సత్రసంజ్ఞకంబైన యాగంబు సేయుచుండిరి.

(ప్ర. స్క. ३९)

అని పరివర్తించెను. తన కభిమానమైనచోటుల మూలమును విడచి స్వకపోల కల్పితమైన కథ నాతఁడు జెప్పికొనుచు బోవును. తన యభి రుచులకు భిన్నముగ నున్న చోటులను మూలము నాతఁడు వదలుట కద్దు. అట్టిచోటులలో పోతనామాత్యులు వ్యాఖ్యాతల యభిప్రాయమును గూడ లక్ష్య పెట్టరు. వ్యాసభగవానుని శ్లోకమిది.

తతోఽతికుతుకో వ్యాత్యస్మిమితై కాదశేంద్రియః
తద్ధామ్నాఽభూదజస్యాక్ష్ణిం పూర్దేవ్యం తీవపుత్త్రికా।

పై శ్లోకమందలి యలంకారము సహజముగలేదు. పైగా ఉపమా నము స్త్రీలింగములో నున్నది. ఇది యలంకారములో నొక దోషము గూడ గదా! శ్రీధరులకును నీసందర్భము బరువైయైనదేమో! వారి వ్యాఖ్యానము కొంత ద్రావిడ ప్రాణాయామముగా నడచినది. శ్రీధరుల వ్యాఖ్యానమిది.

పూర్దేవీ = ప్రజాధిష్ఠాత్రీకాచి ద్దేవతా
తస్యాః అంతి = సమీపే, పుత్త్రికా = చతుర్ముఖీ కనక ప్రతిమేవ."

ఆమూలమును-యీవ్యాఖ్యానమును - రెండును పోతనామాత్యు లను దృష్టిపఱచినట్లు లేదు. అందుకే యాతఁడు - ఆ యుపమానమును చల్లగా జారవిడచినాఁడు.

పోతన్న యనేక చోటుల వ్యాసులతో పందెమువేసికొనినడచినట్లుం డును. అట్టి ఘట్టములు-అడుగడుగునను మనకు కనిపించును. చూడుడు- అంబరీషునకు క్రమక్రమముగా వైరాగ్య మభివృద్ధిని పొందినది. అపుడు వ్యాసులిట్లు వ్రాసిరి.

"గృహేషు దారేషు సుతేషు బంధుషు
ద్విపోత్తమ స్యందన వాజ పంక్తిషు

అక్షయ్యా వస్త్రాభరణా యుధాధిషు
అనంతకో శేష్యకరో దసన్నతిం

- దీనికి పోతన్న తెనిఁగింపు.

ఆ. వె. అతనికీ హమానె హరులందుఁగరులందు
ధనములందు కేళివనములందు
పుత్రులందు బంధు మిత్రులయందును
పురమునందు నంతిపురమునందు. (న. 88)

మూలమునందు సప్తమీబహువచనము అప్పుడప్పు డావర్తింపబడుట మీకు విదితమే! దానితో నొక సౌందర్య మాశ్లోకమున కేర్పడినది. దానిని గమనించిన పోతన్న యావిభక్తి నల్లే తెనుఁగునందు బొందించెను. పైగా 'హరులందు గరులందు' యిత్యాది ప్రాసలు—ఆతఁడు మూలమునకు దిద్దిన మెఱుఁగులు. చక్రమును వర్ణించుచు వ్యాసభగవానుఁడు.

"తస్మా, అదాద్ధరిశ్చక్రం ప్రత్యనీక భయావహం
ఏకాంత భక్తి యోగేన ప్రతోభితాభిరక్షణం"

అని శబ్దాలంకారమునకు త్రోవఁజూపెను. పోతన్న "ప్రతిభట శిక్షణంబును, నిజ జనరక్షణంబును, నిఖిల జగదవక్రంబునగు చక్రంబు నిచ్చి చనియె యని యా రసవాద విద్యను బూర్తిజేసినాఁడు. ఇంతమాత్రమే గాదు. కుంతీదేవి కృష్ణపరమాత్మను స్తుతించుచు——

"కృష్ణాయ వాసుదేవాయ, దేవకీనందనాయచ
నందగోపకుమారాయ గోవిందాయ నమోనమః
నమః పంకజనాభాయ నమః పంకజమాలినే
నమః పంకజ నేత్రాయ నమస్తే పంకజాంఘ్రయే॥

- అని స్తుతించినది,

"శ్రీకృష్ణ! వాసుదేవ! దేవకీనందన! నందగోపకుమార! గోవింద! పంకజనాభ! పద్మమాలికాలంకృత! పద్మలోచన! పద్మసంకాశచరణ! హృషీకేశ! అని మూలమునందలి నామవాచకములను విడువక - వానినన్నిటిని వైజయంతీమాలికగ గూర్చి సుందరముగ నొనర్చినవాఁడు పోతన్న!

వ్యాసుఁడొకసారి భావమును సూచించివదలును. ఆ వ్రేలుబట్టుకొని యాంధ్రకవి హస్తమంతయు మ్రింగును. అనఁగా వ్యాసుని హృదయమును - పరిపూర్తిగ వివరించుమనన్నమాట! అంబరీషుని భార్యనుగుఱించి చెప్పుచు వ్యాసులు—

"మహిష్యా తుల్యశీలయా" యని పలికినాఁడు. దానికి పోతన్న

"తనతోడి నీడకైవడి
ననురూప గుణాఢ్యయైన యాత్మమహిషితో"

అని వ్యాసుల భావమును విశదీకరించెను. వ్యాసులతో మాటలాడుచున్న నారదునిగుఱించి వీణాపాణిః స్మయన్నివ" అని మాత్రమే మూలమున నున్నది. దానిని "లేనగవు నెగడెడి మొగంబుతోడ, విపంచికా తంత్రివ్రేల మీటుచు" అని పోతన్న వ్యక్తీకరించిరి. కథా సన్నివేశమును రచించుటలో పోతన్న మెఱుఁగువెట్టిన చోటు లనేకములు గలవు. ముఖ్యముగా "వామనచరిత్ర, ప్రహ్లాదచరిత్ర! కాలయవనుని కథ! గజేంద్రమోక్షము - మొదలగువానిలో నాయన చూపిన కవితాచాతుర్య మమోఘమైనది. కథలలో కొన్నియెడల రసానుబంధియగు వర్ణనలు అతఁడే సొంతముగ గావించుకొనుచు పోయినాఁడు. నారదుని వృత్తాంతమందు సర్పమును వర్ణించుచు జెప్పిన పద్యములో—

"నీలాయత భోగఫణ
వ్యాళానల విషమహోగ్ర వహ్నిజ్వాలా
మాలావినిపాతితయై..."

యన్న సమాసమతనిదే! వ్యాసులకడకు నారదుఁడు వచ్చినపుడు ఆతనిని వర్ణించుచు వ్రాసిన సీసము పోతన్న కల్పన.

శుక్రాచార్యుఁడు దానమీవలదని బలితోనన్నాఁడు. ఇచ్చినచో నీకు నాశము తప్పదనెను. అట్లు హితముజెప్పిన కులాచార్యుని మాటలు విని మూలమునందు "తూష్ణీం భూత్వాక్షణం" అని మాత్రమేగలదు. ఆ బలికి "క్షణమాత్రనిమీలితలోచనుండై" యనుట పోతన్న జేసిన ప్రాణప్రతిష్ఠ. అట్లే యంబరీషుని చరిత్రలో "వెఱ్ఱితపసి చేయువేడబంబు" చక్కబెట్టుమని శ్రీ మహావిష్ణువన్నమాటలును పోతన్నవే! ఒక్కొక్కసారి రసోత్పాదనకై వ్యాసులు చెప్పక విడచినభావము యొక్క కొసరును యితఁడు పూరించుట వలె పలుకును. తమకొకటి రెండు మాత్రము మనవి సేతును. హిమవద రణ్యములలోఁ బ్రవేశించుచున్న ధృతరాష్ట్ర మహారాజును నియమశీలయైన గాంధారిగూడ వెంబడించినది. ఆమెనుగుఱించి వ్యాసులిట్లన్నారు.

"పతిం ప్రయాంతం సుబలస్య పుత్రీ
పతివ్రతాచాను జగామసాధ్వీ
హిమాలయం న్యస్తదండ ప్రహర్షం
మనస్వి నామివసత్సం ప్రహారః"

ఈ ఘట్టమున పోతన్న రెండు పద్యములు వ్రాసినాఁడు. అవి యీ క్రిందివి.

శా॥ అంధుండైన పతిన్ వరించి పతిభావాసక్తి నేత్రద్వయీ
బంధాచ్ఛాదనమున్ ధరించి నియమ ప్రఖ్యాతయైయున్న త
ద్గాంధారక్షితినాథు కూతురును యోగప్రీతి చిత్తంబుతో
సంధిల్లం బతివెంటనేఁగె నుదయత్సాధ్వీ గుణారూఢయై॥

చ॥ వెనుకకురాక చొచ్చు రణవీరునికైవడి, రాజదండనం
బునకు భయంబులేక వడిబోయెడి ధీరునిభంగి, యప్పుడా
వనిత దురంతమైన హిమవంతము పొంతవనాంత భూమికిన్
జెనిమిటితోడ నించుకయు భీతివహింపక నేఁగె బ్రీతితోన్॥

వీనిలో మొదటిది 'పతివ్రతా' సాధ్వీ అను పదములకు పోతనామాత్యుఁడు జేసిన వ్యాఖ్యానము. రెండవపద్యములో మొదటి యుపమానము వ్యాస భగవానుఁడు వాడినదే! రెండవది పోతనామాత్యుఁడు జేసిన చేర్పు. ఇది సమకాలికమైన భావమేమో! ఎట్లైనను మొదటి యుపమానము బూరింపని గుణవిశేషములనిది కూడ గట్టుకొనుచున్నది. చక్రిమునకు వెఱచి దుర్వాసుఁడు శ్రీ మహావిష్ణువునే శరణుజొచ్చినాఁడు. అపుడాయన యిట్లనెను.

"నాకు మేలుగోర నా భక్తులకకాని
భక్తజనులకేన పరమగతియు
భక్తుఁడెందు జనిన పరతెంతు వెనువెంట
గోవువెంటఁ దగులుకోడెభంగి."

భాగవతము చదువుటకు రానిపల్లెటూరి వారుగూడ యీ యుపమానము పోతన్నదని యెఱుగుదురు. అనగా జనసామాన్యములో నిదియంత ప్రసిద్ధము. అనర్ఘరత్నమును బోలిన యీ యుపమానము పోతనామాత్యునిదే! కృష్ణుఁడు నిర్యాణము చెందినాఁడు. కృష్ణవిరహముచే కర్శితుఁడైన యర్జునుఁడు హాస్తినావతికి వచ్చెను. అపుడు కవ్వడివాలకమును జూచి కలఁగిన ధర్మరాజు ద్వారకలో సమాచారమేమని ప్రశ్నించెను. అర్జునుఁడు కన్నీరు కరతలంబునం దుడిచికొనుచు "మహానిధిం గోలుపోయిన పేద చందంబున" నిట్టూర్పులు నిగిడించుచు బదులు పలికెనట! సందర్భశుద్ధి గలిగిన యీ యుపమానము సహజ పాండిత్యునిదే! వెంటనే యర్జునుఁడిట్లు దుఃఖమును గుప్పించినాఁడు.

క॥ మనసారథి మనసచివుఁడు
మన వియ్యము మన సఖుండు మన బాంధవుడున్
మన విభుడు, గురుడు, దేవర
మనలను విడనాడి చనియె మనుజాధీశా!

(ప్ర. స్క. 358)

పోతన్న జేసిన శిల్పమిది. మూలమునందు బల్బజములుగ నుండు ...ట్టములకు గూడ మహత్తరమైన తనధారాశుద్ధిచే పోతన్న కావ్యత్వము ...పాదించును. అర్జునుఁడు వచ్చినపుడు ధర్మరా జిట్లడుగుచున్నాఁడు,

"కచ్చిత్తే ఽనామయం తాత! భ్రష్టతేజా విభాసిమే
అలబ్ధమనోఽవజ్ఞాతః కింవాతత్ర చిరోషితః
కచ్చిన్నాభిహతో భ్రావైశ్శబ్దాది భిరమంగళైః
నదత్తముక్త మర్థిభ్యః ఆశయా యత్ప్రతిశ్రుతమ్.

కచ్చిత్త్వం బ్రాహ్మణం బాలం గాంవృద్ధం రోగిణః స్త్రియమ్
శరణోపసృతం సత్వం నాత్యాక్షీశ్శరణప్రదః
కచ్చిత్త్వం నాగమోఽగమ్యాం గమ్యాం వాసత్కృతాం స్త్రియమ్.
పరాజితో వాధభవాన్నోత్త మైర్నాసమైః పథి."

ఇత్యాదులు వ్రాసెను. ఈ బల్బజమైన విషయము గైకొని—

కII ఓడితినో! శత్రువులకు
నాడితినో! సాధు దూషణాలాపములన్
గూడితినో! పరసతులను
వీడితినో! మానధనము వీరుల నడుమన్. (ప్ర. 354)

కII తప్పితినో! యిచ్చెదనని
చెప్పితినో! కపటసాక్షి చేసినమేలున్
దప్పితినో! శరణార్థుల
రొప్పితినో! ద్విజులఁ బసులరోగుల సతులన్. (355)

కII అడిచితినో! భూసురులను
గుడిచితినో! బాలవృద్ధ గురువులు వెలగా
విడిచితినో! యాశ్రితులను
ఘుడిఛితినో! పరులవిత్తములు లోభఘునన్. (356)

అనుమూఁడు పద్యములలో పోతన్న తెనిఁగించెను. ఈ తెనిఁగింపులో మూలమును మహత్తర విషయముగ భాసింపఁజేసినాఁడు. అవశ్యఁడై పాండవుల కడనున్న ధృతరాష్ట్రు నుద్దేశించి విదురుఁడు గృహామునువదలి తపశ్చర్యకు బూనుకొనవలసినదని కొన్ని న్యాయనిష్ఠురములు పలికెను. అందులో ధృతరాష్ట్రుని శోచనీయమైన స్థితిని గూడ నాతఁడు వివరించినాఁడు. వానిలో నొక వాక్యమిది.

"భీమాప వర్జితం పిండం ఆదత్తే గృహాపాలవత్."

పాండవులందరిలోను భీమునికి ధృతరాష్ట్రుఁడన్నమంట! దానిని మనసులో నుంచికొనియే విదురుఁడు "భీమాపవర్జితమ్" అనెను. పోతనామాత్యుఁడా భీముఁడేమనునో యిట్లు విస్తరించినాఁడు.

క॥ బిడ్డలకు బుద్ధిసెప్పని
గుడ్డికి పిండంబువండికొని పొండిదె పైఁ
బడ్డాడని భీముండొాఅ
గొడ్డెములాడంగ కూడు గుడిచెద వధిపా!

ఇందులో 'గృహ పాలవత్'యని విదురుఁ డొక యుపమానము చెప్పెను. 'కుక్కవలె' నన్నమాట. ఎంతచెడినను ధృతరాష్ట్రుఁడు చక్రవర్తి. ఆతని నీమాట యనిపించుట పోతన్న కిష్టములేదు. దానిని తొలఁగించినాఁడు.

అంబరీషునిపైకి దుర్వాసుని 'కృత్య' వచ్చినది. ఆసందర్భమున వ్యాస భగవానుఁడు: "నచచాల పదాన్నృపః" అని వర్ణించెను. ఈ వర్ణనములో పోతన్నకు గొంత గర్వము ధ్వనించినదేమో! దానిని తిన్నగా వదలివేసినాఁడు. అట్లే దుర్వాసుఁడు తన్ను శరణువేడినపుడు వ్యాస భగవానుఁడు "మేనే స్వవీర్యంచ పరానుభావం" అనుముక్కను వాడెను. అనఁగా తన ధైర్యాది గుణములును—భగవంతుని ప్రభావము-రెండును ఆరాజునకనుభవ

మునకు వచ్చెనని యర్థము. ఈ ముక్కను పోతన్న మెలకువతో తొలగించి-

"తపసినెగులు మాన్ప తానెంతవాఁడను
హరి కృపామహిత్వమనుచుదలఁచి..."

అని యంబరీషుని యొక్క పరమ భాగవత ధర్మమునకు మెఱుఁగులు దిద్దినాఁడు. నారదుని కథలో వనవర్ణనము వచ్చును. ఆ వనమును వ్యాసుఁడిట్లు వర్ణించెను.

"చిత్ర ధాతు విచిత్రాద్రీన్, యిభ భగ్నభుజద్రుమాన్
జలాశయాన్ శివజలాన్ నలినీ స్సురసేవితాః"

దీనిని పోతన్న యిట్లు తెనిఁగించెను :

"సమద కరికర విదళిత శాఖలుగల శాఖులు (ప్ర. 120) ఈ తెనిఁగింపులో-వ్యాసుని రచనకు వ్యాఖ్యాన ప్రాయముగా పోతన్న రచన-కొఱఁతల నెట్లు పూరించుచుబోవునో తమ చిత్తమునకు వచ్చెనని తలఁతును. ప్రథమస్కంధములో పారితర్హ్యాతహా తాగ్నయః"అని వ్యాసులు వ్రాసినారు. ఈ ముక్క వ్యాఖ్యాన సాపేక్షము. దీనికి శ్రీధరులు "అనేన నిత్యనైమిత్తిక హోమసాకల్యం దర్శితం"అని వ్యాఖ్యానించిరి. అట్లే పోతన్నయు"నిత్యనైమిత్తిక హోమంబులాచరించి"యని వ్యాఖ్యాన విషయము నట్లే దీసికొనెను.

దశమస్కంధమున నీశ్లోకమున్నది.

"నారాయణస్త్వం నహి సర్వదేహినాం
ఆత్మాస్యధీశోఽఖిలలోకసాక్షీ
నారాయణోంగం నరభూజలాయనాత్
తచ్చాఽపిసత్యంన తవైవమాయయా!

(10. 14. 13)

ఈ శ్లోకమునందలి నారాయణ శబ్దమునకు శ్రీధరులు మూఁడు నాల్గు రీతులుగ వ్యాఖ్యానమును జెప్పిరి. ఈ సందర్భమున పోతనామాత్యుఁడు :

"నలినాక్ష నీ వాదినారాయణుండవు
జలము నారము జీవచయమునా ర
మందు నీవుంట నీయందివి యుంటను
నారాయణుండను నామమయ్యె" (10-560)

అని స్పష్టముగ తన యభిప్రాయమును జెప్పివేసినాఁడు. ఇట్లొక్కొక్కసారి యాతఁడు వ్యాఖ్యానమునకు భిన్నముగ చెప్పును. తిక్కనామాత్యులకు యుద్ధ వర్ణనములు వచ్చినప్పుడు-మూఁపులు మూఁడగును. పోతనామాత్యులకు వేదాంతమును వివరింపవలసి వచ్చినప్పుడట్టి యావేశ మావహించును. అస్పష్టముగ-లేక గ్రహించుటకు కష్ట సాధ్యముగా నున్న వ్యాసుల వేదాంతశ్లోకములను వారెంతో యాప్యాయముగ వర్ణింతురు. ఇంద్రియములను దమించుట మొదలగు ఘట్టములలో పెద్ద పెద్ద సమాసము లుపయోగించి - యుద్ధరంగ వర్ణనమువలె హడావిడి సేయుట పోతనామాత్యుల కలవాటు. కామక్రోధాదులనుదమించు వేదాంతి యుద్ధ వీరుఁ డెందుకుగాఁడు? ఈ క్రింది వ్యాసుల శ్లోకమును పోతన్న యెంత సుకరముగ-రమణీయముగ తెనుఁగులోనికి తెచ్చినాఁడో చిత్తగింపుఁడు.

"ఏకాయనోఽసౌద్విఫలః త్రిమూలః
చతూరసః పంచశిఖః షడాత్మా
సప్తత్వగష్ట విటపోనవాక్షో
దశచ్ఛదో ద్విఖగోహ్యాదివృక్షః." (10.2.29)

సీ॥ ప్రకృతి యొక్కటి పాదు ఫలములు సుఖదుఃఖ
ములు రెండు గుణములు మూఁడువేళ్ళు
తగురసంబులు నాల్గు ధర్మార్థముఖరంబు
లెఱిఁగెడి విధము లైదింద్రియంబు

లారు స్వభావంబు లా శోక మోహాదు
　　　　　　　　లూర్ములు ధాతువు లొక్కయేడు
పై పాఱలెనిమిది పగ్గెంగలు భూతంబు
　　　　　　　　లైదు బుద్ధియు మనోహంకృతులును

తే॥గీ॥ రంధ్రములు తొమ్మిదియు కోటరములు ప్రాణ
పత్రదశకంబు జీవేశ పక్షియుగము
గలుగు సంసారవృక్షంబు గలుగ జేయ
గావనడగింప రాజవొక్కరుఁడవీవ!

(ద. పూ. 91)

పోతనామాత్యుల సీసపద్యము - ఆ సంసారవృక్షమును బ్రహ్మాండముగఁ జూపించుచున్నది. వారేరుకొన్న వృత్తమట్టిది. అంతేగాదు — మూలమునం దస్పష్టముగానున్న విషయములను వ్యాఖ్యాన సాహాయ్యముతో వివరించుచు గూడ బోయిరి. ఇంతకన్నను బల్బజములుగ నుండు విషయములలో గూడ వారి శైలియను రసవాద విద్యయెంతయో గొప్ప పనిచేయును. ఆ రచన యిది.

సీ॥ విక్రియా శూన్యమై విషయత్వమును లేని
　　　　　　　　దగుచు నాత్మాకారమై తనర్చు
నంతఃకరణమొక్క యధికసాక్షాత్కార
　　　　　　　　విజ్ఞానమునబట్టి వేరొరులకు
యెరుగంగరానిదై యేపారియుండుట
　　　　　　　　జేసి నీనిర్గుణ శ్రీవిభూతి
బహిరంగ వీథులబారక తిరములై
　　　　　　　　యమలంబు లగు నింద్రియములచేత

ఆ॥వె॥ నెట్టకేలకైన నెఱుఁగంగనగుగాని
గుణవిలాసివగుచు గొమరు మిగులు
నీ గుణవ్రజంబు నేరరాదెరుగంగ
నొక్క మితములేక యుంటనీశ॥

(ద. 553)

ఈ పద్యమునందలి విషయము శుష్కతర్కము యొక్కకంప. దాని నా మహాయోగి వాగ్వైచిత్రి యెంతయో రమణీయముగ నొనర్చెను. ఈరీతిగ పోతనామాత్యుఁడు తెనిఁగింపులోఁ జూపిన ప్రతిభ యితరకవులు జేసిన పనితనముకంటె యేవిధముగను తక్కువదిగాదు. కాని దురదృష్ట వశమున మనమే యింతవరకాతని నుపేక్షించితిమి. ఆ యపరాధమున కాతని కిప్పుడైనను మానసికముగ క్షమాపణ జెప్పికొందముగాక!

ఒకప్పుడొక పిల్ల విమర్శకుఁడు సందర్భవశమున నాతో "భాగవతపు శైలియేమియు బాగుండదు. తిక్కన ధార తీగ దీసినట్లుండును. పోతన్న దట్లుగాక- పాదపాదమునకు దునిగిపోవును. యతి - ప్రాస - వీనిని బూరింప వలసినపుడు - క్రొత్తక్రొత్త పదములను వెదకికొనుటలో నతఁడు పడుబాధ జూచిన మన 'కయ్యో' యనిపించును" అని నిరాఘాటముగ తిక్కన — పోతన్నలలోని తారతమ్యమును తీర్పు జెప్పివేసెను. నేనప్పుడేమియు మాట్లాడలేదు. కారణమేమనఁగా— నా బాల్యములో నేను గూడ పోతన్నపై నిట్టి యభాండముల నెత్తితిని. 'తీఁగె' దిగిచినట్లు వ్రాసిననే ధారాశుద్ధియగును. కాకున్న కాదు" అని మొదలు స్థిరపడ వలెను. అటుతరువాత నీ విమర్శకు నడుముల బలము నిల్చును. భారతకవులలో - తీఁగెదిగిచినట్లు రచన యున్న మాట నిజమే! ఆ ధార యొక్క ద్రుతగతి యెఱ్ఱనకంటెను-తిక్కనకంటెను-నన్నభట్టు లలో నింకను గొంత మీఱినది. కాని భారతము వీరకావ్యము. ఆ పాత్రలకు ద్రుతగతి — ప్రబలమైన యుద్రేకము - ఉత్తాలములైన భావములు-యివి సహజములైన ధర్మములు. అందుచేనా కావ్యములను రచించునప్పుడు-శయ్యా

యెంత తొందఱగ నడపిన మనకంత యానందము గలుగును. కాని-భాగవతము యొక్క ధర్మము వేఱు. శాంతి దానిప్రధానమైన రసము. ఆ పాత్రలకు నిలుకడ—సంయమము — యివి నైజములైన గుణములు. అట్లే వానిని సృష్టించు కవికి గూడ నీ గుణములు లేకున్నచో-నా సన్నివేశములు కోఁతిచేతికి దొరకిన యద్దమువంటి వగును. భారతములోని వారికి ముఖ్యముగ రజోగుణము ప్రధానము. అందుచే మాటలలో వాడిమి - భావములలో తీంద్ర—యీ గుణములుండి తీరవలెను. పోతన్న పాత్రలు - సత్వగుణ ప్రధానములు. భారతములో ప్రతిచోటను తీఁగెదిగిచిన శైలియే లేదు. నిలచి—నిలుకడగఁ బలికిన పట్టులును నుండనే యున్నవి. అట్లే-భాగవతమున గూడ హృదయ భావములకు-విశృంఖల స్వైరగతి నావిష్కరింప వలసిన చోట పదములు పాదరసమువలెఁ బర్వెత్తును. అక్కడ నాతని ధార - వర్షా కాలమునందలి ప్రవాహమువలె తెగదూకులుదూకినది. కానిసామాన్యముగ నాతఁడు శయ్యను-నిరంతరమును గళ్ళెమును చేతఁబట్టుకొనియే నడపును. పోతన్న భాగవతపుఁదెనిఁగింపు—నేఁడు గొంద అనుకొన్నట్లు—పుస్తకమును ముందుబెట్టుకొని-మూఁడునాళ్ళలోదీర్చిన ముచ్చటగాదు. ఆతఁడు సంస్కృత భాగవతము నెన్నియో యేడులు-పరాయణముగ-బారాయణ మొనర్చెను. చదివి-వ్యాసభగవానులు సృష్టించిన ప్రతి సన్నివేశమును — ప్రతిపాత్రను - ప్రతిపద్యమును-పదమును-భావించి, భావించి-"వివర్జిత చేష్టుఁ"డైఁ నాఁడు. ఈ తపస్సు జన్మమంతయు సాఁగుటచే-నా భక్తులలోని యనేకగుణములు - పోతనామాత్యులకు స్వభావములై పోయినవి. ఆతని జీవితమునందు పరమ భాగవతులు తొంగి చూచినట్లు-భాగవతములోని ప్రతిభక్తునిలోను-పోతన్న బ్రతుకు తొంగిచూచును. భాగవత మతనికిఁ గవిత్వము గాదు. కను విప్పు. ఆంధ్రీకరణ మతని కానందమే గాదు. నిష్ఠ. నేటి మనకు మనన యను పదార్థము సున్న. 'కంపెనీ'ల 'కేటలాగు'లలో మన పుస్తకముల జాబితా యెక్కువ కనపడవలెనను ఉబలాటదప్పు వ్రాసిన ముక్కలు బాగున్నవా? లేదా? యను నాత్మవిమర్శనము జేసికొనుట—పనిలేని పని. ఒకా నొక

తెలుఁగు కవి "నే నీ జన్మలో నూటయెనుబది పుస్తకములు వ్రాసి నానయ్యా" అని యెదలు విఱచికొని నాతోననెను. అతనికి బదులు పలుకుటకు నాకేసిగ్గయినది. "శార్ద్ధమంగళమాయె"నని నాలోనేను నవ్వుకొంటిని. పతంగము గూడ పతంగునితో పందెము వేసుకొనునట!

తిక్కనశైలి పోతనామాత్యునకు సాధ్యము గాకపోలేదు. అనుసరింపఁబోవుట—బోళ్ళపడుట-యవకతవక చేష్టలుమనవి. తిక్కన జ్ఞాపకము వచ్చినపు డతఁడు—ఆ యమాత్యునివలెనే వ్రాయును. ఈ క్రింది పద్యమును జూడుడు.

ఉ: రాజట ధర్మజుండు సురరాజ సుతుండట ధన్విశాత్రవో
ద్వేజకమైన గాండివము విల్లట! సారథి సర్వభద్ర సం
యోజకుఁడైన చక్రియట! యుగ్ర గదాధరుఁడైన భీముఁడ
య్యాజికి తోడువచ్చునట! యాపదగల్గు టదేమిచోద్యమో!

(ప్ర. స్క. 211)

—పై పద్యము తిక్కన్న దున్నట్లున్నదోలేదో మీరే చెప్పుడు. అంతేగాదు. అతఁడు నాచన సోమునివలెఁగూడ నందుకొనును. ఈ క్రింది పద్యమొక యుదాహరణము—

శా॥ రాడా! చూడ సమస్త భూతములలో రాజిల్లువాఁడిచ్చటన్
లేడా! పాఱుని చిచ్చుఱమ్ముదొలఁగన్ లీలాగతిందోర్చి నా
కీడా! నే డభయ ప్రధానమత డూహింపన్ నతత్రాతమున్
గాడా! యెందఱ గావఁడే యెడల మత్కర్మంబు దానెట్టిదో!

(ప్ర. స్క. 283)

ఈ శబ్ద చిత్రమును గమనించినపుడు నాచనసోముని కవిత్వమును-పోతన్న తలఁచుకొన్నచో నెంత బాగుగ ననుకరింప గలఁడో మనకుఁదెలియును. ఎఱ్ఱనరచించిన నృసింహ పురాణమును పోతనామాత్యుఁడు బాగుగ నధ్య

యన మొనర్చెను. ప్రహ్లాద చరిత్రములో నాతని చరణము లందుకొని వ్రాసిన పద్యము లెన్నియో యున్నవి.

అందరికన్నను నన్నభట్టుల ననుసరించవలెనను ఉద్వేగము పోతనామాత్యులకు కొంత యెక్కువగ — కావలసినదానికన్న యెక్కువగనే — ఉన్నట్లు కనిపించును. వారు నన్నయ్యను అనేక చోటుల ననుసరింతురు. కొన్ని చోట్లలో నన్నయ్య వాడిన పదములే వచ్చుటగూడ కద్దు.

చ॥ తరళతరంగ వీచి సముదంచిత బిందు సరస్సరస్వత
సరిదరవింద తుందిలల సత్తరు తీరనివాస సన్మునీ
శ్వర నికరాశ్రమాకలితసంపదలఙ్... (తృ-793)

- ఈ పై పద్యమున 'సరస్సరస్వతీ' యనుచోట నుండునది నన్నభట్టుల శబ్దాలంకారమే! ఒక్కొక్కసారి వారివలెనే వీరును పద్యమంతయు నొకటే సమాసమును నింపివేయుదురు. ఆ నింపినచోట మనకది సమాసముగా నట్లే భాసించుట-ఆ పదములలోని యొక చమత్కారము - ఈ క్రింది దట్టిది.

ఉ. మానితసౌరభ ప్రసవమంజుల పక్వఫల ప్రవాళ భా
రానత చూతపోత విటపాగ్రనికేతన రాజకీర స
మ్మానిసుఖానులాప పరిమండితకర్దమ తాపసాశ్రమో
ద్యాన వనప్రదేశకనులాకరతీర నికుంజపుంజముల్. (3.1044)

ఈ సీస పద్యమును చదువునప్పుడు మనకు నన్నభట్టుల పద్యమును చదువుచున్నట్లే యుండును.

సీ॥ నవ్యకాంచన రణన్మణినూపురారావ
విలసిత పాదారవిందయుగళ
కాంచీకలాప సంకలిత దుకూల వ
స్త్రస్ఫార పులిననితంబబింబ

రాజితాన్యోన్య కర్కశపీన కరికుంభ
పృథు కుచభార కపితవలగ్న
మదిరారసాస్వాద మదవిఘూర్ణితచారు
సిత నవవికచరాజీవనయన

తే॥ గీ॥ అపర పక్షాష్టమీశశాంకాభనిటల
మదవదలికుల రుచిరోపమానచికుర
లలిత చంపకకుసుమ విలాసనాస
హాసలీలావలోకన, యబ్జపాణి (తృ. 726)

ఇంత మాత్రమేగాదు. భావధారలో గూడ వారప్పుడప్పుడు నన్నయ్య ననుసరింతురు. ద్రుపదుఁడు, ద్రోణుఁడు—వీరిరువురును ఒకగురువు కడ విద్య నేర్చుకొన్నవారు. తరువాత ద్రుపదుఁడు పాంచాల దేశమునకు రాజయినాఁడు. ద్రోణుఁడు-రాజకుమారుల కస్త్రవిద్యనేర్పుచు బ్రిదుకు చుండెను. సామాన్యముగ విద్యావంతునకు ప్రధాన లక్షణమైన దారిద్ర్యము ముందర-యతని యస్త్ర శస్త్రములేవియు పనిజేసినవిగావు. వివాహమైన వెనుక పేదటికముతో నాతఁడు బాధపడ నారంభించెను. పిల్లలకు పాలు దాగ్రివుటకొక గోవైనను అతనియింటిలో లేదట! ద్రోణుని భార్య కృపి. ఆమెతో నప్పుడప్పుడు "ద్రుపదుఁడు తన సహాధ్యాయి"యని ద్రోణుఁడు గొప్పలు సెప్పికొని యుండెనేమో! ఆరాజునడిగి యేమైనను దానము తెమ్మని భార్యతరిమినది. అతఁడు వెళ్ళెను. సామాన్యధనవంతులకే మనసు లుండవు. ఇఁక రాజుల కెక్కడనుండి వచ్చును? వాఁడు 'సరే! పొమ్మ న్నాఁడు.' ఆయవమానము ద్రోణుని బాధించుచునే యుండెను. ఇంతలో నర్జునుఁడు పేరు ప్రఖ్యాతులు గడించినాఁడు. ద్రుపదుని పట్టికొనివచ్చుటకై గురువు శిష్యునినియోగించెను. ద్రుపదుఁడు అర్జునునకు ఓడిపోయి,చిక్కెను. 'అర్జునుఁజేసిన పరాక్రమంబునకు పరమ హృష్టహృదయుండైన ద్రోణుఁడు దు్రిపదుంజూచి నగుచు నిట్లన్నాఁడట :

కం॥ వీరెవ్వరయ్యా దుశ్రీపదము
హారాజులె? యిట్లు కృపణులై పట్టువడ౯
వీరికి వలసెనె? యహహా! మ
హారాజ్య మదాంధకార మదివాసెనొకో. (అ. ప. 90)

ఈ మందలింపులోని యెత్తుగడ పోతనామాత్యుని హృదయమును చక్కగా లోఁగొన్నది. వారును ఒక్కచోట యీ యెత్తుగడనే వాడిరి. కృష్ణుఁడు వెన్నలు దొంగిలించినాఁడు. ఆ దొంగతనమును యశోద కనుగొన్నది. ఆమె కృష్ణునితో నిట్లన్నదట!

కం॥ వీరెవ్వరు ? శ్రీకృష్ణులు
గారా? యెన్నడును వెన్నగానరట కదా!
చోరత్వంబించుకయును
నేరరట! ధరిత్రి నిట్టి నియతులుగలరే! (10-374)

కాని సాధారణముగ పోతనామాత్యుల శైలియిట్టిది.

సీ॥ "మేఘంబుమీది క్రొమ్మెఱుఁగుకైవడి మేని
పైనున్న పచ్చనిపటమువాఁడు
గండభాగంబుల గాంచనమణిమయ
మకరకుండల కాంతి మలయువాఁడు
శరవహ్ని నడగించు సంరంభమునఁజేసి
కన్నుల నునుఁగెంపు గలుగువాఁడు
బాలార్కమండల ప్రతిమానరత్న హా
టక విరాజిత కిరీటంబువాఁడు.

తే॥ కంకణాంగద వనమాలికా విరాజ
మానుఁ డసమానుఁ డంగుష్ఠ మాత్రదేహుఁ
డొక్కగద చేతఁ దాల్చి నేత్రోత్సవముగ
విష్ణుఁ డావిర్భవించెనవ్వేళయందు. (ప్ర. స్క. 285)

అడుగడుగునను—నాగియాగి-ముందు వెన్కలు జూచికొని-యాతని పద్యగతి యెంతోసుందరముగ నడచును. ఒక్కొక్కసారి-యావేశపడవలసిన సమయములందును-యుల్లేపచించును. అనఁగా-వశిత్వము ఆపాత్రలకు-సామాన్య ధర్మమన్న మాట! దీనికర్థము పోతన్నకిది యంతటి నైజగుణ మనుటయే! కలిపురుషుఁడు ధర్మదేవతను — కాలఁదన్నినాఁడు. ఆ దృశ్యము జూచిన యభిమన్యు నందనునకు బ్రహ్మాండమైన కోపము వచ్చెను. ఆతఁడు కోదండము నెక్కువెట్టి-మేఘ గంభీరవచనములతో నిట్లన్నాఁడట!

శా॥ నిన్నుంగొమ్ముల జిమ్మెనో! కదిసెనో! నిర్భీతివై గోవులం
దన్నంగారణమేమి మద్భుజసనాథక్షోణి నే వేళలం
దు న్నేరంబులు సేయరా దెఱుఁగవా! ధూర్తత్వముం భూమి భృ
త్సన్నాహంబు నొనర్చె దెవ్వఁడవు, నిన్ శాసించెదన్ దుర్మతీ.

(ప్ర. స్క. 415)

కం॥ గాండీవియుఁ జక్రియు భూ
మండలి బెడఁబాసి చనిన మదమత్తుఁడవై
దండింపఁ దగనివారల
దండించెదు, నీవదగుదు దండనమునకున్.

(ప్ర. స్క. 416)

— ఇంతటి కోపములోఁ గూడ పరీక్షిత్తు సహజమైన శాంతిని వదలినవాఁడే గాఁడు. "నిన్నుం గొమ్ముల జిమ్మెనో! గదిసెనో" యను కూర్పులోనున్న పోతన్న శైలిలోని వ్యవహారదక్షత మీరు గమనించియే యుందురని నాతలఁపు.

నిన్నటి యుపన్యాసములో తమకు పక్వమైన పురాణశయ్యను గూర్చి మనవి చేసితిని. ఆ శయ్యాసౌభాగ్యము — ఆ యుదారరచన - పోతన్నలో నక్కడక్కడఁ గన్పించును. అంబరీషోపాఖ్యానములో నీ క్రింది పద్యము పురాణశయ్యకు చక్కని యుదాహరణము—

సీ॥ ఘనవై భవంబున కల్మషదూరుఁడై
యజ్ఞేశు నీశునబ్జాక్షుగూర్చి
మొనసి వశిష్ఠాది మునివల్లభులతోడ
దగిలి సరస్వతీ తటమునందు
మేధతో బహువాజి మేధంబు లొనరించె
గణుతింపరాని దక్షిణలువెట్టి
సమలోష్ట హేముఁడై సకల కర్మంబులు
హరి పరంబులుగాగ నవనియేలె

ఆ॥ విష్ణుభక్తులందు విష్ణువునందుగ
లంకయెడఁ మనసులంకెవెట్టి
విహిత రాజ్యవృత్తి విడువనివాడునై
యతఁడు రాచతపసి యనఁగనొప్పె.

(న. స్క. 84)

– దీనిలో ఘనవై భవంబున – మొనసి – తగిలి – మేధతో నిత్యాదిశబ్దములు వ్యర్థపదములని కొందరాక్షేపించవచ్చును. ఇట్టి యాక్షేపణల విషయమై కొంత నా ప్రథమ వ్యాసమున వివరించిచెప్పితిని. ఈ శయ్య నన్నభట్టులలో నక్కడక్కడ గన్పించును. ఎఱ్ఱన్నలోఁగూడ కొంతయున్నది. తిక్కనామాత్యులు మాత్ర మీదృష్టిని మార్చుకొనిరి. వారికి కావ్యరచన శిల్పము. ఆ శిల్పము యెదిగి యెదిగి భావకవులలో – తరువాతివారిలో నే స్థితికి వచ్చినదో మనవి జేసితిని. తిక్కన తరువాతగూడ – తిక్కనామాత్యుల శిల్పమును ప్రేమించినను – యీ పక్వమైన పురాణశయ్యపై మోజు వదలని వారు లేకపోలేదు. మార్కండేయ పురాణము – వరాహపురాణము – మొదలైన వానిలో నీపాకము బాగుగ గన్పడును. శ్రీనాథుఁడుగూడ నీ సుగుణమును వలచినవాఁడే! వీరందరికంటెను – తెగువగల యిట్టి రచనను ఆద్యంతము నడపింపవలెనను చూపుగలవాఁడు రంగనాథ రామాయణ కర్త. 'అందుకే చదువుకొన్న వారేమనుకొన్నను – సామాన్యులలో రంగ

నాథ రామాయణమునకు - దానివంటిదేయైన యుత్తర రామాయణము నకుఁ బ్రచారము తగ్గలేదు. ఇంతకును - భాగవతమును జదువుకొనుటకు పాఠకుఁడు మనస్సుతోఁబాటు బాహ్యముగను గొంత తయారుగావలెను. ప్రొద్దుటినుండి రాత్రివరకు నింటిపనులన్నియు గొఱఁతలేక చక్కబెట్టు కొని, రాత్రి భుజించి - పదిమంది తీరికగా గూర్చొనవలెను. వారి గోష్ఠిలో మధ్యమధ్య లౌకికవిషయముల గొడవ "నేనున్నా"నని ప్రవేశింపరాదు. నడుమ ప్రమితలో నాముదము బోసి యంటించిన దీపము కొడిగట్టక యాత్మజ్యోతివలెనే వెలుఁగుచున్నది. అపుడు వయస్సు మళ్ళిన - రాగ ద్వేషాదుల యుద్వేగము తగ్గిన - యొకానొక పెద్ద - నాటరాగములో—

సీ॥ ఒకవేయి తలలతోనుండు జగన్నాథు
బొడ్డుఁ దమ్మిని బ్రహ్మపుట్టె మొదల
నతనికి గుణముల నతనిబోలిన దక్షుఁ
డగు నత్రిసంజాతుఁ డయ్యె నత్రి
కడగంటి చూడ్కుల కలువల సంగడీఁ
డుదయించి విప్రుల కోషధులకు
నమరఁదారాతతి నజుని పంపున నాథుఁ
డై యుండి రాజసూయంబుచేసి
తే॥ మూఁడు లోకంబులను గెల్చి మోదకమునఁ
జని బృహస్పతి పెండ్లాముఁ జారుమూర్తి
దార నిలుసొచ్చికొనిపోయ తన్ను గురుఁడు
వేఁడు నందొఁక నయ్యింతి విడువఁడయ్యె.

(న. 376)

— యని తిన్నగ నారంభించును. వాని చుట్టునున్న వారందఱు "చక్కని పాటకు పడగ తాఁడించు పాములవలె" హాయిగఁ దలలాడించుచు విను చుందురు. వారికి నిజముగ భాగవత మర్థమైనది. ఆ శయ్యలోని సౌలభ్య మును - ఆ కథలోని హృదయమును దెలియునది పుణ్యాత్ములకే! అంతే

గాని - "పొగగొట్టపు ఘూంకారధ్వనులలో" నానా భావ పంకిలములై చిల్ల రంగడుల బోలు మనస్సులతో - మనము భాగవతమును చదివినచో - దాని రుచి యర్థముగాదు. ప్రొద్దున లేచినవెంటనే - ముఖము కడుగుకొనుమాట యెట్లున్నను - కాఫీ త్రాగుటకు మన మలవాటు పడితిమి. వేడివేడిగా నది పట్టి కడుపులలోనికి - దిగజాఱినప్పుడు - కొంత బాధయే యగును. కాని - దానిని మనము - గణించుటలేదు. "గడ్డపెరుగు వేసికొని - హాయిగ చల్ది భుజించినచో - కడుపులో నెంతయో చల్లఁగనుండునే - మీకీశిక్ష యేమని - వయసు మళ్లినముసలమ్మలు - మా యింటలేరుగాని - పిల్లల కసరించుచునే యుందురు. నిజమే దాని చల్వను - మనమూహింపగలము. కాని - మన యలవాటులను మార్చుకొందుమా? పిల్లలు మార్చుకొందురా? అట్లే భాగవత పఠనముగూడ! ఇది మనకు చక్కఁగ నర్థముగాకపోయెనే యని- యొక్కొక్కసారి - యాసక్తితోఁ జదువుకొననారంభింతుము గాని - మన దురదృష్టము! అది యెంత యర్థము గావలెనో అంతగాదు. ఎట్లు కావలెనో అట్లుగాదు. కారణమేమి ? మన బ్రతుకులలో - భావములలో - ధ్యానికి పూర్వాంగములులేవు. నన్నయ్యాకువలెనే పోతనామాత్యులకును శబ్ద సౌంద ర్యముపైఁ గన్నుకద్దు. ఒక్కొక్కసారి వారు శబ్దము కొఱకే పద్యమును వ్రాయుదురా! యనిపించును. ఈ క్రింది పట్టివి.

కం॥ గజ నామధేయపురమున
గజరిపు పీఠమున ఘనుఁడు గలిదమనుండ
గ్గజవైరి పరాక్రముఁడే
గజిబిజిలేకుండఁ దాల్చెఁ గౌరవ లక్ష్మిన్. (ప్ర. 437)

- ఇందు పోతన్న హృదయమును లోఁగొన్నది "గజ"శబ్దము. అదే నాల్గు రూపములతో నాల్గు చరణములలో సాక్షాత్కరించినది. ఇటువంటిదే—

కం॥ పురుఁడీ బోటికి నిందిర
పురుఁడంబుజగాక యొరులు పురుఁడే యనుచున్

పురుటూలికి పది దినములు
పురుఁడు బ్రివర్తించి రెలమి పుణ్యాపుగటితల్.

అనునదియును 'పురు' డను శబ్దముపై పోతన్న చేయఁ దలంచికొన్న 'గారడీ' యే యీ పద్యమునకు మూలము. నన్నభట్టు లీ విద్యలో సిద్ధ హస్తులు.

శబ్దముపై నింతఁ గన్నుంచిన వాఁడు కనుకనే యాతఁ డొక్కొక్క సారి-యుత్తాలముగ రసమును వర్ణింపఁ దలఁచుకొన్నప్పుడు-వీని సహాయ ముతో ననన్యసాధారణమైన సృష్టులొనర్చును. పరశురాముని కథలో నీ పద్యమున్నది.

మ॥ ప్రళయాగ్నిచ్ఛట భంగిఁ గుంభివిదళింపంబారు సింహాకృతిం
వెలుచ౯ రాముఁడిలేశు వెంట నడచెం బృథ్వీతలంబెల్ల నా
కులమై క్రుంగఁ గుఠారియైఁ గవచియై కోదండియై కాండియై
ఛలియై సాహసియై నృగాజనమనోజ్ఞక్రోణియై తూణియై.
(న. స్క. 444)

దీనియందలి కోదండి, కాండి, కవచి, యిత్యాది శబ్దములతో నాతఁడు వీరరసమున కెంతయో మెఱుగు వెట్టినాఁడు. ఈగుణము లాతనిరచనమున-నడుగడుగునను గలవు. గంగావతరణ వచనము - దేవదానవుల యుద్ధ వర్ణ నము-వామనుఁడెదిగినరీతి వర్ణించు చూర్ణిక- నృసింహావిర్భాతీ - శబ్దసంప దతో-నాతఁడెంతలేసి పనులొనర్చునో - దెలుపుటకుఁ గొన్ని యుదాహర ణములు: ఆతని పదములు చిలుకల గుంపులవలె బారులు కట్టును. పారి జాత పుష్పములవలె జలజల జల్లించికొనును. శరత్కాల ప్రవాహమువలె మందాలసముగఁ బ్రవహించును. కోపముఁ గొన్న కోడెనాగులవలె తోఁకలపై నాడును. సంస్కృత సమాసములతో నెంతయో లాలిత్యమును గై కొనివచ్చిన వాఁడు నన్నయ్య. ఆతని యా సిద్ధి సంస్కృత కవులకును

లేదు. నన్నభట్టుల ననుసరించుట కెందఱో వేకారి యాయాసపడిరి. అతనిని గొంత సమీపించిన దే కొందఱో! వారిలో కొంతవఱకు కృతకృత్యులైనది ముప్వురే! మొదటివాఁడు పోతనామాత్యుఁడు. తరువాత అల్లసానిపెద్దన. ఆ చాయలక్కడక్కడ నందికొన్నవాఁడు కవిసార్వభౌముఁడైన శ్రీనాథుఁడు. ఈ శబ్దదృష్టి పోతన్నలోఁ గొంత చాపల్యమునకే దారితీసిన దనవచ్చును. ఒక్కొక్కసారి యాతఁడు శబ్దములను శబ్దములకొఱకే వాడును. బ్రహ్మ యన్నచో నాతనికిఁజాలదు. "తలవాకిట వాణిగల పోడిమిచే వాడిమి కెక్కిన నలుమొగంబుల తక్కరిగొంటు" యని బ్రహ్మాండముగ విస్తరించి చెప్పిననే యాకవికితృప్తి. మరియొకచోట "సకలంబున సుకరంబున నెఱిం గెడి నెఱవాడి "ముదుక యెఱుకగల ప్రోడ" యని బ్రహ్మనుద్దేశించియే పలుకును. దశమస్కంధమున నొక ఘట్టమున్నది. నందాదులు బృందావనము నకు-సంసారములు తరలించుకొని వచ్చిరట! ఆ సన్నివేశ మొక వచనమున (10. పూ. 425) వర్ణింపఁబడినది. దానితోజు చూడఁగా - ఒక పెద్ద సామ్రాజ్యము గదలినట్లున్నదిగాని - గొల్లెగూడెము గదలినట్లులేదు. శ్రీనాథుని పోకడలుకూడ నిటువంటివే! ఇవి యన్నియు నాచనసోముని నవీన గుణముల మాహాత్మ్యము. నన్నయ పాత్రలు మితముగ మాటాడును. పది మాటలు పలుకవలసినచోట నొక మాట యని తక్కిన వన్నియు మీరే యూహించికొమ్మనుట యతని రచన. ఈ సుగుణముచే నాతని రచనకు మేరువంత యౌన్నత్యము - సముద్రమంత గాంభీర్యము కుదురుకొనును. ఈ గుణము నన్నయయంత లేకున్నను-పోతనామాత్యులకును గొంత కద్దు. కార్తవీర్యార్జునుఁడు బలవంతముగ మొదవునుగొని మాహిష్మతీ పురము నకుఁ బోయినాఁడు. అపుడు రాముఁడింటలేడు. వచ్చినవెంటనే-తల్లి రేణుక చెప్పినది. ఆతనికిఁ గోపమువచ్చెను. అపుడాయన-

ఆ॥ అద్దిరయ్య నింట నశనంబు గుడిచి మా<br>
యయ్య వలదనంగ నాక్రమించి

కోరి మోదవు రాజు గొనిపోయినాఁడట
యేను రాముఁడౌట యెఱుఁగఁడొక్కో.

యన్నాఁడు. (న. స్కం. 442)

రావణుని కార్తవీర్యార్జునుఁడు కూకటులఁ గదలించి పట్టుకొని - మోకాళ్ళను తాకించి - కింకరులతో కారాగారమునఁ బెట్టించినాఁడట! తరువాతఁ గార్తవీర్యుఁడు మాహిష్మతికి వచ్చి—

"ఓరీ, యిటమీద నూరకుండుము, జగతిఁ
వీరుఁడ ననకుము, గాఁచితి
పోరా..." యని సిగ్గుపరచి పుచ్చినాఁడట!

కాని - మితహిత సత్యవాక్యములతో నన్నయ్యను సమీపింపఁ గలవారు - నాటికిని - నేటికిని - ఆంధ్రసాహిత్యములోనే లేరు.

బంగారువంటి ప్రాయము - కొంగుపసిడి - చెలజిక్కు. యిటువంటి నానుడులు పోతన్నలో నక్కడక్కడ కనుపించును. "మత్తికాఁడు - వేడుకలకత్తె" వంటి పదజాలము గూడ. తార బృహస్పతిని కన్నుగప్పి - చందురుని బొందినది. బుధుఁడు పుట్టినాఁడు. వాఁడు నా భాగమని బృహస్పతి - నాకు రావలెనని చంద్రుఁడు - వాదుపడిరి. అపుడు ఋషులు - సత్యనిర్ణయమునకై దేవతలనడిగిరి. వారు "ఆవేడుకలకత్తె యెఱుఁగుగాని, యితరు లెఱుఁగ"రన్నారట! ఇచట - వేడుకలకత్తె పదమెంతో వేడుకఁగా నున్నది.

నన్నభట్టులు యాటవెలఁదిని గొంత యాదరించిరి. కాని - వారా రచనలోఁ బ్రత్యేకతను జూపించిన వారుగారు. వానికిఁ గొంత నైపుణ్యము - నడపించినవాఁడు బమ్మెర పోతరాజు. భాగవతమున ప్రతి సీస పద్యము గడపటను - సాధారణముగ నాటవెల్దియే తగులుచుండును.

్త్యేకముగ వ్రాసిన యాటవెలఁదులు కూడ నెక్కువ. వీనిలోని సౌందర్య
ును "చాలు! చాలు! ననునంతవరకు పోషించిన వాఁడు వేమనయోగి!
ాని తొలుత నొకవింత యొయ్యారముతో - ఆంధ్రభాషలో నాటవెలఁది
డుగువెట్టినది పోతన్నతోనే! మహాలక్ష్మి వంటిదానికే 'హంగు' సేయుట
ాతని కాటవెలఁది కావలసివచ్చినది. అదృష్టము సేసికొన్న యా పద్యమిది-

ఆ॥ చంచరీ కనికర ఝుంకార నినదంబు
దనరు నుత్పలముల దండవెట్టి
మేఘకోటి నడిమి మెఱుగు బుత్తడిమాడ్కి
సురల నడుమనిలిచె సుందరాంగి.

(అ. స్కం. 277)

. ఇది యొక్కటేగాదు. ఆటవెలఁదులలో నాతఁడు కల్పించిన యొయ్యార
ములు పలురకములు. ఒక్కొక్క రకములో నొక్కొక్క యందము. ఈ
కిందిదొక సౌందర్యము.

ఆ॥ కామతంత్రటీక - కలువలజోక కం
దర్పుడాక - విటుల తాల్మిపోక
చకితచక్రవాక, సంప్రీత జనలోక
రాకవచ్చె మేలు రాఁక యగుచు.

- ఇట్టి 'తమాషా' లతఁడెన్నియో చేసినాఁడు. రసికులు దయతో నవ
లోకింపవలెను.

పోతనామాత్యుల కవిత్వములో మూఁడుపాళ్ళు సంస్కృతమును -
యొకపాలు తెన్గును వచ్చును. తెన్గునుగూడ - "గుణముగ" నాతఁడు
వాడిన చోటులున్నవి.

"కొఱనెలపైఁ దోఁచు నిరులు నా జెలువొంది
నొసలిపైఁ గురులు తుంపెసలుగురియ"

అని యొకసారి పోతన్న - సంస్కృతమును ముట్టనని ప్రతినచేసి వ్రాయును. కాని సంస్కృతము నాశ్రయింపనిది - శబ్దసంపదలతో నొనర్చునగిషీపనులను యెక్కువగా చేయుటకు వీలుతక్కువ. శ్రీనాథునకు గూడ నిదే యలవాటు. ఆంధ్రభాషలో సంస్కృత శబ్దముల పొంతఁబోక - అచ్ఛికముల తోడనే యమూల్యమైన రచనను చేయగల సామర్థ్యము నాటికిని - నేటికిని తిక్కనామాత్యులదే!

మనము మాటలాడునపు డొక్కొక్కసారి 'యిది చాల 'యిది' గానున్నదందుము. అక్కడేదో భావస్ఫోరకమైన మాట మనకు తట్టుట లేదు. ఆకొఱఁతను 'యిది' యను సర్వనామము' పూరింపవలెనని మన యాశ. ఇట్టి 'యిదు'లతో పూరించుకొనవలసిన చోటులు తిక్కనామాత్యులలో చాల వచ్చును. ఆ యలవాటప్పుడప్పుడు పోతన్నకుకూడ నున్నది. భావములలోని న త్తినాయన 'మంచి' యనుపదముతో పూరించుకొనుచుండును. పాలసముద్రమునఁ బుట్టిన లక్ష్మీదేవికి – దేవతలేవేవో యుడుగరలిచ్చిరి. ఆ నడుమ భారతీదేవి యొక 'మంచి' తారహార మొసఁగెనట! (అ. స్క. 271) ఈ తారహారములోని మంచితనమేమో వివరించుటకతనికి మాటలురాలేదు గాంబోలు! ఈ 'మంచి' మరియొకసారి వచ్చును. యశోదకు కొడుకు బుట్టినాఁడని గోపికలకుఁ దెలిసినది. అపుడు వారందరు 'మంచి పదార్థములు కొనుచు వచ్చిరట!

కం॥ కంచుకములు దలచుట్లును
గాంచన భూషాంబరములు కడుమెఱయఁగ నే
తెంచిరి గోపకులందఱు
'మంచి' పదార్థములు గొనుచు మాధవుకడకున్.

(ద. 181)

– ఇక్కడ మంచితనము గూడ పోతన్నకు సంభవించిన మాటలలోని నత్తియే! ఆంధ్రకవికి - వ్యాసభగవానులవలెనే - చక్కని యలంకారముల పై మమత. వారప్పుడప్పుడు ఉపమానములు వాడుదురు. ఉపమానముల కంటె — యుత్ప్రేక్షలు - రూపకములు మెండుగా వచ్చును. తరువాత ప్రబంధకవులకు వీరి యిట్టి పోకడలే మార్గదర్శకములైనవి. దశమస్కంధము లోని చంద్రోదయవర్ణనము నెన్నిసారులు చదివినను విసుగురాదు. ఆ పద్యమిది.

"విటసేనపై దండువెడలెడు వలఱేని
గొల్లెనపై హేమకుంభమనఁగ
గాముకధృతి వల్లికలు ద్రెంప నెత్తిన
శంబరాంతకు జేతి చక్రమనఁగ
మారుఁడు పాంథుల మానాటవులుగాల్ప
గూర్చిన నిప్పులకుప్ప యనఁగ
విరహి మృగమ్ములవేఁటాడ మదనుండు
దెచ్చిన మోహానదీపమనఁగ

ఆ॥ వింతనునుపు గలిగి వృత్తమై యరుణమై
గాంతితోఁ జకోరగణము లుబ్బ
బొడుపుఁగొండ చక్కి బొడిచె రాకాచంద్ర
మండలంబు గగనమండలమున. (ద. స్క. 967)

– ఈ క్రింది రచన స్వభావోక్తియో - యుత్ప్రేక్షయో–మీరే యూహించి కొనవలెను. ఏదియైన గానిండు. అది–వెన్నలు—పాలు - మెక్కిన కృష్ణుని వలెనే దిండుదిండుగా నున్నది. ఆ పద్యమిది.

సీ॥ కర్ణావతంసిత కర్ణికార ప్రభ
గండ భాగద్యుతిఁ గడలు కొలుప

భువన మోహనమైన భ్రూవిలాసంబుతో
వామ భాగానత వదనమొప్ప
నపసవ్యకర మృదులాంగుళి చాతురి
షడ్జ ధ్వనికి మర్మసరణిఁ జూప
డా కాలిమీఁద నడ్డము సాచి నిల్పిన
పదనఖద్యుతి భూమి బ్రబ్బికొనఁగ

తే॥ మౌళిపింఛముఁ గంఠదామమును మెఱయ
విలసిత గాత్రమముగ నొక్క వేణువందు
బ్రహ్మగాంధర్వ గీతంబు పరఁగఁ జేసె
చతుర నటమూర్తి గోపాలచక్రవర్తి. (ద. పూ. 769)

- లలితములైన-శ్లేషలు-ధ్వనులు - వీనిపైఁ గూడ పోతన్న కభిమానము కద్దు. వామన చరిత్రలో నతఁడు వ్రాసిన-

సీ॥ ఇది నాకు నెలవని యే రీతిఁ బలుకుదు
నొకచోట నకనెందు నుండనేర్తు
నెవ్వని వాడనం చేమని నుడువుదు
నాయంత వాఁడనై నడవనేర్తు
నీ నడవడియని యెట్లు వక్కాణింతు
బూని ముప్పోకలఁ బోవనేర్తు
నదినేర్తు నిదినేర్తునని యేల చెప్పంగ
నేరుపులన్నియు నేన నేర్తు

ఆ॥ నొరులుగారు నాకు నొరులకు నే నౌదు
నొంటివాఁడఁ జుట్టమొకఁడులేడు
సిరియు దొల్లిగలదు చెప్పెద నాయింకి
సుజనులందు దఱచు సొచ్చియుందు. (అ. స్క. 552)

– అను పద్యము ద్వ్యర్థియైనను నేకార్థబోధకమైన పద్యమంత సులభముగ నర్థమగుచున్నది. తఱచుగ నాతఁడు దశావతారముల నీ శైలిలోఁ జూపు చుండును. ఇట్టి పట్టులలో-గొంత యాతఁడు-చాపల్యమునకు-లోఁగినట్లును-మనకుఁ దోఁచును.

పోతన్న – శ్రీనాథుఁడు వీరిరువురిని ప్రక్కప్రక్కలనిల్పి చూచి నప్పుడు కొంత రజోగుణము యొక్క వలలోఁబడిన పోతన్న శ్రీనాథుఁడు గను-అంతర్జగత్తులో మునిఁగి సత్త్వగుణము కొంత తెచ్చికొన్న శ్రీనా థుఁడు పోతన్నగను–తప్పక మారుదురనిపించును. ఈ మాట నెందుకంటి ననఁగా – వీరిర్వురి చిత్తవృత్తులను – నడపించిన మూలపదార్థ మొక్కటే. తీవ్రమైన యావేశము. పోతన్నకు విష్ణులీలలు వర్ణించుట యందెంత యార్ద్ర భావముగలదో–అట్టి యెడలు మఱచు నావేశమే - శ్రీనాథునకును శివ లీలలు వర్ణించునపుడు గలుగును.'హరము'అనునది–యారెండు చిత్తవృత్తుల కున్న సామాన్య ధర్మము. కాని – శ్రీనాథునిలో నది రజోగుణ మిశ్రితమై బాహ్యజగత్తున విహారములు సాఁగించెను. ప్రతిపక్షుల విషయములో శ్రీనాథుని చిత్తవృత్తి యిట్టిది–

"కంటికి నిద్రవచ్చునె సుఖంబగునే రతికేళి జిహ్వకుఁ
వంటక మిందునే యితర వర్తనముల్ పదివేలు మానసం
బంటునె మానుషంబుగల యట్టి మనుష్యుల కెన్న డేనియుఁ
కంటకుఁడైన శాత్రవుఁడొకండు తనంతటి వాఁడు గల్గినఁ.

– ఇట్టి యభినివేశమే పోతనామాత్యులకును గద్దు. కాని – వారి పూర్వ పుణ్యముచే విష్ణుభక్తి ప్రాప్తించినది. ఆ సంస్కారముతో – వారిహాత మంతయు-కామక్రోధాదులను జయించుటయందు–వైరాగ్యమును సంపా దించుటయందు–చరితార్థమైపోయెను. అది పోతన్న తపఃఫలము. వీరిర్వురి– మూలప్రకృతులలోను గొన్ని పోలికలు గనిపించును. శృంగారరసముపై

శ్రీనాథున కమిత చాపల్యమనుట ప్రపంచమునకే తెలిసిన విషయము. అట్టి శృంగార లోలతయే పోతనామాత్యులకుగూడ నున్నది. కాని పోతన్నకు వైరాగ్యమెక్కువ. నియమశీలమైన జీవనము – బాహ్యముగ నంటిన దారిద్ర్యము - ఆతని ప్రవర్తనము నిరువైపుల సంరక్షించుకొనుచు వచ్చినవి. వైష్ణవోపాసనలో - నాంతరిక బాహ్యమాలిన్యముల నణచుకొన్నగాని క్షమాపణలేదు. వీరశైవములో నింతటి పట్టుదల యున్నట్లు కానరాదు. శివావతారులైన జంగములకు - మనస్సులనే గాక – తనువులను గూడ - నర్పించుట కైవల్య దాయకమని వారు తలంచిరి. మగవారికేమో గాని — మగువలకిది బాగుగ నన్వయించినది. శ్రీనాథునివంటి వారికి మంచియవకాశము–దొరకెను. ఈ దృష్టిలోని యవకతవకలే–"కాళహస్తి మహాత్మ్యములవంటి కవితల కెక్కెను. పోతన్న కిట్టి యనుకూలము–అభిలాష రెండును లేవు. అందుచే నాతని శృంగార రసాపేక్షయంతయు కృష్ణపరమై పోయినది. గోపస్త్రీల విలాసములు — వారిరూపురేఖలు వర్ణించునపు డాతఁడెంతో యందముగ నా రసమును తీర్చి దిద్దెను. గోపకాంతలు యశోదకుఁ గృష్ణుని యల్లరిచిల్లరి చేష్టలఁదెలుపు ఘట్టము మూలములో మూఁడు శ్లోకములుగా మాత్రమున్నది. దీని నీతఁడు పెంచి సుమారు ముప్పది పద్యములు వ్రాసినాఁడు. వానిలో చదువుటకు కొన్ని వెగటు పుట్టించునవి గూడ! విష్ణువు మోహిన్యవతారము నెత్తిన ఘట్టములోను యితని పెంపకము కావలసినంత కలదు. గోపికా విరహవర్ణన - రాస క్రీడ, భ్రమరగీతలు-యిట్టివానిలో-పోతనామాత్యుఁ డా గోపికలు తానే యైపోయినాఁడు. కాకున్నచో నంతబాగుగ నాఘట్టములు వ్రాయుట యసాధ్యమైన పని. మహారాష్ట్రమునందలి భాగవతకర్త–యేకనాథుఁడు–భక్తులు–తమ కామ క్రోధాదులను భగవంతునియందెట్లు నిక్షేపింతురో – విపులముగ వర్ణించి చెప్పెను. భాగవత రచనమందు – పోతనామాత్యు లా స్థితులనన్నిటిని–యనుభవించినట్లున్నది. ఆయనయే–యంబరీషోపాఖ్యానములో:

కం॥ "పంచేంద్రియముల తెరువుల
వంచించి మనంబునందు వరమతులు ప్రీతి
ష్ఠించి వహింతురు నన్నును
మంచి నరుం బుణ్యసతులు మరగిన భంగిన్" (న. స్కం. 122)

- అన్నట్లు — దశమస్కంధములో - సత్యముగ నాతఁడొక విరహాపరి తప్తయై-పతివ్రతయైన గోపికయే యైనాఁడు. ఆ మహాకవి—తన కామ క్రోధాదులను భగవంతునిపై నిక్షేపించుటకు ఫలము-అతఁడు మాత్రమే కాదు తెనుఁగు దేశమే తరించుట యైనది.

పోతనామాత్యులకు వివిధ చిత్తవృత్తులుగల నాయకులను సృష్టించుటకంటెను-నాయికలను సృష్టించుటలో నెక్కువ యపేక్షయున్నట్లున్నది. ఆతఁడు వర్ణించిన శకుంతల-శర్మిష్ఠ-దేవకి - దేవయాని - రోహిణి-యశోద-వీరందరును చిత్తవృత్తులలో కేవలము విభిన్నలైన వ్యక్తులు. తమ కొక రెండుదాహరణములు మాత్రమే మనవి సేసికొందును.

ఊర్వశికి మిత్రావరుణుని శాపముగలిగెను. అందుచే నావిడకు మానవజన్మ మేర్పడినది. కాని యంతకుముందే యూర్వశికి పురూరవునిపై నొక ప్రేమకద్దు. కారణమేమనఁగా ఆతని శౌర్య సౌందర్యగాంభీర్యాది గుణములను నామె యింద్రుని సభలో నారదునిచే విన్నదట! ఊర్వశి భూలోకమునకు వచ్చి పురూరవుని ముందట నిలువఁబడినది. వాఁడిట్లు న్నాఁడు.

త॥ సరసిజాక్షు మృగేంద్రమధ్యు విశాలవక్షు మహాభుజున్
సురుచిరానన చంద్రమండల శోభితున్, సుకుమారు నా
పురుషవర్యు పురూరవుం గని పూవుటంపరజోదుచేఁ
దొరఁగు క్రొవ్విరితూఁపులం మది దూల పోవఁగ భ్రాంతయై.

- ఊర్వశి భ్రాంతయైనను-ఆమె తన హృదయము నెఱిఁగింపలేదు. ఊరక నిలచియున్నదట! ఇది స్త్రీధర్మమే! పురూరవుఁడును ఊర్వశిని జూచెను. వాఁడు "దీని కరగ్రహణంబులేనిచో జీవనమేటి"కంచు మఱునిముసముననే నిర్ణయించుకొన్నాఁడట! ఎట్టకేలకు వాఁడే ప్రేమోదంతము నారంభించెను. పురూరవుఁ డన్నమాట లివి.

ఉ॥ ఎక్కడ నుండి రాక మన కిద్దరకుం దగు నీకు దక్కితిన్
మ్రుక్కఁడి వచ్చెనే యలరు ముల్కులవాడ డిదంబు ద్రిప్పుచే
దిక్కు నెఱుంగనీదు నను దేహము దేహము గేలుగేల నీ
చెక్కున చెక్కుమోపి తగు చెయ్వుల నన్ను విపన్ను గావవే!

— ఊర్వశి మహాప్రౌఢ. వాఁడీ మాటలన్నంతనే వీఁడు లఘుహృదయుఁడని యామె యర్థము సేసికొన్నది. ఈ భావము నామె బైటఁబెట్టినది గాదు. ఇంతలో గంధర్వులువచ్చి పురూరవుని ప్రేమవిఘాతమును జేసినారు. ఆమె వాని కన్నుమఱఁగి పోయినది—నాటనుండి పురూరవుఁడు వెఱ్ఱివాఁడై యూర్వశిని వెదకుచు తిరుఁగుచున్నాఁడు. ఒకసారి సరస్వతీ నదీ తీరమున నామె వానికంట బడెను. వీనిని వదలి పోయినది మొదలు ఊర్వశికి వీని గాలియే లేదు. యోగ వియోగములకు మనసివ్వరాదనునది యామె నేర్చుకొన్న కామశాస్త్రవేదాంతము. పురూరవుఁ డామెకడకేఁగి దీనముగ యాచించినాఁడు. అపు డూర్వశి తన మనస్సులో వీనిని గుఱించి యున్న నిజమైన భావమును బైటబెట్టినది. అది యిది:

కం॥ మగువలకు నింత లొంగెదు
మగవాఁడవె నీవు! పశువు మాడ్కిన్ వగవన్
దగవే? మానుష పశువును
మృగములు గని రోయుగాక మేలని తినునే! (న—415)

- ఈతలఁ పామె కీనాఁడు గలిగినది గాదు. పురూరవుని జూచిన మొదటి

నాఁడే యేర్పడినది. ఆభావమునింతవరకు దాఁచినది. ఆ తరువాత నామె తన కులధర్మము నీరీతి వెల్లడించెను.

మ॥ తలఁపుల్ చిచ్చులు మాటలుజ్జ్వలసుధాధారల్ విభుండైన పూ
విలుతుఁ మెచ్చర, యన్యులఁ వలతురే విశ్వాసముఁ లేదు క్రూ
రలుతోడఁ బతినైన చంపుదు రధర్మల్ నిర్దయల్ చంచలల్
వెలయాండ్రెక్కడ! వారివేడబములా వేదాంత సూక్తంబులే.

(న. 417)

ఊర్వశీ పురూరవుల ప్రేమలో పురూరవుఁడు ప్రేమైకవశుఁడు. కడుంగడు దీనుఁడుగూడ. ఆదేవకాంత వానితో నెప్పుడును సేవఁజేయించుకొన్నదే గాని - వాని కొకనాఁడైనను సేవజేసినట్లు గానరాదు. ఇది యనుకూల పతిక. ప్రౌఢనాయిక.

దుష్యంతుఁడు వేఁటకు బోయెను. ఆశ్రమమునందు శకుంతల యొక్కతియ యున్నది. ఆశ్రమమునఁ బ్రవేశించిన దుష్యంతున కామె కంటఁ బడినది. దట్టపుఁదుఱుము - మిఱుమిఱు చూడ్కులు - నట్టాడునడుము - దుష్యంతున కింకేమిగావలెను? వెంటనే యతఁడు తన మనస్సును బైటపెట్టి నాఁడు. ఆమెకును దుష్యంతుని జూచినవెంటనే మతిపోయినది. ఇంతలో మన్మథుఁ డొకఁడు నడుమ దూఱెను. వాఁడు గుసుమాస్త్రములతో నా బాలను గొట్టినాఁడట! శకుంతల తాలిమి సెడి యిట్లు బదులువలికినది,

మ॥ అనివార్యప్రభమున్న మేనకయు విశ్వామిత్ర భూభర్తయుఁ
గనిరా మేనక డించిపోయె నడవిఁ గణ్వుండు నన్నింతగా
మనిచెఁ సర్వము నామునీంద్రుఁ డెఱుఁగుఁ మద్భాగధేయంబునఁ
నినుఁ గంటిఁ పిదపఁ గృతార్థనగుదుఁ నేఁడీవనాంతంబునఁ।

(న. 617)

-శకుంత లముగ్ధ. భావగోపనమింకను ఆమెకు బాగుగ నలవాటైనదిగాదు. ఊర్వశి తాను పురూరవుని ప్రేమించితినని నోరారచెప్పనేలేదు. శకుంతల చెప్పినది. ఆ చెప్పుట 'కృతార్థనగుదుఁ' అని యెంతో నాజూకుగా నన్నది. సత్కులమునఁ బుట్టిన కన్యక యింతకంటె మఱి యేమనును?

పోతనామాత్యుఁడు సృష్టించిన దేవయాని మహాగర్వోద్యమస్థాని. భూరికోపానలాకలితగ్లానికూడ. ఆమెదృష్టిలో శర్మిష్ఠ తండ్రి శుక్రాచార్యునకు దాసుఁడు. తన చీర కట్టుకొన్న శర్మిష్ఠను "విహితములే కుక్కలకు హవిర్భాగంబుల్" యని యామె బ్రశ్నించుచున్నది. శర్మిష్ఠగూడ కోపమున తక్కువదిగాదు. కాని - యాకోపము క్షణమాత్రము. శర్మిష్ఠ దేవయానికి దాసియైనది. దానికి కారణము తండ్రియాజ్ఞ. అపుడామె "చల మింకేల పోనీలె"మ్మని తన్నుతాను సవరించుకొన్నదట! ఆ సవరింపు తన కార్యమును సాధించుకొనుటలో దీక్షయే! 'ఎడరువేచి'. ఒకానొక నాఁడు యయాతిని లోగొన్నది. దేవయాని కాసంగతి తెలిసి క్రోధమూర్ఛితయయ్యెను. యయాతి భంగపడినాఁడు. ఆమె విన్నదిగాదు. యయాతి యపరాధము శుక్రుని చెవులకు తాకనేతాకినది. శర్మిష్ఠ క్షత్రియ కాంత కుచితమైన భావగోపనముగల యువతి. దేవయానికి తోఁచిన భావము దాఁచికొను నలవాటులేదు.

సాధారణకవులు ఆంగిక శృంగారమును వర్ణించి తృప్తి చెందుదురు. ఇతఁడును స్త్రీలయంగములను (ద. 213) వర్ణించును. కాని దానికన్నను స్త్రీల చేష్టలు - విలాసములు వర్ణించుట - పోతనామాత్యులకు ప్రియమైన పద్ధతి. స్త్రీలయేడ్పులలో నందమును భావించినకవులు కొందఱున్నారు. శ్రీనాథుడే ఆ రసికతకు మొదలువెట్టెనేమో! దానిని రామరాజభూషణుఁడు సాగఁదీసి పెద్దరాగముఁగఁ జేసెను. పోతనామాత్యులకు గూడ స్త్రీలయేడుపన్న నిష్టమే! నారదుని వరమువలన చిత్రకేతున కొక కుమారుఁడు పుట్టెను. వాఁడు కలిగినది "కృతద్యుతి" యను పట్టమహిషికి

నసూయగొన్న సవతులు వానిని చంపినారు. అపుడా కృతద్యుతి వక్షము మోదికొంచు విపరీతముగ నేడ్చినది.

ఉ. కుంకుమరాగరమ్య కుచకుంభములన్ గడుకజ్జలంబుతోఁ
బంకిలమైన బాష్పముల బాల్పడ మజ్జన మాచరించుచున్
కంకణ పాణిపల్లవ యుగంబున వక్షము మోదికొంచు నా
పంకరుహాక్షి యేడ్చె పరిభావిత పంచమ సుస్వరంబునన్.

(ష. స్క. 451)

– ఈ పద్యమును జదివిన 'కృతద్యుతి' పాటబాడినట్లు తోచునేగాని పరిదేవనము సేసినట్లులేదు. ఇక్కడ వర్ణింపఁబడిన ఆమె రూపమును – శృంగారమున కొసఁగినంత ప్రాఁపు దైన్యమున కొసఁగుటలేదు. మన్మధుఁడన్నను పోతన్నకు మక్కువే! వాని పరాక్రమములను మాటిమాటి కతఁడు వర్ణించుచుండును. వాని విక్రమ విధానమున నొక సన్నివేశమిది—

కం॥ కంతే కాలునిచేతన్
కుంఠితుఁడగు టెట్లు మరుఁడు కుసుమాస్త్రంబుల్
లుంఠించి గుణనినాదము
ఠంఠమ్మన బాలనేసె ఠవఠవ గదురన్.

(9-615)

అన్నివిధములైన శృంగారములును పోతనామాత్యులకు ప్రియమైనవే! ఆతని భాగవతములో, కలహాంతరితలు, విరహిణులు, సంయోగగర్వితలు, వాసక సజ్జికలు ఇట్టినాయికలు కొల్లలుగా వచ్చుచుందురు.

శృంగారమునకును హాస్యమునకును జక్కని లంకె. సాధారణముగ శృంగారమును ప్రేమించువారిలో హాస్యముపై నాసక్తియు గొంత యుండును. నిజముగా నవ్వు మానవునకు భగవంతుఁ డొసఁగిన యమూల్య

మైన వరము. ఒక చిఱునవ్వుగూడ నవ్వక - యిరువది నాలుగు గంటలు కాలిన పెనమువలె మూతిబెట్టుకొని యుండుట కొందఱు గొప్ప సభ్యతగ భావింతురు. అట్టివారిని జూచిన నాకు "పాపమయ్యో!" యనిపించును. వారు జీవితమెట్లు వెళ్ళబుత్తురో గాని - మనకు మాత్రము వారినిజూచిన యోర్చుకొనుట యొక నరక యాతన! "సరేలేవయ్యా! నీకు కొంతకు కొంత యన్నియు నమరియున్నవి గనుక నందముగా నవ్వెదవు. మా కిరువది నాల్గుగంటలేవో సాంసారిక చింతలు. నీవలె తిన్నఁగాఁ గూర్చొని నవ్వుటకు తీరికలే" దని - కొందఱందురు. నా మనవి యేమనఁగా - నింటిలో నన్నియు నమరియున్ననే నవ్వవలెనను నియమము లేదు. మన సాంసారిక కష్టములు పోఁగొట్టుకొనుటకే హాసమొక యమూల్యమైన యౌషధమని నేను జెప్పునది. నా యనుభవములో ధనికులకన్నను - దరిద్రులే తృప్తిగ నవ్వుదురు. కాని కొందఱు వచ్చు నవ్వునుగూడ బలవంతముగ నాపికొని యేమో గాంభీర్యమును ప్రదర్శింప నారంభింతురు. అది వారి దురదృష్టము. ఒకసారి - ఉత్తర హిందూస్థానమున నొక విద్వాంసుని గలిసికొంటిని. అతఁడు ప్రసంగవశమున తులసీరామాయణముపై తానొక వ్యాఖ్యాతనని పల్కెను. తులసీదాసును వ్యాఖ్యానించుటకు తనకున్న ప్రత్యేకయోగ్యతలలో - నవ్వకుండుటయు నొకటి యని - యాతని మాటలలోనే తెలిసికొంటిని. అతఁడట! సుమారిరువది యేండ్లనుండి యొకమారైనను నవ్వలేదట! ఆ గాంభీర్యమే - తులసీదాసులను వ్యాఖ్యానించుట కొక ప్రత్యేకమైన యోగ్యతయట! ఆ వ్యాఖ్యాతను జూచుటకే నాకు భయమయ్యెను. ఇట్టివాఁడు-తులసీ దాసునకు దొరకుట-తయముకాగా-మిగలిన కర్మలేశమునకు గుఱు తేమోయనిపించినది. ఆ వ్యాఖ్యాత తన గ్రంథమును నా కొసంగుదునని పలికెను. దానిని దీసికొని చదువు సాహసము నాకులేకపోయినది. చదివినచో నాతనికున్న రోగము నాకు గూడ దగులుకొను నేమోయని నాభయము. శ్రీనాథునిలో విపరీతమైన హాస్యముగలదు. ఆతనిది ఘంధ

హసితముగాదు. అతి హాసితము. ఒక్కొక్కసారి యపహాసితము గూడ పోతనామాత్యుల యందును-హాస్యరసమున్నది. శ్రీనాథుఁడు భోగ్యవస్తువు లన్నియు నమరియుండి నవ్వినవాఁడు. పోతన్న పరమ దారిద్ర్యములో నుండియు-తృప్తిగా నవ్విన భాగ్యశాలి. కాని నగవు నందును-వారికి కొంత-సంయమమే యున్నది. సామాన్యముగ పోతన్నది మందహాసమే. అరుదుగాదప్ప హద్దుమీరిన చోటుండదు. కృష్ణుని బాల్యలీలలలో-నీహాస్య రసము—కొంతచోటు చేసికొన్నది. కాసంత యెక్కువ గూడ నేమో! తమరు చదివికొనవచ్చును. వామనుని కథలో గురుశాప తప్తుఁడైన పరి స్థితిలోఁగూడ బలి తన మందహాస ప్రియత్వమును విడువలేదు. అనఁగా-దుర్భర దారిద్ర్యమునందును పోతన్న తన హాస్య ప్రియత్వమును మానలే దన్నమాట! ఆ పద్య మీ క్రిందిది.

ఆ॥ వె॥ పుట్టినేర్చికొనెనో పుట్టక నేర్చెనో
చిట్టి బుద్ధులిట్టి పొట్టివడుగు
బొట్టమున్న వెల్ల బూమెలునని నవ్వి
యెలమి ధరణిదాన మిచ్చెనపుడు.

కాని-సాధారణముగ-నిట్టివరుదు. ఒక్క పదముతోనో- వాక్యము తోడనో హాస్యమును సూచించుట పోతన్న వాడుక. యయాతి చరిత్రములోని-యదువు చెప్పిన యీక్రింది పద్య మట్టిది.

శా॥ కాంతాహేయము-దుర్వికారము-దురాకండూతి మిశ్రంబు హ్యా
చ్చింతా మూలము పీనసాన్వితము ప్రస్వేద వ్రణాకంపన
శ్రాంతి స్ఫోటక యుక్తమీముదిమి వాంఛందాల్చి నానాసుఖో
పాంతంబైన వయోనిధాన మిది-యయ్యాతేరయీవచ్చునే.

(న. 551)

— దీనిలో 'తేరయీవచ్చునే'అను పదము చదివినపుడు మాత్రమే కాసంత మన ఫెఢఫి విచ్చును.

ఒక్కొక్కసారి పోతన్నయే మనయెదుట నిలచి చిఱునవ్వుతో కెదికి హెచ్చరించుటయు కద్దు. అట్టిది యొకటి.

కం॥ తజ్జనని లోగిటంగల
రజ్జు పరంపరల గ్రమ్మరం సుతుగట్టన్
బొజ్జ దిరిగిరాదయ్యో జ
గజ్జాలములున్న బొజ్జ గట్టన్ వశమే!

(ద. పూ. 385)

– అట్టి చోటులలో గూడ నితని హాస్యము లలితమైనదే! ఈ పద్యమును చూడుఁడు.

ఆ. వె॥ పొద్దుపుఁ గొండమీఁద పొడుచుట మొదలుగా
బరువువెట్టి యినుఁడు పశ్చిమాద్రి
మరుగు జొచ్చెగాక మసలిన చలిచేతఁ
జిక్కెచిక్కె ననగ చిక్కకున్నె?

– ఈ పద్యమునందు నాల్గవపాదమునందు మాత్రమే కొంత హాస్యమున్నది. సాధారణముగ నాతనికి చేష్టలతో హాస్యమును వర్ణించుట ప్రీతి. ఇందు కుదాహరణములు తమరు గోపికల క్రీడలు మొదలైనవానిలో జూడ వచ్చును.

భక్తి శృంగారములు – కరుణ – పోతనామాత్యులకు చాల ప్రియమైన రసములు. అశ్వత్థామను బట్టికొనివచ్చినప్పుడు ద్రౌపది బలికిన యా పద్యము లితర కవులెవ్వరును – వ్రాయలేనంత బాగుగానున్నవి. వైరాగ్యము – పశ్చాత్తాపము మొదలగు భావములను గూడ ఆతఁడెంతయో సానుభూతితో వర్ణించును. ఆ గుణము లామహాకవి జీవితములో అంత గాఢముగా నదుకుకొన్నవన్నమాట. సౌభరి మహాతపస్వి. ఒకనాఁడాతఁడు స్నానార్థమై యమునకు వెళ్ళెను. అక్కడ నొక మీనరాజు తనకుటుంబ

ముతోఁ గనపడినాఁడట! సౌభరికి సంసారముపై మనసుపోయినది. మాంధాత తన కూఁతులనందర నొసఁగి యాతనికిఁ బెండిలిసేసెను. సౌభరి సుఖము లన్నియు ననుభవించినాఁడు. ఒకానొకనాఁ డేకాంతమున నిట్లాలోచించు కొన్నాఁడట!

మ॥ ఉపవాసంబుల డయ్యుటో విషయ సంయోగంబు వర్జించుటో
తపముఞ్ బూనిచరించుటో హరిపదధ్యానంబునఞ్ నిల్చుటో
యపలాపంబున నేలఁబొందితి హతంబయ్యెఞ్ దపంబెల్ల నీ
కపట స్త్రీపరిరంభముల్ మునులకుఞ్ కైవల్య సంసిద్ధులే.

(స. 186)

చ॥ మునినట! తత్త్వవేదినట! మోక్షమగాని సుఖంబు లెవ్వియుఞ్
జనవట! కాంతలేబదట! సౌధచయంబట వాసదేశముఞ్
తనయులు నైదువేలట నిదానము మీనకుటుంబి సౌఖ్యముఞ్
గనుటట! చెల్లరే! నగవుగాక మహాత్ములు సూచిమెత్తురే.

(స. 187)

పైపద్యములను చదివినప్పుడు యెవ్వనికైనను కడుపున చేయిపెట్టి కలఁచినట్లగును. దీనికి కారణమాతఁడంత లీనుఁడై వ్రాయుటయే!

కృష్ణుఁడు తప్పుజేసినాఁడు. అప్పుడు యశోద వానిని కట్టివేయుటకై ప్రయత్నించినది. ఆ వెన్నదొంగ తప్పించికొనుట కెట్లు ప్రయత్నించు చున్నాఁడో చూడుడు.

సీ॥ స్తంభాదికంబులు తనకు నడ్డంబైన
యిట్టట్టు జని పట్టనీని వాని
యీ తప్పునైరింపు మింక దొంగిలఁబోవ
నేనని మునుముట్ట నేడ్చువాని

కాటుక నెఱయంగ కన్నులు నులుముచు
వెడలు కన్నీటితో నెగచువాని
నేదెసవచ్చునో యిదియని పలుమారు
సురుగుచు గ్రేఁగంట జూచువాని

**ఆ.** వె॥ గూఢచారి పట్టికొని వెఱపించుచు
చిన్ని వెన్నదొంగ చిక్కెననుచు
నలిఁగి కొట్ట చేతులాడక పూఁబోడి
కరుణతోడ బాలు కట్టఁదలఁచె.

(ద. పూ. 372)

— ఇట్టి పద్యములు తెలుగు వాఙ్మయముననే అరుదుగా దొరకును. లలితములైన భావములను పోతన్నవలె చెప్పగల వారాంధ్ర వాఙ్మయమున చాల తక్కువ. వర్ణనలు వచ్చునపుడు ఆతఁడు కొంత విస్తృతముగ వర్ణించును. శబ్దసంపదకే కొన్ని పద్యముల నాతఁడు పలుకును. తిక్కనామాత్యుల కవిత్వములో నొకానొక పద్యమునకు — కథా సందర్భమునుండి వేఱుపఱచినపుడు జీవములేదు. పోతనామాత్యులలో విశకలితములుగా చదువుకొనుటకు పనికివచ్చు పద్యము లెక్కువ. కథారచనలో పోతనామాత్యుఁడు చూపించిన మెలఁకువ యెంతయో గలదు. వామన చరిత్రలో నాకౌశల్యము పరాకాష్ఠ చెందినదనవచ్చును. వామనమూర్తి సభయందు - ప్రవర్తించిన విధము — బలివామనుల సంభాషణము - యీ భావమంతయు— పోతనామాత్యుని స్వకపోల కల్పితమే! బలిచక్రవర్తి కథ చదివినపుడే పాఠకునికిగాని — వామనునిపై సానుభూతి కలుగదు. మన హృదయములో గొనునుదాత్తనాయకుఁడు బలిచక్రవర్తి పోతన్న హృదయములోఁగొన్నవాఁడు గూడ నతఁడే.

దశమస్కంధములో కృష్ణవిరహ పరిత ప్తయైన గోపిక - పోతనామాత్యుఁడు కృష్ణు నుద్దేశించి:

సీ॥ అదె నందనందనుం డంతర్హితుండయ్యె
పాటలీ తరులార! పట్టరమ్మ!
హేలావతుల గృష్ణ! యేలబాసితివని
యైలేయ లతలార! యడుగరమ్మ!
వనజాక్షుఁ డిచటికివచ్చి డాఁగఁడుగదా!
చూతమంజరులార! చూడరమ్మ!
మానినీ మదనుతో మారాత యెఱిఁగించి
మాధవీలతలార! మనుపరమ్మ!
ఆ. వె॥ జాతిసకుల బాయ నీతియే హరికని
జాతులార! దిశలఁ జాటరమ్మ
కదళులార! పోయి కదలించి శిఖిపింఛ
జూటుఁదెచ్చి కరుణఁ జూపరమ్మ!

అని దీనముగా బలికెను. పోతనామాత్యుల విషయమున మనకుఁ దక్కిన భాగ్యము గూడనంతే! ఆ మహనీయుని గుఱించి మన మీ పద్యము మాటిమాటికిని మనన సేసికొనవలసినదే! ఆంధ్ర సాహిత్యములో నాతఁడొక స్వప్నమువంటివాఁడు. కవులెందఱో పుట్టిరి. పుట్టుదురు. పోతనామాత్యులవంటి తపస్వి, ఋషి, కవి, పుట్టుననిమాత్రము ధైర్యముగఁ జెప్పలేము.



# పోతన భాగవతము

## రాజవంశములు - భువనకోశము - ఇతర శాస్త్రములు



డా॥ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు
**M.A.Ph.D.**

# పూర్వపీఠిక

పోతన భాగవతమునందు సంస్కృత భాగవతమునందు కానరాని చారిత్రిక విషయములెవ్వియు కానరావు. పోతనకు బొత్తిగా చరిత్రదృష్టి లేదనుటలో అతిశయోక్తి ఎంతమాత్రమును లేదు. మూలము నందున్న చరిత్రను విమర్శించు మాట యటుండ దానిని సరిగ అర్థము చేసికొని తన గ్రంథమున చేర్చుటయందుకూడ కొంత ఔదాసీన్యము వహించెనేమో. అందువలననే సంస్కృత భాగవతమునకును పోతన భాగవతమునకును కొన్ని ముఖ్యభేదములు కాన్పించుచున్నవనియు తోచుచున్నది.

అసలు సంస్కృత భాగవతమునందలి రాజవంశ వృత్తాంతమునందే మత్స్య, వాయు, విష్ణుపురాణములతో పోల్చిచూచిన యడల కొన్ని భేదములు కాన్పించుచున్నవి. భవిష్యద్రాజవంశ వృత్తాంతములను తెలియపరచు పురాణములనన్నిటిని పరిశీలించి వానిలోని చారిత్ర కాంశములన్నిటిని చర్చించి యిదమిత్థమని నిర్ణయించుటకుగాని ఈ దృష్టితో పరిశీలించినపుడు పురాణములలోపలి ఎంతవరకు నమ్మదగినవి అని నిశ్చయించుటకుగాని, వానిలో భాగవతము నందలి రాజవంశవృత్తాంతము ఎంతవరకు నమ్మదగినది అని కాని చర్చించుటకు గాని ఇచట గ్రంథవిస్తర భీతిచే సాధ్యము కాదు.

ఇక పోతన భాగవతము నందలి విషయమును గాని, లేక సంస్కృత భాగవతమునందలి విషయమును గాని సమన్వయము చేసి చూపవలెనన్న యడల ఇతర పురాణములందలి అంశములన్నిటిని పరిశీలించి వాని సహాయముచేత సమన్వయము చేసిన గాని సాధ్యముగాదు. ఒక్క పురాణములే గాక ఇతిహాసద్వయముగూడ ఈ సందర్భమున అత్యంతావశ్యకములైన ఆధారసామగ్రి చారిత్రిక పరిశోధనయందు ఎట్టి ఆధారములను పరిశీలింపక వదలివైచుట సాధ్యముగాదు. కాబట్టి భాగవతము నందలి చారిత్రికాం

శములను సమగ్రముగ చర్చింపవలెనన్నచో ఒక్క పురాణేతిహాస వాఙ్మయము మాత్రమే గాక ఈ అంశములనుగూర్చి ప్రస్తావనజేయు బౌద్ధ, జైన వాఙ్మయమేమి, అంతకన్న ముఖ్యాధారముల వేదవాఙ్మయమేమి ప్రాచీన చారిత్రకాధారముల నన్నిటిని కొద్దిగనో, గొప్పగనో పరిశీలించిన గాని చారిత్రక సమన్వయమున కుదురదు. అందువలన ఈ వ్యాసమున ప్రధానముగ భాగవతమును (అందులో ముఖ్యముగ పోతన భాగవతమును) దృష్టియందుంచుకొని యుండినను సంపూర్ణతకొరకై ఇతర చారిత్రకాంశములనుగూడ (అవి పోతన భాగవతమునందుగాని, సంస్కృత భాగవతమునందు గాని సంక్షిప్తములైనను) కొంతవరకు చేర్చబడియున్నవి. ఎన్నియో అంశములు భేదాభిప్రాయమునకు తావిచ్చుచున్నవి గాని వాటి నొక్కొక్క దానిని చర్చించినచో ఈ వ్యాసము మితిమీరి పెరిగిపోవునను భయముచే బహుజనామోదమును బడసిన అభిప్రాయములను మాత్రము విశదీకరించి చర్చలను వదలి వైచితిని.

ఈ వ్యాసరచనయందు నాకు తోడ్పడిన గ్రంథములు అసంఖ్యాకములు. వాని నన్నిటిని ఇందు పేర్కొనుట దుస్సాధ్యము. కాని సుమారు ముప్పది సంవత్సరములుగ ఈవిషయమునుగూర్చి చదువుచున్నను ఈ ప్రచురితములైన గ్రంథములన్నియు నాకు లభించనందున ప్రధాన గ్రంథములను మాత్రమే దృష్టియందిడుకొని నా రచనను సాగించితిని. ఇందు పొందుపరచిన అతిసంగ్రహ పుస్తకముల పట్టికలోని గ్రంథము లన్నిటికిని నేను కృతజ్ఞుడను. ముఖ్యముగా రాప్సన్, హజ్రా, పార్జిటర్, పుసాల్కర్, రాయ్‌చౌదరి మహాశయులకు అధికముగా ఋణపడియున్నాను. అట్టి గురువర్యుల శిక్షణయుండియు నేను అక్కడక్కడ ఏవైన దోషములు చేసియుండిన యడల క్షంతవ్యుడను.

# 1. కాలక్రమము

చరిత్ర కందరాని ప్రాచీన కాలము నందలి పౌరాణిక సంఘటనలను గాని, రాజవంశ వృత్తాంతములను గాని కాలమానరీత్యా నిర్ధరించి చూపుట దుష్కరమైన పని. కడకు ఒక్కొక్క యుగము యొక్క పౌర్వాపర్యము లను నిర్ధరించుటయు గూడ దుస్సాధ్యమే. కాని భారత యుద్ధము ప్రాచీన సంఘటనలలో అత్యంత ప్రాముఖ్యము గలది. కాన భారత యుద్ధకాల మును నిశ్చయింప గలిగిన యెడల దీనిపై నాధారముచేసి ప్రాచీన రాజ వంశముల కాలమును ఒక మోస్తరుగ నిర్ణయము చేయవచ్చును.

భారత యుద్ధము కలియుగారంభముననే జరిగెననియు, కలి యుగము ఆరంభమైన పిదప 653 సంవత్సరములకు జరిగెననియు రెండు ముఖ్యమైన సంప్రదాయములు కలవు. మొదటి వాదమునకు బాదామి చాళుక్య రాజగు రెండవ పులకేశి యొక్క ఐహోలెశాసనము ఆధారము. రెండవ దానికి ఆధారము వృద్ధగర్గ, వరాహమిహిర, కల్హాణుల వ్రాతలు. కలియుగము క్రీ॥ పూ॥ 3102 నందు ప్రారంభమాయెనని ప్రాచీన ఖగోళ శాస్త్రజ్ఞుల సంప్రదాయమును ఆర్యభటుడు ఉద్ఘాటించి యున్నాడు.

మహాభారత గ్రంథమునందు ప్రస్తావించిన నక్షత్ర, గ్రహస్థితినిబట్టి కాలనిర్ణయము చేయుటకు కొందరు ప్రయత్నము చేసియున్నారు. కాని పరస్పరవిరుద్ధములగు అంశములే ఈ మహాభారతమునందు తెల్పబడి యున్నందున ఈ రీతిగ ఎట్టి సమన్వయమును కుదురుట లేదు.

నందవంశ రాజగు మహాపద్మడు క్రీ॥ పూ॥ 382 యందు సింహా సన మెక్కెను. ఇంతకు పూర్వము 1015 సంవత్సరముల క్రితము పరీక్షిత్తు జనించెనని పురాణములును, మహాభారతమును చెప్పుచున్నవి. అతడు మహా భారత యుద్ధమునందు జనించెను. కాబట్టి భారత యుద్ధము సుమారు

(1015+382=) క్రీ॥ పూ॥ 1397 నందు జరిగెనని చెప్పవచ్చును. మహాపద్మనందునికిని, జనమేజయుని ప్రపౌత్రుడగు అధిశీమకృష్ణునికిని మధ్య 26 మంది రాజులు పరిపాలన మొనర్చిరట. ఇది బహుశః పొరబాటేమో. లేకున్న ఒక్కొక్క రాజునకు సరాసరి 18 సంవత్సరముల చొప్పున (26 × 18 =)468 సంవత్సరములును, యుధిష్ఠిర అధిశీమకృష్ణులకు మధ్య 100 సంవత్సరముల అంతరాళమును మొత్తము కాలము 1015 సంవత్సరములకన్న చాలా తక్కువ యగుచున్నది. ఒక్కొక్క రాజునకు 18 సంవత్సరములకన్న ఎక్కువగ రాజ్యకాలము నాపాదించుటయు కూడ చారిత్రక సంప్రదాయమునకు విరుద్ధము. కాబట్టి భారత యుద్ధము సుమారు క్రీ॥ పూ॥ 1400 ప్రాంతమున జరిగినదని తలంపవచ్చును.

భారత యుద్ధమునకు పూర్వము 95 తరముల నాటివాడు వైవస్వతమనువు. ఇతనితో కలియుగ మారంభమగుచున్నది. తరమునకు 18 సంవత్సరముల చొప్పున కలియుగారంభమును వైవస్వతమనువు కాలమును భారత యుద్ధమునకు (95 × 18 =)1710 సంవత్సరములకు పూర్వమనియు, అనగా సుమారు క్రీ॥ పూ॥ (1710 + 1400 =)3110 సంవత్సరములనాటి వనియు నిర్ణయింప వీలు కలదు. ఖగోళ శాస్త్రజ్ఞుల సంప్రదాయమునకల తారీఖునకును (అనగా క్రీ॥ పూ॥ 3102) ఈ తారీఖునకును సమన్వయము కుదురుచున్నది.

కలియుగారంభమున జల ప్రళయము సంభవించెననుటకు ప్రబలమైన ఆధారములు కలవు. చాలా ప్రాచీన గ్రంథమైన శతపథ బ్రాహ్మణము నందే ఈ జలప్రళయమును గూర్చియు వైవస్వతమనువు సృష్టి నిరశించుటను గూర్చియు ప్రస్తావన గలదు. ఈ జల ప్రళయ వృత్తాంతము హీబ్రూ, బాబిలోనియా ఇతిహాసములందు కూడ కలదు. మెసొపొటేమియా ప్రాచీన ఇతిహాసమునందు ఈ జల ప్రళయము సుమారు క్రీ॥ పూ॥ 3100 ప్రాంతమున సంభవించెనని కూడ కలదు. కాబట్టి కలియుగారంభము ఈ విచిత్ర సంఘటనము నుండియే పరిగణింపబడెనని ధృవపడుచున్నది.

కలియుగారంభమునకును, భారత యుద్ధమునకును పైరీతిగ కాల నిర్ణయము చేసినయడల ప్రాచీన రాజవంశముల కాలమును ఈ క్రింది విధముగ నిశ్చయింపవచ్చును.

ప్రాచీన సంప్రదాయమున మొట్టమొదటి రాజు వైవస్వతమనువు కాబట్టి వైవస్వతమనువు యుగమును సుమారు క్రీ॥ పూ॥ 3100 నాటిదనియు, ఈ మనువునకు ఐదవతరమునాటి వాడగు యయాతి ఇతని తరువాత (18 × 5 =)90 సంవత్సరములకు అనగా సుమారు క్రీ॥ పూ॥ (3100 − 90 =)3010 నాటి వాడనియు, అతని తరువాత ఇరవై తరములకు అనగా (20 × 18 =)360 సంవత్సరములకు రాజ్యమెక్కిన మాంధాత సుమారు క్రీ॥ పూ॥ (3100 − 360 =)2740 నాటి వాడనియు, తదుపరి 31, 33 తరములకు పిదప వచ్చిన కార్తవీర్యార్జున, విశ్వామిత్ర, జమదగ్ని, పరశురామ, హరిశ్చంద్రుల కాలము సుమారు క్రీ॥ పూ॥ (3100 − 31 × 18 =)2542 నుండి 2506 వరకుననియు అయోధ్యరాజగు సగరుడును, హస్తినాపురరాజులగు దుష్యంత, భరతులును సుమారు క్రీ॥ పూ॥ (3100 − 41 × 18 =)2362 నుండి (3100 − 44 × 18 =) 2308 మధ్య కాలమున వెలసి రనియు, శ్రీరామచంద్రమూర్తి మనువునకు 65 తరముల పిదప రాజ్యమేలెను గాన సుమారు క్రీ॥ పూ॥ (3100 − 65 × 18 =) 1930 నాటి వాడనియు, శ్రీకృష్ణుడు అటుతరువాత వాడనియు తలంపవచ్చును.

పై సమన్వయము ఒక రీతిగ సంతృప్తికరముగ నున్నను, ఇంకను ఎంతయో పరిశోధన జరిగిన గాని ఇదమిత్థమని నిర్ధరించుటకు వీలులేదు.

## 2. జలప్రళయమునకు పూర్వపుగాథ

కలియుగమునకును జలప్రళయమునకును పూర్వము జరిగినవృత్తాంతములు పురాణములందు కొంతవరకు వర్ణింపబడియున్నవి. సృష్టియందు

ప్రప్రథమమున నుండిన మనువు స్వాయంభువ మనువు. ఈ స్వాయంభువ మనువు బ్రహ్మనుండి జనించి తన అర్ధనారీ రూపమగు దేహమునందలి శతరూపా నామమున బరగిన స్త్రీ భాగమునుండి ప్రియవ్రత, ఉత్తానపాదులు ఇరువురు కుమారులను, ముగ్గురుకుమార్తెలను పొందెను. ఈకుమార్తెలకును దేవతలకు, ఋషులకును, యజ్ఞములకును ఎంతయో సంబంధముగలదని గాథలు కలవు. కాని ఈ ముప్పురిలో నొకతె ఆకూతి స్వారోచిషమనువు యొక్క జనని.

స్వాయంభువమనువు నకులి రాజుడని అపరనామముగలదు. ఇతనికి పూర్వముండిన ఆనంద బ్రహ్మ వర్ణవ్యవస్థ నేర్పరచి, వివాహ ధర్మమును స్థాపించినను కాలక్రమున నష్టమై పోయినందున స్వాయంభువ మనువు పునః ప్రతిష్ఠచేసెనట. ఇతడు విజేతయై శత్రువుల నందరినిజయించి భూమి యందు ప్రథమ రాజాయెనట. ఇతని రాజధాని సరస్వతీనది యొడ్డున నుండెను.

రెండవ మనువు స్వారోచిషుడు. స్వాయంభువమనువు యొక్క కుమారు లిరువురిలో నొక్కడును మనువు గాజాలరైరి. కాని అతని పెద్ద కొడుకగు ప్రియ వ్రతుని ముగ్గురు కొడుకులును శైశవమునందే సన్యసించి తరువాతి మన్వంతరమున ఉత్తమ, తామస, రైవత నామముల బరగి మూడవ, నాలవ, ఐదవమనువులుగ వెలసిల్లిరి. స్వాయంభువ మనువు రెండవ కొడుకగు ఉత్తానపాదుని ముగ్గురి కొమారులలో ధ్రువుని గాథ అందరెరిగి నదే. అతని తమ్ములు కీర్తివత్, ఉత్తములు నామమాత్రావశేషులే. ధ్రువుని పిదప ప్రాచీన గర్భుడు సింహాసన మెక్కెను. ఈ వంశమునందలి చాక్షుషుడు ఆరవ మనువు. అతని పౌత్రుడు వేనుడు దుష్టుడై నిరంకుశముగ ప్రవర్తింపగా ప్రజలు చేలరేగి, అతనిని జంపి, అతని కుమారుడైన పృథువును అభిషిక్తుని గావించిరి. ఇతడు వ్యవసాయమును వృద్ధిజేసి, పశుసంపదను పెంచి, వ్యాపారమును పెంపొందించి, అసంఖ్యాకములగు గ్రామములను పట్టణములను నెలకొల్పి, సర్వతో సమగ్రమైన అభివృద్ధిని దెచ్చి తన పేర

భూమికి పృథివియను పేరు చిరస్థాయి గావించెను. ఋజు మార్గమున పరిపాలించు రాజులందరికిని ఇతడు ఆదర్శ ప్రాయుడు. అతడు సింహాసన మెక్కినపుడు గావించిన ప్రమాణమును పరిశీలించినచో నిరంకుశత్వమునకు ఎంత మాత్రమును తావియ్యక తన బాధ్యతను బాగుగా గుర్తెరిగి సక్రమ పాలనను గావించు అధునాతన చక్రవర్తు లెవ్వరును ఇంతకన్న నిశితమైన శపథమును గావింపజాలరని స్పష్టమగును.

పృథువునకు ఐదవ తరమువాడు దక్షుడు. ఇతని కూతురి పౌత్రుడే జలప్రళయమునుండి సృష్టిని కాపాడిన వైవస్వత మనువు.

## 3. ప్రళయము-వైవస్వత మనువు

సుమారు క్రీ. పూ. 3100

పురాణములలో విపులముగ వర్ణింపబడిన ప్రళయ వృత్తాంతము మహాభారతమునందును అంతకన్న ప్రాచీన గ్రంథమగు శతపథ బ్రాహ్మణ మునందును గూడ సంగ్రహముగ వర్ణింపబడియున్నది. ఈగాధ అందరెరింగినదే. మనువు ఒకనాడు చేతులు కడుగుకొనుచుండగా తన్ను రక్షింపమని ఒక చిన్నచేప వేడుకొనెననియు, దయామయుడగు మనువు ఆ చేపను తనకమండలములో వేసి పెంచగా అంత కంతకు పెద్దదై కమండలము కాదు గదా, చిన్న బావిలోను, చెరువులోను కూడ స్థలము జాలక మహా సముద్రమునకు చేర్పవలసి వచ్చెననియు, ప్రళయము ఆసన్నము కాగానే ఈ మత్స్యము సలహానుబట్టి మనువు ఒక పడవను నిర్మించుకొని ఈ చేపకొమ్మునకు కట్టి ఉత్తర పర్వతమునకు చేరి, పడవ నొక చెట్టునకు కట్టివైచి కొండ నెక్కి ప్రాణసంరక్షణ చేసికొని జలప్రళయము ఉపశమనము చెందిన పిదప కొండపైనుండి దిగి వచ్చి మానవ సృష్టి నారంభించెననియు ఈ కథయందు స్థూలముగ తెలియుచున్నది. ఉత్తరమునందున్న నేటి హిమాలయ పర్వతములందు ఒకచోట కొండ చరియను మనోరవతరణమని యందురు, ఇచటనే మనువు పైనుండి కొండ దిగివచ్చెనట,

వైవస్వత మనువు మానవత్వమునకే ఆదికారణము. కాబట్టి పురాణములలో పేర్కొనబడిన రాజవంశముల కన్నిటికిని అతడేమూలపురుషుడు. ఇతడే ప్రథమ రాజు, పాలకుడును కాబట్టి భూలోకమున చట్టములనేర్పరచి పరిపాలనా పద్ధతి నారంభించినది ఇతడే. పరిపాలనా నిర్వహణమునకై వలయు ఆర్థిక సంపత్తిని సేకూర్చుటకై భూమి ఆదాయమునందు ఆరింట ఒక పాలు ప్రభుత్వమునకు పన్నుగా చెల్లింపవలెనని నిర్ణయించినది కూడ ఇతడేనట.

ఈ మనువునకు పదిమంది కుమారులు కలిగిరి. కాని వీరి పేర్లను గూర్చియు జనన క్రమమును గూర్చియు ఒక్కొక్క పురాణములో నొక్కొక్క రీతిగ చెప్పబడియున్నది. జ్యేష్ఠుడు విచిత్ర పురుషుడు, ఇతడు ఇల అను పురుషుడు: కాని ఇతడు స్త్రీకూడ. కాబట్టి ఇలా అని ఆడ పేరు కూడ ఇతనికి కలదు. మిగతా వారి పేర్లను ఈ క్రింది రీతిగ నిశ్చయింప వచ్చును. (1) ఇక్ష్వాకు (2) నాభాగ(3) ధృష్ట (4) శర్యాతి (5) నరిష్యంత (6) ప్రాంశు (7) నాభాగోద్దిష్ట (లేదా నాభానేదిష్ట) (8) కరూష (9) పృషధర. వీరిలో నలుగురే రాజ వంశ స్థాపకులు. ఇక్ష్వాకు అయోధ్యను రాజధానిగా చేసికొని పరిపాలించెను. ఇతని తనయుడు వికుక్షి ఐక్ష్వాకు (సూర్య) వంశమును స్థాపించెను. నాభాగుని వంశము బహుశః గంగా ప్రాంతమున మధ్యభాగమును పాలించిరేమో. ఈవంశమును ఎక్కువ విశేషములు తెలియవు. త్వరలో పరాజితులై స్వాతంత్ర్యమును గోల్పోయిరేమో. ఈవంశములోనివాడే రథీతర చక్రవర్తి ఇతని వంశీయులే రథీతర లని ప్రసిద్ధిగాంచిన క్షత్రియాంశసంపన్నులగు క్షత్రియ బ్రాహ్మణులు. ధృష్ట వంశీయులైన ధార్ష్టక క్షత్రియులు పంజాబులోని వాహీకను పరిపాలించిరి. వీరు బ్రాహ్మణులనియు, క్షత్రియులనియు, వైశ్యులనియు కూడ నానావిధముగ ప్రస్తావనగలదు. వర్ణవ్యవస్థ ఏమంత విస్పష్టముగ పరిగణింపబడని రోజులవి. శర్యాతి వంశీయులు ఆనర్త ప్రాంతమును పరిపాలించిరి. గుజరాత్ ప్రాంతముతో సంబంధము కలిగించుకొనిన వారిలో వీరే

ప్రథములు. కాబట్టి గుజరాత్ యొక్క ప్రాచీననామము ఆనర్త. శర్యాతి కుమారుడైన ఆనర్తుని నుండి ఈ పేరు వచ్చెను. నరిష్యంతుని వంశీయుల గూర్చి ఏమియు తెలియ రాకున్నది. వీరు శకులకు మూల పురుషులని కొందరు చెప్పుచున్నారు. ప్రాంశు వంశీయులు కూడ అజ్ఞాతులే. నాభ గోద్దిష్టుడు ఉత్తర బిహారునందు వైశాల వంశమును స్థాపించెననియు, నేటి బసార్హ్ (ముజఫర్ పూర్ జిల్లా) నాటి వైశాలియనియు తోచుచున్నది. సోన్ నదికి పడమట నున్న నేటి రీవా సంస్థానమును కరూషు లాక్రమించి మహా యోధులుగ కీర్తిగాంచిరి. పృషధరునికి మాత్రము భూభాగమే లేక పోయెను. ఇతడు గురువుగారి గోవును జంపి నేరస్థుడాయెనట.

జ్యేష్ఠపుత్రుడైన ఇలుడు స్త్రీరూపమున బుధుని పరిణయమాడి పురూరవుని ప్రసవించెను. ఇతడే ఐల (చంద్ర)వంశస్థాపకుడు. ఈ ప్రధాన వంశమునుండియే కాన్యకుబ్జులు, యాదవులు (హైహాయులు, అంధకులు, వృష్ణులు) తుర్వసులు, ద్రుహ్యులు, ఆణవులు, పంచాలులు, బార్హద్రథులు, చేదులు మొదలగు రాజవంశము లుద్భవించెను.

ఇలాదేవి సుద్యుమ్నుడను కింపురుషునిగ పరివర్తనముజెంది సుద్యుమ్నులని ప్రసిద్ధిజెందిన ఉత్కల, గయ, వినతాశ్వు లను పేర్లుగల ముగ్గురు కుమారులను పొందెను. ఈ ముగ్గురును క్రమముగ ఉత్కల, గయ, ఉత్తర కురు మున్నగు ప్రాచ్య దేశములకు రాజులైరి. కొంతకాలమునకు పిదప ఆనవులును, కాన్యకుబ్జులును ఈ ప్రాంతమునంతటిని ఆక్రమించుకొనగా ఈ మూడు వంశములును అంతమొందెను.

చంద్రవంశరాజులైన పురూరవ, నహుష, యయాతుల జైత్ర యాత్రలవలననే క్రమముగా కరూష, నాభాగ, ధృష్ట, నరిష్యంత, ప్రాంశు, పృషధర రాజ్యము లంతమొంద పౌరవ రాజ్యము విస్తరించెను,

# 4. యయాతియుగము

సుమారు క్రీ॥ పూ॥ 3000–2750

## 1. చంద్రవంశము :

బుధునికో లేక సోమునికో ఇలాదేవియందు జనించిన ఐలపురూరవుడు చంద్రవంశ స్థాపకుడని పైన చెప్పబడెను. ఐలరాజధాని ప్రతిష్ఠానమనియు, తరువాతికాలమున ఇచట ఐలులు ఎన్నియో గొప్ప కార్యములు చేసిరనియు పురాణములు చెప్పుచున్నవి. కాని వీరు ఆరంభమున హిమాలయప్రాంతము వారనుటకు పురాణములందు ఎన్నియో ఆధారములు కలవు.

పురూరవుడు సప్తద్వీపములను పరిపాలించి ఒకవంద పర్యాయములు అశ్వమేధయాగమును గావించెనట. ఊర్వశీ పురూరవుల ప్రేమగాథ అందరెరిగినదే కాని చివరకు ఇతడు అధికారమదాంధుడై బ్రాహ్మలపై దండెత్తి, వారి నగలను హరించి, నైమిష ఋషులు యాగము చేయుచుండగా కాంచన ఖచితమైన వారియజ్ఞశాలనే కొల్లగొట్ట నుద్యమించెనట. ఋషులు కుపితులై ఇతనిని వధించి, ఇతని జ్యేష్ఠపుత్రుడైన ఆయువును సింహాసన మెక్కించిరి.

పురూరవుడు సూర్యవంశజుడైన ఇక్ష్వాకు చక్రవర్తియొక్క సమకాలికుడు. ఉత్తరముననుండిన ఇక్ష్వాకు చక్రవర్తియొక్క అయోధ్య రాజ్యమును జయింపజాలక, దక్షిణమున మహాయోధులైన కరూషుల నెదిరింపజాలక పురూరవుడు తూర్పువైపునను, వాయవ్యదిశయందును తన రాజ్యమును విస్తరింపజేసెను. ఈ విధముగ ఐలరాజ్యమునందు గంగాయమునానదుల మధ్యప్రదేశమును, మాల్వా, తూర్పు రాజపుత్రస్థానమును చేరిపోయెను. ఈ విశాలరాజ్యమును పురూరవుని యనంతరము ఆయుః అమావసు లను అతని కుమారులిరువురును పంచుకొనిరి,

ఆయువు ప్రతిష్ఠానము రాజధానిగా ఐలవంశము ఉత్తరోత్తరాభి వృద్ధినొందునట్లుప్రయత్నములు సాగించుచుండగా అమావసుగంగాయమునా నదుల మధ్యప్రాంతమును తన భాగముగ పంచుకొని కాన్యకుబ్జవంశమును స్థాపించెను. ఆయువు ఋషులకును, బ్రాహ్మణులకును గౌరవము జూపి వారితో స్నేహభావమున మెలంగుచుండెను. కాని స్వర్భానుడను దానవ రాజ కూతురుని ప్రభాదేవిని పరిణయమాడి ఐదుమంది పుత్రులను బడసెను. వీరిలో నహుషుడు,క్షత్రవృద్ధుడు అను మొదటిఇరువురు మాత్రమే ముఖ్యులు.

నహుషుడు తండ్రి యనంతరము ప్రతిష్ఠానమునకు రాజుకాగా రెండవవాడు తూర్పువైపున కాశీపట్టణపు రాజయ్యెను. నహుషుడు గొప్ప యోధుడు. ఇతడు భూమిపైన ప్రప్రథమమున నాటకరంగమును స్థాపించె నట. ఇతడు ఇంద్రపదవిని పొందెననియు, పిదప గర్వితుడై అగస్త్యుని పరి హసించి, తన ఉత్తమ స్థానమును గోల్పోయెననియు మహాభారతమున ఒక గాథయున్నది. కాని నహుషుడు కడుసమర్థుడని పరిగణించుటకే ఎక్కువ ఆధారములు కలవు.

నహుషుని పిదప రాజ్యమెక్కిన అతని తనయుడు యయాతి సమ్రాట్ బిరుదాంచితుడని పురాణములందును మహాభారతమునందు ప్రశం సింపబడెను. ఇతడు అయోధ్య, కాన్యకుబ్జ రాజ్యములకు పడమటనున్న మధ్యదేశము నంతటిని సరస్వతీ నదివరకును జయించెను. తన రాజ్యమునకు ఆగ్నేయమునను, దక్షిణమునను,పశ్చిమమునను ఉండిన భూభాగమునంతటిని ఆక్రమించుకొనెను. భార్గవకుల ఋషి పుంగవుడైన ఉశన శుక్రుని కుమార్తె యగుదేవయానియు,అసుర రాజైన వృషపర్వుని కుమార్తెయగు శర్మిష్ఠయు ఇతనిభార్యలు. వీరిరువురి వివాహమునుగూర్చి కొంతవిస్తరముగ పురాణము లందును, మహాభారతము నందును వర్ణింపబడియున్నది. దేవయాని వివా హము ప్రతిలోమ వివాహము. కాన దీనిని సమర్థించుటకై కొన్ని విశేష కారణములు చెప్పబడి యున్నవి.

దేవయానికి యదుతుర్వసులను ఇరువురు కుమారులును, శర్మిష్ఠకు అను, ద్రుహ్యు, పూరు అను ముగ్గురు కుమారులును జనించిరి. యయాతి తన రాజ్యము ఈ ఏవురికిని పంచియిచ్చి ప్రధానవంశము నిలబెట్టుటకు మాత్రము కనిష్ఠ పుత్రుడైన పూరువునే నియోగించి ఇతనికి ప్రతిష్ఠానము రాజధానిగాకల మధ్యదేశమును (గంగాయమునలకు మధ్యనున్న భాగము నందు దక్షిణ భాగమును) పంచి ఇచ్చెనట. పూరువు క్రమముగ కీర్తివంతుడై ఈ వంశమునకు పూరువంశమనియు, పౌరవ వంశమనియు అపరనామమును సంపాదించెను. ఇతని పిదప ఇతని తనయుడు జనమేజయుడు సింహాసన మెక్కెను. ఇతర తనయులే ప్రాంతమును పొందిరో స్పష్టముగ తెలియుట లేదు. జ్యేష్ఠుడైన యదు చక్రవర్తి చర్మణ్వతీ (చంచల్) వేత్రవతీ (బెత్వా) శుక్తిమతీ (కేన్) నదులతో విరాజిల్లు నైఋతి భాగమును పొందె ననియు, తుర్వసు రీవాప్రాంతమునగల ఆగ్నేయ దిగ్భాగమును పొందె ననియు, ద్రుహ్యుడు పడమటి ప్రాంతమును, అనువు ఉత్తర ప్రాంతమును పొందిరని కొన్ని పురాణముల నుండి తెలియుచున్నది.

ఈ రీతిగ పూరువు నాటికి కాశీకాన్యకుబ్జములతో సహా ఐల వంశీయులు సప్తరాజ్యములను స్థాపింపగల్గిరి. కాని వీటిలో యదుచక్రవర్తి స్థాపించిన యాదవవంశమొక్కటే చంద్రవంశము లన్నిటియందును కడుంగడు ప్రశస్తిగాంచెను. గుజరాత్, కాఠియవార్ ప్రాంతమున నుండిన శర్యాతులను జయించి రాక్షసు లాక్రమించుకొనగా యాదవులు ఈరాక్షసులను జయించి ఆ ప్రాంతము నంతటిని ఆక్రమించుకొనిరి. యదుచక్రవర్తి కుమారులలో క్రోష్టా, సహస్రజిత్ అను ఇరువురు మాత్రమే ముఖ్యులు. వీరికాలములో యాదవ వంశము రెండుగా చీలి యాదవ, హైహాయ వంశములుగ నేర్పడెను.

యదుచక్రవర్తికి పన్నెండవతరము వాడైన చిత్రరథుడు మతినారు డను పేరుగల పౌరరాజునకు సమకాలీనుడు. మతినారుని కూతురు అయోధ్యరాజగు సూర్య వంశపు రెండవ యువనాశ్వుని వివాహమాడెను. వీరి

పుత్రుడు మాంధాత చిత్రరథుని పౌత్రి (శశబిందు కుమార్తె) బిందుమతిని పరిణయము జేసికొనెను. చిత్రరథ శశబిందువులు గొప్ప సామర్థ్యవంతులు. శశిబిందుపాలనమునందే యాదవ రాజ్యము విస్తరించి తూర్పున పౌరవ, తుర్వసు రాజ్యములను, ఉత్తరమున ద్రుహ్యారాజ్యములను ఆక్రమించు కొనెను.

## 2. సూర్యవంశము :

మనువు యొక్క తొమ్మండుగురు కుమారులు స్థాపించిన వంశ ములలో అయోధ్య, విదేహ, వైశాలి, శర్యాత వంశములు మాత్రమే ఎన్నదగినవి.

మనువుయొక్క జ్యేష్ఠపుత్రుడు ఇక్ష్వాకు చక్రవర్తి అయోధ్య రాజులలో ప్రథముడు. ఇతనికి నూరుగురు కుమారులు కలిగిరి. కాని వారం దరిలో ఇతని పిదప సింహాసనమెక్కిన వికుక్షియు (ఇతనికి శశాదుడనియు కూడ పేరు కలదు), విదేహరాజ్యమును స్థాపించిన నిమియు, అరణ్యాము నకు పేరునిచ్చిన దండకుడును మాత్రమే ముఖ్యులు.

వికుక్షుని కుమారుడు పరంజయుడనియు, పురంజయుడనియు కకుత్స్థుడనియు ప్రసిద్ధిగాంచెను. రణరంగమున ఇంద్రుడు వృషభరూపము దాల్చి తన మూపురము (కకుత్) భాగముపై నెత్తికొనిపోయెనట. ఇతనికి ఆరవతరమువాడు ఉత్తర కోసలరాజధాని నగరమైన శ్రావస్తి నగరమును స్థాపించిన శ్రావస్తుడు; యువనాశ్వుని కుమారుడు.

శ్రావస్తుని పౌత్రుడైన కువలాశ్వునికి దుంధుమార యని బిరుదు. ఈ బిరుదును గూర్చి యొక విచిత్రగాథ గలదు. ఇతడు దుంధు అను రాక్ష సుని భంజించి, ఉత్తంకుడను మునివర్యుని రక్షించుటకై రాజపుత్రస్థానము నందు ఎడారిలో మధ్యనున్న లోతులేని సముద్రమునకు వెళ్లెనట. అటనున్న

రాక్షసుని జయించి భూగర్భముననుండిన అతని అగ్నిప్రాసాదమును తుద ముట్టించెనట. బహుశః ఏదైన ఒకఅగ్నిపర్వతము పశ్చిమకోస్తా యందుండె నేమో అనియు ఆ పర్వతము విజృంభించినపు డొకమారు కువలాశ్వుని సేన నాశనమునుజెందినను అతడుచుట్టుముట్టు త్రవ్వినందువలన ఏదో ఒక జల ప్రవాహము (బహుశః సమీపముననే, భూగర్భము నుండేనేమో) ఈ అగ్నిపర్వతముపై ప్రవహించి తుదముట్టించెనేమో అనియు డాక్టరు నరేంద్ర నాథ లా అను చరిత్రజ్ఞుడు వ్యాఖ్యానము చేయుచున్నాడు. బహుశః దక్షిణ రాజపుత్రస్థానము నందును ఇంకను పశ్చిమముననుఉండిన అసురు లను ఆదిమ వాసులను జయించి ఆర్యసంస్కృతిని వ్యాపింపజేసినందున ఇట్టి గాథ ఏర్పడి యుండునని కూడ తోచుచున్నది.

కువలాశ్వునికి ఎనిమిదవ తరమువాడు రెండవ యువనాశ్వుడు. ఇతనికి సౌద్యుమ్ని యని అపరనామము గలదు. ఇతనిని గూర్చియు ఒక విచిత్ర గాథ కలదు. ఇతడు పొరబాటున తన పట్టపురాణి కివ్వవలసిన మంత్ర జలమును తానే త్రాగినందున గర్భము ధరించి తన ఎడమ రొమ్ము ఎముక నుండి కుమారుని ప్రసవించెనట. ఈ శిశువు ఇంద్రుని బొటన వ్రేలిని చివికి అమృతమును పొంది, పెరిగి, పెద్దవాడైనందున మాంధాతయని పేరు గాంచెనట.

సూర్యవంశము నందలి ఇతర శాఖలను గూర్చి ఇచట సంగ్రహముగ ప్రస్తావింపవచ్చును. ఇక్ష్వాకు కుమారుడైన విదేహుడు (ఇతనికే నిమియని మరియొక పేరు గలదు) విదేహ రాజులకు మూలపురుషుడాయెను. ఇతడు జయంత పట్టణము నధివసించుచుండెను. ఇతనికుమారుడే మిథియను పేరుగల జనకుడు. మిథి నుండియే రాజధాని పేరుకూడ మిథిలయాయెను. కాలక్రమమున ఈ వంశము పేరు కూడ మారిపోయి జనక వంశమాయెను.

నాభానేదిష్టుడు స్థాపించిన వంశము తరువాతి రాజైన విశాలనుండి వైశాలి వంశమని పేరు గాంచెను. ఇతడే విశాల లేక వైశాలి నగరమును

స్థాపించెను. ఈ వైశాలి మొదటి రాజుల పేర్లు భలందన, వత్సప్రి. భలందనుడు గొప్ప యోధుడు. భూమి నంతటిని జయించెను, కాని ఇతడు వర్ణాంతరుడై వైశ్యుడాయెనట.

మనుపుత్రుడైన శర్యాతిచే స్థాపింపబడిన శర్యాత వంశము ఏమంత గొప్ప ఖ్యాతిని సంపాదించుకొనలేదు. శర్యాతి తన కూతురు సుకన్యను భృగువంశీయుడైన చ్యవన ఋషికి నొసగి పరిణయము జేసెను. శర్యాతి పిదప అతని కుమారుడు ఆనర్తుడు సింహాసన మెక్కెను. అచిరకాలములోనే ఈ వంశము పుణ్యాజన రాక్షసులచే నిర్మూలనము జెందెను.

సౌద్యుమ్నులు కూడ ఎక్కువ ప్రాముఖ్యత గాంచలేదు.

## 3. బ్రాహ్మణ కుటుంబములు :

క్షత్రియ వంశములేకాక ప్రాచీన భారత చరిత్రయందు బ్రాహ్మణ కుటుంబములు కూడ ఎక్కువ ప్రాశస్త్యము వహించెనని భాగవతమును ఇతర పురాణములును ఋజువు పరచుచున్నవి.

ఈ బ్రాహ్మణ కుటుంబములు బ్రహ్మమానస పుత్రులైన ఎనమండుగురు ఋషీశ్వరుల నుండి ఏర్పడెనట (1) భృగు, (2) అంగిరస (3) మరీచి (4) అత్రి (5) వసిష్ఠ (6) పులస్త్య (7) పులహ (8) క్రతు అను ఈ ఎనమండుగురును ఏ రీతిగ ఈ కుటుంబములకు మూల పురుషులైరో కొన్ని విచిత్ర గాథలు వర్ణించుచున్నవి. వీరిలో చివరి ముగ్గురును బ్రాహ్మణ కుటుంబములను స్థాపించలేదు. పులస్త్యునుండి రాక్షసులును, వానరులును, కిన్నరులును, యక్షులును మాత్రమే జనించిరి. పులహ ఋషినుండి కింపురుషులును, పిశాచములును, భూతములును, సింహశార్దూలాది జంతువులును జనించెను. క్రతువునకు భార్యాపుత్రు లుండినట్లుగాని, వివాహము జరిగినట్లు గాని ప్రస్తావనలేదు. కాని వాలఖిల్యులు ఇతని సంతతియని ఒక గాథయున్నది. మిగత ఐదుగురు ఋషీశ్వరుల నుండి వచ్చిన కుటుంబములు కూడ అన్నియు ఒకే ప్రాచీనతమ కాలము నందుద్భవించినటుల గానరాదు,

భార్గవులును, వసిష్ఠులును ప్రాచీనతములు. అంగీరసులును కూడ అప్పటి వారే నేమో! కాని ఆత్రేయులును, కాశ్యపులును (మరీచినుండి జనించిన వారు) తరువాతికాలము నాటివారని తోచుచున్నది.

భార్గవులలో ప్రాచీనతములు చ్యవనుడు, శుక్రుడు. శుక్రుడు దైత్య, దానవ అసురులకు గురువాయెను. బృహస్పతి దేవగురువైనందున వీరిరు పురికిని వైరము. శుక్రుని కూతురు దేవయాని పూరువంశరాజైన యయాతిని పెండ్లాడి యదుతుర్వసు లను ఇరువురు కుమారులను పొందెనని పైన జూచితిమి.

వసిష్ఠుల పుట్టుపూర్వోత్తరముల గూర్చి విచిత్రగాథలు గలవు. వీరు ఈ మన్వంతరమున మిత్రావరుణ దేవతనుండి జనించిరని ఒక గాథ. స్వాయంభువ మన్వంతరమున మూలపురుషుడైన వసిష్టుడు బ్రహ్మమానసపుత్రుడుగ జనించెనని మరియొకగాథ. వసిష్టులు తొలుతనుండియు అయోధ్య రాజులకు వంశపారంపర్యముగ నుండిన పురోహితులు. ఇక్ష్వాకు చక్రవర్తి యొద్దను, వికుక్షి - శాదునియొద్దను, నిమివద్దను కూడ వశిష్టులు పురోహితులుగ నుండినట్లు పురాణములందు కలదు.

ఆత్రేయులుకూడ ప్రాచీనతమ వంశములలో నొకటియని తోచుచున్నది. కాని వీరిలో ప్రథముడు, ప్రభాకరుడనువాడు, పురువంశ రాజులలో నొకడగు భద్రాశ్వుని(లేక రుద్రాశ్వుడా ?) పది కుమార్తెలను వివాహాము జేసికొని పదిమంది కుమారులను కలిగెనని చెప్పబడియున్నది. ఈ పదిమంది కుమారులే ఆత్రేయ గోత్రశాఖలలో ముఖ్యశాఖలకు మూల పురుషులని చెప్పబడియున్నది.

మరీచిమహర్షి కశ్యప ప్రజాపతియనియు, దేవదానవులకు ఉభయులకును మూలపురుషుడనియు ప్రస్తావన కలదు.

పై కుటుంబములు మాత్రమేగాక విశ్వామిత్రులును, జమదగ్నులును, ఇతర బ్రాహ్మణ కుటుంబములును కూడ తరువాతి కాలమున చారిత్రికముగ ఎక్కువ ప్రాముఖ్యత వహించెను.

# 5. మాంధాతయుగము

( రమారమి క్రీ॥ పూ॥ 2750 – 2550 )

## 1. సూర్యవంశము :

శశబిందు యాదవరాజ్యమును వృద్ధిగావించుచుండగా సూర్యవంశ తిలకుడైన మాంధాత అయోధ్యయందు పాలన సల్పుచు చక్రవర్తి యనియు, సమ్రాట్ అనియుప్రసిద్ధికెక్కెను. ఇతని తల్లి పౌరవవంశ రాజైన మతినారుని కుమార్తెయైన గౌరియనియు, తండ్రి యువనాశ్వుడనియు పైనతెల్పబడెను. ఇతడు విష్ణువుయొక్క ఐదవ అవతారము.ఇతడు ఒకవంద రాజసూయ యాగములను, అశ్వమేధ యాగములను గావించెనట. ఇతని దాతృత్వమును ప్రశంసించుచు ఎన్నియో గాథలు అనాదిగ కలవు. ఇతని రాజ్యవైశాల్యమును గూర్చియు, గోదానములను గూర్చియు కూడ ఎంతయో ప్రశంసగలదు. యాదవ శశబిందు కూతురు బిందుమతి ఇతని భార్య. పుత్రులు పురుకుత్స, అంబరీష, ముచుకుందు లని ముగ్గురు. ఇతని తనయ (కొందరు ఈమెను పౌత్రియనియు, కొందరు చెల్లెలనియు చెప్పు చున్నారు) కావేరి కాన్యకుబ్జుల జహ్నువును పరిణయమాడెను.

ఇంద్రుని బొటనవ్రేలిని చీకినందున (నన్ను చీకుచున్నాడు అని ఇంద్రుడు చెప్పెనట) మాంధాత ఆయెనని చెప్పు వ్యుత్పత్తి బహుశః తరు వాతికాలము నాటిదై యుండునని తోచుచున్నది. అతడు భూమినంతటిని జయించెననియు ఇంద్రుని అర్ధాసనమును పొందెననియు అందరెరిగిన అంశమే. ఇతడు పౌరవులను కాన్యకుబ్జులను ద్రుహ్యులను, ఆనవులను జయించినట్లు తోచుచున్నది. యాదవులతో చుట్టరికముండినందున వారిని వదలివైచెనేమోగాని దక్షిణాపథమునందలి హైహయులనుకూడ జయించి నట్లు తోచుచున్నది.

ఇతని పిదప సింహాసనమెక్కిన ఇతని తనయుడు పురుకుత్సుడు 'అవశ్యంపితురాచార'మని దండయాత్రలను సాగించెను. నాగులు ఇతనిని

ఆశ్రయించి శరణువేడగా వారి కన్యను, నర్మదను, పరిణయమాడి వారి శత్రువులైన మౌనేయ గంధర్వులను నిర్జించి ఈ నాగులను రక్షించెనట.

ముచుకుందుడు కూడ సుప్రసిద్ధుడే. ఇతనికిని కాలయవన కృష్ణుల కును సంబంధము కలిపి, సమకాలికులుగ జేయుట బహుశః పొరబాటేమో? ఇతడు పారిపాత్ర, రిక్షపర్వతములనడుమ నర్మదానది యొడ్డున ఒక పట్టణ మును గట్టించి బలమైన కోటను స్థాపించెను. కాని అచిరకాలమునందే హైహాయ రాజైన మహిష్మంతుడు ఇతనిని జయించి ఇతని కోటను గైకొని మహిష్మతియని దానికి వేరుపేరు నిచ్చెను.

పురుకుత్సుని పిదప అయోధ్య క్రమముగ ప్రాముఖ్యతను గోల్పో వగా చంద్రవంశములు వృద్ధియాయెను.

## *1. చంద్రవంశములు :*

మాంధాత కాలమునందు పౌరవవంశము క్షీణదశయందుండెను. కావుననే మాంధాత యమునానదియొడ్డున యజ్ఞములను జేయుటయేకాక పౌరరాజ్యమును దాటిపోయిఆనాడు అటువైపున నుండిన (అనగా పంజాబు సమీపముననుండిన)ద్రుహ్యులను కూడ జయించెను. ద్రుహ్యులను రాజపుత్ర స్థానమునుండి పంజాబువరకును తఱిమివైచిన యాదవులు బహుశః శశ బిందు కాలమునందు పౌరవరాజ్యమును గూడ జయించినట్లు తోచు చున్నది. హైహాయరాజ భద్రశ్రేణ్యుడు గూడ ఎట్టిఆటంకమునులేక పౌరవ రాజ్యము గుండ చొరవచేసికొనిపోయి వారణాసి చేరెను. బహుశః పౌరవ రాజ్యము నామమాత్రావశిష్టమై యుండెనేమో యనుటకును ఈ రాజులు అరణ్యావాసము జేయుచుండిరేమో యనుటకును దుష్యంతుని గాథయే కొంత ఆధారమొసగుచున్నది. ఇతడు కరంధముని సుతుడైన మరుత్త తుర్వసుతో నుండెననుట నిస్సంశయము కదా!

మాంధాతచే జయింపబడినను అచిరకాలమునందే కాన్యకుబ్జ జహ్నువుకాలమున మరల ప్రాముఖ్యత నొందెనని జహ్నువుయేననాశ్వుని పౌత్రిని పరిణయమాడెనను విషయమును బట్టియే తెలియుచున్నది.

హైహాయులు మాల్వాకు దక్షిణమున మహిష్మంతుని కాలముననను, అతని తరువాత రాజైన భద్రశ్రేణ్యుని కాలముననను దినదినాభివృద్ధి గాంచిరని పైన జూపితిమి. భద్రశ్రేణ్యుడు పౌరవరాజ్యమును నిర్జించుటయేగాక కాశీనికూడ జయించిఆప్రాంతమునంతటిని ఆక్రమించుకొనెను. కాశీరాజైన హార్యాశ్వుడు నష్టరాజ్యమును సంపాదించుకొను ప్రయత్నమునందే హైహాయులచే పరాజితుడై చంపబడెను. ఇతని కుమారుడు సుదేవుడు కూడ ఓడిపోయెను. కొంతకాలము కాశీప్రాంతము క్షేమక రాక్షసుల వశము జెందెను. కాని త్వరలోనే హైహాయ దుర్దముడు మరల నీప్రాంతము నంతటిని సాధించెను.

ఆనవులు మహామనస్సనెడి రాజు కాలమున (ఇతడు అనువుకు పదవ తరమువాడు) తూర్పు వైపు వ్యాపించి పంజాబు నాక్రమించుకొనిరి. బహుశః ఇతని రాజ్యము కడు విశాలమైనందుననే గాబోలు ఇతని తనయులు ఉశీనర, తితిక్షులు ఇరువురును ఈ రాజ్యమును పంచుకొనిరి.

ఉశీనరుడు పంజాబు తూర్పు భాగమున తన రాజ్యమును స్థాపించెను. ఇతని పిదప ఇతని ఏవురు కుమరులును ఇతని రాజ్యమును పంచుకొనగా శిబి మూల్టాన్ ప్రాంతమును, నృగుడు నేటి మాంట్‌గోమరీ, ఉత్తర బికనీరు ప్రాంతమును, నవుడు నవరాష్ట్రమును, కృమి కృమిల పట్టణ ప్రాంతమును, సువ్రతుడు బహుశః తూర్పు పంజాబు ప్రాంతమును పాలించిరి. యౌధేయులును, అంబష్ఠులును క్రమముగ నృగసువ్రతుల నుండి ఉద్భవించినవారు. వీరందరిలో శిబి సుప్రసిద్ధుడై పంజాబు నంతటిని (ఒక్క వాయవ్యదిగ్భాగము మాత్రము తప్ప) జయించెను. ఇతని కుమారులు నలుగురును ఈ క్రింది విధముగ నాలుగు రాజ్యములను స్థాపించిరి. (క) వృష

దర్భులని పేరు గాంచిన శిబివంశీయులు మూల్టాన్ ప్రాంతమునందును, (ఖ) సౌవీరులు సింధు నందును, (గ) కేకయులు జీలం చీనాబు నదుల మధ్య నున్న నేటి గుజరాత్, షాపూర్ ప్రాంతమునందును, (ఘ) మద్రకులు సకల (నేటి సియాల్ కోట) రాజధానిగా నేటి లాహోర్, జమ్ము ప్రాంతములను పాలించిరి.

తితిక్షువు తూర్పువైపు వెడలిపోయి విదేహ, వైశాలి రాజ్యములను దాటి పోయి సౌద్యుమ్నులు పాలించిన తూర్పు బిహారు ప్రాంతములకువచ్చి అచ్చట ప్రాచ్య రాజ్యమును స్థాపించెను. దీని నుండియే కాలక్రమముగ అంగ, వంగ, కళింగ, పుండ్ర, సుహ్మరాజ్యము లేర్పడి బలిచక్రవర్తి ఏవురు కొమారులకును ఈ ప్రాంతము స్థానమాయెను.

ద్రుహ్యులు, శశబిందు, యువనాశ్వ, మాంధాత, శిబి మున్నగు వారిచే పరాజితులై రాజపుత్ర స్థానమును వదలి ఉత్తరము వైపు వెళ్ళి పోయి పంజాబు చేరిరని ఇదివరకే జూచితిమి. వీరిరాజు అంగారుడు మాంధాతచే చంపబడెను. అంగారుని తరువాతి రాజులలో నొకడైన గాంధారుని నామమే ద్రుహ్యులకు తరువాతి కాలమున రూఢమాయెను. వీరి సంఖ్య క్రమముగ పెరిగినందున వీరిలో కొందరు భారత దేశమును దాటిపోయి ఉత్తరమున మ్లేచ్ఛ ప్రాంతములలో ఎన్నియో చిన్నచిన్న రాష్ట్రములను స్థాపించిరని తోచుచున్నది.

## 6. పరశురామయుగము

(బహుశః క్రీ. పూ. 2550–2350)

అయోధ్య రాజైన సూర్యవంశపు సగరునివరకును ఈయుగముగానే పరిగణింపవచ్చును. ఈ యుగమునందు పండ్రెండు తరముల చరిత్ర కలదు. కాని ఒక్క భృగువంశీయులు మాత్రమే కాక హైహయులును, భృగువులును ఇరువురును ఒకరి తరువాత నొకరు ప్రాముఖ్యము వహించియున్నారు.

## 1. భృగువులు

భృగువు నుండి ఏర్పడిన భార్గవులు ఆనర్త (గుజరాత్) యందు వసించిరి. శర్యాతులు నాశనము చెందిన పిదప ఈ ప్రాంతము హైహాయుల ప్రాబల్యమునకు లోనుకాగా భార్గవులు కూడ వారితో చేరిరి. కృతవీర్యుడు తన పురోహితులైనందున, హైహాయ రాజు భార్గవులకు అధికధనము నొసంగెనట. ఇతని తరువాతి రాజులు ఈ ధనమును వాపసు ఇవ్వమనికోరగా ,భార్గవు లందుల కియ్యకొననందునవారిని హైహాయులు నానా వెతలం బెట్టసాగిరట. వీరిబారి నుండి తప్పించుకొనుటకై భార్గవులు ఈ ప్రాంతమునుండి పారిపోయి, మధ్యదేశమునందలి కాన్యకుబ్జమును జేరిరి.

భార్గవులలో ముఖ్యుడు ఊర్వుని కుమారుడు ఋచీకుడు. ఇతడు విలు విద్యయందు గొప్ప నేర్పరి. హైహాయులయందు పగసాధించుటకై ఇతడు క్షత్రియులతో సంబంధ బాంధవ్యములను ఏర్పరుచు కొనుటకై యత్నించెను. కాన్యకుబ్జ రాజైన గాధితనయను, సత్యవతిని, తనకిచ్చి వివాహము చేయుమని కోరగా గాధికి ఇష్టములేక తప్పించుకొనుటకై నెపము వెదకి నల్లచెవులుగల వేయి గుఱ్ఱములను కన్యాశుల్కముగా తెచ్చి యిమ్మని కోరెనట. ఇట్టి దుష్కర కార్యమును కూడ సాధించి ఋచీకుడు సత్యవతిని పెండ్లాడెను. వీరి తనయుడే జమదగ్ని. కాబట్టి జమదగ్ని విశ్వామిత్రుని మేనల్లుడు. (విశ్వామిత్రుడు గాధి కుమారుడు కదా!)

జమదగ్ని విలువిద్యయందును, శస్త్రవిద్యయందును గొప్ప పాండిత్యము సంపాదించెను. అయోధ్య రాజవంశమునకు చెందిన రేణువు కూతురిని, రేణుకను పరిణయమాడెను. కాని ఇతనికి యుద్ధమునందును, పగసాధించుటయందును వైముఖ్యము. పరమశాంతుడై కాలము గడుపుచుండ హైహాయరాజగు, కార్తవీర్యుడు ఇతని ఆశ్రమమునకు వచ్చి, ఇతని ఆతిథ్యమును స్వీకరించి, ఇతనివద్దనున్న కామధేనువును హరింపబూనెను. మొదట కామధేనువు రోమములనుండి ఉద్భవించిన యవనులచేత ఇతడు

పరాజితుడై ననుచివరకుఎట్లో తనకార్యము సాధించి, ఆశ్రమమును ధ్వంసము చేసి కామధేనువును ఎత్తుకొనిపోయెనని అందరెరింగిన విషయమే.

జమదగ్నికి నలుగురైదుగురు కుమారులు కలిగిరి. వారందరిలో కనిష్ఠుడైన రాముడు కడుసమర్థుడు. ఇతనికి ముఖ్యమైన ఆయుధము పరశువు (గండ్రగొడ్డలి). కాని అన్ని ఆయుధములందును, ముఖ్యముగ విలువిద్యయందును గొప్ప నేర్పరి. ఇతడు త్రేత, ద్వాపరయుగముల సంధి కాలమునందు అవతారమెత్తిన విష్ణుమూర్తియేయని పురాణములు నుడువుచున్నవి. కాని మహాభారతమునందు రెండుచోట్ల మాత్రమే (ఇవి తరువాతి కాలమునందు చేరిన ప్రక్షిప్తములేమో!) ఇతడు విష్ణువుయొక్క అవతారమని చెప్పబడినది.

తరతరములనుండి హైహాయులయందుకల ద్వేషభావమువలనను కార్తవీర్యునిదుశ్చర్యలవలనను క్రోధోద్దీపితుడై భార్గవరాముడు కార్తవీర్యుని చేతులనునరికి చిత్రవధ చేసెను. పిదపఇట్టి పాపమునకు ప్రాయశ్చిత్తముగ తండ్రియాజ్ఞననుసరించి తీర్థయాత్రకై బయలుదేరిపోగా కార్తవీర్యుని కొమరులు జమదగ్నిని తపస్సు చేసికొనుచు సమాధియందుండినపుడు చంపివైచిరి. పరశురామునికి ఇక హైహాయులను నిర్మూలముచేయుట మాత్రమేగాక సకల క్షత్రియులను అంతమొందించుటయే జీవిత పరమావధిగ దోచి, ఇరువదియొక్కమారులు దండయాత్రసలిపిఅతడు క్షత్రియోన్మూలనము గావించెనట. క్షత్రియరక్తముతో కురుక్షేత్రమువద్ద ఎన్నియో తటాకములు నిండిపోయెనట. ఎవరో కొందరుమాత్రము అతికష్టముతో పర్వతప్రాంతములకు పారిపోయిగాని,లేదాస్త్రీలమధ్యదాగిగాని ప్రాణములను దక్కించుకొనిరట. పౌరవబుతువంతుడును, అయోధ్య సర్వకర్మయు, మగధ బృహద్రథుడును, అంగచిత్రరథుడును కాశీవత్సరాజును మాత్రమేపరశురామునినుండి తప్పించుకొనిరి. ఈ గాథలయందు కొంత అతిశయోక్తి యుండినను పరశురాముడు తన బంధుమిత్రులను కూడగట్టుకొని వైశాలి, విదేహ, కాశీ, కాన్యకుబ్జ

అయోధ్యరాజుల నందరిని కూడ గట్టుకొని హైహయులపై పలుమారుదండ యాత్ర సాగించి నిర్జించెననుటకు సందియము లేదు. ఇట్టి ఘోరవిపత్తునకు లోనై హైహయులు కొంత కాలమైనను అణగియుండిరనుటకు సంది యము లేదు.

పరశురాముడు ఒక్కొక్కమారు క్షత్రియ వధచేసినపుడును ప్రాయ శ్చిత్తముగ తపము చేయుచుండెనట. చివరకు పాపపరిహారముగ కశ్యపునికి తాను జయించిన పృథివినంతటిని దానము జేసెనట. ఇక ముందెప్పుడైనను కూడ పరశురాముడు దండయాత్రకు పూనుకొన కుండుటకై కశ్యపుడు, పృథివి యంతయు తనదైనందున, పరశురాముని బహిష్కరించెనట. పృథి విపై ఎచట నుండుటకును తావు లేక పరశురాముడు సముద్రమునుండి పశ్చిమ కోస్తా ప్రాంతమును సాధించి, ఎత్తి, అందు వనవాస మేర్పరచి వసతి కల్పించుకొనెనట. భృగుకచ్ఛ (నేటి బ్రోచ్) నుండి కన్యాకుమారి వరకును పశ్చిమ కోస్తా ప్రాంతమంతయు పరశురామునితో ఎక్కువ సంబంధము కలిగియుండినటుల నేటికిని గాన్పించుటకు కారణమిదియే.

పరశురాముడు దాశరథిరామునికిని పాండవులకును ఎన్నియో తర ములకు పూర్వపు వాడైనను రామాయణమునందును, మహా భారతము నందును కొన్ని ఘట్టములయందు కానవచ్చుచున్నాడు. దాశరథి రాముడు సీతను పరిణయమాడి అయోధ్యకు మరలివచ్చుచుండ భార్గవ రాముడెదురై కయ్యమునకు కాలుద్రవ్వి పరాజితుడాయెననియు, జరాసంధుని దండ యాత్రలకు గుఱిగాని చక్కని నివాసస్థానమును పరశురాముడు బలరామ కృష్ణులకు చూపించెననియు, భీష్మ, ద్రోణ, కర్ణులకు శస్త్రవిద్య నేర్పి ఆచార్యుడాయెననియు, భీష్మునితో యుద్ధము జేసెననియు, పాండవులతో యుద్ధమునకు పూనుకొనవలదని దుర్యోధనునికి సలహా యొసంగెననియు ఇంకా కొన్ని గాథలు కలవు. ఇతిహాసనాయకుల ప్రాశస్త్యము నుగ్గడించు టకై వీరికి భార్గవులతో కూడ సంబంధము కలిపివేయుటకు ఇట్టి గాథలు

తరువాతి కాలమున ఏర్పడియుండవచ్చునని తోచుచున్నది. ఇక కాల మాన రీత్యా ఏదో ఒక సమన్వయము కుదిరించుటకై గాబోలు ఇతడు చిరంజీవియను (శాశ్వతముగ జీవించువాడని) రూఢి ఏర్పడెను.

## 2. హైహయులు

పురుకుత్సుని యనంతరము అయోధ్యారాజ్యము క్షీణింపగా హైహ యులు క్రమముగా తూర్పు, ఉత్తరము వైపుల వ్యాపించిరనియు, కృత వీర్యుని కుమారుడు అర్జునుడు గొప్ప యోధుడై తన రాజ్యమును ఎక్కువగ వ్యాపింపజేసెననియు, సమ్రాట్, చక్రవర్తి, కార్తవీర్య, సహస్రార్జున బిరు దముల నొంది ఇతడు మహాఖ్యాతి వహించెననియు పైన జూచితిమి. ఇతని సహస్ర బాహువులు నిజముగ వెయ్యి ఓడలని ఒక చారిత్రకుడు నిర్ధరించి యున్నాడు. నారాయణుని అవతారమని కొందరు విశ్వసించు దత్తాత్రేయు నారాధించి కార్తవీర్యుడు అతని యనుగ్రహమువలన దిగ్విజయమునుగాంచె నట. నర్మదానది సముద్రమున గలయు ప్రాంతము నధివసించిన కర్కోటక నాగు లనువారి అనూప రాజ్యమును ఇతడుజయించి మహిష్మతీ పట్టణమును గైకొనెను. రావణుని జయించి, ఖైదీగా తీసికొనివచ్చియు, పిదప కరుణించి వదలి వైచెనట. ఇతడు హిమాలయ పర్వతమువరకును దండయాత్ర సాగించె ననుటకు తార్కాణము ఇతడు అటనున్న ఆపవశిష్ఠుని ఆశ్రమమును ధ్వం సముజేసి, శాపము నొందుటయే. పృథివినంతటిని జయించి ఎన్నియో యజ్ఞములను జేసెననియు, ఇతడు ఆదర్శ ప్రభువనియు, తపమునందును దానమునందును, విద్యయందును గుణములందును సాటిలేని వాడనియు, ఇతని పరిపాలన న్యాయ సమ్మతముగ నుండెననియు ఘోషించు చున్నం దున ఒక్క భార్గవుల తోటి వైరమును, ఆపవశిష్ఠునికి జేసిన అపకారమును మాత్రమే ఇతని యందలి లోపములని తోచుచున్నవి.

హైహయ భార్గవ స్పర్ధలకు కారణము నిజముగ భార్గవుల విదేశీ వ్యాపార దక్షతయేనని కరండీకర్ అను మహారాష్ట్రపండితుడు వాదించు

చున్నాడు. భార్గవులు సముద్ర యానమునందు ఎక్కువ నైపుణ్యముగల వారట. కాబట్టి విదేశ వ్యాపారమున గొప్ప లాభమును గడించిరి. కాని అర్జునుడు వీరిని స్వార్థపరులుగ భావించి, విదేశ వ్యాపారము స్వదేశమున కును ఆర్య సంఘమునకును లాభదాయకముగ నుండునటుల జేయబూను కొని నౌకా నిర్మాణ దక్షులైన ఆత్రేయుల సాయమున సహస్ర నౌకలను (లేక వెయ్యి తెడ్లుచే నడుపబడు బ్రహ్మాండమైన ఒక నౌకను) నిర్మింప జేసి, తన్ను ప్రతిఘటించిన రావణ, కర్కోటకాదులను జయించెననియు పరశు రాముడు ఇతనిని ఎదిరించి నిర్జించి విదేశ వ్యాపారమును ఆర్యుల వశము నుండి లాగికొని ద్రావిడుల వశము గావించెననియ పై వాదము యొక్క సారాంశము. హైహయరాజ్యము నాశము జెందిన పిదప పరశురాముడు పశ్చిమ భూభాగమును అభివృద్ధి పరచి సూర్పారకవంటి పట్టణములను స్థాపించెనట.

పరశురాముని ధాటికిలొంగిపోయినను హైహయులు అచిరకాలము నందే విజృంభించిరనుటకు అర్జునుని కొమారులు నానా ప్రాంతములందును రాజ్యము చేయుచుండుటయే నిదర్శనము. అర్జునుని జ్యేష్ఠ పుత్రుడు జయధ్వ జుడు అవంతియందు రాజ్యము చేయుచుండెను. మరియొక పుత్రుడు శూరసేనుడు మథురయందును, ఇంకొకడు శూరుడను వాడు బహుశః సురాష్ట్రమునందును రాజ్యము చేయుచుండిరి. జయధ్వజుని కుమారుడు తాళజంఘుడు. ఇతనికి పెక్కుమంది కుమారులు కలిగిరి. వారందరిలో వీతిహోత్రుడు ముఖ్యుడు.

హైహయులు ఐదు భాగములుగ చీలిపోయిరని పురాణములు చెప్పుచున్నవి. (1) వీతిహోత్రులు (2) శార్యాతులు (3) భోజులు (4) అవంతీయులు (5) కుండికేరులు అను ఈ ఏవురును కూడ తాళ జంఘులని పేర్కొనబడుచుండిరి. వీరిలో వీతిహోత్ర, కుండికేరులు (లేక తుండికేరులు) వింధ్య ప్రాంతముల నుండిరి. శర్యాతులు పశ్చిమ భారతము నందును, భోజులు ఆరావలి పర్వత ప్రాంతములందును, అవంతీయులు

మాళ్వ యందును రాజ్యమేలిరి. వీరు కాన్యకుబ్జ, కోసల, కాశీరాజ్యములపై పలుమారు దండెత్తుచు వచ్చి, చివరకు కాన్యకుబ్జమును జయించిరి. కాశీ రాజైన హార్యశ్వుని గూడ జయించిరి. కాని తరువాత పరాజితులై వీతిహోత్రి రాజొకడు భార్గవఋషిని శరణు వేడవలసి వచ్చెను. అటు పిదప హైహాయ వంశమే అంత మొందెను. బ్రాహ్మణుడే రాజాయెను.

అయోధ్య రాజ్యముపై హైహాయులు దండెత్తినపుడు వారితో శక, యవన, కంభోజ, పారద, పహ్లావులు చేరియున్నందున హైహాయులు వీరందరికిని నాయకులుగ నుండిరేమో యని తోచుచున్నది. ఇట్టి ప్రబల శత్రువును ఎదిరింపజాలక నాటి అయోధ్యరాజు బాహుడనువాడు (అసితు డని రామాయణమునందు గలదు). పారిపోయి వనవాసము చేయుచు ఔరవ భార్గవుని ఆశ్రమమున అవసానము జెందెను. ఇతనికి వనవాసమునందే సగరుడను తనయుడు కలిగెను. ఇతడు ఔరవ భార్గవునియొద్ద విద్యా భ్యాసముచేసి, చివరకు భార్గవుల సాయముచేతనే తన రాజ్యమును మరల సంపాదించుకొని ప్రశంసాపాత్రుడాయెను. వైశాలీవిదిశా రాజ్యములను గూడ హైహాయులు జయించిరనియు విదిశవారి పాలనముక్రిందనే కొంత కాలముండెననియు పురాణములు చెప్పుచున్నవి, కాని హైహాయులు తూర్పువైపు వ్యాపించుటకు వీలులేకుండునట్లు వైశాలిరాజులు ఒక గొప్ప ప్రతిబంధకముగ నేర్పడిరని తోచుచున్నది.

హైహాయులు రణపండితులేగాని పాలనాదక్షులుగారు. అందువలన యుద్ధమునందు పరాజయముచెందిన రాజ్యములు సర్వవిధముల నాశనము చెంది అరాచకమునకు లోనగుచుండెను.

## 3. ఇతర చంద్రవంశములు :

*(క) యాదవులు :* సగరచక్రవర్తి అయోధ్యను పాలించుచుండగా యాదవరాజ్యమును విదర్భరాజు పాలించుచుండెను. అప్రతిహత పరాక్రము డగు సగరచక్రవర్తితో విదర్భరాజు వియ్యమునలిపి కూతురుని, కేశినిని

సగరునికి పరిణయముగావించి, వంశానుక్రమముగ వచ్చిన రాజ్యమును వదలి వైచి, దక్షిణాపథమునకు వెడలిపోయెను. ఈరీతిగ ఉత్తరాపథమున కంతటి కిని సగరుడు ఏకచ్ఛత్రాధిపత్యము వహించెను. కాని సగరుని యనంతరము విదర్భయాదవులు మరల హైహయరాజ్యముపై తమ యధికారమును నెలకొల్పిరి. విదర్భరాజ తనయులు ముఫ్వురును మూడు శాఖలకు మూలపురుషులైరి. క్రథుడని అపరనామముగల భీముడు ప్రధానవంశమున నుండగా కైశికుడు చేదిరాజై చేదివంశ స్థాపకుడాయెను. మూడవ కుమారుడు లోమపాదుడు స్థాపించినవంశ మే ప్రాంతమందుండెనో తెలియరాదు.

(ఖ) ఆనవులు: ప్రాచ్యదేశమున తితిక్షువుచే స్థాపింపబడిన ఆనవ వంశము సగరచక్రవర్తి కాలమున బలిచక్రవర్తి పాలనయందుండెను. ఇతని రాణి సుధేష్ణ భర్తయనుమతిగొని మామతేయ దీర్ఘతమస్సనెడి ఋషివర్యునివలన అంగ, వంగ, కళింగ, పుండ్ర, సుహ్మాయను నామముల బరగిన ఏవురు కొమరులను పొందెను. అంగరాజ్యముయొక్క రాజధాని నేటి భాగల్పూరునకు పడమట నాలుగుమైళ్ల దూరమునగల మాలిని. అంగ, మగధరాజ్యములకుమధ్య సరిహద్దుగ చంపానది ఏర్పడెను. నేటి భాగల్పూరు మాంఘీరు జిల్లాలే నాటి అంగరాజ్యము. దీనికి పడమట నేటి ఢాకా, చిట్టగాంగ్ప్రాంతములే నాటి వంగరాజ్యము. పుండ్రరాజ్యము ఉత్తర బెంగాల్ ప్రాంతము. సుహ్మ రాజ్యము బర్ద్వాన్ప్రాంతము. కళింగము ఒరిస్సా కోస్తాప్రాంతము, ఉత్తర సర్కారులును.

(గ) కాన్యకుబ్జము: జహ్నువు తరువాతకొన్ని తరములకు కుశికుల మూలపురుషుడైన కుశికుడును, ఇతనికి పౌరుకుత్సరాణియందు (ఈమె పురుకుత్సునికి ఆరవతరముది) గాధియు, అతనికి ఋచీకుని అనుగ్రహము వలన విశ్వరథ నామధేయముగల విశ్వామిత్రుడును కలిగిరి. గాధి ఇంద్రుని యవతారమట. గాధి కూతురు, సత్యవతి, ఋచీకుని పరిణయమాడిన యంశము ఇదివరకు ఎరిగినదే,

విశ్వామిత్రుడు వసిష్ఠునినుండి కామధేనువును బలాత్కరించి గైకొన జాలక క్షత్రియ బలముకన్న బ్రహ్మతేజోబలమే ఉత్తమమైనదని తెలిసికొని రాజ్యమును వదలివైచి సర్వసంగ పరిత్యాగముజేసి, ఘోరతప మొనరించి బ్రాహ్మణుడై చివరకు వసిష్ఠునితోనే తాను బ్రహ్మర్షియని ఒప్పందము నొందెను. విశ్వామిత్రుడు వసిష్ఠు నెదిరించి సత్యవ్రతత్రిశంకునికి సాయము జేసి స్వర్గము నందతనికి స్థానము చేకూర్చెను. త్రిశంకుని కుమారుడు హరిశ్చంద్రుడు వసిష్ఠుని మన్ననకు పాత్రుడుకాగా అతని సుగుణములను పరీక్షించుటకై విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని ముప్పుతిప్పలుపెట్టెను. శక్తి మొదలగు వసిష్ఠులను విశ్వామిత్రుడు సౌదసుల (సుదాసుని వంశమువారు) ద్వారా సంహరింపజేసెను. హరిశ్చంద్రుని కొమరుడైన రోహితునికి బదులుగ శునఃశేపుడను వానిని నరమేధయాగమున బలి యివ్వకుండ వానిని తన కుమారునిగ స్వీకరించి రక్షించెను. విశ్వామిత్రుడు రామాయణము నందు కన్పించుచున్నాడు. ఇతనికి మేనకయందు శకుంతల జనించుటయు ఆమె దుష్యంతుని పరిణయమాడి భరతచక్రవర్తి జననియగుటయు సకలజన విదితమే.

విశ్వామిత్ర వసిష్ఠుల స్పర్ధ అనంతము, వంశక్రమానుగతము అని పురాణములనుండి తెలియుచున్నది. శకుంతలాజనకుడును, శ్రీరామచంద్రుని సమకాలికుడును, హరిశ్చంద్రునికిని, జమదగ్నికిని, శునఃశేపునికిని, సుదాసునికిని కవశ ఐలూషునికిని, దశరాజ్ఞులకును సమకాలికుడును ఐన విశ్వామిత్రుడు ఒక్కడేకాజాలడు. వీరందరిని ఒక్కవ్యక్తిగ పురాణములందు నిర్ధరించి చెప్పినందువలన వంశవృక్షములందును, కాలమాన పట్టికలందును ఎన్నియో చిక్కులేర్పడినవి.

కాన్యకుబ్జరాజైన విశ్వామిత్రుడు జమదగ్ని పరశురాములకు బంధువు కాబట్టి హైహయులతో వారికున్న పోరాటములో ఇతడును కొంత సహాయము చేసియేయుండును. వసిష్ఠునిచే పరాభవముచెంది, రాజ్యమును

పరిత్యజించి, తన కుటుంబమును అయోధ్య సమీపమునందలి ఒక ఆశ్రమములో వదలి, తపమాచరింప బోయెననుటలో ఆశ్చర్యమేమియు లేదు. శునఃశేపుని రోహితునికి బదులుగ బలిఇవ్వనుండ అతనిని రక్షించి దేవరాతుడని పేరు మార్చి తన కుమారునిగ స్వీకరించెను. తన కుమారులు క్రొత్తగ వచ్చిన ఈ దేవరాతుని ఆధిక్యతను (జ్యేష్ఠత్వమును ఒప్పుకొనకపోగా వారిని మ్లేచ్ఛులు కమ్మని శపించెను. వీరే ఆంధ్ర, పుండ్ర, శబరులు. విశ్వామిత్రుని యనంతరము అష్టకుడు కాన్యకుబ్జ సింహాసనమెక్కెను.

(ఘ) కాశీ : దివోదాసుని కుమారుడు ప్రతర్దనుడో లేదా అతని కుమారుడు వత్సుడో ఈ రాజ్యమును విస్తరింపజేసి కౌశాంబీ ప్రాంతమంతటిని ఇందులో కలిపివైచెను. వత్సునినుండి ఈ ప్రాంతమునకు వత్సదేశమని పేరువచ్చెను. వత్సుని కుమారుడు అలర్కుడుకూడ సామర్థ్యవంతుడే. భద్రశ్రేణ్యుని కాలమునుండి రాక్షసుల బారియందుండిన వారణాసిని ఇతడు జయించి మరల కాశీపట్టణమునే తన రాజధానిగా చేసికొని చాలకాలము రాజ్యపాలనము చేసెను.

## 4. సూర్యవంశము :

(క) అయోధ్య : మాంధాత, పురుకుత్స, త్రసదస్యుల కాలమున యశోవంతముగ విరాజిల్లిన ఈ రాజ్యము తరువాత నామమాత్రావశిష్టముగ నుండి త్రయ్యారుణ, సత్యవ్రత - త్రిశంకు, హరిశ్చంద్రుల కాలమున మరల గణనకెక్కెను. సత్యవంత త్రిశంకును గూర్చి ఎన్నియో గాథలు గలవు. ఇతని అత్యాచారములను జూచి కోపించి పురోహితుని ఆజ్ఞానుసారముగ ఇతనిని తండ్రి శపించగా ఇతడు ఇల్లు వాకిలి లేక గంగానది యొడ్డున మహారణ్యములలో తిరుగుచు చండాల జీవితమున పండ్రెండు సంవత్సరములు గడిపెనట. ఆరోజులలో తొమ్మిది సంవత్సరముల కాలము ఘోరమైన క్షామము సంభవించెను. ఆక్షామమునందు విశ్వామిత్రుని కుటుంబము తిండిలేక మలమల మాడుచుండగా (అతడు వీరిని వదలివైచి

తపము జేయబోయెనని పైన జూచితిమిగదా) త్రిశంకు వీరిని పోషించెనట. తపము ముగిసిన పిదప విశ్వామిత్రుడు వృత్తాంతమునంతయు ఎరింగి త్రిశంకునకు సాయపడ నిశ్చయించి, ఇతని తండ్రి త్రయ్యారుణుడు చనిపోయిననుగూడ ఇతనిని రాజ్యమునకు పిలిపింపకపోవుటగని, ఇదంతయు తనకు పరమశత్రువైన వసిష్ఠునిపై సాధింపగల విజయముగదా! అని పరిగణించి, కొంత శ్రమపడి త్రిశంకును అయోధ్య సింహాసన మెక్కించెను.

త్రిశంకుని పిదప హరిశ్చంద్రుడు సింహాసనమెక్కి సామ్రాట్ పదవినిపొంది రాజసూయయాగ మొనరించెననియు, ఎన్నియో కష్టముల కోర్చి విశ్వామిత్రుని చేతనే తాను సత్యవ్రతుడనియు, సుగుణముల కుప్పయనియు మన్ననగాంచెనని అందరెరింగిన విషయమే. ఇతని కుమారుడు రోహితుడు రోహితపురమును గట్టించెనట. రోహితుని చిన్నకుమారుడు చంపయను వాడు తూర్పు బిహారునందు భాగల్‌పురమునకు సమీపమున చంపాపురమును కట్టించెనట. హరిశ్చంద్రునికి ఆరవ తరమువాడు బాహువు. ఇతని తనయుడే సగరుడు. తన తల్లికి సవతి విషము పెట్టగా ఆ విషము గర్భమునందున్న ఇతనికే ప్రాకి ఆవిషములోనే జనించినందున ఇతడు సగరుడాయెను. ఇతడు జనించుటకు పూర్వమే తండ్రి మరణించెను. తల్లి ఔర్వ ఋషి ఆశ్రమమున శరణుజొచ్చి ఇతనిని ప్రసవించినందున ఇతడు ఔర్వ ఋషివద్ద విద్యాభ్యాసము జేసి విలువిద్య యందు గొప్ప ప్రావీణ్యము సంపాదించి, ఔర్వుని అనుగ్రహము వలన ఆగ్నేయాస్త్రమును గూడ పొందెను. అప్పటికి అయోధ్య ప్రాంతము నంతటిని హైహాయులనంటి వచ్చిన విదేశీయులు ఆక్రమించుకొనిరి. వీరు క్షత్రియులమని చెప్పుకొనుచు, బ్రాహ్మణులను గౌరవించుచు,సనాతన మతాచార వ్యవహారముల నవలంబించి వసిష్ఠునే తమ పురోహితునిగ ఉంచుకొనిరి. ఈ రీతిగ సగరుడు యుక్తవయస్కుడగు వరకును సుమారు ఇరువది సంవత్సరములు జరిగెను.

సగరుడు గొప్ప యోధుడు. రాజ్యమును సంపాదించుకొని పిదప హైహాయులను జయించుటకై మధ్యదేశమును, మధ్య భారతమునంతటిని

దాటిపోయి, అఖండ విజయముగాంచి, వారి అనుయాయులయిన శకయవన కాంభోజాదులను సంపూర్ణముగ అణచివైచి, వారు వసిష్ఠుని శరణుజొచ్చి వేడగా వసిష్ఠుని వాక్యమును శిరసావహించి ప్రాణముతో వదలివైచెను. కాని పరాజితులను చిహ్నముగ శకులు సగము తల గొరిగించుకొనవలె ననియు, కంభోజులు పూర్తిగ తల గొరిగించుకొన వలెననియు, పారదులు అసలు క్షౌరమే చేసికొన రాదనియు, వెంట్రుకలకు ఎట్టి సంస్కారమును జేసికొన రాదనియు, పహ్లావులు గడ్డమును గొరిగివైచియే తీరవలెననియు ఈ రీతిగ వీరెవ్వరికిని వైదికాచారముల నవలంబించుటకు వీలులేనట్లు కట్టడి చేసెను. వసిష్ఠుల ఆధ్వర్యమున క్రమముగ విదేశీయులు ఏరీతిగ వైదికా చార సంపన్నులగుచుండిరో, వీరికెట్టి విచిత్ర ఆచార వ్యవహారములుండెనో ఈ గాధనుండి తెలియుచున్నది. సముద్రము సగరుని తనయుడాయెనని (సాగరుడు) తెల్పుటకు మరియొక విచిత్రగాధ గలదు.

సగరుడు నాటి రాజన్యుల నందరిని అణచివైచి ఉత్తరాపథమునకు ఏకచ్ఛత్రాధిపత్యము వహించెను. ఇక అతడు వదలివైచిన రాజ్యములు తూర్పున విదేహా, వైశాలి, ఆనవ రాజ్యములును, దక్షిణమున విదర్భయు, చంబల్ నది యొడ్డున ఉండిన యాదవుల శాఖయు, మధ్యదేశమునందు కాశియు, రేవాపర్వత ప్రాంతములందు తుర్వసుల రాజ్యమును, ఇవి మాత్రమే.

సగరుని జ్యేష్ఠ పుత్రుడు, అసమంజుడు క్రూరుడగుటచేత అతనిని వదలివైచి అతని తనయుడైన అంశుమంతునికి పట్టము కట్టిరి.

(ఖ) వైశాలి: వైశాలి రాజైన కరంధముని కొందరు రాజులుకలిసి దండెత్తి చుట్టుముట్టగా వారితో ఘోర యుద్ధముగావించి ఎట్టకేలకు జయము నొందెను. ఇతని తనయుని అవీక్షితుని విదిశారాజు(బహుశః ఇతడు హైహాయుడేమో?) చెరగొనిపోగా అతనితో బోరి తనయుని విడిపించు కొనుటయే గాక గొప్ప విజయమును గాంచెనట. విదిశ రాజు తనయ విశా

లను పెండ్లియాడి ఇతడు షోడశ మహాచక్రవర్తులలో నొకడని ప్రసిద్ధిజెందిన మరుత్తుడను తనయుని పొందెనట. మరుత్తుడు విరామము లేక యజ్ఞయాగాదులను జేయుచుండెనట. ఇందులకై వలయు వేలకొలది పాత్రలను ఇతర ఉపకరణములను ఇతడు బంగారుతోనే చేయించెనట. ఇతనికి నాగులతో అమిత పోరాటము సాగెననియు చివరకు వీరిని సంపూర్ణముగ నోడించివారి నివాసములన్నింటిని కాల్చివేయ నుద్యుక్తుడుకాగా వీరు ఇతని తండ్రి శరణు జొచ్చి, వారు జంపిన ఋషులనందరిని విషము పీల్చియో ఔషధులుపయోగించియో బ్రతికింపగా, ఇతడు దయదల్చి వదలి వైచెనట. ఈ నాగులు నిజముగ హైహయులే యనియు హైహయుల విజృంభణము వీలులేకుండునట్లుగ వారిని అణచివేయుట మరుత్తుని మహా కార్యములలో నొకటియని పార్జిటర్ అను చరిత్రకారుడు వక్కాణించుచున్నాడు.

### 5. బ్రాహ్మణకుటుంబములు:

భృగు, భార్గవ నామములతో వాసిగాంచిన ఈ బ్రాహ్మణకుటుంబము ఈయుగమునందు సర్వప్రాముఖ్యతను గాంచెను. ఋచీకుడు, జమదగ్ని, పరశురాముడు, ఆగ్ని ఔర్వుడు భార్గవులలో ముఖ్యులు.

అంగిరసులలో ప్రథముడు అయాస్యుడు. ఇతడే అయోధ్య రాజైన హరిశ్చంద్రుడు శునఃశేపుని బలియిచ్చి యజ్ఞము చేయ పూనుకొని నపుడు అధ్వర్యవము వహించిన పురోహితుడు. అంగిరసులు వైశాలి రాజుల వంశక్రమానుగత పురోహితులు. ఉశిజ అంగిరసుడు కరంధమ అవీక్షుతుల పురోహితుడుగా నుండగా, అతని తనయులు బృహస్పతియు, సంవర్తుడును మరుత్త అవీక్షుతుని పురోహితులయిరి. ఉశిజుని జ్యేష్ఠ పుత్రునికి ఉచథ్యునికి ఆతని భార్యమమతయందు దీర్ఘతముడను గ్రుడ్డివాడొకడు తనయుడుగ జనించెను. దీర్ఘతముడు ధర్మ విరుద్ధముగ ప్రవర్తించినందువ అతనిని బహిష్కరించి, తెప్పపైనునిచి గంగానది యందు వదలివైచిరట.

అదృష్ట వశమున అతడు కొంత దవ్వరిగిన పిదప తూర్పు ఆనవ రాజైన బలి ఆతనిని జూచి సురక్షితునిజేసి తనకు పుత్రభిక్ష ఇవ్వమని వేడెనట. ఈ రీతిగ బలి యొక్క రాణికి అంగ, వంగ, కళింగ, పుండ్ర, సుహ్మ్యులని ఏవురు పుత్రులు జనించిరి. తరువాత కొంతకాలమునకు దీర్ఘతమునికి గ్రుడ్డితనము పోయి దృష్టి ఏర్పడెననియు, పౌరవ వంశభరతుని అభిషేకమున ఇతడే అధ్వర్యవము వహించెననియు తెలియుచున్నది. బృహస్పతి కుమారుడు భరద్వాజుడు కాశీపట్టణమునకు వెళ్లి దివోదసుని పురోహితుడాయెననియు, అతని పుత్రుడు వితథుడు భరత చక్రవర్తికి దత్తపుత్రుడై పౌరవ వంశమును నిలబెట్టెననియు కూడ పురాణములందు గలదు.

అత్రికుటుంబములో హైహయార్జునిచే మన్ననగాంచిన దత్తఆత్రేయుడొకడే ప్రముఖుడుగా గాన్పించుచున్నాడు.

వసిష్ఠులలో దేవరాజు అయోధ్యరాజులగు త్రయ్యారుణ సత్యవ్రతులకు పురోహితుడు. తరువాత కాలమున అతని వంశీయుడే శక యవనాది విదేశీయులకు కూడ పురోహితుడుగనుండి చివరకు సగరుని పురోహితుడాయెను. హైహయార్జునుడు హిమాలయములలో ధగ్ధము జేసిన ఆశ్రమము ఇతనిదే. ఆపవ ఋషి కూడ ఈ వసిష్ఠ కుటుంబమువాడే.

జామదగ్న్య రాముని యజ్ఞమునందు అధ్వర్యవము వహించి, అతని నుండి పృథివి నంతటిని దానముగగొని, పరశురాముని దండయాత్రలకు ఇకముందెన్నడును అవకాశము లేకుండునట్లుగ అతనిని బహిష్కరించిన కశ్యపుడే పురాణములందు ఆకుటుంబములో మొదటివాడుగ గాన్పించుచున్నాడు, మరియొక అగస్త్యుడు లోపాముద్రను పెండ్లాడి దక్షిణ దేశమునకు వచ్చెను. ఇతడు కాశిరాజగు ప్రతర్దుని పౌత్రుడైన, అలర్కుని సమకాలీనుడు.

ఇప్పటికి పురాణ వాక్యములరీత్యా కృతయుగము ముగిసెను. పరశురామ, సగరులయుద్ధములవలన పౌరవ, కాన్యకుబ్జ, ద్రుహ్యు, ఆనవ

(పంజాబుశాఖ) వంశములు క్రమముగ రూపుమాయజొచ్చెను. యాదవులు దక్షిణాపథమును జేరిరి. హైహయులు పూర్తిగ అణగిపోయిరి. ఇక తూర్పు ప్రాంతము నందలి వైశాలి, విదేహ, అయోధ్య, కాశీ, ఆనవ (బెంగాల్ శాఖ) రాజ్యములు మాత్రమే తరువాత యుగమున ప్రశస్తిగాంచెను.

## రామచంద్ర యుగము

(రమారమి క్రీ॥ పూ॥ 2350—1950)

### 1. సూర్యవంశము:

సగరునికి పిదప భగీరథునివరకును అయోధ్య రాజ్యము కొంత వెనుకకు బడెను. భగీరధుడు షోడశ మహాచక్రవర్తులలో నొకడు. ఇతడు సమ్రాట్ బిరుదమును సంపాదించెను. ఇతడు గోదాన బాహుళ్యముచేత వాసికెక్కెను. ఇతడు శివభక్తుడు. ఇతడు వియద్గంగను తపముజేసి భూమిపై ప్రవహింపజేసి కపిల మహర్షిచే శాపము జెందిన తన పూర్వీకులకు మోక్షము దెచ్చెనట, అందువలననే గంగ భాగీరథియాయెను. బహుశః గంగా పూజను ఇత డారంభించెనో, లేక గంగానదికి కాలువలు త్రవ్వించి నీటిపారుదల వసతు లేర్పరచినందున ఇతనికి పురాణము లందిట్టి ప్రాముఖ్యత వచ్చెనో చెప్ప జాలము.

భగీరథునికి మూడవ తరమువాడు అంబరీషనాభాగి. ఇతని కాలమున అయోధ్య ప్రాముఖ్యత గడంచెను. ఇతడు భాగవత మతావలంబి యనియు, ద్వాదశీవ్రత నిష్ఠుడనియు పురాణములలో గాన్పించు ప్రశంస బహుశః తరువాతకాలమున ఇతనికి ఆపాదించిన విశేషములని తోచు చున్నది. ఇతని తర్వాత మూడవ తరమువారు ఋతుపర్ణుడు. నలచరిత్ర యందు ఇతనికి కొంత స్థానము కలదు. ఋతుపర్ణుని తనయుడు సుదాసుడు. కాని వేదప్రస్తావితుడైన దశరాజ్ఞ సుదాసునికిని ఇతనికిని ఎట్టి సంబంధమునులేదు.

సుదాసుని తనయుడు కల్మాషపాదుడను అపరనామముగల మిత్ర సహుడు ఇతని పేరును గూర్చి ఎన్నియో గాధలుగలవు. ఇతడొకమారు పొరబాటున తన గురువు వసిష్ఠునికి నరమాంసమును వడ్డించెనట. వసిష్ఠుడు కుపితుడై రాక్షసుడవు గమ్మని శపించి, పొరబాటని తెలిసినపిదప శాంతుడై శాపకాల వ్యవధిని తగ్గించి రాక్షసత్వము పంౘ్రెండు సంవత్సర ములేయని నిర్ధరించెనట. ఈలోగా రాజుగూడ వసిష్ఠుని శాపమునకు కినిసి ప్రతిశాప మొసగ నుద్యుక్తుడై రాణిచే నివారితుడై, శాపగ్రస్త మంత్ర జలమును ఏమిజేయుటకును తోచక, భూమిపై వైచినచో ఏండ్ల తరబడి భూమి బీడు పారిపోవునని వెఱచి, తనకాళ్ళపైననే వేసికొనెనట. వెంటనే తనకాళ్లు శిలామయములాయెను. యథాస్థితిని పొందిన పిదప కల్మాష పాదునికి మరియొక శాపముండినందున పుత్రులు లేక దుఃఖించి వసిష్ఠునినే వేడి నియోగరీత్యా వసిష్ఠునిచే రాణికి గర్భోత్పత్తి కలిగించెను.

ఈ విధముగ జనించిన అశ్మకుడను తనయుడు పౌదన్యపురమును స్థాపించెనట.అశ్మకుని తనయుడు మూలకుడనువాడుపరశురామునికి వెఱచి స్త్రీసమూహములందు దాగికొనుచుండుటచేత నారీకవచుడనిపించుకొనెను. కాని పరశురాముడు అశ్మకునికి ఎన్నియో తరముల పూర్వపువాడు. బహుశః కల్మాషపాదుని యనంతరము రాజులసమర్థులగుటచేతఈప్రాంతము నందలి అరాచక, విపరీత పరిస్థితులను బట్టి ఇతనిని రహస్యముగ అంతః పురములో నునిచి పెంచి పెద్దవానిని జేయవలసివచ్చెనేమో? అయోధ్య అను రాజ్యము గూడ రెండుచీలికలై ఆరు, ఏడు తరములకు పిదపనే, రెండవ దిలీపుడని ప్రఖ్యాతిగాంచిన ఖట్వాంగుని కాలముననే, మరల ఒక్క టాయెను. అంతవరకును, భరత పంచాల రాజ్యములు ఉచ్ఛదశయందుండి నపుడు, అయోధ్య క్షీణదశయందుండెనేమో?

రెండవ దిలీపుడు సమ్రాట్, చక్రవర్తి బిరుదాంచితుడు. అసురులతో బోరుటకై ఇతడు దేవతలకు సాయము జేసెనట. ఇతడు విష్ణుభక్తుడు.

ఇతని తనయుడు రఘుమహారాజు గొప్ప ఖ్యాతిని గడించినందున ఇక్ష్వాకు వంశము రఘువంశమాయెను. ఇతడు ఆదర్శప్రభువు కాబట్టి తరచు అయోధ్య రాజులలో ప్రథముడుగ పరిగణింపబడుచున్నాడు. ఇతడు పృథ్వి నంతటిని జయించి విశ్వజిత్ యాగము గావించెనట.

రఘు మహారాజు తనయుడు అజమహారాజు. ఇతని రాణి విదర్భ రాజ తనయ, ఇందుమతి. వీరి కుమారుడే దశరథుడు. ఇతడు ఉత్తరాపథ మున సకల దిక్కులందునుదండయాత్రలు సాగించివిజేతయైఆర్యసంస్కృతిని వ్యాపింపజేసెను. ఇతని సమకాలికుడైన మధు యాదవ రాజ్యమును సుస్థిర ముగ జేసెను. పౌరవులు ఆనాడు గంగా యమున మధ్యదేశమున ఉత్తర పంచాలాది నాలుగు రాజ్యములందు విలసిల్లుచుండిరి. దశరథుని కాలమున కోసల రాజ్యమునకు తూర్పున విదేహవైశాలి, అంగరాజ్యములును, దక్షిణ మున కాశీతో కలిసిపోయిన వత్సదేశమును, పడమట హస్తినాపుర రాజ్య మును, పంచాల రాజ్యములును, విలసిల్లుచుండెను. యమునా నదివద్ద నుండి గుజరాత్ వరకును, వింధ్యా, సాత్పురా పర్వతముల కటువైపునుండిన దక్షిణ ప్రాంతమంతయు మధుచక్రవర్తి పాలనమున నుండిన యాదవ రాజ్యమునకులోబడి యుండెను.

దశరథునికి కౌసల్యా, కైకేయి, సుమిత్రలే కాక ఇతర భార్యలుండిరి. కాని కైకేయిదేవి సుతునికే పట్టము గట్టెదనని వివాహమునకు పూర్వము ఇతడుమాట ఇచ్చియుండినట్లు తోచుచున్నది. ఇతని కూతురు, శాంత, అంగ రాజగు లోమపాదునికి పెంపుడు పోయెను. కాని వసిష్ఠునిసలహా ననుసరించి దశరథుడు శాంతను ఋష్యశృంగుని కిచ్చిపరిణయము గావించిఅతని సహాయ ముతో పుత్రకామేష్టి యాగము జేసెను. రామజననాది రామాయణ వృత్తాంత మందరెరింగినదే. రామాయణము నుండియే మనకు ప్రాచీన కాలము నందలి దక్షిణ ప్రాంతమును గూర్చి కొంతవరకు తెలియుచున్నది, అచ్చటచ్చట కొందరు ఆర్యవీరులు వసతి నేర్పరుచుకొని యుండిరేమో; కాని దక్షిణాపథమున దండక యను విఖ్యాతి గాంచిన ఘోరా

రణ్యముండెను. రామచంద్రుడు వనవాసమునకై బయలుదేరి మొదటప్రయాగకు వెళ్ళి, నైఋతిదిశ ప్రయాణము సాగించి భూపాల్ ప్రాంతమును అటు నుండి దక్షిణముగా నర్మదా నది యొడ్డును, పిదప చట్టీస్‌గర్ జిల్లా ప్రాంతములచేరి అందు పదిసంవత్సరములు వాసమొనర్చెనని తోచుచున్నది. పిమ్మట దక్షిణమువైపు ప్రయాణముచేసి గోదావరీ నదికి మధ్యయందున్న జనస్థానమును చేరెను. ఈ ప్రాంతము రాక్షసుల వారికి లోనైనందున మునులకు బాధకరముగ నుండెను. రామచంద్రుడు మునులకు సాయమొనర్చి రాక్షసులను కొందరిని హతమార్చెను. ఈ రాక్షసులకు సింహళము నందలి రాక్షస రాజ్యముతో సన్నిహిత సంబంధ ముండినందున, రావణుడు పగవూని సీతను ఎత్తుకొని పోయెను. రాముడు దక్షిణమువైపు ప్రయాణము సాగించుచు పంపా సరస్సును, ఋష్యమూక పర్వతమును చేరుకొని వాలి వధ గావించి, సుగ్రీవునికి పట్టము గట్టి వానర సహాయమున రాక్షసులను జయించి, రావణుని వధించి, విభీషణునికి పట్టముగట్టి సీతా సమేతుడై అయోధ్య జేరెను. ఇంత కాలమును తన ప్రతినిధిగ భరతుడు పరిపాలన యొనర్చుచుండెను.

కొన్ని కొన్ని విచిత్ర వృత్తాంతములను,అతిశయోక్తిని, వదలి వైచినచో రామకథ యందు చారిత్రకము కాని విషయము లేమంత ఎక్కువగ గాన్పించుట లేదు.

రాముని తమ్ములు వివిధ ప్రాంతములను పాలించుచుండిరి. అంగదచంద్రకేతులను పేర్లుగల,లక్ష్మణుని సుతులిరువురును హిమాలయ పర్వత సమీపమున నుండిన కారపథ దేశమునందు అంగదీయ, చంద్రచక్ర రాజధానీ నగరముల నుండి పాలించుచుండిరి. భరతునికి తన తల్లి రాజ్యమైన కేకయ రాజ్యమును, సింధుదేశమును రాజ్యమాయెను. అతని తనయులు తక్ష, పుష్కరులు గంధర్వులనుండి గాంధారను జయించి తక్షశిలా, పుష్కరావతీ పట్టణములను స్థాపించిరి. శత్రుఘ్నుడు యమునా నది పశ్చిమమున సాత్వత యాదవుల నోడించి మధుసుతుడగు మాధవలవణునిజంపెను, మధుపురిని (మధుర)

మధురయని నామకరణముజేసి ఇతడుతన రాజధానిగా జేసుకొనెను. ఇతని తనయుడు సుబాహుడించే ఇతని పిదపపాలనము సల్పెను. రాముని తనయులలో కుశుడు అయోధ్యా ప్రాంతమును, లవుడుఉత్తరకోసల ప్రాంతమును శ్రావస్తి రాజధానిగా పాలించిరి. ఈ చిన్నచిన్న రాజ్యము లెక్కువ కాల ముండినట్లు గాన్పించదు. గాంధార రాజ్యముల ప్రస్తావన తరువాత కాలమున అసలే గానరాదు. బహుశః దుహ్యులతో అవి కలసిపోయేనేమో! యాదవ రాజగు భీమసాత్వతుడు శత్రుఘ్నుని కుమారులను మధురనుండి తరిమివైచి ఆ ప్రాంతము నంతటిని యాదవ రాజ్యమున గలిపికొనెను. ఇక లక్ష్మణుని కుమారులను గూర్చిగాని, లవునిగూర్చిగాని ప్రస్తావనయే గాన్పించుటలేదు.

ఇటుపైన అయోధ్యకు ఎట్టి ప్రాముఖ్యతయు గాన్పించదు. పౌరవ, యాదవరాజ్యములే ఇటుపైన ఎక్కువ ప్రశస్తిగాంచిన రాజ్యములు.

*విదేహ:* జనక నామధేయమున బరగిన రాజులలో సీతాదేవి తండ్రియైన శీరధ్వజుడు సుప్రసిద్ధుడు. సాంకిష్య రాజగు సుధన్వనుడు సీతను తన కిచ్చి పరిణయము చేయమని శీరధ్వజుని కోరెను. కాని సుధన్వనుడు యుద్ధమునందోడి పోగా శీరధ్వజుడు తన తమ్ముని కుశధ్వజుని సంకిష్య రాజ్యాధినాథునిగాజేసెను. శీరధ్వజుని తనయలు సీతాఊర్మిళలు రామ లక్ష్మణులను, కుశధ్వజుని కుమార్తెలు మాండవి, శ్రుతకీర్తులు భరత, శత్రుఘ్నులను పరిణయమాడిరి.

*వైశాలి:* మరుత్తుని సుతుడు నరిష్యంతుడు గొప్ప యజ్ఞముజేసి, మహోదాతయని ప్రసిద్ధి కెక్కెను. అతని సుతుడు దముడు గొప్ప యోధుడు;స్వయంవరమున తన్నెదిరించినశత్రు రాజులను నిర్జించి దశార్ణదేశ రాకుమారితెను పరిణయమాడెను. కొన్ని తరములకు పిదప తృణబిందువు సింహాసన మెక్కెను. ఇప్పటికి త్రేతాయుగమున మూడవ పాదము జరుగుచుండెనని పురాణములు చెప్పుచున్నవి. తృణబిందు అలంబుషను పెండ్లాడి

విశాలుడను తనయుని, ఇలవిలాయను కూతురిని పొందెను. ఇలవిలను పులస్త్యునికిచ్చి పరిణయము జేయగా వారికి ఐలవిల విశ్రివసుడు కలిగెను. విశాలుడు విశాలా పట్టణమును నిర్మించి రాజధానిగా జేసికొనగా ఆరాజ్యమునకు వైశాలి అనుపేరు యేర్పడెను. ఈ వంశమున గాన్పించు చివరి నామము సుమతి (లేక ప్రమతి). ఇతడు దశరథుని సమకాలీనుడట.

## 2. చంద్రవంశము:

పౌరవులు పౌరవయోధుడైన దుష్యంతుడు సగరునికి రెండు మూడు తరములకు ఇటీవలివాడు. తుర్వసురాజునకు పుత్రులు లేనందున దుష్యంతుని దత్తపుత్రునిగా స్వీకరించినందున ఈ రెండు వంశము లేకమాయెను. ఇక్ష్వాకు వంశము సగరుని యనంతరము క్షీణదశ చెందగా దుష్యంతుడు తన పిత్రీయ రాజ్యమును సంపాదించుకొని వంశకరుడని ప్రఖ్యాతి గాంచెను. ఇతడు కశ్యప కుటుంబమునకు చెందిన కణ్వుని ఆశ్రమమున పెరిగిన విశ్వామిత్రుని తనయను శకుంతలను పరిణయ మాడి భరతుడను కుమారరత్నమును గాంచెనని పైన జూచితిమి.

దమన, సర్వదమన బిరుదాంచితుడైన భరతుడు గంగా యమునా నదీతీరములందు ఎన్నియో యజ్ఞములను గావించెను. దీర్ఘతము డీయజ్ఞములందీతనికి పురోహితుడాయెను. ఇతడు సరస్వతీ నది యొద్దున గూడ యజ్ఞములను జేసెననియు, సానాప్రాంతములను జయించి సమ్రాట్ బిరుదమును సంపాదించెననియు పురాణముల నుండి తెలియుచున్నది. ఇతని రాజ్యము సరస్వతి నుండి గంగ వరకును వ్యాపించి యుండెను. ఇతని తరువాత పౌరవ వంశమునకు భరత వంశమని పేరువచ్చెను. బహుశః ఇతని కాలమునందే రాజధాని ప్రతిష్ఠానమునుండి మారి హస్తినాపురమునకు వచ్చెను. హస్తినాపురమను పేరు బహుశః ఇతని తరువాతి రాజులలో నొకడగు హస్తిని బట్టి ఏర్పడియుండును.

భరతుని కుమారు లందరును అప్రియోజకులైనందున అతడే వారి నందరిని జంపి మరుత్తులను ప్రార్థించి బృహస్పతి కొమరుడైన భరద్వాజుని తనయునిగాఁ పెంచుకొనెను. కాని ఇతని పిదప సింహాసనమెక్కినది ఇతని మనుమడు (భరద్వాజుని తనయుడు) వితథుడనువాడు.

భరతునికి తరువాత ఐదవతరమువాడైన హస్తికి అజమీఢుడనియు, ద్విమీఢుడనియు ఇరువురు కుమారులుండిరి. వీరిరువురును కడుసమర్థులై ఎన్నియో క్రొత్త రాజ్యములను జయించి పౌరవరాజ్యమును విస్తరింపజేసిరి. అజమీఢుడు హస్తినాపురమునందు పాలించినందున అతని తనయులు ఆ ముగ్గురును (ఋుక్ష, నీల, బృహదశ్వులనువారు) ఈ రాజ్యమును పంచుకొనిరి. ఋుక్షుడు హస్తినాపురమునందు పౌరవవంశమును నిలబెట్టెను. నీలబృహదశ్వులు ఉత్తర దక్షిణ పాంచాల రాజ్య స్థాపకులైరి. ద్విమీఢుడు తన పేరట ఒక వంశమును స్థాపించెను. అది కొంతకాలము వరకు నేటి బెరిలీ జిల్లా ప్రాంతమునందు వెలసిల్లెను.

అజమీఢునికి తరువాత ఆరవతరమువాడు భృమ్యశ్వుడు. ఇతనికి అసమర్థులైన తనయులేవు రుండిరి. అపహాస్యమునకై వీరికి ఒసగిన (పంచ అలం అనెడి) సూటిమాట పంచాల నామమునకు ఆధారమాయెను. పంచాల భరతవంశమునందొక శాఖయేయని దీనినిబట్టి తెలియుచున్నది. (బహుశః ఐదు వంశములు కలిసిపోయి ఇట్టి సంయుక్త స్మారకమగు పేరునకు దారి తీసినేమో?) ఈ ఏవురిలో జ్యేష్ఠుడైన ముద్గలుడు ఒక ప్రధాన శాఖకు మూలపురుషుడాయెను. ఇతనిపౌత్రుడు వధ్ర్యశ్వుడు ఈరాజ్యమును విస్తరింపజేసెను. అతని తనయుడు దివోదసుడు ఇంకను ఈ రాజ్యవైశాల్యమునువృద్ధిజేసెను. కొందరు చారిత్రకులు ఇతడునుఇతని వంశీయుడైన సోమదత్త సుదాసుడును వైదిక వాఙ్మయమునందు దశరాజయుద్ధమునందు ప్రస్తావింపబడిన మహాపురుషులేయని విశ్వసించుచున్నారు. ఇది బహుశః అసమంజసమని తోచుచున్నది.

*యాదవులు:* ప్రధానయాదవ వంశము విదర్భయందు క్రథ - భీముని పాలనము నందుండగా ఇతని తమ్ముడు కైశికుడు చేదివంశమును స్థాపించెను. విదర్భరాజులలో సుప్రసిద్ధుడు నిషధరాజగు నలుని చేపట్టిన దమయంతీదేవి తండ్రియైన భీమరథుడు. ఇతని తరువాత సుమారు పదితరములకు వచ్చిన మధువు, చీలిపోయిన చిన్న చిన్న యాదవ సంస్థానముల నన్నిటిని జేర్చి, యాదవ సామ్రాజ్యమును స్థాపించెను. కాని అతని తనయుడు శత్రుఘ్నుడిచే హతమాయెను. కొంతకాలము ఈ రాజ్యము శత్రుఘ్నుని తనయుడు సుబాహువు పాలనము నందుండినను మధువుకు ఐదవ తరమువాడైన సత్వతుని కుమారుడు భీముడు మరల ప్రీతియమును సంపాదించుకొనెనని పైన జూచితిమి.

*తూర్పు ఆనవులు:* ఏడవ తరమువాడైన లోమపాదునివరకు అంగ వంశమును గూర్చి మనకేమియును తెలియదు. ఇతడు విలువిద్యయందు కడు నేర్పరియనియు, దశరథునికి ప్రియమిత్రుడనియు, ఇతడు దశరథుని కుమార్తెను శాంతాదేవిని దత్తపుత్రికగ స్వీకరించి, ఋష్యశృంగుని కిచ్చి వివాహము జేసి, పుత్రకామేష్టి యాగఫలితముగ చతురంగుడను పుత్రుని గాంచెను. లోమపాదుని ప్రపౌత్రుని పేరును బట్టియే అదివరకును మాలినీ యని పేరు వడసిన అంగరాజ్యరాజధానీ నగరమునకు చంపాయను పేరు వచ్చెను,

*కాశీ:* వారణాసినుండి రాక్షసులను తఱిమివైచి రాజధానిని మరల కాశీయందు స్థాపించిన అలర్కుడు ఋతుధ్వజ (ఇది వత్సుని రెండవ పేరు) మదాలసల పుత్రుడు. ఇతడు ఆముష్మిక దృష్టి కలవాడగుటచేత తమ్ముడు తనపై దండెత్తిరాగా యుద్ధముచేయుట కిచ్చగింపక రాజ్యమును వదలివైచెను. అలర్కుని పిదప అతని సుతుడు సన్నతి రాజ్యమునకు వచ్చెను.

3. బ్రాహ్మణ కుటుంబములు:

ఈ యుగమునందలి భార్గవులలో ప్రాచేతసుడను అపర నామము గల వాల్మీకి సుప్రసిద్ధుడు.

విశ్వామిత్రులలో శకుంతల తండ్రియు, మిత్రసహ-కల్మాషపాదుని పురోహితుడగు వసిష్ఠునికి సమకాలికుడై పగసాధించిన ధీరుడును - వీరిరువురును - ముఖ్యులు.

## కృష్ణ మహాయుగము

(రమారమి క్రీ॥ పూ॥ 1950–1400)

రాక్షస నిర్మూలనానంతరము శ్రీరామ పట్టాభిషేకమునుండి ఆరంభమైన ద్వాపర యుగము, భారతయుద్ధ పరిసమాప్తితో ముగిసినదని పురాణములు చెప్పుచున్నవి. ఈ యుగమున పంచాల, పౌరవ, యాదవ వంశములే ప్రధానస్థానము నాక్రమించెను. అయోధ్య మొదలైన రాజ్యములు అడుగంటి పోయెను.

*1.* పంచాలులు:

ఉత్తర పంచాల రాజ్యము సుదాసుని కాలమున విస్తరించి ప్రసిద్ధికెక్కెను. సుదాసుడు పౌరవరాజగు సంవరణునిజయించి, ఆతని రాజ్యము నాక్రమించెను. కాని ఇతని పుత్రపౌత్రులైన సహదేవ సోమకుల రాజుల కాలమున ఈ రాజ్య ప్రాబల్యము తగ్గిపోయినందున సంవరుణుడు తనరాజ్యమును మరల సంపాదించుకొనగల్గెను. మరికొంతకాలమునకు ద్విమీఢరాజగు ఉగ్రాయుధుడు ఉత్తర పంచాల రాజును (బహుశః పృషతుని పితామహుడేమో?) సంహరించి అతని రాజ్యము నాక్రమించెను. రాజ్యభ్రష్టుడైన పృషతుడు దక్షిణ పంచాల కాంపిల్య యందు తలదాచుకొనెను. ఉగ్రా

యుధుడు అంతటితో తృప్తినొందక శంతనుని మరణానంతరము పౌరవ రాజ్యముపై దండెత్తెను. కాని భీష్ముడు ఇతనిని సంహారించి పృషతునికి అతని పిత్రీయమైన అహిచ్ఛత్రి రాజ్యము నిచ్చివేసెను.

పృషతుని పిదప ఉత్తర పంచాలయందు అతని తనయుడు ద్రుపదుడు సింహాసన మెక్కెను. ఇతడు తనసహాధ్యాయుడైనద్రోణుని అవమాన పరచి నందున ఆతడు తన శిష్యులైన కురుపాండవ రాకుమారుల సాయముచేత ఇతనిని ఓడించి ఉత్తర పంచాల రాజ్యమును గైకొనెను. సోమక, సృంజయు లను పంచాల వంశ శాఖలు ద్రుపదుని జేరి, భారతయుద్ధమున పాల్గొనెను. ద్రుపదుడు తపమాచరించి ద్రోణుని సంహారింపగల కుమారుని, ధృష్టద్యుమ్నుని, గాంచెను. పంచాలులు భారతయుద్ధ యుగమున ప్రముఖ స్థానమునందుండి రనుటకు ఎట్టి సంశయమును లేదు. పాండవులు పంచాల రాకుమార్తెయగు ద్రౌపదిని పరిణయమాడినందున వీరు పాండవుల పక్షము నందుండి వారికి ఎంతయో సహాయము గావించిరి.

దక్షిణ పంచాల రాజులందరిలో బ్రహ్మదత్తుడు సుప్రసిద్ధుడు. ఇతడు ఋగ్వేదాథర్వణవేదముల క్రిమపాఠమును నిర్ధరించి నిర్ణీతము జేసెనట, ఇతని మంత్రిపుంగవుడు కండరీకుడు సామవేద క్రమపాఠమును నిర్ణయము జేసెనట, బ్రహ్మదత్తుని ప్రపౌత్రుడు జనమేజయ దుర్బుద్ధి క్రూరరాజైనందున ద్విమీఢ రాజగు ఉగ్రాయుధుడు ఇతనిని వధించి రాజ్యము నాక్రమింపగా ఈ వంశము అంత మొందెను.

## 2. పౌరవులు:

పంచాల సుదాసునిచే పరాజితుడైన పౌరవరాజు,సంవరణుడు, సింధు దేశమునకు పారిపోయి వసిష్ఠుని సాయముచే మరల రాజ్యమును సంపాదించు కొనెనని పైన జూచితిమి. ఇతనికి తపతీదేవియందు కురు అను గొప్ప యోధుడు జనించెను. కురువు ప్రయాగయందు యజ్ఞము చేసెనట. అన్నగా

మధ్యనున్న దక్షిణ పంచాల రాజ్యమును జయించి ఇతడు ప్రయాగ వరకును తన రాజ్యమును విస్తరించెనని యర్థము. కురుదేశము, కురుక్షేత్రము (వ్యవసాయములోనికి తెచ్చిన ప్రాంతము), కురుజాంగల (వ్యవసాయములేని అటవిక ప్రాంతము), మొదలగు నామము లీతనిని బట్టి యేర్పడినవి. ఇతని వంశీయులు కౌరవులైరి. కొన్ని సంవత్సరములందు ఈ దేశవాసులకుగూడ కురు, కౌరవ నామములను వ్యవహరించుచున్నారు.

కురురాజు పిదప రాజ్య మెక్కిన వారిని గూర్చి స్పష్టముగ తెలియుటలేదు. ఇతనికి పరీక్షితు, జహ్నూ, సుధన్వులను ముగ్గురు పుత్రులుండిరనియు, పరీక్షితునికి జనమేజయుడును, అతనికి శ్రుతసేన, ఉగ్రసేన, భీమసేనులునుకలిగిరని తెలియుచున్నది. కాని ఆ పిదప వీరి కేమాయెనో తెలియరాదు. బహుశః జహ్నువు కొమారుడు సురథుడు ప్రధాన వంశమునందే రాజ్యమునకు వచ్చియుండుట జూడ వీరు స్వాతంత్ర్యమును గోల్పోయిరని తోచుచున్నది. జనమేజయుడు రాజ్యమును గోల్పోయెనని ఒకనొకగాథ తెల్పుచున్నది. జనమేజయుడు గార్గ్యఋషి కుమారునికి హానియొనరించినందున ఆ ముని ఇతనిని శపించెననియు, పిదప ఇంద్రోత దైవాప శౌనకుడు ఇతని కొరకై అశ్వమేధయాగముచేసి పాపపరిహారము గావించినను కూడ రాజ్యము మాత్రము లభింపదాయెననియు ఈగాథనుండి తెలియుచున్నది.

కురురాజు యొక్క కనిష్ఠ పుత్రుడైన సుధన్వుని వంశము రెండు శాఖలై నాలుగవ తరము వాడైన వసురాజు కాలమునందు చేది, మగధ రాజవంశము లాయెను. ప్రధాన వంశమునందు సమర్థులెవ్వరును లేనందున ప్రతీపుని కాలము వరకును కౌరవ వంశము అణగియుండెను. ప్రతీపుని ముప్వురు కొమరులలో జ్యేష్ఠుడు దేవాపి కుష్ఠురోగి. రెండవవాడు, బాహ్లికుడు. తనకు రాజ్య మక్కరలేదని వదలివైచి పోగా మూడవ పుత్రుడు శంతనునికే రాజ్యము వచ్చెను. శంతనుడు గంగను పరిణయమాడి భీష్ముని గాంచెను. ఇతడు దేవవ్రతు డను బిరుదముగలవాడు. తనతండ్రి సత్యవతిని

పరిణయమాడి ఆమెయందు జనించు పుత్రులకు రాజ్యము నొసగుటకై తాను బ్రహ్మచర్యదీక్ష బూనెను. ఇతడు గొప్ప యోధుడు, రాజనీతి యందునుకూడ దక్షుడు. ద్విమీఢ ఉగ్రాయుధుడు దండెత్తిరాగా అతనిని హతమార్చి, పృషతునికి అతని పిత్రీయమైన ఉత్తర పంచాల రాజ్యమును సంపాదించిపెట్టెనని పైన జూచితిమి.

శంతనునికి సత్యవతియందు జనించిన వారిలో పెద్దవాడు, చిత్రాంగదుడు గంధర్వులతో యుద్ధముచేసి చనిపోయెను. రెండవవాడు విచిత్రవీర్యుడు సింహాసనమెక్కెను. ఇతడును పుత్రులులేకనే చిన్న వయస్సునందే మరణించినందున, అతని రాణి నియోగపద్ధతి నవలంబించి, వ్యాసమహర్షిచే ధృతరాష్ట్ర, పాండురాజులను కనెను. ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడైనందున పాండురాజునకు పట్టముగట్టి, భీష్ముడు రాజ్యవ్యవహారము లన్నింటిని నడపించుచుండెను. ధృతరాష్ట్రుడు గాంధారిని పరిణయమాడి దుర్యోధన, దుశ్శాసనాది పుత్రులను నూరుగురిని గనెను. పాండురాజు కుంతి భోజుని కూతురును, కృష్ణుని మేనత్తయు, ఐన పృథా యను మారుపేరుగల కుంతీదేవిని, వాహ్లీకరాజైన శల్యునికూతురగు మాద్రిని పరిణయమాడెను. పిదప విజిగీషువై దండయాత్రసాగించి, దశార్ణులను, మిథిల, కాశీ, సుహ్మ పుండ్రరాజులను జయించి కురురాజ్యమును విస్తీర్ణముజేసెను. ఒకమారు వేటయందు పొరబాటున పాండురాజు జింకయని భ్రమపడి ఒక ఋషికుమారుని వధించి శాపమునొందెను. వెంటనే పశ్చాత్తాపముజెంది రాజ్యమును వదలి, భార్యాద్వయ సమేతుడై హిమాలయములకు వెడలిపోయెను. అప్పుడు కుంతీదేవికి యమ, వాయు, ఇంద్రులవలన యుధిష్ఠిర, భీమార్జునులును, అశ్వినీదేవతలవలన మాద్రికి నకుల సహదేవులును కలిగిరి. పాండురాజు ఆశ్రమవాసమునందే మరణింపగా మాద్రి సహగమన మొనర్చెను. కుంతీదేవి పంచపాండవులతో హస్తినాపురమునకు మరలిరాగా, రాజ్యపాలన మొనర్చుచుండిన ధృతరాష్ట్రుడు యుధిష్ఠిరుని యువరాజుగా నియమించెను.

*చేది, మగధరాజ్యములు:* సుధన్వుని పిదప నాల్గవ తరమువాడైన వసురాజు యాదవులనుండి చేది రాజ్యమును జయించి తన వంశమును స్థాపించెనని పైన జూచితిమి. ఇతనికి చైద్యోపరిచార (చైద్యులను జయించిన వాడు) సమ్రాట్ 'చక్రవర్తి' అను బిరుదములు గలవు. ఇతడు మగధ, మత్స్య రాజ్యములను గూడ ఆక్రమించినట్లు తోచుచున్నది. ఇతని రాజధాని నగరము శుక్తిమతీ (నేటి కేనో) తీరమునందుండిన శుక్తిమతి, ఇతనినలుగురు పుత్రులును వేర్వేరుస్వతంత్రరాజ్యములను స్థాపించిరి. జ్యేష్ఠుడు బృహద్రథుడు మగధయందును, కుశుడు కౌశాంబియందును, యదువు కరూషప్రాంతమునందును, ప్రత్యగ్రహుడు చేదియందును రాజ్యములను నెలకొల్పిరి. కనిష్ఠునికి బహుశః చేది రాజ్యమునకు సమీపమున వాయవ్య దిశయందుండిన మత్స్యరాజ్యము ప్రాప్తమాయెనేమో?

బృహద్రథుడు గిరివ్రజపట్టణము రాజధానిగా మగధరాజ్యము నేలి, ఈ రాజ్యమునకు ఎక్కువ ప్రాముఖ్యతను సంపాదించెను. ఇతని తరువాత వారిలో నొకడైన జరాసంధుడు రాజ్యమును బ్రహ్మాండముగ విస్తరింపజేసి మధురరాజైన యాదవ కంసునిగూడ తన సామంతునిగ చేసికొనెను. కంసుడు క్రూరుడై, ప్రజలను హింసించుచుండెనని శ్రీకృష్ణుడతనిని వధించి ఉగ్రసేనునికి మధురయందు పట్టాభిషేకము గావించెను. కంసుడు తన అల్లుడు కాన జరాసంధుడు కుపితుడై మధురభోజులపైనను కృష్ణునిపైనను ఎన్నియోమార్లు దండెత్తి, కొంత విజయముసాధించెను. యాదవులు కొంత కాలము జరాసంధుని ఎదిరించగలిగినను ఎన్నటికైనను ప్రమాదము తప్పదని గుర్తెరిగి నైరుతివైపు వలసపోయి, పశ్చిమ కోస్తాప్రాంతమున ద్వారక వద్ద కృష్ణుని నాయకత్వమున సుస్థిరులైరి. కొంతకాలమునకు పాండవ భీముడు జరాసంధుని వధించెను. అతని తనయుడు సహదేవుడు పాండవుల పక్షము జేరెను.

## 3. యాదవులు:

భీమ సాత్వతుడు పాలించిన విశాల యాదవ రాజ్యమును అతని పుత్రులు నలుగురును పంచుకొనిరి. భజమానుని వంశమువారి ప్రస్తావనకాన

రాదు. దేవావృధునికి పర్ణాశనది (నేటి పశ్చిమ మాల్వాయందలి బనాస)తో కొంత సంబంధముండినటుల కాన్పించుచున్నది. బహుశః ఇతని వంశము వారే మార్తికావత భోజులని ప్రశస్తిగాంచి, నేటి ఆబూపర్వత ప్రాంత మందలి సాల్వదేశమును పాలించిరి. మూడవ పుత్రుడు అంధకుడు మథుర యందు రాజ్యముజేసెను. ఇతనికి నలుగురు పుత్రులు కలిగిరి. కాని వారిలో కుకుర భజమానులు మాత్రమే ముఖ్యులు. కుకురుని నుండియే కుకురులు జనించిరి. వీరు కంసుని కులమువరకు ముఖ్యులుగ నుండిరి. భజమాన వంశీయులు అంధకులని పేరు నొంది, మథుర సమీపమున రాజ్యము చేయు చుండిరి. ఈ వంశము వాడే హృదీకుని పుత్రుడైన కృతవర్మ. ఇతడు కౌరవుల పక్షమున భారతయుద్ధమున పాల్గొని, యుద్ధమున చావని ముప్వురిలో నొకడు. తరువాత ఇతడు ద్వారకకు జని, యాదవుల అంతః కలహములలో సాత్యకిచే చంపబడెను. భీమ సాత్వతుని నాల్గవ పుత్రుడు వృష్ణికి నలుగురు తనయులు జనించిరి. వీరిలో జ్యేష్ఠ, కనిష్ఠుల నామ ధేయము ఒక్కటే-అనమిత్రుడు. ఈ నలువురినుండి ఎన్నియో వంశశాఖ లారంభమాయెను. జ్యేష్ఠుడు, అనమిత్రునికి (లేక సుమిత్రుడా?) పిదప అతని తనయుడు నిఘ్నుడనియు వానిపిదప అతనితనయులు ప్రసేన సత్రా జితులు రాజ్యముచేసిరి. శ్యమంత కోపాఖ్యానము ద్వారా సత్రాజితుని గూర్చియు ఇతనితనయయగు కృష్ణుని ప్రియభార్య,సత్యభామను గూర్చియు ఎరుగని వారుండరు. మరికొంతకాలమునకు ఈవంశీయుడైన దేవమీఢుషుడు ఇక్ష్వాకు రాకుమారితెను అశ్మకీదేవిని పరిణయమాడి, శూరు డను పుత్రుని గాంచెను. శూరుని రాణి మారీషా యను పేరుగల భోజకుల ప్రసూత. వీరికి వసుదేవాదులగు పదిమంది పుత్రులును, పృథా, శ్రుతదేవా, శృతశ్రవా మున్నగు ఏవురు కుమార్తెలును కలిగిరి. పృథాదేవిని కుంతి భోజుడు పెంచుకొనినందున ఈమెకు కుంతియని పేరు వచ్చెను. శ్రుతదేవ వృద్ధ శర్మ యనెడి కరూషరాజును పెండ్లాడెను. శ్రుతశ్రవ చేదిరాజగు దమ ఘోషుని పరిణయమాడి, శిశుపాలుని గాంచెను. వసుదేవుడు కుకురరాజగు

దేవకుని (దేవకీ మొదలగు) ఏడుగురు పుత్రికలను వివాహమాడెను. ఇతని పుత్రులే బలరామకృష్ణులు. ఇతని పుత్రిక సుభద్ర అర్జునుని పెండ్లాడి, అభిమన్యునిగాంచెను. ఇతని పుత్రుడే పరీక్షితు. ఇతడే భారత యుద్ధానంతరము హస్తినాపుర సింహాసనము నధిష్ఠించినది.

వృష్ణికి కనిష్ఠ పుత్రుడైన అనమిత్రునికి మాద్రీదేవియందు శినియు, వానినుండి శైన్యులును జనించిరి. సాత్యకి, యుయుధానులు ఈ వంశమునందే జనించిరి.

కుకురులలో ఆహుకుడనువాడు, కాశీరాజు పుత్రికను పెండ్లాడి దేవక ఉగ్రసేన మొదలగు పుత్రులను గాంచెను. దేవకునికి నలుగురు పుత్రులును, దేవకీ మొదలైన ఏడుగురు పుత్రికలును కలిగిరి. ఉగ్రసేనునికి కంసాది నవపుత్రులును, పంచ పుత్రికలును కలిగిరి. కంసుడు తండ్రిని చెరబట్టి సింహాసన మాక్రమించెను. వసుదేవుడతని మంత్రి. దేవకీపుత్రుడు తన్ను సంహరించునని విని, కంసుడు ఆమె పుత్రులను ఏడు మందిని చంపెను. కృష్ణ, బలరాములు గోకుల బృందావనమునందు పెరిగి, పెద్దవారైరి. కృష్ణుడు కంసుని జంపి ఉగ్రసేనుని మరల సింహాసన మెక్కించెనని పైన జూచితిమి.

కృష్ణుని వృత్తాంత మందరెరింగిన విషయమే. భాగవతమునందు ప్రత్యేకముగా కృష్ణలీలలు కొంత అధికముగా వర్ణింపబడియున్నవి. భారతమునందుకూడ ద్రౌపదీ స్వయంవర ఘట్టమునుండియు కృష్ణుని ప్రస్తావన అధికముగాకలదు. ఈ అంశము లందరెరింగినవే గాన ఇట వర్ణింప నవసరములేదు.

యాదవ నాశనమునకు పిదప కృష్ణుడు తన యవసాన మాసన్నమైనదని గుర్తెరిగి, స్త్రీలను పిల్లలును వచ్చి చూచుకొనమని అర్జునుని కబురు పంపి, వనవాసమున కేగెను. అర్జునుడు ద్వారకనుండి వీరందరిని తోడ్కొని పోయి కృష్ణుని మనుమలలో ఇంకను జీవించియున్న వజ్రుడను వానిని మధుర సింహాసన మెక్కించెను. కృష్ణుడు గాఢ తపమున మునిగియుండగా వేటగాడొకడు జింకయని భ్రమపడి అతనిని బాణముతో చంపెను.

వాసుదేవ కృష్ణుని దైవముగా పూజించుట పతంజలి మహాభాష్య కాలమునకు పూర్వము అనగా క్రీ॥ పూ॥ రెండవ శతాబ్దమునకు పూర్వమే రూఢిగా నుండెనని చెప్పవచ్చును.

## 4. చూర్ప్స అనవులు:

జరాసంధుని సామంతునిగ కర్ణుడు కొంతకాలము అంగరాజ్యమును పాలించుచుండెను. ఇతని వృత్తాంత మందరెరింగినదే. ఇతని కుమారులలో జ్యేష్ఠుడు వృషసేనుడు. ఇతడును తన ఏవురు తమ్ములతోబాటు భారత యుద్ధమున మరణించెను.

## 5. సూర్యవంశము:

రాముని యనంతరమున అయోధ్య చరిత్ర యందంత ప్రాముఖ్యత గడించలేదు. రాముని తనయుడు కుశుడు కుశస్థలి రాజధానిగా దక్షిణ కోసలను పాలించి, వింధ్య ప్రాంతములందు ఆర్య సంస్కృతిని వ్యాపింప జేసెనని తెలియుచున్నది. ఇతడు నాగకన్యను పరిణయమాడెనని చెప్పుట వలన ఆర్యేతరులలో ఇతడు నాగరికతను ఎక్కువగ వ్యాపింపజేసెనని తెలియును. ఇతని తరువాతి వారలలో జైమినినుండి యోగము నేర్చిన హిరణ్యానాభ కౌసల్యాయనువాడు ముఖ్యుడు. భారతయుద్ధమునకుపూర్వము సూర్యవంశ రాజులలో చివరివాడు బృహద్బలుడు. ఇతడే అయోధ్యసేనను ఈ యుద్ధములోనడపి పాండవుల నెదిరించెను. రాజసూయమునకు పూర్వము భీముడితనిని జయించి యుండెను గాని, కర్ణుడు మరల ఇతనిని జయించి నందున కౌరవులతో చేరవలసి వచ్చెను. ఇతడు అభిమన్యునిచేత భారత యుద్ధమున చంపబడెను.

# 10. భారత యుద్ధము

(రమారమి క్రీ॥ పూ॥ 1400)

భారతగాథ యందరెరింగినదే. అందువలన ఇచట వర్ణింప నవసరము లేదు. కాని యుద్ధమునందు పాల్గొనిన రాజుల వృత్తాంతము నొకింత పరికింపవలయును. కౌరవులకు పదునొకండు అక్షౌహిణులును, పాండవులకు ఏడు అక్షౌహిణులును మాత్రమే సేన యుండెను.

ప్రాచ్య భారతమునుండి మగధ రాజైన జరాసంధుని తనయుడు సహదేవు డొకడు తప్ప ఇతరులందరును కౌరవుల పక్షమున నుండిరి. తూర్పు మగధ, విదేహ, అంగ, వంగ, కళింగ రాజ్యములు కర్ణుని అధికారమున నుండి కౌరవ పక్షము చేరెను. ప్రాగ్జ్యోతిష పురాధినాథుడైన భగదత్తుని నాయకత్వమున కిరాతులు కూడ కౌరవుల పక్షమున నుండిరి.

మధ్యదేశమున వత్స, కాశి, చేది, కరూష, దశార్ణ, పంచాల పాలకులు పాండవులపక్షమున నుండిరి. కోసలరాజైన బృహద్బలుడు మాత్రము కౌరవులను చేరెను. యాదవులు ఒక్క పక్షమును చేరరైరి. కృష్ణుడు యుద్ధము చేయనని కేవలము సలహాదారుడుగ మాత్రము పాండవులను చేరెను. బలరాముడు ఎవరివైపునను చేరుటకు ఇష్టములేక తాటస్థ్యము వహించెను. వృష్ణి యాదవులలో యుయుధానుడును, సాత్యకియు పాండవుల పక్షము చేరిరి. మహిష్మతీనీలుడును, అవంతియొక్క వింద అను విందులును, భోజ,అంధక, కృష్ణ, కృతవర్మలును, విదర్భ, నిషాద, సాళ్వరాజులు, కౌరవులను జేరిరి.

పంజాబు పశ్చిమోత్తర ప్రాంతము నుండి కౌరవులకు బావమరదియైన సింధు సౌవీరరాజు జయద్రథుడును, గాంధార యొక్క శకునియు, త్రిగర్త యొక్క సుశర్మయు, కేకయ, శిబి రాజులును, మద్రరాజగు శల్యుడును, వాహ్లీక, క్షుద్రక, మాలవ, శిబితాయు (అంబష్ఠుల రాజు), సుదక్షిణులును

(కంభోజరాజు) కౌరవసేన యందుండిరి. ఈ ప్రాంతమునుండి పాండవ పక్షమును జేరిన వాడు కాష్మీరమునందు నైరుతి దిగ్భాగమును పాలించిన అభిసారుడొక్కడే. పాండవుల పక్షమున పంచాలులును, మత్స్యులును, చేది, కరూష, పశ్చిమ మగధ, కాశీ, నైరుతి యాదవులును ఉండగా, కౌరవుల పక్షమున ఇంచుమించుగా ప్రాచ్య భారత రాజులందరును, పశ్చిమోత్తర ప్రాంతరాజులును, మధ్యదేశమునందలి కోసల, వత్స, శూరసేన రాజులును, పశ్చిమ ప్రాంతమునందలి మాహిష్మతీ, అవన్తి,సాల్వ రాజ్యములునుఉండెను. అనగా మధ్యదేశమును, గుజరాతును పాండవుల పక్షమున నుండగా మిగత భాగమంతయు కౌరవుల పక్షమవలంబించెను. పాండవుల సేన మత్స్య రాజధానియైన ఉపప్లవ్యమునందు విడిసియుండగా కౌరవసేన హస్తినా పురము నందుండెను.

భారతయుద్ధమును గూర్చినచర్చఇచట అనవసరము. యుద్ధమునందు పంచపాండవులును, సాత్యకియు, ధృతరాష్ట్రుడును తప్ప మిగతవారంద రును (కృతవర్మ, కృపాచార్య, అశ్వత్థామల సంగతి వేరు) మరణించిరి. యుధిష్ఠిరుడు సింహాసన మెక్కెను; అశ్వమేధయాగము చేసెను. మరి కొంతకాలమునకు వృష్ణి, యాదవ వంశములు నిర్మూలములాయెను. యాదవ స్త్రీజనమును పిలుచుకొని వచ్చుచున్న అర్జునుని ఆభీరులు ఓడించిరి.

మరలకొంత కాలమునకుఅర్జునుని మనుమడగు పరీక్షితునకు పట్టము గట్టి యుధిష్ఠిరుడు సన్యసించి అడవులకేగెను.

పరీక్షితునితో కలియుగము ప్రారంభమాయెనని పురాణములు చెప్పు చున్నవి. ఇంతకు పూర్వము జరిగినదంతయు భూతకాలములో చెప్పబడినను, ఇటుపైన రాజ వృత్తాంతము భవిష్యత్తులో జరుగనున్నట్లుగ పురాణములు చెప్పుచున్నవి.

# 11. భారత యుద్ధానంతర యుగము

(సుమారు క్రీ॥ పూ॥ 1400 నుండి క్రీ॥ పూ॥ 600 వరకు)

క్రీ॥ పూ॥ నాలుగవ శతాబ్దమున నందసామ్రాజ్యమునందు కలిసి పోవువరకు, భారతయుద్ధమునకు పిదప, వెలసిల్లిన రాజ్యముల ప్రస్తావన పురాణములందు కానవచ్చుచున్నది. మగధ గాక పౌరవులు, ఐక్ష్వాకులు, పంచాలులు, కాశీ, హైహయ, కళింగ, అశ్మక, మైథిల, శూరసేన వీతి హోత్రులు పేర్కొనబడినను, మగధతో పాటు పౌరవ, ఐక్ష్వాకువంశముల వృత్తాంతము మాత్రమే కొంత ఎక్కువగా గాన్పించుచున్నది. అసలు పైనుడివిన వంశములన్నియు ఇంచుమించుగా ఉత్తరాపథమున తూర్పు ప్రాంతమునందును, మధ్యప్రాంతమునందును, పశ్చిమప్రాంతమునందును కొద్ది భాగమునందు మాత్రమే వెలసినవి. మిగత ప్రాంతముల ప్రస్తావన గూడ ఈ కాలమున కానరాదు. నేటి ఉత్తర ప్రదేశ, దక్షిణ బిహార్ ప్రాంతపు చరిత్ర మాత్రమే పురాణములందు ఈ యుగమున కానవచ్చు ననుటలో అతిశయోక్తి లేదు.

## 5. పౌరవులు :

భారత యుద్ధమునకు పిదప పాలించిన రాజులలో ప్రథముడు పరీక్షితుడనియు, ఇతడు అర్జునుని పౌత్రుడనియు, ఇతనితో కలి ఆరంభ మాయెననియు పైన జూచితిమి. వైదిక వాఙ్మయమున గానవచ్చు పరీ క్షితుడును ఇతడును వేరని స్పష్టముగ తెలియుచున్నను చారిత్రకముగ అతని చర్యలును, ఇతని చర్యలును కలిసిపోయి సందేహము లేర్పడుటకు ఎక్కువ అవకాశము వచ్చినది.

పరీక్షితు రాజ్యము గంగా యమునల మధ్య ప్రదేశమని తెలియు చున్నది. అనగా నేటి థానేశ్వర్, ఢిల్లీ, గంగా యమునల మధ్యప్రదేశము నందలి ఉత్తరభాగమును. కలిశకము ఇతని కాలములో నారంభమాయెను. కలిపురుషుడు ధర్మదేవతను తన్నగా, పరీక్షితు అతని నెదిరించి అణచి, తన

రాజ్యమునుండి తఱిమివైచిన వృత్తాంతము పోతన భాగవతమున ప్రథమ స్కంధమున (పద్యములు 378–404) వర్ణింపబడియున్నది.

ఇతడు మృగయావినోదియై అరణ్యమున సంచరించుచు దాహితప్పి, తపమొనరించుచున్న ఒక మునిని గాంచి దారి యడుగగా అతడు బదులు చెప్పకున్నందునకినిసి, అతనిపై చచ్చినపామును వేసి యవమానపరచెననియు, ఇందుకు కోపించి ఆ మునియొక్క పుత్రుడు ఇతనిని శపించెననియు, శాపానుసారముగ తక్షకుడను సర్పరాజు ఇతనిని కాటువేసి, చంపెననియు పోతన భాగవతమున విపులముగ వర్ణింపబడినది. నాగులు గాంధారయందు క్రమముగ బలవంతులైరనియు, భారతయుద్ధమున బలహీనత నొందిన పౌరవులను నాగులకు రాజైన తక్షకుడు ఎదిరించి హస్తినాపురముపై దండెత్తి ఓడించి పరీక్షితుని జంపెననియు తోచుచున్నది.

పరీక్షితుని పిదప అతని తనయుడు జనమేజయుడు బాల్యదశయందే సింహాసనమెక్కెను. తన తండ్రిని జంపిన నాగులపై ఇతడు పగబూని తక్షశిలపై దండెత్తి, ఎందరో నాగులను వధించెను. ఆస్తికుడు ఈ సందర్భమున ఇతనిని నివారింపనియెడల నాగులను నిర్మూలము జేసియేయుండును. తక్షకుడు మాత్రము ఎట్లో తప్పించుకొనెను. దీనినే సర్పసత్రమని పురాణాదులందు వర్ణించియున్నారు. జనమేజయుడు బలవంతుడనియు, కురురాజ్యమును మరల వృద్ధినొందించెననియు, తక్షశిలాప్రాంతమును దానికిని తన రాజ్యమునకును మధ్యనున్న మద్రదేశమును (పంజాబుమధ్య) జయించెననియు దీనినిబట్టి తెలియుచున్నది. తక్షశిలను జయించిన పిదప ఇతడు కొంతకాలము తక్షశిలనే రాజధానిగా చేసికొనియుండెననియు కూడ తోచుచున్నది. కావుననే జనమేజయునకు వైశంపాయనుడు మహాభారత కథను ఈ తక్షశిలయందే వినిపించెను. కేకయరాజగు అశ్వపతి పరీక్షిత్తు, జనమేజయులకు సమకాలీనుడు. జనమేజయుడు గాంధారదేశమును జయించినపుడు గాంధారకు తూర్పుననున్న ప్రాంతము నేలుచుండిన అశ్వపతి

జనమేజయుని తన సార్వభౌమునిగా అంగీకరించెను. ఇతడు తత్త్వ విశారదుడనియు, ప్రజాపాలనమున సాటిలేనివాడనియు ప్రతీతి. అశ్వపతి కేకయ రాజులందరికినిగల వంశనామమైనందున జనమేజయుని కాలము నాటి రాజే వీరందరిలో మిన్నయని ఊహింపవచ్చును.

జనమేజయుని తమ్ముడు కక్షసేనుడనువాడు స్వతంత్ర రాజ్యము స్థాపించి ఇంద్రప్రస్థము రాజధానిగా పరిపాలించెనని తోచుచున్నది. ఇతని తనయుడు అభిప్రతారిణుడు ఖాండవమున దృతిఅధ్వర్యమున యజ్ఞమొన రించెనని పంచవింశబ్రాహ్మణమునుండి తెలియుచున్నది. బంధుకోటిలో అభిప్రతారిణులే సర్వోత్తములట. హస్తినాపుర వంశము క్షీణించి, జనమే జయ సంతతివారు హస్తినాపురమును వదలి, కౌశాంబికి వలసపోయిన పిదప కూడ ఇంద్రప్రస్థమున ఈ అభిప్రతారిణ వంశము రాజ్యమేలు చుండెననుట స్పష్టము.

జనమేజయునికి పిదప అతని తనయుడు శతానీకుడును, ఇతని పిదప అతనికిని విదేహా రాజపుత్రియందు జనించిన అశ్వమేధదత్తుడును, అటు పిమ్మట పౌత్రుడు అధిసీమకృష్ణుడును రాజ్యముచేసిరి. శతానీకుడు విదేహా రాజగు ఉగ్రసేన జనకునికిని అశ్వమేధదత్తుడు పంచాల రాజగు ప్రవాహణ జైవాలికిని సమకాలికులని తెలియుచున్నది. అధిసీమ కృష్ణుని కాలమున మగధయందు సేనాజిత్తుడును, అయోధ్యయందు దివాకరుడును పాలించు చుండగా గోమతి నదియొడ్డున నైమిశారణ్యమున ద్వాదశ వర్షములొక మహాయాగము జరిగెను. పురాణము లన్నియు ప్రప్రథమమున పారాయ ణము చేయుట ఈ యాగమునందే. ఈయాగమున ఆధ్వర్యవము వహించిన వారిలో శౌనకుడు ప్రథముడు కాబట్టి మహాభారతమును, పురాణములును ఇతనిని సంబోధించి చెప్పిరట. పురాణముల నన్నిటిని సేకరించి పరిష్కరించు టకు ఇదియే ప్రథమ ప్రయత్నము గాబోలు. పురాణములలోని రాజవంశా వళిలో అధిసీమ కృష్ణుని యనంతరము పాలించిన రాజుల పేర్లును, రాజవంశ

ముల పేర్లును భవిష్యత్కాలమునందు చెప్పబడుటకు కారణము బహుశః అప్పటి కవి లేకపోయి తరువాత కాలమున చేర్చబడియుండుటయే అని తోచును.

అధిసీమ కృష్ణుని తనయుడు నిచకుడు పరిపాలించుచుండగా ఈ కురు రాజ్యమునకు దారుణవిపత్తు సంభవించెను. గంగ ఉప్పొంగి పట్టణమును నాశనము చేసెను. మిడుతలదండు (వడగండ్ల వర్షమని మరియొక వృత్తాంతము) రాజ్యమునందలి పైరుపంటలను సంపూర్ణముగ నాశనము చేసెనని ఛాందోగ్యోపనిషద్ నుండి తెలియుచున్నది. ఇట్టి ఈతి బాధలకు తాళజాలక కురు ప్రజలు దేశమును వదలి, బయలుదేరి సుమారు 300 మైళ్ళు ప్రయాణము చేసి, అలహాబాదు సమీపమున యమున ఒడ్డున ఉన్న వత్సభూమిలోని కౌశాంబికి వలసపోయిరి. పంజాబు ప్రాంతమునుండి ఒత్తిడి చేయుచుండిన శత్రువులు కూడ కొంత వరకు ఈవలస పోవుటకు కారణమైయుండవచ్చును.

కౌశాంబి చేరిన పిదప వీరిచరిత్ర స్పష్టముగ తెలియుటలేదు. నిచకుని పిదప 23 మంది రాజులు క్షేమకుడనువాని వరకు పరిపాలించిరని పురాణములు చెప్పుచున్నవి. వీరిలో శతనాక అపరనామముగల పరంతపుడును, ఉదయనుడును ముఖ్యులు. పరంతపుడు అంగ రాజధానియగు చంపపై దాడిచేసెనట, ఉదయనుడు అవంతి రాజగు ప్రఖ్యాత మహాసేనునికిని, మగధ రాజగు అజాతశత్రువునకును సమకాలికుడు.

## 2. కోసల :

భరత యుద్ధమునందు మరణించిన బృహద్బలుని పిదప (3) ఇక్ష్వాకు వంశరాజులు పరిపాలన చేసిరి. వీరిలో ఆరవవాడగు దివాకరుడు అధిసీమ కృష్ణుని సమకాలికుడని పైన చూచితిమి. కాని పురాణములందున్న వృత్తాంతమును జైన గ్రంథములందలి వృత్తాంతముతో పోల్చి చూచినచో ఈనాటి చరిత్రయందు చాలా తారుమారు జరిగినదనియు సత్యచరిత్రమనియు, దుష్కరమనియు తోచుచున్నది.

అయోధ్యగాక సాకేతయు, శ్రావస్తియు కూడ రాజధానీ నగరములుగనుండెనని తోచుచున్నది. సాకేత అయోధ్యలను ఒక్కొక్కపరి పర్యాయ పదములుగ వాడినందున బహుశః ఇవి నేటి సికిందరాబాదు, హైదరాబాదువలె సమీపమున నున్న పట్టణములనితోచుచున్నది. అయోధ్య సరయూనది సమీపమున నున్నదని అందరెరింగిన అంశమే. ఇదినేటి సాహెట్ మాహెట్ అను గ్రామము. ఇది గోండా, బహ్రైచ్ పొలిమేరలలో రాప్తి నది దక్షిణపు ఒడ్డున ఉత్తరప్రదేశ్‌లోనున్నది.

కోసల కాశీరాజ్యములకు తరచు యుద్ధము సంభవించుచుండెననియు, చివరకు కాశీ కోసల రాజ్యమునందు కలిసిపోయెననియు బౌద్ధ వృత్తాంతములనుండి తెలియుచున్నది.

### 3. మగధ :

భారతయుద్ధమున బార్హద్రథ వంశజుడైన సహదేవుడు (జరాసంధుని తనయుడు) పాండవులపక్షమున నుండెనని పైనజూచితిమి. ఇతని తనయుడు సోమాధి అధిసీమకృష్ణ, దివాకరుల సమకాలీనుడు. ఈ వంశమునందు చివరివాడు 23వ తరమునకు జెందిన రిపుంజయుడు. ఇతనిని చంపి ఈతని మంత్రి పుణిక (సుణిక, మునిక, పునిక, పులక అని కూడ ఇతని పేరు కాన్పించుచున్నది.) అనువాడు ఇతని కుమారుని సింహాసన మెక్కించెననియు, ఈ ప్రద్యోతుడు ప్రద్యోతవంశమును స్థాపించెననియు కలదు. ప్రద్యోతవంశమునందు 5 తరముల రాజులు 138 సంవత్సరములు పాలించిరనియు, పిదప శిశునాగుడు తన తనయుని కాశీరాజుగాచేసి తాను గిరివ్రజమును (ఇదియే రాజగృహ. నేటి రాజగిర్) రాజధానిగ చేసికొని పాలించెననియు, ఈ వంశమువారే బింబిసార, అజాతశత్రులనియు పురాణములు తెల్పుచున్నవి.

కాని పురాణముల వృత్తాంతమునకును, బౌద్ధ జైన గ్రంథములందలి వృత్తాంతములకును చాల వ్యత్యాసము కాన్పించుచున్నది. ప్రద్యోత

వంశము అవంతి రాజ్యమును పాలించెనని మత్స్యపురాణముకూడ ఒప్పుకొను చున్నది. శిశునాగుడు బింబిసారునికి పూర్వపువాడా? లేక తరువాతివాడా? అనుటయు కూడ చర్చనీయాంశమే. భావిపరిశోధనవలన గాని సత్యచరిత్ర నిర్ధారణ కాజాలదు.

---

## 4. ఇతర రాజ్యములు :

భారత యుద్ధానంతరము పై మూడు రాజ్యములుగాక ఇతర రాజ్యములేవియు ప్రాముఖ్యత కాంచలేదు. కాబట్టి వీరినిగూర్చి ఎక్కువ చారిత్రకాంశములు కానరావు.

పంచాలరాజ్యమున భారతయుద్ధమునకు పిదప మహాపద్మనందుని రాజ్యకాలమువరకును 27మంది రాజ్యముచేసిరనియు, ఈ రాజ్యమున పరిచక్రా, కాంపిల్య (లేక కాంపీల), అహిచ్ఛత్ర అను మూడు పట్టణములుండె ననియు, ద్రుపద మహారాజుకాలమున ఈ రాజ్యము రెండు భాగములాయెననియు, చేదిరాజకన్య ఉత్తర పంచాల రాణియగుటచేత చాలమంది చేదినుండి అచ్చటికి వలసపోయిరనియు, దుర్ముఖ (ద్విముఖ) అను రాజు బౌద్ధమునందు కొంత ప్రాముఖ్యము వహించెననియు తెలియుచున్నది.

శూరసేనరాజ్యమునకు యమునానది ఒడ్డున ఉన్న మథురానగరము రాజధాని. భారతయుద్ధమునకు పూర్వము ఈ రాజ్యము యాదవ వంశీయుల పాలనలోనుండెనని పైనజూచితిమి. యుద్ధానంతరము నందయుగము వరకును 23 మంది రాజులు పాలించిరట.

శూరసేన రాజ్యమునకు దక్షిణమున అవంతి రాజ్యముండెను. అవంతి యనగా మాల్వ మధ్యభాగమును, నిమాల్ ప్రాంతమును. దీని రాజధాని పేరు అవన్తి లేక ఉజ్జయనీ. ఇది నేడు చంబల్ నదికి ఉపనదియగు సిప్రానది యొడ్డున గాన్పించు నేటి ఉజ్జయినీనగరమే. భారత యుద్ధమునకు పిదప ప్రద్యోతవంశము వరకును ఉజ్జయినీ చరిత్ర స్పష్టముగ తెలియరాదు. సుమారు 28 మంది రాజులు పాలించిరని కొన్ని పురాణములందును,

24 మందియని మరికొన్ని పురాణములందును, వీరు హైహాయవంశీయు లని కొందరును, వీతిహోత్రులని మరికొందరును వాదించుచున్నారు.

విదేహారాజ్యము విజ్ఞానమునకును, సంస్కృతికిని ఒక ముఖ్యకేంద్ర మని కొందరు తలంచుచున్నారు. జనకరాజులవంశము కృతి అను వానితో అంతమొందెను. ఇతనికి కృతక్షణుడని మరియొక నామము. ఇతడే భారత యుద్ధమునాటివాడు. ఇతని తండ్రిపేరు బహుళాశ్వుడు. కృతి అనువాడే కరాళుడనియు, ఇతడు బ్రాహ్మణకన్యను చెఱచినందున సకుటుంబముగ నాశనము చెందెననియు అర్థశాస్త్రమునందు కలదు.

తత్త్వవేత్తయై, యాజ్ఞవల్క్యునినుండి బ్రహ్మజ్ఞానమును సంపా దించిన జనకు డెప్పటివాడో తెలియరాదు. జనమేజయుని కాలమున పాలించుచుండిన జనకుని ఆస్థానమునుండి అతని ఆస్థాన విద్వాంసుడైన శ్వేతకేతు (ఉద్దాలకుని తనయుడు) జనమేజయుని యాగమున పాల్గొనె నని తెలియుచున్నది. బుద్ధుని కాలములో లిచ్ఛవీలతోపాటు విదేహ వజ్జి రాజసమూహమున నుండెనని బౌద్ధగ్రంథములనుండి తెలియుచున్నది.

కాశీరాజ్యమును గురించి అచట 23 మంది రాజులు పాలించి రనుటతప్ప మరేమియు తెలియదు.

అంగరాజ్యమును గూర్చియు ఏమంత ఎక్కువగ తెలియరాదు. కళింగ రాజ్యమును 32 మంది రాజులును, అశ్మకరాజ్యమును 25 గురు రాజులును పాలించిరని తెలియుచున్నది. కాని వీరినిగూర్చి ఎట్టి అంశములును తెలియుటలేదు.

## బౌ ద్ధ యు గ ము

(సుమారు క్రీ॥ పూ॥ 600 - క్రీ॥ వె॥ 200 వరకు)

పోతన భాగవతమున ద్వాదశ స్కంధమునందు శుకయోగి పరీక్షిత్తునకు భావికాలగతుల చెప్పుసందర్భమున రాజుల క్రమము నెరింగించియున్నాడు. ఇందు కేవలము రాజుల పేర్లపట్టిక మాత్రమేయున్నది. కాని ఎట్టి ఖిష్కరమ్ము

లును కానరావు. ఈ పేర్లయందును కూడ సంస్కృత భాగవతమునకును పోతన భాగవతమునకును చాలా భేదములు కాన్పించుచున్నవి. ఇక చారిత్రక రీత్యా పరిశీలించిన యెడల భాగవత పురాణమునకును ఇతర పురాణములకును ఉన్న భేదములు మాత్రమేగాక బౌద్ధజైన గ్రంథములందు కాన్పించు వృత్తాంతమునకును, ఇతర చారిత్రికాధారములకును, పురాణ వృత్తాంతమునకును కాన్పించు వ్యత్యాసమంతయు పరిశీలించి దీర్ఘపరిశోధన కావించిన గాని సత్యచరిత్రి గానరాదు. ఐనను రాజుల ప్రకారము పోతన యొసగినట్లుగ ఈ క్రింది పట్టికయందు కాననగును.

*5. శిశునాగులు :*

10 రాజులు మొత్తము 360 సంవత్సరము లేలిరి. 1. శిశునాగుడు 2. కాకవర్ణుడు (3) క్షేమవర్ముడు 4. క్షేత్రిజ్ఞుడు 5. విధిసారుడు 6. అజాతశత్రుపు 7. దర్భకుడు 8. అజయుడు 9. నందివర్ధనుడు 10. మహానంది.

"అంతట మహానందికి శూద్రస్త్రీ గర్భంబున నతి బలశాలియయిన మహాపద్మవతి యను నందనుం డుదయించు: నతనితోఁ క్షత్రియ వంశం బడంగి పోగలదా సమయంబున నరపతులు శూద్రప్రాయులై, ధర్మరహితులై తిరుగుచుండ మహాపద్మునకు సుమాల్యుండాదిగాగల యెనమండ్రు కుమారులుదయించెదరు. వారు నూరు సంవత్సరంబులు క్షోణీతలం బేలెద; రంతట గార్మ్యకుండు మొదలుగా రాజనవకంబు నందాఖ్యులం జనియించు; నానవ నందుల నొక భూసురోత్తముం డున్మూలనము సేయు; నప్పుడు వారు లేమిని మౌర్యులు గొంతకాలం బీజగతీ తలంబు నేలుదు; ర త్తరి నా భూదేవుడు చంద్రగుప్తుండనువానిం దనరాజ్యమందు నభిషిక్తుంగా జేయంగలండు."

"మౌర్యులతో చేరిన యీపదుగురును" 137 సంవత్సరములు రాజ్యమేలిరి. 1. చంద్రగుప్తుడు 2. వారినాథుడు 3. అశోకవర్ధనుడు 4. సుయ

శేస్సు 5. సంయుతుడు 6. శాలిశూకుండు 7. సోమశర్మ 8. శతధన్వుండు 9. బృహద్రథుండు (తొమ్మిది పేర్లుగలవు.)

బృహద్రథుని సేనాపతియగు శుంగుం డతనిని వధించి రాజ్యము గైకొనెను.

*శుంగులు:* 10 మంది రాజులు 112 సంవత్సరములు రాజ్యమేలిరి. 1. శుంగుడు 2. అగ్నిమిత్రుడు 3. సుజ్యేష్ఠుడు 4. వసుమిత్రుడు 5. భద్రకుండు 6. పుళిందుడు 7. ఘోషుడు 8. వజ్రమిత్రుడు 9. భాగవతుడు 10. దేవభూతి.

దేవభూతిని గణ్వామాత్యుండగు వసుదేవుం డనువాడు వధియించి రాజ్యంబేలు.

*కణ్వాలు :* వసుదేవునకు భూమిత్రుండు, వానికి నారాయణుండు కలిగిరి. "కణ్వవంశజులైన వీరలు మున్నూట నలువదేనబ్దంబులు మేదినీతలం బేలుదురు." (345 సంవత్సరములకాలము పాలించిన కణ్వులలో మూడు నాలుగు పేర్లే చెప్పబడినవి.)

పిదప ఆంధ్రుల ప్రస్తావన ఈ క్రింది విధముగ గలదు. "మఱియు కణ్వవంశజుండగు సుశర్ముం డను రాజుదయించిన, వాని హింసించి, తద్భృత్యుం డంధ్రజాతీయుండయిన వృషలుం డధర్మమార్గవర్తియై వసుమతీచక్రం బవక్రిందైయేలు." పిమ్మట 27 గురు ఆంధ్రవంశరాజులపేర్లును పేర్లకు పిదప "ఇట్లు పెక్కండ్రుదయించి నన్నూటయేబదియాఱు హాయనంబులు "ధాత్రిం బాలించెద"రని కలదు. ఆంధ్రవంశరాజులగూర్చి కొంత విపులముగా క్రింద చర్చింపబడియున్నది. కాని ప్రకృతము ఆ తరువాత వంశములనుగూర్చిన ప్రస్తావన తిలకింతము. ఈ వంశముల పేరును, ఒక్కొక్క వంశమునందలి రాజులు పాలించిన మొత్తము సంవత్సరముల సంఖ్యయే ఇవ్వబడినదిగాన ఒక్కొక్క వంశములోని వివిధరాజుల పేర్లుగాని, వారి కాల

పరిమితిగాని ఇవ్వబడలేదు. ఒక్కొక్క రాజవంశమునందలి రాజుల సంఖ్య ఈ క్రింద పట్టికయందు చూడనగును.

(1) ఆభీరులు 7 (2) గర్దభులు 10 (3) గంకవంశజులు 16 (4) యవనులు 8 (5) బర్బరులు 1 (6) గురుండులు 13 (7) మేనులు 11; మొత్తము వీరందరును గలిసి 909 సంవత్సరములు "గర్వాంధులై" యేలిరట. ఈ మొత్తము కూడిక తప్పో అచ్చుతప్పో తెలియరాదు.

మరల కొన్ని వంశములపట్టిక గలదు.

1. మేనవంశజులు (వీరును పై మేనులును ఒక్కరేగారేమో?)
   11 మంది రాజులు 300 సంవత్సరములు రాజ్యమేలిరి.
2. కైలికు లను యవనులు రాజులై పలిరి. పిదప,
3. భూతనందుడు, నవభంగిరుడు, శిశునందుడు, అతని తమ్ముడు యశోనందుడు, ప్రవీరకుడు మొత్తము 106 సంవత్సరము లేలిరి.
4. పై రాజులకు 13గ్గురు కుమారు లుదయించి, అందు 6 మంది బాహ్లీక దేశాధిపతులైరి.
5. కడమ 7 గురు కోసలాధిపతులైరి.
6. వైధూర్యపతులు నిషధాధిపతులైరి.
7. అప్పుడు పురంజయుడు మగధదేశాధిపతియై పుళింద, యదు, మద్రి దేశవాసులగు హీనజాతి జనులు బ్రహ్మజ్ఞానహీనులై, హరిభక్తి విరహితులైయుండ, వారికి ధర్మోపదేశముసేసి, చాల పరాక్రమవంతులైన క్షత్రియవంశంబు లడంచి, పద్మావతీ నగర పరిపాలకుండై ఆ గంగా ప్రయాగ పర్యంతము పరిపాలించెను.
8. శూద్రప్రాయులగు రాజులును, వ్రాత్యులును, బాషండులు నగు విప్రులును గలిగి, సౌరాష్ట్రావంత్యాభీరార్బుద మాళవదేశాధిపతు లయ్యెదరు.

9. సింధు తీరంబుల, జంద్రిభాగా ప్రాంతంబుల గాశ్మీర మండలంబునను మేధాహీనులై మ్లేచ్ఛాకారులగు రాజులు భూభాగం బేలుచు,ధర్మసత్య దయాహీనులై సంగ్రామ రంగంబుల హతులయ్యెదరు.

ఇంతటితో పోతన భాగవతంబున రాజవంశావళి ముగిసెను. సంస్కృత భాగవతమున చెప్పిన వంశముల నెన్నిటినో పోతన వదలివైచెను. మిథిలా పట్టణము నేలిన రాజులు, క్రీ॥ వె॥ మూడవ నాలుగవ శతాబ్దులందు పరిపాలన మొనరించిన రాజవంశములు సంస్కృత భాగవతమునందు వివరింప బడియున్నను పోతన వాని నన్నిటిని సంపూర్ణముగ వదలివైచెను.

## 6. ఆంధ్ర వంశ రాజులు;

ఆంధ్ర వంశ రాజుల పట్టికను, కాలమానమును ఇందు జేర్చుట ఏమంత అప్రస్తుతము కాజాలదు.

ఈ పట్టిక నుండి ఆంధ్ర వంశ రాజుల నామములు పోతన భాగవతమునందును, సంస్కృత భాగవతమునందును, ఇతర పురాణములందును ఏరీతిగనున్నవో కాంచనగును. చారిత్రికులు రూఢముచేసిన రాజుల నామధేయములును, వారి రాజ్యకాలపరిమితియు క్రీస్తుశకమున నిర్ధరించి వారి రాజ్యకాలమునుకూడ క్రిందిపట్టికయందు ఈబడినది.కాన వాటిని గూర్చిన చర్చయంతయు ఇందు విశదీకరింపవలెననిన యడల ఈ వ్యాసమింకను పెరిగిపోవును. అందువలన ఇంతటితో ముగించెదను.

ఆంధ్ర రాజ వంశమునుగూర్చిన విషయములనుగూడ పోతన ఎంత మాత్రమును పరిశీలింపక గ్రంథమును రచించెననుట పై నుండి స్పష్టము. చారిత్రక దృష్టి లేకుండుటయే ఇందునకు కారణము.



# ఆంధ్రవంశపు రాజ

| 4 | 5 | 6 | 7 | 8 | 9 |
|---|---|---|---|---|---|
| వాయ పురాణః | రాజ్యకాల పరిమితి | బ్రహ్మాండ పురాణము | రాజ్య కాల పరిమితి | విష్ణు పురాణము | భాగవతము సంస్కృతం |
| వికు | | | | | |
| ధుక | 23 | చిమ్మక | 23 | శ్రవక | వృషలోబలీ |
| ష్ణ | 18 | కృష్ణ | 18 | కృష్ణ | కృష్ణ |
| శాతకర్ణ | | శ్రీ శాతకర్ణి | 18 | శ్రీశాతకర్ణి | శ్రీశాంతకర్ణ |
| | | పూర్ణోత్సంగ | 18 | పూర్ణోత్సంగ | పౌర్ణమాస |
| తకర్ణి | 56 | శాతకర్ణి | 56 | శాతకర్ణి | |
| | | లంబోదర | 18 | లంబోదర | లంబోదర |
| లవా | 12 | ఆపీలక | 12 | దివీలక | చివిలక |
| | | సౌదాస | 18 | మేఘస్వాతి | మేఘస్వాతి |
| | | ఆవి (?) | 12 | | |
| | | స్కందస్వాతి | 7 | | |
| | | మహేంద్ర శాతకర్ణి | 3 | | |
| | | కుంతల శాతకర్ణి | 8 | | |
| | | స్వాతిషేరణ | 1 | | |
| మాని | 24 | | | పటుమాయి | అటమాన |
| కృష్ణ | 25 | | | అరిష్టకర్మయి | అరిష్టకర్మయి |
| | [5] | | | హాల | హాలెయ |
| లక | 5 | భావక | 5 | పుత్తలక | తలక |
| షే. | 21 | ప్రవిల్లసేన | 12 | ప్రవిల్లసేన | పురిషభీరు |
| పీతిహోర్ణి | 1 | సున్దర శాతకర్ణి | 1 | సుందరశాతకర్ణి | సునందన |
| ర శాకర్ణి | ½సం. | చకోర శాతకర్ణి | ½సం. | చకోర శాతకర్ణి | చకోర |
| వమి | 28 | | | శివస్వాతి | శివస్వాతి |
| మీపుత్ర | 21 | యన్త్రమతి (?) | 34 | గోమతీపుత్ర | గోమతీపుత్ర |
| | | శాతకర్ణి | 29 | పులిమాయి | పురిమాయి |
| | | ఆవి (?) | 4 | శాతకర్ణి శివశ్రీ | మేదశిరస్ |
| | | శివస్కంద శాతకర్ణి | 8 | శివస్కంధ | శివస్కంద |
| శాతకర్ణి | 29 | యజ్ఞశ్రీ శాతకర్ణి | 19 | యజ్ఞశ్రీ | యజ్ఞశ్రీ |
| కుకు | 6 | | | విజయ | విజయ |
| శాతకర్ణి | 3 | దణ్డశ్రీ శాతకర్ణి | 3 | చండశ్రీ | చంద్ర |
| మావి | 7 | పులోమావ్ | 7 | పులోమావి | సులోమాధి |

| పౌరవులు | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ...ర ...లులు | దక్షిణ పాంచాలులు | పౌరవులు | కాశి | కాన్యకుబ్జ | సంఖ్య | షరా |
| 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 |
| | | భరద్వాజ | | | 46 | |
| | | వితథ | | | 47 | |
| | | | | | 48 | |
| | | | | | 50 | |
| | | హస్తి | | | 51 | |
| | | అజామీఢ | | | 52 | |
| | | | | | 53 | |
| | | | | | 54 | |
| | బృహద్వసు | | | | 55 | |
| | | | | | 56 | |
| ...ర్యోశ్వ | | | | | 59 | |
| ...ల | | | | | 60 | |
| | | | | | 61 | |
| | | | | | 62 | |
| ...దాస | | | | | 63 | |
| | | | | | 64 | |
| | | | | | 65 | |
| | | | | | 66 | |
| | | | | | 67 | |
| ...ాస | | | | | 68 | |
| | | సంవరణ | | | 70 | |
| | | కురు | | | 72 | |
| | | పరీక్షిత్ | జహ్ను | సుధన్వన్ | 73 | |
| | | | (మగధ) | వసుచైద్య (చేది) | 78 | |
| | | | బృహద్రథ | ప్రత్యగ్రహ(?) | 79 | |
| | బ్రహ్మదత్త | ప్రతీప | | | 87 | |
| | జనమేజయ | శంతను | | | 90 | |

## ఆంధ్ర

# మహాభాగవతోపన్యాసములు

## ఉపాఖ్యానములు : అంతరార్థములు



మహోపాధ్యాయ సాహిత్యాచార్య సాహిత్య సమ్రాట్, కవీంద్ర
శ్రీ స్వామీ శివశంకర శాస్త్రి – సాహితీ సమితి.

(19)

ప్రతి గ్రంథముకూడ ఆఖ్యానమే. ఎదుటివారిని సంబోధించి చెప్పి నట్లు రచింపకపోయినను, ఆ గ్రంథకర్త అప్రత్యక్షముగా నుండి ఉత్తమాధి కారికి చెప్పుచున్నట్లే భావింపనగును. ఆఖ్యానములో ప్రధాన వృత్తము సామాన్యముగా సుదీర్ఘముగా నుండదు. గ్రంథ బాహుళ్యమే యభిలషిత మగుచో ఉపాఖ్యానములను సంతరింపక తప్పదు. ఆఖ్యానము నడచు చుండగా సందర్భోచితముగా ఉపాఖ్యానము సముద్భూత మగును. పురా ణము లన్నిట నున్న విధముగనే భాగవతమునగూడ ఉపాఖ్యానములు కలవు. ఉపాఖ్యాన శబ్ద వాచ్యము లయిన కథలు భాగవతములో కొన్ని కానవచ్చుచున్నవి. ఉపాఖ్యాన ప్రాయము లయిన కథ లెన్నో యున్నను వానిని పరామర్శించుట కవకాశము లేదు.

భాగవతమును శుకుడు పరీక్షిత్తునకు ఏడు రోజులలో చెప్పినట్లు కానబడుచున్నది. బ్రాహ్మణ శాప తప్తుడై పరీక్షిత్తు సప్తమ దివసమున మరణము తప్పదని యెరింగినవా డగుటచే భూలోక స్వర్గలోకసౌఖ్యములు హేయము లని తలచి, రాజ్యము విసర్జించి, నిరశనత్వ దీక్షాచరణము సంక ల్పించుకొని—

కలిదోషావలి నెల్ల బాపెడి వియద్గంగా ప్రవాహంబు లో
పలికిం బోయి మరిష్యమాణు డనుచుం బ్రాయోపవేశంబునన్—

చిత్తము గోవింద పదా
యత్తము గావించి మౌని యై తనలో నే
తత్తఱము లేక భూవర
సత్తముడు వసించె ముక్తసంగత్వమునన్.

విష్ణుపదీ తీరమున ప్రాయోపవేశమున రా జుండుట యాకర్ణించి మహర్షు లెందరో యచటికి జేరిరి. రాజు వారలను పూజించి తుదకు—

ఏడు దినంబుల ముక్తిం
గూడఁగ నేరీతి వచ్చు గురు సంసార

క్రీడన మేక్రియ నెడతెగు
చూడుడు మా తంఁడ్రులార, శ్రుతి వచనములన్.

సప్తాహంబుల ముక్తి కేగెడు గతిం జర్చించి భాషింపరే ! అని ప్రార్థించినాడు.

దైవయోగమున ఆ సమయమునకు శుకయోగి యరుదెంచెను. పరీక్షిత్తు ప్రణిపాతము చేసి, "చెప్పవే తండ్రి, ముక్తికి జేరు తెరువు" అని వేడినాడు. కావున పరీక్షిత్తు కోరినది ముక్తియే కాని అన్యము కా దనుట స్పష్టము.

(భాగవతము ముక్తిబోధక గ్రంథము "జ్ఞానా దేవ హి మోక్షః" అనునట్లు, హరిభక్తివలన జ్ఞానము కలిగి మోక్షము లభించు నని నిరూపించు చున్నది. ఇందు నవవిధ భక్తిమార్గములు వర్ణితములు. ఈ భక్తి జ్ఞానపరమే.

ప్రహ్లాదుడు తండ్రితో సంభాషించుపట్టున నొకచో—
తను హృ ద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెరుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుడై యుండుట భద్ర మంచు దలతున్—

అని అధికారి తారతమ్యమునుబట్టి అన్నాడు. ఇదియే భాగవత హృదయ మని చెప్పవచ్చును.)

ఈ తాత్పర్యమును బోధించుటకై భాగవతములో కొన్ని యుపాఖ్యానములు నిబద్ధము లయినవి. పురాణములు తాత్పర్యార్థ ప్రతిపాదకము లగుటచే కథలు, ఘటనలు యథాతథము లని భావించినను భావింప కున్నను క్షతి లేదు.

స్పష్టముగా విషయ నిరూపణము చేయుట యటుండగా, విషయ నిగరణము చేయు విధానము గోచరించుచుండును. ఒకయెడ నేదో, నీతి కాని, ధర్మముకాని, తత్త్వముకాని స్ఫురించును. కొన్నియెడల బహువ్రీహి సమాసమువలె అన్యపదార్థము ప్రధానముగా ద్యోతిత మగును.

కథలలోని ప్రత్యంగమునకు అంతరార్థ ముండ నక్కరలేదు. బాహ్యార్థ చర్వణానంతరము అంతరార్థ మనుమీయమాన మగును.

౨

## ధ్రువోపాఖ్యానము :

ఉత్తానపాదు డను మహారాజునకు సునీతి, సురుచి యను భార్యలు కలరు. సునీతివలన ధ్రువు డను పుత్రుడు పుట్టెను. రాజునకు సురుచియెడ ప్రీతియు, సునీతియెడ నప్రీతియు నేర్పడెను. ఉత్తానపాదు డొకనాడు సురుచి బిడ్డ డగు ఉత్తముని తన తొడపై గూరుచుండబెట్టుకొని యుప లాలనము చేయుచుండగా ధ్రువుడు దగ్గరకు బోయెను. తండ్రి వాని నాదరింపలేదు. సురుచి సవతి కుమారునితో నిట్లనెను; "నీకు తండ్రి తొడపై గూరుచుండు యోగ మున్నచో నా కడుపున బుట్టియుందువు. శ్రీహరి పదపద్మము లాశ్రయించినచో నీవు నా గర్భమున జన్మింపగలవు" ఈపలుకులకు తండ్రి మిన్నకుండెను. ధ్రువుడు బాధపడి, తల్లికడకుబోయి వృత్తాంతము నివేదించెను. ఆమె వగచి బాలు నోదార్చి, "సురుచి పలికినట్లు హరి పదపద్మములు సేవింపుము. నారాయణు నాశ్రయించి నీ తాత యగు మనువు భౌమ దివ్య మోక్ష సుఖముల నొందెను" అని బోధించెను. ధ్రువుడు పురము వెడలి కొంతదూరము పోవునప్పటికి నారద మహర్షి యెదురుపడి, ప్రశ్నించి యున్నతెర గెరిగి నారాయణు నారాధించు విధానము బోధించి వాసుదేవ మంత్ర ముపదేశించెను. ధ్రువుడు మహర్షికి ప్రదక్షిణ నమస్కారములు చేసి మధువనమునకు జనెను.

అంతట నారదుడు ఉత్తానపాదునికడకు బోయెను. రాజు మహర్షిని పూజించి "నా కుమారుడు ధ్రువుడు, నతని తల్లియు నరణ్యమునకు బోయినారు. ఏ మయిరో తెలియదు. నా పొరపాటువలన కుమారునకు కష్టము కలిగినది" అని విచారముతో బలికెను. అందులకు నారదుడు "నీ కుమారుని హరి రక్షించును. ఎవ్వరును పొందని యున్నతపదమును ధ్రువుడు పొందగలడు. అతడు నిన్ను జూడవచ్చు" నని యోదార్చి చనెను.

ధ్రువుడు ఘోరతపస్సు చేసెను. దానివలన సమస్త లోకములు కంపించెను. లోక పాలకులు హరిసన్నిధి కరిగి విన్నపము చేసిరి. ధ్రువుడు ఘోరతపస్సు చేయుచున్నా డనియు, వానిని వారింతు ననియు హరి వారల ననునయించి, గరుడవాహనారూఢుడై ధ్రువుని యెదుట సాక్షాత్కరించెను. అతడు స్తుతి క్రియాకరణ సమర్థుడు కాలేదు. హరి వాని కపోలతలమును తన శంఖముతో స్పృశింపగా నతడు ముక్త కంఠముతో భగవంతుని స్తుతించెను,

హరి సంతుష్టాంతరంగుడై "బాలకా, గ్రహ నక్షత్ర తారాగణ జ్యోతిశ్చక్రము, నక్షత్ర రూపములైన ధర్మాగ్ని కశ్యప శుక్రులును, సప్తర్షులును తారకా సమేతులై దేనిచుట్టు ప్రదక్షిణము తిరుగుచుందురో, దురాపము, అనన్యాధిష్ఠికము, లోకత్రియ ప్రళయకాలమున నశింపక వెలుగుచుండు ధ్రువక్షితి యను ఆ పదవిని ఇరువదియారువేల సంవత్సరముల తరువాత ప్రాప్తింతువు. అంతవరకును రాజ్యము చేయుదువు" అని యనుగ్రహించెను.

అనంతరము ధ్రువుడు నిజపురమునకు మరలి వచ్చుచుండగా చారుల వలన తండ్రి వృత్తాంతము విని, యెదురు పోయి, కొనివచ్చి వానిని రాజ్యాభిషిక్తుని జేసెను.

అతని సహోదరుడు వేటకై వనమున కేగి, యక్షునిచే నిహతుడయ్యెను. అతని తల్లి సురుచి దుఃఖముతో నరణ్యమున కేగి దవానలములో దగ్ధ యయ్యెను.

హరిసేవానిరతుడై ధ్రువుడు తుదకు ధ్రువక్షితిని బ్రాపించెను.

ఉపమాతృ స్పర్ధ్యావాగ్వ్యసన కర్షితుడై ధ్రువుడు క్రమముగా ఉత్తమ పదవి నొందెను. అభిమానవంతులకు అన్యుల హేళన ఉద్దీపకమై ఉత్తమ ప్రయత్నమునకు పరోక్షముగా నుపకరించును. ఉత్తానపాదుడు ఉత్తముడే. కాని ప్రథమ భార్యకన్న ద్వితీయభార్య ప్రియతర యయ్యెను.

లోకవృత్త మింతే. అందుచే ముద్దుల పెండ్లము పెద్ద భార్య కొడుకును అవహేళన చేయుచున్నను అతడు మిన్నకుండెను. తన యుత్సంగమునకు ధ్రువుని దీసికొన్నచో నామెకు కష్టముగా నుండు నని యూహించి యూరకున్నాడు. ఆమె వాక్కులు ధ్రువుని చెవులలో బాణములవలె నాటుకొన్నవి. అందు బాధ యున్నను బోధకూడ కలదు. కావుననే యత డిలు వెడలినాడు.

నారద దర్శనములో నానార్థము లున్నవి. త్రిలోక సంచారి యగు నతడు ఈ విషయము నిట్టె గ్రహించి అనుగ్రహ బుద్ధితో నవతరించినాడు. తపో నివారణము నిజముగా నవరోధకల్పనకు గాదు; పూనికను దృఢతరము చేయుటకే. విఘ్నాయాస సంత్రస్తు లయినవారు అల్పులు. "ధీరుల్ విఘ్న నిహన్యమాను లగుచుఙ ధృత్యున్నతోత్సాహులై ప్రారబ్ధార్థము లుజ్జగింపరు".

"విష్ణుపదము అత్యున్నతము. తీవ్రయోగ సమాధి నిష్ఠు లయిన తపస్వులకుగూడ సులభ ప్రాప్యము కాదు. నీ వీ పూనిక విడుచుట మేలు. చిన్నవాడవు" అని నారదుడు కొంత యధైర్య పరచెను. కాని ధ్రువుడు తీవ్రాభినివేశముతో పట్టు పట్టెను. గ్రహింపకున్నను ఉత్తానపాదుడు తనయునకు భావి సూచకముగా ధ్రువ నామ ముంచినాడు. అప్పుడు నారదుడు.—

"ధర్మార్థ కామ మోక్షాఖ్యం య ఇచ్ఛే చ్ఛ్రేయ ఆత్మనః
ఏకం హ్యేవ హరే స్తత్ర కారణం పాద సేవనమ్"

అని చెప్పినాడు. ఇది ఉపదేశము. దీని ననుసరించి బాలుడు బహువిధముల ఘోరతపస్సు చేసినాడు; అనన్యమైన నిరూఢ భక్తియుక్తు డగుటచే భగవంతుడు సాక్షాత్కరించినాడు. వయో లింగ వర్ణ భేదములతో పని లేనిది భగవానుని యనుగ్రహము. ప్రత్యక్షమైన భగవానుని ధ్రువు డిట్లు స్తుతించినాడు :

"యోఽన్తః ప్రవిశ్య మమ వాచ మిమాం ప్రసుప్తాం
సంజీవయ త్యఖిల శక్తిధర స్స్వధామ్నా
అన్యాం శ్చ హస్త చరణ శ్రవణ త్వ గాదీ౯
ప్రాణా న్నమో భగవతే పురుషాయ తుభ్యమ్ !"

ఈ ప్రార్థనలో నారదోపదిష్ట మగు మంత్రలింగ మున్నది.

క్రమశః ధ్రువక్షితి లభ్య మగునని నారాయణు డనుగ్రహించినాడు. ఈ ధ్రువక్షితి సమస్త జ్యోతిర్మండలములకును మీద నుండునది. కల్పాంత మున జ్యోతిర్మండలములు లయించినను ఈ ధ్రువక్షితి లయింపదు. దీనికే విష్ణుపద మని ప్రసిద్ధి కలదు. విష్ణు పాదోద్భవ యైనగంగ ధ్రువ మండలము నుండి జాలువారి, చంద్రాది మండల క్రమమున క్రింది లోకములకు రసా తలమువరకును ప్రవహించును.

ఇంటికి మరలునపుడు ధ్రువుడు అతృప్తుడై తన్ను అసిద్ధార్థునిగా భావించుకొన్నాడు. "పరమేశ్వర సాక్షాత్కార మైనప్పుడు మోక్షమును వేడక రజోదృష్టితో బాల్య చాపల్యమున నిట్టి పదవి కోరితినే" యని విచార పడినాడు.

ధ్రువుడు భగవన్నుతి చేయునపుడు మాత్రము అంతరాత్మయై వాగాదులను, ఇంద్రియములను ప్రేరేపించుచుండు సర్వవ్యాపి పరబ్రహ్మ, చైతన్యమునే పరిపూర్ణ భావమున భావించినాడు.

ముముక్షు వగుటకు గాని, జీవన్ముక్తు డగుటకు గాని పురుషుడు వయోవృద్ధుడు కా నక్కర లేదనియు, ధ్రువ, ప్రహ్లాద, శుకులవంటి మహా నీయులు బాలురే యనియు, బాల్యముననే బ్రహ్మనిష్ఠు డగుట యుత్తమ మనియు ఈ యుపాఖ్యానము సూచించును.

3

## పురంజనోపాఖ్యానము :

పూర్వము పురంజను డను రాజు కలడు. అతనికి విజ్ఞాతు డను సఖుడు కలడు. రాజు పురాన్వేషి యై తన కనురూపమైన పురమును గానక

ధరాచక్రి మంతటను సంచరించి, తుదకు హిమవత్పర్వత దక్షిణ సానువు లందు పురము నొకదానిని గనుగొని, పుర బాహ్యోద్యానము లోనికి బోయెను. అచ్చట యువతీజన సమేతయై......అయిదు తలలు కల సర్ప ప్రతిహారుని వెంట వచ్చుచున్న యువతీరత్నమును గాంచి పురంజనుడు "సుందరీ! ఎవరు నీవు? తలి దండ్రు లెవరు? ఈ యువతు లెవరు? ఈ సర్ప మెవ్వడు? తెలుపు" మని యడిగెను. ఆమె యతనినిజూచి వీరమోహితయై చిరునవ్వుతో ని ట్లనెను : "పురుషర్షభ, కుల గోత్ర నామాదికములు నాకు దెలియవు. ఈ పురమున నివసించుచున్నాను, కాని దీనిని నిర్మించినవారి నెరుగను. ఈ లలనా రత్నములు నా సఖులు. మేము నిద్రించునప్పు డీ వృద్ధ సర్పము పురమును పాలించుచుండును.

మనుజనాయక, నీవు మద్భాగ్యవశమున
నిటకు నేతెంచితి, వివుడ నీకు
మంగళం బగు! నీవు మహితేంద్రియ గ్రామ
భోగ్యంబు లగు కామపుంజములను
నర్థి సంపాదింతు వనఘాత్మ, ఈ నవ
ద్వార ప్రియుక్తమై తనరు పురము
నీవు కైకొని యేలు నీ కంటె దీనికి
నధిపు డన్యుండు లే డనఘ, యిందు
మదుపనీతము లైన కామముల ననుభ
వింపగా సమాశత మధివ్ఠింపు మెలమి
కోరి నీకంటె ప్రియులు నెవ్వారు నాకు?

రతిజ్ఞాన విహీనుడు, నయకోవిదుడు, ఇహపరచింతాశూన్యుడు, పశు ప్రాయుడు, త్వదన్యుడు నైనవానిని ఎవ్వని వరింతును? గృహస్థాశ్రమము సర్వక్షేమార్థ మైన యాశ్రియము.

కరుణారస పరిపూర్ణ
స్ఫురితస్మితరుచి విలోకపుంజముచేతం

గర మర్థి దీనజన భయ
హారణుడవై సంచరింపు మఖిల జగములఙ."

ఇట్లు పలుకగా పురంజను డామెను స్వీకరించెను. అంతట వారు పురములో ప్రవేశించిరి. నూరు సంవత్సరములు వారు సమస్త సుఖము లనుభవించిరి.

లోకభయంకర మైన గ్రీష్మకాలము వచ్చెను. తరళలహరీ మనోహర మైన హ్రదినిలో నతడు నివాసము చేసెను. ఆ పట్టనమునకు తూర్పు దిక్కున అయిదు, దక్షిణమున నొకటి, ఉత్తరమున నొకటి, పశ్చిమమున రెండు మొత్తముఖ తొమ్మిది వాకిళులు కలవు. పై దిక్కున పదు, క్రింది దిక్కున రెండు ప్రకార మా ద్వారము లమరియుండెను. పృథగ్విషయ గత్యర్థమై ఈశ్వరు డొకడు కలడు. ఆపురమున నిర్వాగ్వ్యాశస్కు రను నిద్దరు అంధులు కలరు. పురంజనుడు వారలచే గమన కరణము లను క్రియల నొందుచు, అంతఃపురగతు డగునప్పుడు విషూచీ సమన్వితుడై, జాయాత్మ జోద్భవము లైన మోహాపప్రసాద హర్షముల నొందుచుండును. అట్లు కర్మా సక్తుడు, కామాత్మకుడునై బుద్ధియను మహిషిచే నతడు వంచితుడయ్యెను. ఆకామిని యేమి చేసిన తాను నదే చేయుచుండును. ఆమె మోదింపగా తానును మోదించును. ఈ విధమున నతడు అజ్ఞుడు, ఇతరేచ్ఛా విరహితు డునై యుండి యొకనాడు ధనుర్ధరుడై—

పంచాశ్వయుక్తంబు పంచబంధనము
చక్రి ద్వితీయమును యుగద్వయంబు
ఆశువేగంబు నేకాతుంబు కూబర
ద్వయము పతాకా త్రితయ యుతంబు
ఏకప్రగ్రహమును నేక సారకంబు
సప్త వరూథంబు స్వర్ణభూష
మును పంచ విక్రమమును నేక నీడంబు
ప్రకట పంచ ప్రహరణము నైన

రథము కాంచన రచిత వర్మము ధరించి
విలసదక్షయతూణీర కలితు డగుచు
కడక దీపింప నెక్కి యేకాదశ ప్రి
సంఖ్య సేనాసమేతుడై సరభసముగ—

పురము వెడలి పంచప్రస్థ మను వనమున కరిగి, విడుపరాని మహిషిని విడిచి పెట్టి, మృగయాసక్తుడై ఘోరముగ ననేక మృగములను వధించి, వేట చాలించి, మందిరమునకు మరలి వచ్చి, రాత్రివేళ స్వకీయ ప్రాణవల్లభ యగు మహిషిపైకి మనసు మరలగా గృహిణి కానబడలేదు. అంత నతడు నిజాంతః పురములోని కాంతల నడుగగా వారు చీరె చెరగు పరచుకొని నేలపై బండుకొని విచారముతో నున్న గృహిణిని జూపిరి. పురంజనుడు తన యుత్సంగమున నామెను గూరుచుండబెట్టుకొని, పాదము లుముట్టి మధుర వాక్కులతో నామెను లాలించెను. ఆమె లేచి మంగళస్నానము చేసి, మోహనాకారముతో వచ్చి నిలిచెను. అంతట వారు బహుకాలము భోగ ములలో దేలియాడిరి. క్రమముగా ఏకాదశ శత పుత్రులును, దశోత్తర శత పుత్రికలును సముద్భవించిరి. వారలకు యుక్తవయస్సులు రాగా నెల్ల రకును రాజు వివాహములు చేసెను. అనేక యజ్ఞములు చేసెను. క్రమ ముగా నతని వయసు మరలిపోయెను.

అప్పుడు చండవేగ విఖ్యాతు డను గంధర్వాధీశుడు 360 మంది గంధర్వులు, గంధర్వీ జనము మిధునములుగా వెంట జనుదేర పురంజన పురము నాక్రమింప నుండెను. పురాధ్యక్షుడైన ప్రజాగరుడు వారితో సంవత్సరకాలము యుద్ధము చేసి, క్షీణించెను. ఈ కాలమున పురంజనుడు పాంచాలదేశమునుండి నిజపార్షదులు కొనివచ్చు పదార్థముల ననుభవించుచు బాంధవ సమేతుడై చింతాక్రాంతుడై యుండెను.

కాలపుత్రిక యను కామిని వరాన్వేషణ చేయుచు సమస్త లోక మున కలయ దిరుగుచు యయాతి కుమారు డగుపూరుని జూడ, నాత

డామెను వరించెను. ఆమె యతనికి వర మిచ్చి, దౌర్భాగ్యవశమున దుర్భగ యని ప్రతీతి గాంచుటచే నామెను మరియొక పురుషు డెవ్వడును వరింప లేదు. ఒకనాడు బ్రహ్మలోకమునుండి యవతరించుచున్న నారద మహర్షిని ఆమె వరింపగా నతడు నిరాకరించెను. ఆమె కోపించి ఏకత్రావస్థానము లేకుండునట్లు నారదుని శపించెను. మహర్షి యామె కుపాయము చెప్పగా నామె భయనామకు డను యవనేశ్వరుని దరిసి, పతివి క మ్మని ప్రార్థించెను. దేవగుహ్యాచికీర్షు వగుదానిని జూచి యతడు చిరునగవుతో, "ని న్నెవ్వరు నభినందింపరు. కాని నేను జ్ఞానదృష్టితో నీకు పతి నిరూపణము చేయు దును. నా సేనా సాహాయ్యము పొంది, ప్రజానాశ మొనరించు నీవు అవ్యక్తగతివై కర్మ నిర్మిత మైన లోకము ననుభవింపుము. ఈ ప్రజ్వారుడు నాకు సహోదరుడు, నీవు నా భగినివి. మీ యుభయులతో గూడి అవ్యక్తుడను, భీమసైనికుడను అయిన నేను వర్తింతును" అని చెప్పెను. తోడనే యతని సైనికులు ప్రజ్వార కాలకన్యాయుక్తులై భూమండలమున దిరుగుచు, భౌమభోగాఢ్యమును, జరత్పన్నగ పాలితము నైన పురంజను పురము నొక నా డాక్రమించిరి. కాలకన్యక బలాత్కారముగా నాపురము ననుభవించెను. యవనులు పురద్వారముల వెంట లోనికి బ్రవేశించి సమస్త మును పీడించుచుండిరి. పురంజనుడు కాలకన్యోపగూఢుడై, నష్ట సంపదుడు, వినష్టమతి, విషయాత్మకుడు, వినిహతైశ్వర్యుడు, ప్రతికూలబంధు బాంధవుడు నయ్యు గంధర్వ యవనాక్రాంత పురమును విడువలేక విడువలేక విడువ నుప క్రమించెను. ప్రజ్వారుడు పురమును దహించెను. పురంజనుడు చాల పరి తాపము చెందుచు దగ్గరవారి గతి యే మగునో యని వగచుచుండ భయ నాముడు వచ్చి, పశువును గొనిపోవునట్లు అతనిని తోడుకొనిపోవుచుండగా ననుచరవర్గము దుఃఖముతో వెంట జనుచుండెను. జరత్పన్నగము వెడలి నంతనే పురము జర్జరితమై పోయెను.

తమః విహితు డైన పురంజనుడు పూర్వ సుహృ త్తగు ఈశ్వరు నెరుంగక పరలోకగతు డయ్యెను. అచ్చట యవను డతనిని బాధించు

చుండెను. ఆర్తి యనుభవించుచు నిజ భార్యయైన ప్రమదోత్తమను చిత్తమున నిరంతరము తలచుచుండుటచే నతడు తరువాతి జన్మమున విదర్భ రాజగృహమున ప్రమదోత్తమయై జన్మించెను.

ఆ వైదర్భిని పాండ్య భూమీశుడు రాక్షస వివాహము చేసికొనెను. ఆ మలయధ్వజుడు బహు సంతానము గన్న పిదప విరక్తుడయి, రాజ్యము కుమారుల కిచ్చి, చంద్రిమసాతామ్రపర్ణీజలముల సుస్నాతుడై బహు కాలము ఘోర తపము చేయుచు, హరిధ్యాన నిరతుడై యుండెను. భార్య వైదర్భి భక్తితో తనకు శుశ్రూష చేయుచుండ నొకనా డాతడు మృతి నొందెను. అది యెరుగక యామె యథాప్రకారము పరిచర్య చేయుచు, పాదములు చల్లబడిపోవుటచే నాతడు విగతజీవు డయ్యె నని గ్రహించి, బహువిధముల విలపించి, భర్తృకళేబరమునకు దహనసంస్కారము చేసి, తానును అగ్నిలో బడనుండగా పూర్వసఖుడు విజ్ఞాన స్వరూపుడు నయిన బ్రాహ్మణు డచ్చటికి వచ్చి యామె నూరడించి "నీ వెవరు? ఇత డెవరు? నే నెవ్వడనో తెలియునా? ఈ సృష్టికి పూర్వము మన మిరువుర మును సఖులము" అని యిట్లు చెప్పెను: "మనము మానస నివాసుల మైన హంసలమై యుండి, యిలు వెడలి వేయి వత్సరములు సఖులమై వర్తించుచుంటిమి. నీవు నన్ను బాసి భౌమభోగరతుడవై మహీమండల మున గ్రుమ్మరునప్పుడు కామినీ నిర్మితము, పంచారామము, నవద్వార సమేతము, ఏకపాలకము, త్రికోష్ఠము, షట్కులము, పంచవిపణము, పంచ ప్రకృతి స్త్రీ నాయకమునైన యొకానొక పురమును జూచి అందు ప్రవే శించి, అంగనా పరతంత్రుడవై, నష్టస్మృతివై, వైదర్భీ జన సంభావిత సుఖాభాసము లగు దుఃఖములచే నిట్టి దశ బొందితివి. నీవు వైదర్భివి కావు. ఇతడు నీ భర్త కాడు. నీవు పురంజనపతివి కావు. నీవు స్త్రీ వనియు, గత జన్మమున పురుషుడ వనియును తలంచుట సత్యము కాదు. ఇది యంత యును మాయ. మనము పూర్వము హంసలము. మన రూపము చూడు. నేనే నీవు, నీవే నేను. విద్వాంసులు మన యంతరమును వీక్షింపరు."

అప్పుడు వైదర్భి యీ బోధ విని తద్వియోగ నష్టమైనజ్ఞానము క్రమ్మర పొందెను.

---

నా పృష్టః కస్యచి ద్బ్రూయాత్—అడుగనిదే ఎవనికిని చెప్పరాదు. కావున ప్రాచీనబర్హి అడిగిన పిమ్మటనే నారదుడు పురంజనోపాఖ్యానము చెప్పినాడు. కర్మఠుడు ప్రాచీనబర్హి :

" న జానామి మహాభాగ, పరం కర్మాపవిద్ధధీః
బ్రూహి మే విమలం జ్ఞానం యేన ముచ్యేయ కర్మభిః.
గృహేషు కూట ధర్మేషు పుత్ర దార ధనార్థ ధీః
న పరం విందతే మూఢో భ్రామ్యన్ సంసార వర్త్మసు"

అని పలుకగా, నారదుడు చెప్పిన యుపాఖ్యానము ముక్తిప్రదము. జ్ఞాన విషయమును నారదుడు సూటిగ చెప్పలేదు.

"పరోక్ష క్రియా ఇవ హి దేవాః" అతి శ్రుతి చెప్పుచుండుటచే—
"ప్రాచీన బర్హిషం పారోక్ష్యేణ ప్రదర్శితమ్
యత్పరోక్ష ప్రియో దేవో భగవాన్ విశ్వ భావనః."

ఉపాఖ్యాన విధాన మవలంబింప వలసివచ్చినది.

పురంజనోపాఖ్యానము సంసార వృక్ష స్వరూపమును, శరీర తత్త్వమును వివరించును. ఏ కారణమున ఆత్మ ద్వి త్రి చతుష్పాదము, బహుపాదము, అపాదము అగుచు పురంజను డయ్యెనో ఆకతమున పురంజనుడు పురుషు డయ్యెను. అట్టి పురుషునకు నామ క్రియా గుణముల వలన విజ్ఞాతుడు కాకపోవుటచే అవిజ్ఞాత శబ్ద వాచ్యు డగు సఖుడు ఈశ్వరుడు. పురుషుడు సాకల్యమున దేహ పరిగ్రహము చేయగోరినపుడు నవద్వారకలితము, ద్విహస్త చరణయుక్తము అగు పుర మేది కలదో అది లెస్స యని తలచి ఆపుర మను దేహమున ఇంద్రియములతో ఏ బుద్ధి నధిష్ఠించి విషయముల ననుభవించునో, అహంకార మమకారములకు ఏ బుద్ధి తత్త్వము కారణ

మగునో ఆ బుద్ధి ప్రమదోత్తమ. దానికి సఖులు జ్ఞాన కర్మ కారణము లయిన యింద్రియ గుణములు. సఖీజనములు తదీయ వృత్తులు. పంచ ముఖ సర్ప మనగా పంచవృత్తి యైన ప్రాణము. ఏకాదశ మహాభటు లనగా బృహద్బలుడు, ఉభయేంద్రియ నాయకుడునయిన మనస్సు. నవద్వార సమేత మయిన యీ పురమును చుట్టివచ్చిన పాంచాల దేశము లనగా పంచ విష యములు. నవద్వారము లనగా అక్షి, నాసికా, కర్ణముఖాదికములు.

చండవేగు డనగా కాలోపలక్షక మయిన సంవత్సరము. గంధర్వులు దినములు. గంధర్వీజనములు రాత్రులు. పరివర్తనము ఆయుర్హారణము. కాలకన్యక జర. యవనేశ్వరుడు మృత్యువు. అతని సైనికులు ఆధి వ్యాధులు. ప్రజ్వారుడు జ్వరము. దక్షిణ పాంచాల మనగా పితృలోక ప్రాపకము, ప్రవృత్తి రూపకము నయిన శాస్త్రము. ఉత్తర పాంచాల మనగా దేవలోక ప్రాపకము, నివృత్తి సంజ్ఞికము అయిన శాస్త్రము. శ్రుతధరుడు శ్రోత్రము. వైశన మనగా నరకము. అంధు లనగా హస్త పాదములు. అంతఃపురము హృదయము. విషూచి యనగా మనస్సు.

రథ మనగా దేహము. కురంగములు ఇంద్రియములు. ఈషాద్వయ మనగా వత్సరము, తత్కృత వయస్సు. చక్ర ద్వయము పుణ్య పాప కర్మ ద్వయము. వేణుత్రయము గుణత్రయము. పంచబంధుర మనగా ప్రాణ పంచకము. రశ్మి మనస్సు. సారథి బుద్ధి. రథికోపవేశనస్థాన మనగా హృద యము. కూబరములు శోక మోహములు. పంచ ప్రహరణము లనగా పంచేంద్రియార్థ ప్రక్షేపము. పంచ విక్రమము కర్మేంద్రియములు. సప్త వరూథములు ధాతువులు. హైమోపస్కరము రజోగుణము. అక్షయ తూణీరము అనంత వాసనాహంకారోపాధి. ఏకాదశ చమూపతి యనగా ఏకాదశేంద్రియ మైన మనస్సు. ఆసురీవృత్తి, యనగా బాహ్య విక్రమము. విషయముల ననుభవించుట వేట.

జీవుడు దేహమున స్వప్నసుషుప్తి జాగ్రదవస్థలయందు ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధి భౌతికము లైన బహువిధదుఃఖములవలన క్లేశముల ననుభ

వించుచు, అజ్ఞానావృతు డయి, వర్ష శతము నిర్గుణు డయ్యును ప్రాణేం ద్రియ మనో ధర్మములను తనయం దధ్యవసించి కామలవముల ధ్యానము చేయుచు, అహంకార మమకార సహితముగా కర్మాచరణము సలుపు చుండును.

ఇక స్త్రీ నాయక పురము: పంచారామము లనగా పంచేంద్రి యార్థములు. నవద్వారములు నాసికాది ద్వారములు. ఏక పాలక మనగా ప్రాణ పాలనము. త్రికోష్ఠము లనగా తేజో భిన్నములు. షట్కులములు ఇంద్రియ సంగ్రహము. విపణములు కర్మేంద్రియములు. పంచప్రకృతి యనగా పంచభూతములు. ప్రకృతి యను కామిని యనగా బుద్ధి.

స్వప్నావస్థయందు లింగ శరీరాధిష్ఠాత యైన జీవుడు జాగ్రద్దేహాభి మానము విడిచి శరీరాంతరము నొంది, మనమున సంస్కార రూపమున ఆహిత మైన కర్మము ననుభవించుచందమున పురుషుడు ఏ లింగ శరీరముచే కర్మ మాచరించునో ఆ లింగ శరీరమున లోకాంతరములో దేహ విభేదము నొందక తత్ఫల మనుభవించును. దాన ప్రతిగ్రహాదులయందు స్థూలదేహ మునకు కర్తృత్వము కలదన్నచో, అహంకార మమకారయుక్తు డైన పురు షుడు మనస్సుచే, నేయే దేహము పరిగ్రహించునో ఆ యా దేహమున సిద్ధ మైన కర్మ మా జీవు డనుభవించును. అట్లు కాకున్న కర్మము పునర్భవ కారణ మగుట ఉపపన్నము కాకుండును. కావున మనః ప్రధాన మైన లింగ శరీరమునకే కర్తృత్వ ముపపన్న మగును.

పంచతన్మాత్రాత్మకము, త్రిగుణాత్మకము, షోడశ వికారాత్మ విస్తృ తము నగు లింగ శరీరము నధిష్ఠించి, చేతనాయుక్తు డైన జీవు డని చెప్ప బడును.

"తివిరి యప్పురుషుండు। దేహంబునను జేసి
　　యనయంబు పెక్కు దేహాంతరముల
నంగీకరించుచు నవి విసర్జించుచు
　　సుఖ దుఃఖ భయ మోహ శోకములను

బోలు పొందు తద్దేహములనె పొందుచునుండు
        అది యెట్టు లన్నను నగ్రభాగ
తృణ మూది మరి పూర్వతృణ పరిత్యాగంబు
        గావించు తృణజలూకయునుబోలె
జీవు డవని గొంత జీవించి మ్రియమాణు
డగుచు నొందు దేహ మర్థి జెంది
కాని, పూర్వమైన కాయంబు విడువడు
కాన, మనమె జన్మ కారణంబు.

............మనంబె జీవులకెల్ల సం
సరణ కారణ మట్టి కర్మవశంబునఁ సకలేంద్రియా
చరణు డౌట నవిద్య గల్గును సంతతంబు నవిద్యచే
బరగుటఁ బహుదేహ కర్మనిబంధముల్ కలుగుం జుమీ !

.........అవిద్య లయించుటకై రమాపతిఁ
ఘనుజననస్థితి ప్రళయ కారణభూతుని పద్మపత్ర లో
చను పరమేశు నీశ్వరు సర్వజగంబు తదాత్మకంబుగా
గనుగొనుచుం దదీయ పదకంజము లర్థి భజింపు మెపుడుఁ".

ఇది జీవేశ్వరగతి.

"ధ్యాయ తీవ వేలాయ తీవ" అని శ్రుతి. బుద్ధితో తాదాత్మ్యము కలిగినపుడు అంతయు దానివలెనే యుండును. "పురం జనయతీతి పురం జనః." సంస్కృత భాగవతమున మహిషి పేరు పురంజని. హంస లనగా పరిశుద్ధులు. "హంసా పరిశుద్ధా."

విషయ వివరణమున పురంజనోపాఖ్యానము ప్రగాఢ మయినది.

## ౩ (జడ) భరతోపాఖ్యానము :

పూర్వము భరతు డను మహారాజు ధర్మమార్గమున దేశమును పరిపాలించుచు విష్ణుధ్యాన పరాయణుడై యుండెను. అంతకు మున్ను అజ

నాభ మను పేరు గల వర్షమునకు ఈ రాజువలన భారతవర్ష మని పేరు వచ్చెను. ఆయన ధనాదికమును పుత్రులకు సమముగా పంచి యిచ్చి, ఇలు వెడలి పులహాశ్రమమునకు బోయి, బహువిధముల నిష్ఠతో హరి నారాధించుచు విగత విషయాభిలాషు డయ్యెను.

ఒకనా డాయన నదిలో స్నానము చేసి ప్రణవోచ్చారణ చేయుచుండ లేడిపిల్ల తల్లి గర్భమునుండి జారి నీటిలో బడెను. తల్లి మరణించెను. భరతుడు పిల్లను జూచి జాలిచెంది, ఆశ్రమమునకు గొనిపోయి మిక్కిలి మక్కువతో బెంచుచుండెను. క్రమముగా హరిణపోతముమీదనే మానసము లగ్నమగుటచే ఆయన శక్తు లుత్సన్నము లయ్యెను. ఏమి చేయుచున్నను ఆయన హరిణపోతమునే తలచుచుండెను. ఒకనా డాలేడిపిల్ల యెచ్చటికో కనబడకుండ బోయెను. హరిణపోతముమీద మోహ మగ్గల మగుటచే నతడు బహువిధముల విలపించెను. తుదకు లేడిపిల్ల మరలివచ్చునప్పటి కాయనకు సంతోష మంకురించెను. ఇట్లు కొంత కాలము చనెను.

> భరతుం డల్లన అంత్యకాలము వెసం బ్రాపింపగా నప్పు డా
> హరిణంబుం గడు భక్తి బుత్రగతి నత్యాసక్తి వీక్షింప, నా
> హరిణంబుం దన యాత్మలో నిలిపి దేహం బంతటం బాసి తా
> హరిణీ గర్భమునన్ జనించి హరిణంబై యొప్పె పూర్వస్మృతిన్.

భగవదారాధన సామర్థ్యమున మృగ జన్మ కారణము గ్రహించి భరతుడు లోలోన పరితాపము చెందుచు, పులహాశ్రమమునకు వచ్చి, దేహత్యాగావసానము వాంఛించుచు, సంగము విడిచి తిరుగుచు, తుదకు నదీతీర్థమున శరీరము విడిచెను.

భరతు డావలి జన్మమున అంగిరసు డను నుత్తమ బ్రాహ్మణునకు ద్వితీయ భార్యయందు పుత్రుడై పుట్టెను. తండ్రి యతనికి సక్రమముగా సమస్త సంస్కారములు చేయించెను. బాలుడు పెరిగి పెద్దవాడయి, భాగవతోత్తముడై కర్మములయం దిచ్ఛ లేకుండియు, నెట్లో చేయుచుండెను.

తండ్రి యెంత ప్రయత్నించినను కుమారునకు సక్రమ కర్మానుష్ఠాన మల వడలేదు. కొంత కాలమునకు తండ్రి మరణింపగా నతని తల్లి యగ్ని ప్రవే శము చేసెను. సవతి తల్లి కొడుకు లతని మహిమను గుర్తింపనేరక అతనిని వేదాధ్యయనము చేయనీయక కుమతులై గృహకృత్య నిర్వహణమున నియోగించి, 'ఉన్మత్త జడబధిర' అని పిలుచుచుండిరి. వ్యవసాయమున నియుక్తుడై భరతుడు దేహాభిమానము లేక శీతవాతాతప వర్షముల కోర్చి, నూక, తవుడు, తెలిక పిండి, పొట్టు తినుచు, చేను కావలి కాయుచుండెను. సంతాన కాముడైన వృషలపతి పురుష పశువును భద్రకాళి మందిరమునకు తీసికొని పోవుచుండగా వాడు తప్పించుకొని పోయెను. భృత్యులు రాత్రి వేళ చేను కాచుచున్న భరతుని బట్టుకొని పోయి, అభ్యంజనాదికము చేయించి, నూతన వస్త్రాదు లిచ్చి, భోజనానంతరము వాద్యములతో నత నిని భద్రకాళి సమ్ముఖమున నాసీనుని జేసిరి. వృషలపతి మంత్రపూతమైన ఖడ్గము చేతబట్టి మస్తకము ఖండింప దలచెను. అప్పుడు—

> అచ్చట విప్రసూనుడు భయం బొకయించుక లేక చంపగా
> వచ్చినవారియందు కరవాలమునందును కాళియందు దా
> నచ్యుత భావ ముంచి హృదయంబున పద్మదళాతు నెంతయుః
> మచ్చికతోడ నిల్పి యనుమానము నొందక యుండె నెంతయుః.

భద్రకాళి వృషలాదులను సంహరించెను. అనంతరము భరతుడు చేనికి కావ లికై పోయెను.

ఆవల కొంత కాలమునకు సింధు భూపాలుడగు రహుగణుడు ఇక్షు నదీ తీరమున నున్న కపిల మహామునివలన తత్త్వజ్ఞానము గ్రహించు కోరి కతో మేనాలో జనుచుండెను. శిబికా వాహకులు త్రోవలో భరతుని గాంచి, మేనా మోయింపసాగిరి. అతడు హరిధ్యానమున నుండుటచే దేహముమీద మనస్సు లేక యెట్లో నడచుచుండెను. విషమ గమనము నకు రాజు బాధపడుచు వాహకులను మందలించెను. నూతన పురుషుని

వలన బాధ కలుగుచున్నదని వారు చెప్పగా రాజు వేగిరపడి భరతుని బహు విధముల దూషించెను.

భరతు డిట్లనెను : "రాజా! భార మీ శరీరమునకుగాని నాకుగాదు. స్వామి భృత్య సంబంధము శరీరమునకుగాని జీవునికి లేదు. స్తబ్ధుడను, ముక్తుడను అగు నాకు నీవు చేయు శిక్ష వ్యర్థమగును."

రాజు శిబికనుండి దుమికి బ్రాహ్మణునికి సాష్టాంగ దండప్రణామము లాచరించి "మహాత్మా, నా తప్పు సైరింపుము. నిస్సంగుడవైన నీ స్వభావము తొలుత గ్రహింపనైతిని" అని వేడగా భరతుడు రహూగణునకు తత్త్వజ్ఞాన ముపదేశించి చనియెను. సింధు భూపతియును దేహాత్మ భ్రమను విడిచిపెట్టెను.

> కృపయాపి కృత స్సంగః పతనాయైవ యోగినః
> ఇతి ప్రదర్శయ న్నాహ భరత స్త్యైణ పోషణమ్.

యోగియగువానికి సంగ మేమాత్రము కూడదు. దయావిష్ట చిత్తుడైన భరతుడు లేడిపిల్లను రక్షించి, తత్సంగమువలన యోగ భ్రష్టు డయ్యెను.

లోకములో కొందరు కొందరు కుక్కనో, పిల్లినో, చిలుకనో, ముంగిసనో, ఉడుతనో, ఏదో పక్షినో, జంతువునో పెంచుచు దానితో కాలక్షేపము చేయుచుందురు. రామదాసునంతటి మహానుభావుడు చిలుకను పంజరములో బంధించి పోషించుటచే పండ్రెండు వత్సరములు బందిగమునం దుండవలసి వచ్చినట్లు జనశ్రుతి కలదు.

ద్రవిడదేశమున విలసిల్లిన శ్రీ తాయ్ మానవర్ అను మహానుభావుడు ఏదో ధర్మశాల వసారాలో నొక మూల నుండెడివాడు. రాజకుమారు డొకడు సంపదలు, సౌఖ్యములు త్యజించి ఆయన సేవచేసి తరింపవలెననెడి యాశయముతో నొకనాడు తత్సన్నిధికి బోయి ప్రణామాదికము చేసెను. ఆయన ఘేమియు మాటాడలేదు, రాజపుత్రుడు ఆయన తనకు

గానబడునట్లుగా ఆ ధర్మశాలలోనే వేరొక మూల నివసించుచు, ప్రతిదినము ప్రాతఃకాలమున ప్రణామము చేసిపోవుచుండెడివాడు. ఇట్లు ద్వాదశ వర్ష ములు గడచినవి. ఎన్నడును పలుకరింపని శ్రీ తాయ్ మానవర్ ఒకనాడు రాజకుమారుని తన దగ్గరకు బిలిచెను. అతడు సమ్మోదభరితుడై "స్వామీ, నేటికి తమకు నామీద అనుగ్రహము కలిగినది! ధన్యుడను! ఈ యను గ్రహమునకు కారణము మాత్రము గ్రహింపలేకున్నాను" అని భక్తితో పలికెను. "నాయనా, నేటితో నీవు సంగవర్జితుడవైనావు. రాజ్యాదిక మును విడిచినావు; కాని ప్రీతిపాత్రమైన శునకమును మాత్రము విడువ వైతివి. నిన్న కుక్క చనిపోవగా దానిని ఖననము చేసి వచ్చితివి. నేటి నుండి సంగ రహితుడివయి జ్ఞాని వయినావు" అని యనుగ్రహించినట్లు కథ తెలియవచ్చుచున్నది.

నిరంతర హరిణ సంసర్గముచే భరతుడు క్రమేణ ఉత్తమ శక్తులు కోలుపోయెను. "అంతే మతిస్సా గతిః". జీవి మరణకాలమున దేనిని విశే షముగా ధ్యానించిన అదియే యగును. భరతుడు హరిణమునే చూచి తద్భావనతో ప్రాణములు విడుచుటచే హరిణ జన్మము కలిగెను. వెనుక జన్మములో విశేషముగా భగవదారాధన చేసియుండుటచే నతనికి పూర్వ జన్మ స్మృతియు, వివేకమును సంక్రమించెను. హరిణ దేహమున బహు కాల ముండక త్వరలోనే యతడు తద్దేహమును పవిత్ర ప్రదేశమున విస ర్జించెను.

"శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టో భిజాయతే;
అథవా యోగినా మేవ కులే.........".

ఉత్తమ బ్రాహ్మణ వంశమున నతడు జన్మించెను. తండ్రి జీవించి యున్నంత వరకును అన్నియు సక్రమముగా నడచెను. అనంతరము సవతి సోదరుల వలన బహువిధములైన కష్టముల కతడు లోనయ్యెను. తుదకు పశు ప్రాయ మైన వృత్తి యవలంబింపక తప్పినది కాదు. ఆహారముకూడ పశు

వులకు పెట్టునదే యాతడు తినుచుండెను. ఎట్టి స్థితిలో నున్నను జ్ఞాని యగుటచే ఆత్మారాముడై యుండి కష్ట సుఖ విభాగము తలపెట్ట లేదు.

కర్మశేష మనుభవింపవలెను. భద్రకాళికి బలిగాగూడ బోవలసి వచ్చెను. దేవి దయాళు వగుటచే నతనికి మరణము సంభవింప లేదు. దేవీ కటాక్షమునకు పాత్రి మయిన వానికి క్రమేణ శ్రేయమే కలుగును.

శిబికా వహనము చివరి కృత్యము. లోపల గూరుచున్న రహూ గణ ప్రభువునకు భరతుని సంగతి యేమి తెలియును? కావున ప్రభు దర్ప ముతో నిష్ఠుర వాక్యము లాతడు పలికినాడు. ఎంత ప్రాభవోపేతుడు, రజోగుణ సంస్పృష్టుడు నయినను రాజు కపిల మహాముని సన్నిధికి బోయి విజ్ఞాన వాక్కులు వినదలచినవా డగుటచే జడ భరతుని పలుకులు చెవిని బడినంతనే ప్రబుద్ధుడై పల్లకి దిగి అతని పాదములపై వ్రాలినాడు. తమ స్సును గాని, రజస్సును గాని తొలగించిననే కాని వివేకోదయము కాదు కదా?

జడ భరతు డవధూత చర్య నవలంబించినవాడు. అట్టివాడు 'మూకోన్మత్త పిశాచవత్' ప్రవర్తించును. సంసర్గమువలన భ్రష్టు డగుటచే నతడు అన్య సంసర్గము తన కంటకుండుటకై అవధూత చర్యావలంబి యయినాడు.

అవధూత చర్యను గూర్చి విష్ణు పురాణములోని హిరణ్యగర్భ గీతము లైన శ్లోకము లి ట్లున్నవి :

"సమ్మానానా పరాం హానిం
యోగర్ధేః కురుతే యతః
జనే నావమతో యోగీ
యోగసిద్ధిం చ విన్దతి.
తస్మా చ్చరేత వై యోగీ
సతాం ధర్మ మదూషయన్

జనా యథా వమన్యేరన్
గచ్ఛేయు ర్నైవ సంగతిమ్."

రహూగణునకు భరతుడు తుదిలో చేసిన ఉపదేశసార మి ట్లున్నది :

"జ్ఞానం విశుద్ధం పరమార్థ మేక
మనంతరం త్వబహిః బ్రహ్మ సత్యమ్
ప్రత్యక్ప్రశాంతం భగవ చ్ఛబ్ద సంజ్ఞం
య ద్వాసుదేవం కవయో వదన్తి.
రహూగ, తైతత్ తపసా నయాతి
న చేజ్యయా నిర్వపణా ద్గృహా ద్వా
న చ్ఛందసా నోత జలాగ్ని సూర్యై
ర్వినా మహత్పాద రజోభిషేకమ్.
య త్రోత్తమ శ్లోక గుణానువాదః
ప్రస్తూయతే గ్రామ్యకథా విఘాతః
నిషేవ్యమాణో నుదినం ముముక్షో
ర్మతిం సతీం యచ్ఛతి వాసుదేవే."

భరతు నంతవానికి కర్మ క్షయమై ముక్తి లభించుటకు మూడు జన్మములు పట్టినది.

## ౬ అజామిళోపాఖ్యానము :

కన్యాకుబ్జపురమున అజామిళు డను బ్రాహ్మణుడు కలడు. అతడు సదాచారములు విడనాడి, దుర్వాదములు చేయుచు, జూద మాడుచు, ఉపపత్నితో కాలక్షేపము చేయుచు, కాలక్రమమున పదుగురు కుమారుల బడసెను. బిడ్డలను భావించుచు, పెంచుచు, మోహజలధిలో బడి, పతితుడయ్యెను. ఈ రీతిని ఎనుబది యెనిమిది వర్షములు గడచినవి. తన కడగొట్టు కొడుకునకు అజామిళుడు నారాయణు డను పేరు పెట్టి, వానితో నాటపాటలలో కాలము బుచ్చుచుండగా మరణ సమయ మాసన్న

మయ్యెను. అయ్యెడ ముప్పురు యమదూత లతనికి గానబడిరి. అతడు వికలేంద్రియుడు, వికంపిత ప్రాణుడు, వికృతలోచనుడు, విహ్వలాత్మకుడు నయి—

దూరమున నాడు బాలుడు
బోరన దన చిత్తసీమ బొడకట్టిన, ఓ
నారాయణ, నారాయణ,
నారాయణ, యనుచు నాత్మనందను నొడివెౕ.

మరణ సమయమున అజామిళుడు నారాయణ స్మరణము చేయుటచే తత్సమీపమున నున్న విష్ణుదూతలు ప్రభునామ మాలకించి, యమకింకరులు తనువునుండి బ్రాహ్మణుని వెలికి దీయుచుండగా డగ్గరి వారిని ప్రక్కకు నెట్టిరి.

యమదూతలు వారితో "ఎవరు మీరు? మమ్ము నడ్డగించుటకు కారణమేమి? ఈ ప్రాణిని విడిపించితిరి. ఇక యముని శాసనములు లోకమున హాస్యాస్పదములు కావా? దివ్యరూపధారులై, ఆయుధధారులై, శాంతతనుద్యుతులు నగు మీరు ధర్మపాలుర మైన మమ్ము నడ్డగించుట న్యాయమగునా? ఇతడు బ్రాహ్మణ వంశమున బుట్టి, తొలుత వేదాధ్యాయనాదికము చేసినాడు. గురువులను, అతిథులను సేవించినాడు. బహుమంత్రసిద్ధులనుగూడ పొందినాడు. నిత్య నైమిత్తిక క్రియలు నిర్వర్తించినాడు. కాని యౌవన మదమున భ్రష్టుడై, క్రమముగా పతితు డయినాడు. ఇట్టివానిని నరకమునకు గొనిపోవలెను. దండనమువలన నితడు ధన్యుడు కాగలడు. ఇది ధర్మమార్గము" అని పలికిరి.

నయకోవిదు లైన విష్ణుదూత లపు డి ట్లనిరి :

"ఈతడు కోటి సంఖ్యలకు నెక్కుడు పుట్టువు లందు జెంది యాయాతము లైన పాప నివహంబుల నన్నిటి బారద్రోలె వ్రి

ఖ్యాత మతిఁ మహా మరణ కాలమునఁ హరి పుణ్యనామ సం
భూత సుధామయాద్భుత విభూతిక రాకుర సంగ్రహంబునఁ.
బిడ్డ పేరు పెట్టి పిలుచుట విశ్రామ
కేళినైన మిగుల గేలినైన
పద్య గద్య గీత భావార్థముల నైన
కమలనయను దలప కలుషహరము."

ఇట్లని వారు భాగవత ధర్మము నిర్ణయించిరి. యమదూతలు శాంతి చెంది యమలోకమునకు జని యముని కీ విషయము విన్నవించిరి.

అజామిళుడు తన జీవితమును సింహావలోకనము చేసి, మిక్కిలి విచారించి, వైష్ణవజ్ఞాన దీపమువలన తన యజ్ఞానము తొలగిపోవగా గంగా ద్వారమునకు జని, దేవతా మందిరములో సమాసీనుడై, యోగమార్గమున దేహము విడిచి, విష్ణు సేవకులతో గూడి విమాన మెక్కి, వైకుంఠమున శ్రీమన్నారాయణ పదారవింద సేవాచరణ పరిణామ స్థితికి జనెను.



"నరక యాతనల నెట్లు తప్పించుకొన నగును?" అని పరీక్షిత్తు శుకు నడిగెను. పాప కర్మములు చేసిన యెడల నరక లోక నివాసము, యమ యాతనలు సిద్ధించును. కృచ్ఛ్ర చాంద్రాయణాది ప్రాయశ్చిత్త కర్మలచేత పాపకర్మములు సమూలముగా నాశము పొందవు. అవిద్వాంసు డైన యధికారికే ప్రాయశ్చిత్తము విధింపబడినది. అముఖ్యము, ముఖ్యము అని ప్రాయశ్చిత్తము రెండు విధములు.

అజామిళుని నడవడి చిత్ర మైనది. ఉత్తమ బ్రాహ్మణ వంశమున బుట్టి, వేదాధ్యయనాదులు చేసి, సక్రమముగా కన్య నాతడు వివాహము చేసికొన్నాడు. అంతవరకును యోగ్యుడే. కాని భార్య పెద్దది కాలేదు. అతనికి యౌవనోద్రేకము కలిగినది. మీదు మిక్కిలి ఒకనాడు తలవని

తలంపుగా ఉద్దీపన మొదలిడినది, అజ కానవచ్చినది. ఇచ్చట అజ యనగా వృషలి, "అజయా మిళ తీతి అజామిళః." అజతో కూడినవాడు. ఇప్పుడు అజ యనగా అవిద్య. పెద్దలు పెట్టిన నామధేయమున కనుగుణముగా ప్రవర్తించినాడు. ఏ మాత్రము నిగ్రహ మున్నను భ్రష్టత సంక్రమించెడిది కాదు.

ఇక నే మున్నది? శూద్ర స్త్రీని పెట్టుకొన్నాడు. వీర్యవంతులకు సంతానము కలుగ కుండునా? కాల క్రమమున నతడు పదుగురు కొడుకు లను బడసెను. వృషలీ సాంగత్యమున సదాచారములు విడనాడెను. "స్వాధ్యాయా న్మా ప్రమదః" అని వేదాదేశము. కాని వేదాధ్యయనము మానెను. అంతటితో నూరకుండక దుర్వాదములు చేయసాగెను. నిత్య కృత్యములకు ధనము వలయును గదా? ద్యూతమే శరణ మయ్యెను. అన్ని విధముల నాతడు భ్రష్టు డాయెను.

కాని, అనుకొనకుండ అజామిళుడు తన చిన్ని కొడుకునకు నారా యణ యని పే రిడెను. తక్కినవారి నామము లేవో తెలియరాదు. తెలిసి నను దాని ప్రసక్తితో పని లేదు. నారాయణ యనునది శ్రీ మహా విష్ణువు నామాంతరము. భారతీయులలో భగవన్నామము పెట్టుకొనని వార లాకాలమున లేరు. సామాన్యముగా చిన్ని కొడుకుమీద తలిదండ్రు లకు ప్రీతి హెంచు. అజామిళునకు నారాయణమీద ప్రేమ మిక్కుటము. వానితోనే యతనికి కాలక్షేపము. ఒకనాడు హఠాత్సంభవముగా మృత్యు వాసన్న మయ్యెను. యమదూతలను జూచి యాతడు బెగ డొంది, చిన్ని కొడుకు జ్ఞప్తికి రాగా నారాయణా యని కేకవేసెను. వాడు దగ్గఱకు వచ్చెనో రాలేదో కాని విష్ణుదూతలు వచ్చిరి. వారే యతని సంత్రాణనము నకు హేతుభూతు లయిరి.

అప్పుడు యమదూతలకును విష్ణుదూతలకును సంవాదమో వివా దమో జరిగెను. అజామీళుడు వినుచుండెను. ఆ శ్రవణమే యతనిని రక్షిం

చినది. ఉపదేశము లేకుండ ఉత్తమ జ్ఞానోదయము కానేరదు. వారి సంవాదమే అతని కుపదేశ మయినది!

వ్యతిక్రమమునకు ప్రాయశ్చిత్తము తప్పదు. ఇచ్చట "కిం తర్హి ముఖ్య ప్రాయశ్చిత్తమ్?" అను ప్రశ్నయు కలుగును. యమదూతలు వెడలిపోయిన తరువాత నాతడు నిజజీవితమును సింహావలోకనము చేసి కొనెను. మిక్కిలి విచారము కలిగినది. అదియే ప్రాయశ్చిత్త రూపము. "ముఖ్య ప్రాయశ్చిత్తం తు విమర్శనం జ్ఞానమ్." అప్పు డతడు పునీతు డయినాడు. ముక్తికి సంసిద్ధు డయినాడు.

ఒక్కమారు భగవన్నామోచ్చారణము చేసినంతనే యతనికి ముక్తి కలిగినట్లు ఉపాఖ్యాన ముద్ఘాటించుచున్నది. నామోచ్చరణముచేతనే హఠాన్ముక్తి కాలేదు. మాలిన్య క్షాళనము, జ్ఞానోదయము, పరామర్శ ఇత్యాది సోపానము లున్నవి. ప్రతిజ్ఞా వాక్యము మండూకప్లుతిచేసి, ప్రరోచనోత్పాదక మయ్యె నని భావింపవలెను.

భగవన్నామోచ్చారణము భవతారక మని భావన చేయవలెను.

## ౭ చిత్రకేతూపాఖ్యానము :

శూరసేన దేశములకు ప్రభు వగు చిత్రకేతుడు చాల యోగ్యుడు. అతనికి చక్కని భార్య లెందరో కలరు; కాని సంతానము లేదు. ఒకనాడు అంగిరస మహాముని రాగా రా జాయనను పూజించెను. మహాముని పుత్ర కామేష్టి చేసి అగ్ర మహిషి యగు కృతద్యుతికి యజ్ఞ శేష మిచ్చి, పుత్రుడు పుట్టు నని చెప్పి వెడలిపోయెను. నవ మాసములు నిండిన వెనుక కుమారుడు జన్మించెను. బిడ్డయు దినదిన ప్రవర్ధమానుడై, అందరకును అల్లారు ముద్దుగా పెరుగుచుండ, రాజు కృతద్యుతియందు బద్ధానురాగుడై తక్కిన రాణులను తలపకుండెను. బిడ్డడే దానికి కారణమని యెంచి, వారు బాలునికి విషము పెట్టించిరి. తెల్లవారగనే బిడ్డని లేపుటకై దాది పోయి చూడగా వాడు మృతుడై యుండెను. వార్త విని తల్లి వచ్చి యేడ్చు

చుండ రాజు విని యచటికి బోయి దుఃఖించెను. అందరును దుఃఖాక్రాంతు లయిరి.

అంతలో అంగిరస, నారదు లచటికి వచ్చి, రాజునకు బోధ చేసిరి. చిత్రకేతువు వారితో—

"పొందుగ గ్రామ్య పశుత్వము
పొంది మహాశోకతమము పొందిన నాకుఁ
సుందర దివ్యజ్ఞానము
జెందించిన వారి మిమ్ము జెప్పుడు తెలియఁ."

అనెను.

"నీకు పుత్రుని ప్రసాదించిన అంగిరసుడను నేను. ఇతడు బహ్మ మానస పుత్రుడు నారద మహర్షి" అని మరల జ్ఞానబోధము చేసెను నారదుడు "రాజా, ఉపనిషద్గోప్య మగు మంత్రమును సప్త రాత్రములు పఠించువాడు సంకర్షణు డైన భగవంతుని జూచును. నారాయణు నాశ్రయించి యీ మోహాము వదలి శీఘ్రముగా నుత్తమ పదవిని పొందుము" అని, మృత కళేబరమును జూచి "జీవుడా, ఈ దేహమున ప్రవేశించి, ఆయుశ్శేషము ననుభవించి, రాజ్యము చేయుచు, బంధువులను సంతోషపెట్టుచుండుము." అనెను.

ఆ బాలు డిట్లు పలికినాడు :

"కర్మవశమున నెందు సుఖంబు లేక
దేవ తిర్య ఙ్నృ యోనుల దిరుగు నాకు
వెలయ నే జన్మమందునో వీరు తల్లి
దండ్రు లయినారు చెప్పవే తాపసేంద్రా!
బాంధవ జ్ఞాతి సుతులును బగతు రాత్మ
వరు లుదాసీన మధ్యస్థ వర్గములును
సరవి గనుచుందు రొక్కొక్క జన్మమునను

నెరయ బ్రాణికి నొకవాని నిజము కలదె?
సతు లెవ్వరు సుతు లెవ్వరు
పతు లెవ్వరు మిత్రి శత్రు బంధుప్రియ సం
గతు లెవ్వరు సర్వాత్మక
గతుడై గుణసాక్షి యైన ఘను డొక్కనికిన్?"

"నాకును మీకును నెక్కడి సంబంధము" అని బంధువులతో చెప్పి, వెడలి పోయెను.

అందరు విస్మిత చిత్తులై దుఃఖము మాని, శవమునకు యమునానది కడ నుత్తర కర్మములు నిర్వర్తించిరి. చిత్రకేతువు కాళిందిలో స్నానము చేసి నారదునివలన మంత్రోపదేశము పొంది, నియమ పూర్వకముగా నారాయణ రూప మైన విద్య నారాధించి సప్త రాత్రానంతరమున విద్యాధరత్వమును, దివ్య విమానమును పొందెను. నారాయణానుగ్రహమున త్రిజగము లందును విమానమున సంచరించుచు, ఒకచోట అనంతుని దర్శించి, ఆయన బోధలు విని, భక్తి శ్రద్ధా సమన్వితుడై బహుకాలము దివ్య సుఖములతో వివిధ ప్రదేశములను వీక్షించుచుండెను, ఒకనాడు—

ఆ విద్యాపుర భర్త కాంచె హార నీహారామృతాహాసమున్
శ్రీ విభ్రాజితమున్ నిరస్త గిరిజా సేవాగతాయాసమున్
దేవానీక వికాసమున్ శుభ మహాదేవాంఘ్రి సంవాసమున్
భూవిఖ్యాత విలాసమున్ త్రిభువనీపూతంబు కైలాసమున్.

ఆ రజత భూధరంబున
నీరేజ భవామరాది నికరము కొల్వన్
పేరోలగమున నుండిన
గౌరీయుతు డైన హరుని గనియె...

తన యూరుపీఠంబున నున్న భవానిని కౌగిట జేర్చుకొని యున్న పరమే

శ్వరుని జూచి, చిత్రకేతుడు పకపక నవ్వి, దేవికి వినబడునట్లుగా ని ట్లనెను:

“కొమరొప్పగా లోక గురుడును, కడ లేని
ధర్మ స్వరూపంబు తాన యగుచు
జడలు ధరించియు సరి లేని తపమున
పొడ వైన యీ యోగి పుంగవులును
బ్రహ్మవాదులు కొల్వ భాసిల్లు కొల్వులో
మిధున రూపంబున మెలతతోడ
ప్రాకృతుండునుబోలె బద్ధానురాగుడై
లాలితుం డయ్యె నిర్లజ్జత నిట
అకట, ప్రకృతి పురుషు డైన తా నేకాంత
మందు సతులతోడ నలరు గాని
ఇట్లు ధర్మసభల నింతులతో గూడి
పరిఢవింపలేడు భ్రాంతి నొంది.”

పరమేశ్వరు డా వాక్కులు విని నవ్వెను. భవానిమాత్రము కోపము చెంది,

“భృగు నారద కపిలాదులు
నిగమాంతజ్ఞులును యోగ నిర్ణయ నిపుణుల్
త్రిగుణాతీతు మహేశ్వరు
నగ రెన్నడు వారు ధర్మనయ మెరుగ రొకో!

నీవు రాక్షసుడవై పుట్టుము. ఇక ముందు మహాత్ముల నవజ్ఞ చేయకుము” అని పలికెను. చిత్రకేతుడు విమానము దిగి వచ్చి దేవికి దండ ప్రణామములు చేసి, అంజలి ఘటించి, “జగన్మాతా, నీ శాప వాక్కుల నట్ల కై కొంటిని. న న్ననుగ్రహింపుము. శాప భయ శంకితుడను కాను. జగన్మాత వైన నిన్ను పరిహాసించినందులకు వగచుచున్నాను” అని దండ ప్రణామములు చేసి, పార్వతీ పరమేశ్వరులను ప్రసన్నులను గావించి వెడలి పోయెను.

పిమ్మట పరమేశ్వరుడు పార్వతీ దేవితో—

"అరయ చిత్రకేతు డతి శాంతు డతిలోక
సముడు విష్ణుభక్తి సంగతుండు
ఇతని నేమి చెప్ప? ఈశుండ నగు నేన
ఉవిద, అచ్యుత ప్రియుండ ఇమ్మి.

కావున భగవద్భక్తుల
భావమునకు విస్మయంబు పని లేదు" అన, నామె శాంతించెను.

---

సామాన్యముగా గృహస్థులకు సంతాన వాంఛ యుండును; అందులో రాజులకు చాల మెండుగా నుండుట సహజము. తన యనంతరము కుమారుడు రాజ్యమునకు రావలె ననియు. తన సంతతి వృద్ధి నొంది శాశ్వతముగా దేశమును పరిపాలించుచుండ వలె ననియు వాంఛ యుండును. అట్లే చిత్రకేతువుకూడ నభిలషించెను. అతనికి భార్య లెందరో యున్నను తుదకు అంగిరస మహాముని యనుగ్రహమున గాని సంతానము కలుగలేదు. కుమారుని కన్న రాణిమీదనే ప్రభువునకు ప్రీతి మిక్కుటమగును; అందుచే తక్కిన రాణులను అలక్ష్యము చేసి, ఆదరింపకుండుట సంభవించును. వారికి అసూయా ద్వేషములు జనించును. తమ కష్టమునకు కారణ మేదో దానిని నిర్మూలించుటకు వారు ప్రయత్నింతురు. బాలుడు పోయిననే కాని ప్రభువునకు క్రృతద్యుతియెడ ననురాగము హరింపదని, వారు బాలునకు రహస్యముగా విషప్రయోగము చేయించిరి బలీవర్దములు పోరాడునపుడు లేగ నలిగిపోయినట్టు అమాయకు డగు బాలుడు కాలధర్మము చెందెను.

ఏకపుత్ర మరణ విషయమున తండ్రి దుఃఖము వర్ణనాతీతము. అందునను లేక లేక కలిగినవాడు, వంశాంకురము, భవిష్యత్ప్రభువు నగు వాని

మృతి మహా దుఃఖదము. కావుననే విద్వాంసు డయినను రాజు మిక్కిలి దుఃఖాక్రాంతు డాయెను. ఋషి వాక్కులవలన గాని ఆతనికి ప్రబోధము కలుగలేదు. కొంతతడవు దుఃఖింపక తప్ప లేదు.

ఋషి ప్రబోధముకూడ చాలినది కాదు. శృంగ గ్రాహిక న్యాయ ప్రకారము "జాతస్య మరణం ధ్రువ" మ్మను సూక్తిని జనన మరణ స్వభావమును నిరూపింపవలసి వచ్చెను. అందులకే ఋషి కళేబరమున వదలిన జీవము నాహ్వానించి, శరీరమున మరల ప్రవేశించి సుఖించి, బంధువులను సుఖపెట్టు మని పలికెను. ఆ జీవి చెప్పిన మాటలు, చేసిన బోధ అందరకు నాశ్చర్యము కలిగించెను. తా మెవనిని ప్రీతితో బెంచి, పంచ ప్రాణములను వానిపై బెట్టి ప్రేమించుచుండిరో అట్టివాడే తూష్ణీం భావముతో విరాగ వచనములు పలికినపుడు బంధువులకుగూడ విరక్తి కలుగును. అట్లే చిత్ర కేతునకు వైరాగ్యము కలిగెను; ఆతడు క్రమముగా ప్రభావసంపన్ను డాయెను.

ఈ యుపాఖ్యానము ప్రధానముగా జనన మరణ స్వరూపమును నిరూపించును.

"యథా ప్రయాన్తి సంయాన్తి స్రోతో వేగేన వాలుకాః
సంయుజ్యన్తే వియుజ్యన్తే తథా కాలేన దేహినః."

ఇక పుత్రాది రూప సంబంధ మిట్టిది :

"యథా ధానాసు వైధానా భవన్తి న భవన్తి చ
ఏవం భూతేషు భూతాని చోదితా నీశమాయయా."

ఈశ్వర మాయా చోదితు లయి పుత్రాదిరూప భూతములు ప్రవర్తించు చుండు నని తాత్పర్యము.

ఇంకొక విషయము గమనింప దగినది. విష్ణుభక్తిపరాయణులు అన్య దైవతములయెడ గూడ భక్తితో ప్రవర్తింపవలెనే కాని, అగౌరవము చూపరా దనియు, శివ కేశవ భేదము తత్త్వతః లే దనియు గ్రహింపనగును. అంతటి మహాప్రభావ సంపన్ను డయ్యును చిత్రకేతువు పరమేశ్వరుని పరి హసించుటచే గౌరీ శాప దగ్ధుడై, తుదకు వృత్రాసురుడై జన్మింపవలసి వచ్చెను.

## ౭ సుయజ్ఞోపాఖ్యానము :

ఉశీనర దేశమున సుయజ్ఞు డను రాజు యుద్ధమున శత్రువులచే నిహతు డయ్యెను. అతని శవము చుట్టును బంధువులు, కాంతలు గుమి గూడిరి భార్యలు బహువిధముల రోదనము చేయుచుండిరి. సాయంసమయ మగుచుండెను. ఇంతలో యముడు బ్రాహ్మణ బాలుని రూపమున నచటికి వచ్చి వారితో ని ట్లనెను : "అజ్ఞులు యోగ వియోగములకు సుఖ దుఃఖ ముల నొందుదురు. పుట్టినవాడు చనిపోవ కుండునా? ప్రాణికోటి యెచ్చట బుట్టెనో యచ్చటికే పోవుట సైజము. మావంటివారము ఒంటిగా నడవు లలో తిరుగుచు వన్యమృగములబారి బడక బ్రదికి యున్నాము. గర్భమున మమ్ము పోషించినవాడే యడవులలోగూడ రక్షించుచున్నాడు. కాలకర్మ వశమున భూతములు నిలుచును, పోవును.

పాంచభౌతిక మైన భవనంబు దేహంబు
పురుషుడు దీనితో పూర్వకర్మ
వశమున నొకవేళ వర్తించు దీపించు
తరి మైన నొకవేళ తలగిపోవు
చెడెనేని దేహంబు చెడు గాని పురుషుడు
చెడ డాతనికి నింత చేటు లేదు,
పురుషునికిని దేహపుంజంబునకు వేరు
గాని యేకత్వంబు కానరాదు
దారువుల వెలుంగు దహనుని [illegible] వడి
కాయముల జరించు గాలి భంగి
నాళ లీనమైన నభముచాడ్పున వేరు
తెలియవలయు దేహి దేహములకు.

ప్రాభవమున భూతపంచ కేంద్రియ మనో
లింగ దేహములను లీల కూడు

విడుచు నస్వ్యా నొకడు విభుడు, దీనికి మీరు
పొగుల నేల వగల బొరల నేల?

బాంధవ్య మనునది మాయాగుణముచే దోచుచుండును. ఈ కథ వినుడు.

అడవిలో పిట్టలను పట్టువాడు తన సాధనములను గొనిపోయి వల పన్ని అందు జిక్కుకొన్న పక్షుల గొంతులు నులిపి చిక్కములో బడవేయు చుండెను. ఒక యాడు పిచ్చుక వలలో చిక్కి చచ్చినది. దాని భర్త విల పించుచు బిడ్డల నెట్లు పోషింప గల నని వాపోవుచుండెను. ఇంతలో కిరా తుడు బాణము విడువగా మగ పిచ్చుక నేల వ్రాలెను.

కావున మీ రెంత కాలము దుఃఖించినను రాజు మరలిరాడు.”

బాలరూపధారి యైన యముని వాక్కులు విని వారు తెలివి తెచ్చు కొని దహన సంస్కారములు చేసి వెడలిపోయిరి.



ప్రియజన మరణము లోకములో దుస్సహము. భర్తలు మృతి నొందగా భార్యలు విలపించుట సహజము. వైధవ్యము మహా భయంక రము ! ఇష్టు లయినచో బంధువులుకూడ సత్యముగానే దుఃఖింతురు. రోద నమువలన కొంత భారము తగ్గును. మన వాఙ్మయముననను, లోకము లోను దుఃఖాభిభూతులకు ఆప్తులు విలపింపవల దని బోధించుచుండుట పరిపాటి. అట్లు చేయుట యొకవిధముగా సమంజసమే. దుఃఖమునకు అంత ముండవలెను. దుఃఖమగ్నులకు వివేకము నశించును. కావున బోధ యుపక్త మగుచుండును.

ఈ యుపాఖ్యానమున యముడు దయాళువై బాలరూపముదాల్చి వచ్చి, దుఃఖితులకు వివేకము కలిగించెను. వయోవృద్ధులు ధర్మపన్నములు పలుకుదురు. చిన్నవారు పలుకరు. ఇందు చిన్నవాడు పెద్దబోధ చేయు టలో విశేష మున్నది. పురాణములలో బాలురు వివిధ సంఘటనలలో

వివేకముతో ప్రసంగించుట గమనింప దగినది. ఒక్క ప్రహ్లాదుని దృష్టాంతము చాలును. బాలురు బోధ చేయుచుండగా పెద్దల కాశ్చర్యము, లజ్జయు కలుగును. 'ఇంతటి చిన్నవాడు సద్వాక్యములు పలుకుచున్నాడు. మనము పెద్దల మయ్యు బాలునిచే చెప్పించుకొన వలసివచ్చినది' అని శాంతచిత్తు లగుదురు.

'జాతస్య మరణం ధ్రువమ్' అని యందరకును తెలిసినదే. అయినను తరుణము వచ్చినప్పుడు తప్పక బోధ చేయవలసినదే. సద్వాక్య విషయములలో 'అసకృ దావృత్తిః' మంచిదే. ఏదైనను—

'పథి స్థితం తిష్ఠతి దిష్ట రక్షితం
గృహాస్థితం తద్విహతం వినశ్యతి,
జీవ త్యనాధో పి తదీక్షితో వనే
గృహే పి గుప్తో విహతో న జీవతి."

ఇందలి అవాంతర కథలోకూడ బోధ యున్నది. భార్య, భర్త యను బంధములో నున్నప్పుడు పిచ్చుకలవలె చచ్చుటయే సంభవించును. బంధమును ఛేదింప జాలనిచో మానవులుకూడ పిట్టలవలెనే యగుదురు. ఉత్తమ జాతిలో జన్మించినను లాభము లేదు. చటక దంపతుల వృత్తాంతమీ యర్థమును సూచించును.

హిరణ్యాక్షుడు మృతి నొందిన పిదప దుఃఖించుచున్న తల్లిని ఊరడించుటకై హిరణ్యకశిపుడు చెప్పిన దీ యుపాఖ్యానము. రాక్షసుడయ్యును కొంత వివేకము కలవాడు హిరణ్యకశిపుడు. పైన మహావీరుడు, మృత్యువును లెక్క చేయనివాడు. కాలగతిని, భాగధేయమును గ్రహించినవాడు. అట్టివాడు పలికెడి పలుకులలో సారముండుట సహజము.

## ౨ అంబరీషోపాఖ్యానము :

అంబరీషుడు సద్గుణ గరిష్ఠుడు. అతడు సమస్త ప్రపంచమునకును ప్రభు వయి, సత్పరిపాలనము, వైష్ణవార్చనలు చేయుచుండువాడు. అశ్వ మేధాది యజ్ఞము లెన్నియో చేసి, హరిధ్యానపరాయణుడై, రాజ్య పరి పాలనము సలుపుచు నిర్లిప్తుడై యుండగా నొకనాడు భక్తవత్సలు డైన పురుషోత్తముడు అతనికి చక్రము ననుగ్రహించెను. అంబరీషుడు హరిని గూర్చి ద్వాదశీ వ్రతము వత్సరముపాటు చేసెను ఆ వ్రతాంతమున కార్తిక మాసములో మూడు రాత్రు లుపవసించి, కాళిందీ నదిలో స్నానము చేసి, మహాభిషేక విధానమున మధువనములో హరి నభిషేకించి, విప్రోత్త ములకు గోదానములు చేసి, సంతృప్తిగా భోజనము పెట్టించెను. అనంత రము ప్రభువు పారణ చేయదలచుచుండగా దుర్వాస మహర్షి అభ్యాగతు డుగా వచ్చెను. రా జాయనను పూజించి భోజనార్థము నిమంత్రించెను. మహర్షి స్నానార్థము కాళిందీ నదికి బోయి ధ్యానమగ్నుడై తడవు చేసెను. ద్వాదశి రెండు గడియలు మాత్రము మిగిలి యుండెను. ద్వాదశి వేళ రాజు పారణ చేయక తప్పదు. మహర్షి రాలేదు. పారణ చేసినచో బ్రాహ్మణాతిక్రమ దోషము కలుగును. కావున రాజు విద్వజ్జనులతో సంప్రతింప వారు అంబరీషునితో—

"అతిథి పోయి రామి నధిప ఈ ద్వాదశి
పారణంబు మాన పాడి కాదు
కుడువకుంట కాదు కుడుచుటయును కాదు
సలిలభక్షణమ్ము సమ్మతమ్ము."

అని ధర్మసందేహము పోగొట్టిరి. అంబరీషుడు నీరు పారణ చేసి దుర్వాసు నికై యెదురుచూచుచుండెను.

కొంత తడవునకు దుర్వాసుడు వచ్చి రాజు చేష్టితము మనమున గ్రహించి, ఆగ్రహించి "ఈతడు విష్ణుభక్తుడు కాడు, దాంభికుడు, న

న్నాహ్వానించి ముందు తానే పారణ చేసినాడు. ఈ దుష్కర్మునకు శిక్ష చేసెదను" అని కేశపాశము పెరికి, దానితో "కృత్య" యను శక్తిని నిర్మించి రాజుమీదికి వదలెను. ఆ శక్తి భీకారాకారముతో, వివిధాయుధములతో రాజును సమీపించెను. అంబరీషుని రక్షించుటకై విశ్వరూపుడైన హరి చక్రమును బంపెను. అది వచ్చి కృత్యను సంహరించి, దుర్వాసుని వెంట బడెను; మహర్షి యెచటికి బరుగిడిన నచటికి వెంట నంటుచుండెను. ఆయన బ్రహ్మలోకమునకు జేరి "విధాత, విశ్వజనన వ్యాపార పారీణ, రేఖాలీలేక్షణ, కావవే, కరుణ జక్రంబు న్నివారింపవే" యని ప్రార్థించెను బ్రహ్మ తనవలన కాదని వివరించెను. అంతట దుర్వాసుడు కైలాసమున కరిగి మహేశ్వరునికి విన్నవించెను. మహేశ్వరుడు మంచిబోధ చేసి. విష్ణువు నాశ్రయింపు మనెను. మహర్షి వైకుంఠమునకు జని—

"భక్తరక్షా పరతంత్ర, మానుపగదే చక్రానల జ్వాలలన్ !
నీ మహిమార్ణవమ్ము తుది నిక్కముగా నెరుగంగ లేక నీ
ప్రేమకు వచ్చు దాసులకు కీడొంచుదనంబున నెగ్గు చేసితిన్
నా మరపున్ సహింపు మట నారకుడైన మనంబులో భవ
న్నామము చింత సేసిన ననంత సుఖస్థితి నొందకుండునే?"

అని వేడి పాదములు విడువకుండెను. నారాయణుడు బహుప్రకారముల బోధించి, అంబరీషునికడకు బోయి యతనిని సంతుష్టుని జేయు మని చెప్పెను.

అంతట దుర్వాసుడు అంబరీషుని జేరి పాదములు పట్టుకొనెను. రాజు చరణ స్పర్శనమునకు జంకుచు హరి చక్రమును స్తుతించెను :

"ఏ నమస్కరింతు నింద్ర శాత్రవ ధూమ
కేతువునకు ధర్మ సేతువునకు
విమల రూపమునకు విశ్వదీపమునకు
చక్రమునకు గుప్త శక్రమునకు !

వీహిత ధర్మమందు విహరింతు నేనియు
ఇష్ట మైన ద్రవ్య మిత్తునేని
ధరణి సురుడు మాకు దై వతం బగు నేని
విప్రునకు శుభంబు వెలయు గాక !

అఖిల గుణాశ్రయు డగు హరి
సుఖియై నా కొలువువలన జొక్కెడినేనిన్
నిఖిలాత్మమయుం డగుటను
సుఖ, మందుం గాక భూమిసురు డిప్పేళన్ !”

ఇట్లు స్తుతింపగా చక్రము శాంతించి వెడలిపోయెను.

దుర్వాసుడు రాజును కొనియాడుచు —

“ఒకమా టెవ్వని పేరు కర్ణములలో నొయ్యారమై సోకినన్
సకలాఘంబులు పల్లటిల్లి తొలగున్ సంభ్రాంతితో, నట్టి స
త్సుకరున్ మంగళతీర్థపాదు హరి విష్ణున్ దేవదేవేశునిన్
అకలంక స్థితి గొల్చు భక్తులకు లే దడ్డంబు రాజాగ్రణీ !”
యని పలికెను.

రాజు మునిని పూజించి భోజనము పెట్టించెను. దుర్వాసుడు సంతృప్తుడై బ్రహ్మలోకమునకు జనెను.



“న ప్రాభూత్ యత్ర నిర్ముక్తో బ్రహ్మదణ్డో దురత్యయః.” అప్రతిహత మైన బ్రాహ్మణ శాపము వర్తింపని అంబరీష మహారాజు చరిత్రను శుకుడు వర్ణించినాడు.

హరిధ్యాన పరాయణుడు, వ్రతసేవానిరతుడు నగు రాజుకు నారాయణుడు చక్రము ననుగ్రహించెను. అదియే అతనిని సర్వదా కాపాడుచుండెను,

అంబరీషుడు ద్వాదశి గడియలు గడవక ముందే పారణ చేయవలసి యున్నది. కాలము గడచినచో వ్రతనిష్ఠా వ్యతిక్రమ మగుట నిశ్చయము. దుర్వాస మహర్షి ఆహ్వానము లేకుండ వచ్చిన అభ్యాగతుడు. పిలుపు లేక వచ్చినను "అభ్యాగతః స్వయం విష్ణుః" అనెడి భావనతో అంబరీషుడు సగౌరవముగా అప్పు డాహ్వానించినాడు. ఆహూతుడు సమయమునకు భోజనమునకు రావలెను. అట్లు రానిచో ఎందరో అతనికొర కెదురు చూచుచుండవలెను. వా రందరును ఉపవాసము చేసినవారు. దుర్వాసు నంతటి మహర్షి కొంత ఆలస్యము చేసినప్పటికిని ఎల్లరును ప్రతీక్షించుచుండ వలసినదే. కాని ద్వాదశి గడియలు దాటుచున్న వే. అప్పుడు అంబరీషు డేమి చేయవలెను? విద్యావినయసంపన్ను డగుటచే నతడు ధర్మనిర్ణయము చేయజాలినవా డయ్యును ధర్మవేత్త లగు పెద్దలను సంశయము తీర్ప వేడెను. వారును ధర్మనిర్ణాయకు లగుటచే స్వగతము నుద్ఘాటింపక వేద విహిత మగు విధానమునే యుపదేశించిరి. "అపో శ్నాతి, త న్నే వాశితం, నై వాశితమ్" అని శ్రుతివాక్యము. బ్రాహ్మణులు శ్రుతి ననుసరించిరి.

"అంభసా కేవలే నాథ, కరిష్యే వ్రతపారణామ్
ఆహు ర్భక్షణం విప్రా నశికా నశితం చ యత్."

అను మనో నిశ్చయముతో రాజు సలిలము పుచ్చుకొనెను. దానివలన ధర్మ హాని కాని, వ్రతహాని కాని కలుగ లేదు.

స్నానము చేసి దుర్వాసుడు ధ్యాననిష్ఠుడై యుండుటచే కాల హరణ మయినది. ఆ విషయ మాయన గమనించినట్లు తోచదు. తుదకు అంబరీషునికడకు వచ్చి, దివ్య దృష్టితో పారణ సంగతి గ్రహించినాడు. ఋషులలో చాలమందికి ముక్కుమీద కోపము. దుర్వాసుడు మహా కోప ధారి. తోడనే మండిపడి, జట పెరికి కృత్యను నిర్మించి అంబరీషుని మీదికి పంపెను.

కృత్య ఆభిచారిక శక్తి, అగ్నిలో పుట్టినది. భీకర రూపముతో కృత్య రాజుమీదికి పోవనుండగా చక్రము వచ్చి దానిని దహించి ఋషి

వెంట బడెను. కోపోద్రిక్తు డైనవానికి వివేకము తరుగును. తొలుత కృత్యను ప్రయోగించుటే దోషము. చక్రము వెంట బడినపుడు నమస్కారము చేసిన నెట్లుండెడిదో, తోచక ఋషి భయవిహ్వలుడై పరుగెత్తెను. ప్రథమతః బ్రహ్మలోకమునకు బరుగెత్తెను. విష్ణు నాభీ కమలమునుండి జన్మించిన బ్రహ్మ విష్ణుచక్ర నివారణము తన కసాధ్య మనెను. అనంతరము ఋషి సులభసాధ్యు డగు మహేశ్వరుని కడకు బోయి వేడెను. విష్ణువునకు అత్యంతాప్తు డగు మహేశ్వరుడు శక్తిసంపన్ను డయ్యు విష్ణువు సన్నిధికే పొమ్మని యుపదేశించెను. చివరకు దుర్వాసుడు నారాయణుని పాదములపై బడెను. శ్రీమన్నారాయణుడు సర్వశక్తిసంపన్ను డయినను భక్త జనులకు న్యూనత దా నిచ్చువాడు కాడు. కావున దుర్వాసునితో—

> "సాధవో హృదయం మహ్యం సాధూనాం హృదయం హ్యహమ్
> మ దన్యం తే న జానన్తి నా హం తేభ్యో మనా గపి,
> అతో హ్యాత్మాభిచార స్తే యత స్తం యాతు వై భవాŚ
> సాధుషు ప్రహితం తేజః ప్రహర్తుః కురుతే ౾ శివమ్"

అని చెప్పి, అంబరీషునికడకే పొమ్మనెను.

ఎంత శక్తిమంతు డయినను నిజశక్తిని నిష్కారణముగా ప్రదర్శింపరాదు. అందునను అనపరాధులు, సాధువులు నగువారల విషయమున నేమాత్రము చూపరాదు. మీదుమిక్కిలి అపకారమునకు దొరకొనరాదు. ఇట్లు ఆలోచితముగనో అనాలోచితముగనో చేసిన దుష్కార్యము ఎదురు తిరిగి వచ్చి బాధించును.

అంబరీషుడు మహాభాగవతు డగుటచే తన కపకారము తలపెట్టినవానికి మనసులోనైనను ప్రత్యపకారము తలపెట్టలేదు. సమస్తము భగవదధీనము చేయుటచే స్వయంకర్తృత్వము మాని చక్రమునే వేడినాడు, అహంకార మనుచితము, సాధువృత్తి సముచితము.

---

౬౫ బస్తోపాఖ్యానము :

అరణ్యములో మేక తిరుగుచు, కర్మవశమున నూతిలోనికి జారిన యాడు మేకను జూచి కామించి, తన కొమ్ములతో నూతి యొడ్డును కూలద్రోసెను. ఆడు మేక యీవలకు వచ్చి మగమేకను భర్తగా కోరెను. అజము సరే యని దానితో క్రీడించుచు, తన్ను కామించిన యాడుమేకల నన్నిటిని స్వీకరించి మత్తిల్లి వర్తించుచుండెను. నూతిలోనుండి వెడల దీసిన మేకను నిర్లక్ష్యము చేయగా, అది విచారించి, యుపాలంభనము చేసి విడిచి పోవుచుండ, మగమేక దాని వెంట బడి లోపరచుకొన జాలకుండెను. మేక యజమానుడు దాని కంగహాని కల్పించెను. అది క్రింద బడి విలపించి వేడుకొనగా బ్రాహ్మణుడు యోగవిదు డగుటచే లోపము తీర్చెను. అంతట ఛాగము మరల ఛాగితో క్రీడించుచు, ఎంతకాలమునకు విషయ సుఖమునుండి విరమింపలేదు.

---

ఈ యుపాఖ్యానమును యయాతి తన భార్య యగు దేవయానికి జెప్పినాడు. ఏ స్థితిలో చెప్పినాడు?

"స్త్రైణోపహ్నావ మాత్మనః బుధ్వా—"

పశువువలె నయితి నని యయాతి విచారించి, నవ్వుకొన్నాడు.

"భుక్త్వా భోగా మజాం హాస్యన్
అజవ ద్వృత్తి మాత్మనః
విడంబయన్ ప్రియా మాహ
నిర్వేదయితు మాత్మవాన్."

నిర్వేదము కలిగిన పిమ్మటనే వివేకోదయ మగును. ఎంతకాలము కాంతా భోగ మనుభవించుచున్నను తనివి తీరదు. శరీరము జర్జరితమై మృత్యువు నాహ్వానించుచున్నను విరతి తోపదు. కాని యేక్షణముననో భగవదను గ్రహముచేత మనస్సులోని యావరణము భగ్నమగును.

ఇందు అజా శబ్దము మేకను బోధించును. మేకకు కామ మెక్కువ యని ప్రతీతి. యయాతియు అజవృత్తి నవలంబించి, హాసించినాడు. ఇచ్చట అజా శబ్దము అవిద్యాపరము.

దేవయానియు బహుకాలము భోగము లనుభవించి యుండుటచే ఉపాఖ్యాన వ్యాజమును గ్రహించి భోగ విరత యయ్యెను. బోధ చేసిన యయాతి విరక్తు డయ్యె నని వేరుగా చెప్ప నక్కర లేదు.

---

## ౧౦ కుచేలోపాఖ్యానము :

శ్రీకృష్ణుని సఖు డైన కుచేలుడు విజ్ఞాన రాగాది విరహిత స్వాంతుడు, శాంతుండు, మానధనుడు, విజితేంద్రియుడు, బ్రహ్మవేత్త. బహు సంతాన ముండుటచే దారిద్ర్య బాధ ననుభవించుచు, అన్యులను నీచముగా యాచింపక, తనంతన లభించిన కాసును బంగారు నాణెముగా తలపోయుచు, సంతృప్తి చెందుచు, నెట్లో యతడు భార్యను, బిడ్డలను పోషించుచుండెను.

ఆతని భార్య ఆభిజాత్యము కల పతివ్రతాతిలకము. ఒకనాడు బిడ్డ లాకటిచే మలమల మాడుచు, అన్నము పెట్టు మని ఆకులు, గిన్నెలు చేతబట్టుకొని వచ్చి చుట్టును జేరగా నామె మిక్కిలి దుఃఖించి, భర్త కడకు బోయి "పేదరికము నివారించు నుపాయ మూహింపకున్నావు—

బాల్యసఖు డైన య ప్పద్మపత్రనేత్రు
గాన నేగి దారిద్ర్యాంధకారమగ్ను
లైన మము నుద్ధరింపుము, హరి కృపా క
టాక్ష రవిదీప్తి పడసి మహాత్మ, నీవు...

వరదుడు, సాధు భక్తజనవత్సలు, డార్త శరణ్యు, డిందిరా
వరుడు, దయాపయోధి, భగవంతుడు, కృష్ణుడు, తా కుశస్థలీ

పురమున యాదవ ప్రకరముల్ భజియింపగ నున్నవాడు, నీ
వరిగిన నిన్ను జూచి విభు డప్పుడ యిచ్చు ననూన సంపదల్.

కలలోనం దను మున్నెరుంగని మహా కష్టాత్ము డైనట్టి దు
ర్బలు డాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులో
దలపన్ తోడన మెచ్చి యార్తిహరుడై త న్నైన నిచ్చున్, సుని
శ్చల భక్తిన్ భజియించువారి కిడడే సంపద్విశేషోన్నతుల్?''

అని బోధించెను. కుచేలుడు సంతోషించి కృష్ణుని జూడ బోవుట యిహ
పర సాధక మని తలచి, భార్యతో "నీవు చెప్పినట్లు చక్రపాణిని జూడ
బోయినపుడు రిక్తహస్తములతో జనక, కానుక కొనిపోవలెను గదా? ఏ
మున్నది?" అనెను. ఆమె కొన్ని యటుకులు భర్త యుత్తరీయము
కొంగున గట్టిగా, నతడు గోవింద దర్శనోత్సాహియై బయలు దేరెను.
త్రోవలో నతనికి జంకు కలిగినది.

"ద్వారకా నగరములోని కెట్లు పోవుదును? అంతఃపురములోనికి
బోవునెడల ద్వారపాలకు లడ్డగింతురు. వారి కేమి బహుమాన మీయ
గలను? ఎక్కడి విప్రుడవు? ఇందుల కేల వచ్చితివి అన్న నేమి చేయుదును?
కృష్ణుడు న న్నుపేక్షింపడు. అతని చిత్తము, నా యదృష్టము" అని విత
ర్కించుచు బ్రాహ్మణుడు నగరములోను, క్రమముగా నగరిలోను ప్రవే
శించెను. వివిధ హర్మ్యములను జూచుచు, తుద కొక మందిరమున స్త్రీలు
చామరములు వేయుచుండగా భార్యతోకూడ కృష్ణుడు హంసతూలికా
తల్పముపై గానబడెను.

ఇందీవరశ్యాము వందిత సుత్రాము
కరుణాలవాలు భాసురకపోలు
హార్యతు నిభమధ్యు నఖిలలోకారాధ్యు
ఘన చక్రహస్తు జగత్ప్రశస్తు
కౌస్తుభాలంకారు కామితమందారు

సురుచిర లావణ్యు సురశరణ్యు
ఖగకులాధిపయాను కౌశేయపరిధాను
పన్నగశయను నబ్జాతనయను
మకరకుండల సద్భూషు, మంజుభాషు
నిరుపమాకారు, దుగ్ధసాగర విహారు
భూరిగుణసాంద్రు, యదుకులాంభోధి చంద్రు
విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణు కృష్ణు.
కని డాయం జనునంత కృష్ణుడు దళత్కంజాతు డప్పేద వి
ప్రుని నశాంతిత దరిద్రపీడితు, గృశీభూతాంగు, జీర్ణాంబరుఁ
ఘనతృష్ణాతురచిత్తు హాస్యనిలయుఁ ఖండోత్తరీయుఁ కుచే
లుని నల్లంతనె చూచి సంభ్రమ విలోలుండై డిగెఁ దల్పముఁ.

దిగి, యెదురు పోయి, బహువిధముల నాదరించి స్వాగతము పలికెను. రుక్మిణి చామరము వేసెను. శుద్ధాంత స్త్రీలు ఆశ్చర్యము చెందిరి.

కృష్ణుడు కుచేలుని చేయి పట్టుకొని, చిన్ననాడు గురుకులములోని సంగతులు కొన్ని జ్ఞప్తి చేసి, "నీవు ఉత్తమవంశసంజాతను పెండ్లియాడినా వనుకొందును. నీ మనస్సు ఐహిక విషయములందు లగ్నము కానట్టు తోచుచున్నది" అనెను. అనంతరము లోకసంగ్రహమును గూర్చియు, గురు మహిమను గురించియు సంభాషించి "ఒకనాడు గురుపత్ని నియో గమున ఇంధనార్థ మడవికి జని జడివానలో తడిసి, శే యెల్ల నచట గడపి నాము. ప్రాతఃకాలమున మన గురువు సాందీపని వెదకి వెదకి మనను కనుగొని, యూరడించి నిజమందిరమునకు గొనిపోయిన సంగతి జ్ఞప్తి యున్నదా?" యని, కొంత ప్రసంగించి, "నీవు వచ్చునపుడు నా కేమి యుపాయనము తెచ్చితివి?

దళ మైన పుష్ప మైనను
ఫల మైనను సలిల మైన బాయని భక్తిం

గొలిచిన జను లర్పించిన
నెలమిఁ రుచిరాన్నముగనె యేను భుజింతుఁ."

అనునప్పటి కుచేలుడు మోమోటమిచే అడుకు లీయనేరక తల వంచుకొని మిన్నకుండెను. కృష్ణభగవానుడు బ్రాహ్మణుని స్థితిగతులు దివ్యచిత్తమున గ్రహించి ముడి విప్పి, అటుకులు గుప్పెడు తీసికొని తిని, మరియొక గుప్పెడు తీసికొన బోవగా రుక్మిణి భర్త చేయి పట్టుకొని వారించెను. కుచేలు డారాత్రి గోవిందుని మందిరమున వివిధ రుచ్య పదార్థములు భుజించి, మృదుశయ్యాతలమున నిద్రించి, అరుణోదయమున లేచి కాల్య విధులు నిర్వర్తింప, కృష్ణు డతనిని కొంతదప్పు పంపెను. త్రోవలో విప్రు డిట్లు తలపోసెను: "పురుషోత్తముని దర్శించితిని. నా జన్మము ధన్య మయినది! సోదరునివలె నన్ను కృష్ణుడు బహువిధముల నాదరించినాడు.

శ్రీనిధి యిట్లు నన్ను బచరించి ఘనంబున, విత్త మేమియు
న్నీని తెరంగు గానబడె నెన్న దరిద్రుడు సంపదంధుడై
కానక తన్ను జేర డని కాక, శ్రితార్తిహరుండు సత్కృపాం
భోనిధి సర్వవస్తు పరిపూర్ణునిగా నొనరింప కుండునే?"

ఇట్లు తలపోయుచు నిజపురము జేరి, మహాసౌధమును గాంచి ఎవరిదో యనుకొనుచుండగా దివ్య వనితలవంటి తెరవలు గీతనృత్త వాద్యములతో నతనిని అంతిపురిలోనికి గొనిపోయిరి. దివ్యాంగనవలె నానందముతో కల కలలాడుచున్న నిజ భార్యను గాంచి యతడు సంతసించి, హాగిలబ్ధ వైభ వము లనుభవించుచు మనోవికారములేక హరిధ్యాన పరాయణుడై యుండెను.



జీవేశ్వరు లేకముగా నున్నను వారిని గూర్చి శ్రుతి యిట్లు చెప్పు చున్నది:

ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే;

తయో రన్యః పిప్పలం స్వా ద్వత్తి,
అనశ్న న్నన్యో అభిచాకశీతి.

కుచేలుడు జీవుడు, కృష్ణుడు ఈశ్వరుడు. జీవేశ్వరులకు తత్త్వతః భేదము లేదు. అయినను సంసారిత్వమువలన బ్రహ్మమునకే జీవత్వవ్యప దేశము సంభవించుచున్నది. పార్థివ శరీరమున బ్రవేశించిన పిదప జీవుడు కించిజ్ఞుడ ననియు, ఐశ్వర్యహీనుడ ననియును భావించును. సంసారి యగు టచే బుద్ధి తాదాత్మ్యము నొంది, స్వస్వరూపమును మరచి అనైశ్వర్యమునే పొందును.

కుచేల జన్మమునకు పూర్వము జీవుడు లౌకికైశ్వర్య మదమత్తుడై ఐహిక భోగముల ననుభవించుచు నారాయణ పరాయణత్వమును విసర్జిం చెను. దుష్కర్మాచరణమునకు ప్రతిఫలము వివిధ బాధా రూపమున నుండును. కుచేలుడు జన్మతః దరిద్రుడు. కు చేల మనగా జీర్ణ వస్త్రము. ఇక్కడ వస్త్రము లౌకిక భోగములకు సంకేతము. కుచేల మయినపుడు దారిద్ర్య చిహ్నమే.

"దరిద్రాయ కుటుంబితా." ధనహీనులకు సంతానము మెండు. కుచేలునకు మొత్తము ఇరువది యేడుగురు బిడ్డలు కలిగినట్లు ఒకచో గాన వచ్చుచున్నది. సర్వవిధముల సమర్థత యున్నను బహుసంతానము వలన బాధలు తప్పవు. అందులో తాను భరింప లేని బిడ్డలను గనుట దరిద్రునకు తగని పని. బిడ్డలకు గుడ్డలు తగినవి ఈజాలక పోవుట య టుండ, కడుపు నిండ అన్న మైనను పెట్టజాలడు. కావుననే కుచేలుని సంతానము ఆకలి చిచ్చుచే మాడుచు పట్టెడు గిరము పెట్టు మని యడుగుట సంభవించెను. ఆ వ్యథ భరింపలేక యొకనాడు అతని భార్య దారిద్ర్య నివారణమున కుపాయ మూహింపవలసిన దని కోరినది. అంతవరకు నతనికి ఈ విష యము తోచనే లేదు.

అందులో ఆభిజాత్యము! తనయంత లభ్య మయినదే పుచ్చుకొనును గాని అతడు యాచన చేయడు. ఎట్లో కుటుంబ పోషణము చేయు

చుండెను. అట్టివాడు ఏదో మందముగా నుండును. నిగ్రహము లేక బహుసంతానము కన్నను, అతని కొక గొప్ప సుగుణ మున్నది. అది నిరంతర హరిధ్యాన పరాయణత్వము.

ఆప్తోపదేశము లేకుండ ఉత్తమ కార్యాచరణ ప్రారంభము కానేరదు. ఆతని భార్య యొకనా డిట్లు చెప్పినది :

"నను, బ్రహ్మన్, భగవత స్సఖా సాక్షాత్ శ్రియః పతేః
బ్రహ్మణ్యా శ్చ శరణ్యా శ్చ భగవాన్ సాత్వతాం పతిః"

ఇందలి శబ్దములు సార్థకములు. ఇదియే ఉపదేశ మయ్యెను. దుష్కర్మశేష ముండుటచేతనే అప్పటికిని పెద్దమ్మవారు ఏవో సంశయములు కలిగించినది. గోవింద దర్శనోత్సాహిత్వము రక్షించినది.

లీలామానుష విగ్రహు డైన కృష్ణభగవానుని ప్రవర్తనము, సంభాషణము సంస్తవనీయములు. తాను భగవదవతారు డైనను లోక సంగ్రహార్థము శ్రీకృష్ణుడు అతిథి నెట్లు సత్కరింపవలెనో, బాల్యసఖు నెట్లు సంభావింపవలెనో లోకమున కొజ్జబంతివలె నిరూపము చేసినాడు. కుచేలుడు అంతిపురము లోనికి బోయి, మరునా డుదయము కృష్ణునివద్ద సెలవు తీసికొని పోవువరకును వర్ణిత మైన ఘట్టము మధురాతి మధురము ! మధురానాథు డగు మాధవుడే అట్టి చర్య చేయగలడు. అట్టి వాక్కులు పలుకగలడు !

పరమేశ్వరానుగ్రహమువలన కుచేలుని దౌర్భాగ్యము తొలగి పోయినది. క్షణ లేశములో ఆతని పురములో సమస్త సంపదలు సమకూడి ఆతనికై యెదురు చూచుచున్నవి. అయినను త్రోవలో నున్న కుచేలున కా విషయము తెలియదు. శ్రీనిధి తన్ను సర్వవస్తు పరిపూర్ణుని చేయలే దనియు, అట్లు చేయకుండుటకు కారణము సంపదంధుడు భగవానుని విస్మరించు ననియు తలపోయుట ఆతని యదృష్టమునకు సూచనయే.

ఆప్తోపదేశమువలన వివేకోదయ మయినది. పరమేశ్వరానుగ్రహము వలన నిజస్థితి—అనగా ఐశ్వర్యము లభ్య మయినది. అప్పుడు భగవానుని యెడ భావము దృఢతమ మగును. ఇంటికి జని కుచేలుడు సంపద లనుభవించుచున్నను మనస్సు భగవానునియందే లగ్నము చేసి యుండెను.

భూభారము హెచ్చి, వసుంధర గోరూపధారిణియై బ్రహ్మాదులను తరుచుగా ప్రార్థించినట్లు పురాణములవలన తెలియుచున్నది. భూభార మనగా జనబాహుళ్యము. ప్రాచీనకాలమునుండియు భరతవర్షమునకే కాక ప్రపంచమునకే యిక్కట్టు తెచ్చుచున్నది. ప్రజ సంతాన నిరోధకము చేసినగాని ప్రపంచము బాగుపడదు; లోకమునకు కుచేలత్వము తొలగదు.

---

## ౧౧ పింగళోపాఖ్యానము :

విదేహ నగరములో పింగళ యను స్వైరిణి కలదు. అనుదిన మామెకడకు విటులు వచ్చి, తగు ధన మిచ్చి, సంతోషముతో వెడలిపోవు చుందురు. ఇట్లు కొంతకాలము గడచెను. ఆమె ఒకరాత్రి వాకిలిగుమ్మము కడ సరసులకొరకు వేచి యుండెను, చాలతడవు ప్రతీక్షించినను ఎవ్వరును రాలేదు. కొంతసేపటికి సుందరు డొకడు కానవచ్చెను; కాని యతడును పింగళ యింటిలోనికి బోవలేదు. అమె లోనికి బోవుచు వీధిగుమ్మము కడకు వచ్చుచు నెన్నోసారులు తిరిగి శ్రమ బడెను. ఇంతలో నర్ధరాత్ర మయ్యెను. ఆమె యీ సంగతి గ్రహించి, రిచ్చపా టొంది విరక్త చిత్త ముతో లోనికి బోయి పండుకొనెను. ఒక్క క్షణములో నామె మనసు నుండి యాశ తొలగెను; జ్ఞానోదయముకూడ నయ్యెను.

అప్పు డామె—

"ఆశా హి పరమం దుఃఖం నైరాశ్యం పరమం సుఖమ్"

అనెను. ధనము వెచ్చించి తన యౌవనము హరించిపోవు నాథునకుతోడ

హేయభావము, తన్ను విడువని మనోనాయకు డగు అచ్యుతుని యెడ భక్తియు, నామెలో నంకురించెను. తోడనే యామె సుఖముగా నిద్రపోయెను. (సుఖం సుస్వాప పింగలా.)



ఈ యుపాఖ్యానమును అవధూత యదు సంవాదములోనిది. అవధూత కేవలము దత్తాత్రేయుడే యని కొంద రన్నారు. ఆయన సంభాషణలో తనకు పలువురు గురువు లున్నా రనియు, అందు పింగళయు కల దనియు పలికెను. మహానుభావు డగు దత్తాత్రేయుడు సామాన్యను గురుభావముతో దలచుట మిగుల నాశ్చర్యజనకము. కాని—

విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే, గవి, హస్తిని
శుని చైవ స్వపాకే చ పండితా స్సమదర్శినః"

అనునట్లు భేదబుద్ధితో నుండక, బాలా దపి సుభాషిత మ్మను విధమున మంచిని గ్రహించుచుండుగు.

ధనలోలుపయు, విటలోలుపయు నగు స్వైరిణికి క్షణలేశములో నిట్టి విరక్తియు, భక్తియు కలుగుటకు కారణము పరమేశ్వరానుగ్రహమే. కావున ప్రతి జీవియు ఆశను విసర్జింపవలెను. అదియే సకల దుఃఖములకును మూలము. కాంతా కనకములమీది యాశ విడువనివారలకు హృదయోన్మీలన మె ట్లగును? ఆశను ఖండించునది వైరాశ్యమే.

"నిర్వేద ఆశపాశానాం పురుషస్య యథా హ్యాసిః
న హ్యాంగా, జాత నిర్వేదో, దేహబంధం జిహాసతి."

ఈ యుపాఖ్యానము సంస్కృత భాగవత గృహీతము. ఆంధ్రభాగవతమున ఏకాదశ స్కంధములో పింగళ సూచన మాత్రము కలదు.



## ౧౨. మార్కండేయోపాఖ్యానము :

బ్రహ్మచర్య వ్రతము నవలంబించి మృకండు మహాఋషి, నారాయణ ధ్యానపరాయణుడై తపస్సు చేయుచుండగా నతనికి హరి హరులు ప్రత్యక్షమై వరము కోరు మనిరి. గుణగణాఢ్యు డయిన కుమారు ననుగ్రహింపు డని యతడు వేడగా, వారు మంచి దని, కోరిన వర మొసగి యంతర్ధాన మొందిరి. పిమ్మట ఋషికి మార్కండేయు డను కుమారుడు కలిగి, నియమ నిష్ఠాగరిష్ఠు డయి యుండెను. మృత్యువు వచ్చి తనను పాశబద్ధుని జేయగా మార్కండేయుడు మృత్యువును ధిక్కరించి పదివేల సంవత్సరములు తపస్సు చేసెను. అందుల కిందుడ్రు భయపడి, మార్కండేయుని తపోభంగము చేయుటకై దేవాంగనల నంపెను. వారు బహువిధ ప్రలోభములు చూపినను జటావల్కలధారియై, అగ్నిహోత్రునివలె నున్న ముని చలింపలేదు. దేవాంగనలు వెడలిపోయిరి.

అతని తపస్సునకు మెచ్చి హరి ప్రత్యక్షము కాగా, మార్కండేయుడు "దేవా, నీ దివ్యనామ స్మరణంబునం జేసి యీ శరీరంబుతోడనే యనేక యుగంబులు నేను బ్రదుకునట్లుగా జేయవే" యని వేడుకొనగా శ్రీహరి యటులే యనుగ్రహించిన, తన మాయా స్వరూపమును వివరింపు మని ప్రార్థించిన ఋషికి ఆ విషయము తెలిపి యంతర్ధాన మయ్యెను.

అనంతరము మార్కండేయుడు శివపూజచేయుచు, హరి స్మరణము మరచెను. మేఘములు బహుకాలము వర్షింపగా ధరాతలము జలమయము, అంధకారబంధురము నయ్యెను. జల మధ్యమున వటపత్రముపై పద్మరాగ ప్రభలతో వెలుగుచున్న పాదములు కల బాలుని గాంచి మార్కండేయుడు నమస్కరించి, యతని జఠరాంతమున సంచారము చేసి చేసి, బాలుని చరణ సంస్మరణమువలన వెలువడి, యతనిని కౌగిలింపబోయెను. బాలు డంతర్ధానము నొందెను. ముని యథాప్రకారముగా నిజాశ్రమము చేరి తపస్సు చేయజొచ్చెను. శాంకరీ సమేతుడై శివుడు ధరణిమీదికి దిగెను. అన్య

మేమియును గానక యేకాగ్రచిత్తుడై యున్న ముని హృదయమున శివుడు నిజ యోగమాయా ప్రభావముచే బ్రవేశించి, స్వస్వరూపమును జూపెను. మార్కండేయుడు పరమేశ్వరుని బహు ప్రకారముల స్తుతించెను. నీవు పరమ శైవుడ వని. మహాదేవు డనుగ్రహించెను. మార్కండేయుడు "దేవా, భవత్సందర్శనమున విష్ణుమాయా ప్రభావ మెరుగ నయ్యెను. నాకు నారాయణచరణధ్యానము, మృత్యుంజయము కలుగునట్లు అనుగ్రహింపవలె" నని ప్రార్థించెను, "నీకు జరా, రోగ, వికృతులు లేక కల్పకోటి పర్యంత మాయువు, పురుషోత్తముని యనుగ్రహము కలుగు" నని మహేశ్వరు డంతర్ధాన మొందెను.

---

"ప్రాకృతిక, నైమిత్తిక ప్రళయములలో నెవ్వరు నుండుటకు వీలు లేదుకదా! అట్టియెడ మార్కండేయుడు సప్తకల్పముల నెట్లు చూడ గలిగెను?" అని శౌనకుడు సూతు నడిగెను. ఆత డిట్లు చెప్పెను :

"మాయ అనాది. సమస్త బీజ సమాహార రూపమే మాయ. అన్ని కల్పములును మాయలో వాసనా రూపమున నుండును. "అఘటన ఘటనా పటీయసీ మాయా", అని ప్రసిద్ధమే కదా? కావున మార్కండేయుడు మాయా ప్రదర్శనమునే చూచి భ్రాంతి నొందినా డని గ్రహింపవలెను."

మార్కండేయుడు చిరంజీవులలోనివాడు. చిరంజీవి యన్నంత మాత్రమున ప్రళయకాలమునగూడ నుండువా డని తలపరాదు. ప్రళయ మున సమస్తము లయింపక తప్పదు. ఈ యర్థమును బోధించుటకై యీ యుపాఖ్యానము ప్రవృత్త మయినది.

భాగవతమున మార్కండేయుడు మృత్యువును ధిక్కరించె నని కాన వచ్చుచున్నది. పురాణాంతరములో నతడు మృత్యుంజయుని శరణు జొచ్చె ననియు, మహేశ్వరుడు మృత్యువును వారించి, భక్తుని రక్షించి, పదునా రేండ్లు వయస్సు మాత్ర ముండునట్లును, చిరంజీవి యగునట్లును అనుగ్రహించె ననియు తెలియవచ్చుచున్నది.

మార్కండేయుడు శివపూజ చేయుచు, హరి స్మరణము విడిచెను. తత్త్వతః విచారించినచో శివ కేశవులకు భేదము లేదు. శివ సాక్షాత్కారము వలన విష్ణు మాయా ప్రభావము గ్రహించి, మార్కండేయుడు మరల నారాయణ చరణధ్యానము కలుగునట్లు వేడినాడు. దీనివలన హరిహరా ద్వైతము సూచిత మగుచున్నది.



## ౧౩ ఉపసంహారము :

శ్రీమద్భాగవతము విష్ణు భాగవత మనియు, విష్ణు భక్తిచే మోక్షము కలుగుననియు కొందర నుచున్నారు. విష్ణు శబ్దము సర్వవ్యాపి యగు శుద్ధ బ్రహ్మ చైతన్యమునే సూచించుననియు, శుద్ధ మైన అద్వైత తత్త్వమునే శ్రీమద్భాగవతము బోధించుచున్న దనియు మరికొందర నుచున్నారు.

> జన్మా ద్యస్య యతో న్వయా దితరత శ్చార్థే ష్వభిజ్ఞ స్స్వరాట్
> తేనే బ్రహ్మ హృదాయ ఆది కవయే ముహ్యన్తి య త్సూరయః
> తేజో వారి మృదాం యథా వినిమయో యత్ర త్రిసర్గో మృషా
> ధామ్నా స్వేన సదా నిరస్త కుహకం సత్యం పరం ధీమహి.

ఈ శ్లోకము ప్రక్షిప్తము కా దని యంగీకరించిన పక్షమున, శ్రీమద్భాగవతకారు డగు కృష్ణద్వైపాయన వ్యాసుడు పీఠికలోని యీ శ్లోకమున బ్రహ్మ తటస్థ లక్షణమును కంఠోక్తిగా సూచించినాడు. కావ్య ప్రారంభములో "మనా క్కావ్యార్థ సూచనమ్" అన్నట్లే, ఉత్తమ గ్రంథోపక్రమములో తాత్పర్య బీజ ముండును.

బ్రహ్మసూత్రములను బాదరాయణుడు కాక కృష్ణద్వైపాయనుడే సంతరించె నని యంగీకరించుచో "జన్మా దస్య యతః" అను బ్రహ్మసూత్ర

ములో తటస్థ లక్షణమును చెప్పినట్లు స్పష్ట మగుచున్నది. భాగవతాంతర్గత దశమ స్కంధమున 87వ అధ్యాయమున శ్రుతిగీతోపాఖ్యానమును శుద్ధాద్వైత తత్త్వ ప్రతిపాదనమునకు తార్కాణముగా గ్రహింపవచ్చును.

పురాణము సముచ్చయము, "వేదార్థ ముపబృంహయేత్" అని ఆర్యోక్తి. వేదాశయము "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి." బ్రహ్మ మద్వితీయ మయినను "సో కామయ తబహుస్యాం ప్రజాయే యేతి" అనుటవలన నామరూపాత్మక మైన సృష్టి వ్యాప్త మయినది. పురాణ సముచ్చయము వేదార్థ విజృంభణము చేయు నన్నచో భాగవత పురాణము కూడ చతుర్వింశత్యవతారములను, వివిధేతిహాసములను, ఉపాఖ్యానములను వర్ణించినను, నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావ మైన అద్వితీయాఖండ బ్రహ్మ తత్త్వమునే నిరూపించిన దని గ్రహింపదగును.

తత్ప ద్బ్రహ్మార్పణ మస్తు!



# ఆంధ్ర
# మహా భాగవతోపన్యాసములు

## వాసుదేవ తత్త్వము-అవతారములు-
## భాగవత వైష్ణవము



శిరోమణి
శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు.

# యోగి సంఘమునకు నుత్తమ వ్రతములు వాసుదేవ నామవర్ణనములు

వాసుదేవుడు పరమార్థమగు తత్త్వము. ఆ భగవానుని దివ్యము లగు గుణగణములను వ్యక్తపరచు దివ్య చరిత్రము శ్రీ మహాభాగవతము. పరమపురుషుని గుణగణానుసంధానము సకల శుభముల నొనగూర్చును. గదా! ఆ కారణముననే తెనుగువారిమీద మిక్కిలి కృపతో పరమ భాగవతోత్తముడగు శ్రీ బమ్మెర పోతనామాత్యుడు ఆ భాగవతమును తెనుగున రచించి తెనుగు లోకమున కంతకును భుక్తి ముక్తులను సమకూర్చెను. ఆ మహానుభావుని వదనారవిందమునుండి వెల్వడిన కవిత మరందధార. దాని బిందువులు పద్యములు. అవి మధుర భక్తిని, మధుర రసభుక్తిని కల్గించుట తెనుగు లోకమున కంతకును అనుభవపునరుక్తమే. భక్తిరస ప్రవాహ మా మహనీయుని కవితాధారగా, స్రవన్తిగా ప్రవహించినది. అం దవగాహన మొనరించువారికి సంసార మలపంకమునుండి ముక్తి కల్గుటయు మొదటినుండి యున్నదే. అస లీ మహాభాగవతమునకు లోకప్రచారమును సమకూర్చిన మొదటి యధికారి శ్రీపరీక్షిత్తు, విష్ణురాతుడు ఈ ముక్తిభాగ్యము ననుభవించెనుకదా! ఈ తీరు గొప్పదనము గల యీ గ్రంథమును మహానుభావుడగు మన పోతన్నగారు తెనుగొనరించుట మన తెనుగు లందరి యదృష్టమును బంగారు పూవుల బూచి ఫలించుటయే. తెనుగునాట నన్ని గ్రంథములకన్న నీ పోతన్నగారి వదనారవింద మరందధారకే ప్రచార మధికము. దీనివలన నాప్యాయన మొందని యూరు తెనుగునాట నుండదనుట యతిశయోక్తి కాదు. అక్షరాస్యుడైన యే తెనుగువాడును ఈ మరంద ధారలోని బిందువు నొకదానినైన స్వీకరించి అనుభవింపకుండ నుండడు. నా చిన్ననాటి పెద్ద లందరును తెల్లవారుజాములపుడు మన మహనీయుని భాగవతములోని—

"నీ పాదకమల సేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం

స్త్రాపార భూతదయయును
తాపసమందార నాకు దయసేయగదే”

అను పద్యమును, గజేన్ద్రమోక్షము, రుక్మిణీ కళ్యాణములతోబాటు తమ పిల్లలకు జెప్పుచుండువారు, తాము నిత్యము ననుసంధించుచుండువారు.

“విద్యావతాం భాగవతే పరీక్షా” యన్నట్లుగా ననేకములగు వ్యాస పరాశర ఘట్టములతో నిండియున్న యీ మహాగ్రంథమును భేదించుట కెంతటి పాండిత్యము సహజముగా నుండవలెనో విద్వాంసులు మాత్రమే గుర్తింపగల్గుదురు. సహజ పాండిత్యముతో దండిగా నుండిన మన యీ పోతన్నగారే యీ గ్రంథమునుగూర్చి—

“భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు శూలికైన దమ్మి చూలికైన
(1-19)

అని యన్నారు,

నిజమునకు బై యర్హతను దలంచికొని గర్వించెనేని అత డీనాటి వఱకు నింతటి లోకపూజ్యపదము నొందగలడా? విను డా మహానుభావుడే యీ తీరు సందర్భమున నెట్లు ప్రహ్లాదుని ద్వారమున దెల్పెనో?

“అమలజ్ఞానత, దానధర్మరతి, సత్యక్షాంతి నిర్మత్సర
త్వములన్, యజ్ఞ తపో ఽ నసూయల గడున్ దర్పించు ధాత్రీసురో
త్తము కంటెన్ శ్వపచుండు ముఖ్యుడు, మనోర్థప్రాణవాక్కర్మముల్
సమతన్ నిన్ను నయించెనేని నిజవంశ శ్రీకరుం డా దుదిన్.”
(7-351)

అసలు ఈ భాగవతపు సాంప్రదాయమే అట్లు నడచుచున్నది. పరమ దుర్భేద్యమైన రహస్యామ్నాయమగు నీ మహాగ్రంథము భాగవత మును ప్రథమోపదేశకుడగు శ్రీ శుకమహర్షియు నారద, వ్యాసాది విబుధ సంప్రదాయమువలన విన్నంత, కన్నంత, దెలియవచ్చినంతయేకదా పరమ భాగవతాగ్రగణ్యుడగు పరీక్షిత్తునకు దేటపరచినాడు! ఇంకను కొంత వెను

కకు పరిశీలించినచో వ్యాసుకు, నారదుడునుగూడ నిట్టివారే యని తెలియ వచ్చును. ఈ మహాభాగవతము నెరిగినవారు "తమవరకే అది" అని యూర కొనకుండ సర్వార్థ సాధకమును, సకల దురన్త దుస్తర దుఃఖనిస్తారకమును నగు నీ గోవింద కథా సుధారసమును పరులకు-సంసార దుఃఖాంబుధిమగ్నులకు వినయ నమ్రీభావముతో దమంత దామే కోరి (ref-2-260) తేట పరచుట అత్యావశ్య కర్తవ్యమను విధి ఇందువలన బోధితమగుచున్నది. లేనిచో సకల నిరపేక్షులగు సంకర్షణ, సనత్కుమార, నారద, బృహస్పతి, పరాశర, వ్యాస, శుకాదులు ఈ మహావిషయమును లోకములోనివారి కేల యుపదేశింప తమంత వత్తురు? అథవా-సనందనాది విష్ణురాతునివర కున్న ఉపదేశ్యులుకూడ నుపాయాన్తరములబ్రవర్తింపక "ఇదియే కావలెను" అను నాసతో నేల బ్రవర్తించిరి? ఈ భాగవతము నుపదేశింపగల యుపదేశ కుల యాగమనమునే విష్ణురాతాదు లేల యాశించిరి? వినుడు సమాధాన మును :

"శ్రీమంతమై మునిశ్రేష్ఠకృతంబైన భాగవతంబు సద్భక్తితోడ
వినగోరువారల విమలచిత్తంబుల జెచ్చెఱ నీశుండు సిక్కుగాక
ఇతర శాస్త్రంబుల నీశుండు సిక్కునే? మంచివారలకు నిర్మత్సరులకు
గపట నిర్ముక్తులై కాంక్ష సేయక యందు దగిలియుండుట మహా
తత్త్వబుద్ధి.
పరగ నాధ్యాత్మికాది తాపత్రయంబు నడచి పరమార్థభూత
మై యధిక సుఖదమై సమస్తంబుగాకయు నయ్యునుండు వస్తు
వెరుగంగదగు భాగవతమునందు." (1-36)

అంతేకాక

"వరగోవింద కథా సుధారస మహావర్షోరుధారాపరం
పరలంగాక బుధేన్ద్రచంద్ర! యితరోపాయానురక్తిం బ్రవి
స్తర దుర్ధాన్త దురంత దుస్సహ జనుస్సంభావితానేకదు
స్తర గంభీర కఠోర కల్మష కనద్దావానలంబాఱునే."

కనుకనే

"నలిన నయన భక్తినావచేగాక సంసార జలధిదాటి చనగరాదు
వేయునేల మాకు విష్ణుప్రభావంబు, దెలుపవయ్య సూతధీసమేత!"

అని శౌనకాదులు సూతు నడుగుటయు, సూతుడు——

"వేదకల్పవృక్షవి,గళితమయి'శుకముఖసుధాద్రవమున మొనసియున్న
భాగవత పురాణఫల రసాస్వాదన పదవి గనుడు రసికభావవిదులు"

అని సమాధానించుటయు సంభవించినది.

"నిగమ విభజన విద్యోల్లాసు" డగు శ్రీ వేదవ్యాస విబుధునివలన దా నీ మహాభాగవతమును విన్నంతయు "బ్రహ్మతత్పరుడై యుత్తమ శ్లోక లీలోత్సవమున నాకృష్టచిత్తుడై పఠించిన" తాను కన్నంతయు రాజు "హరిభక్తు డగుటఁజేసి, యెఱిగింతు" నన్నాడు. ఆ సంప్రదాయము నుండి తొలగకుండగానే మన భాగవత రత్నము శ్రీ పోతన్నగారుకూడా "విబుధవరులవలన విన్నంత కన్నంత తెలియవచ్చినంత తేటపఱతు"నన్నారు. దేనిని? శ్రీ వాసుదేవనామ వర్ణనాత్మకముగా వెలసిన యీ మహాగ్రంథ మును-శ్రీ భాగవతమును.

అయితే శ్రీ శుకయోగివద్ద కృష్ణద్వైపాయనుడు విబుధుడు. ప్రకృతములో మన పోతన్నగారికడ నెవరో విచారింపవలసి యున్నది. మన వెనుకటి పరిశోధకులు, పురాణం హయగ్రీవ శాస్త్రిలుగారు, తం. తెవప్పెరుమాళ్ళయ్యగారు, నాగపూడి కుప్పుసామయ్య B. A. గారు వీరలు శ్రీధరస్వామియే మన పోతన్నగారికడ విబుధులని తెల్పుచున్నారు. శ్రీధరులు శ్రీ భాగవతమునకు "భావదీపిక" యను వ్యాఖ్యను వ్రాసిరి. ఇంతే కాక ఈ శ్రీ భాగవతమునకు ఇంచుమించుగా మూల మనదగిన విష్ణు పురాణమునకుగూడ వ్యాఖ్య రచించియుండిరి. వారు "అద్వైతులు" అని పెద్దలు—ఇందాకటి వారు అనెదరు. కాని శ్రీ శంకరభగవత్పాదుల-అద్వైతముతో వీరు భేదింతురు. అద్వైతులని పిలువబడు చాలమంది శంకర భగ

వత్సాదులతో భేదింతురు. విజ్ఞాన భిక్షువు, మధుసూదన సరస్వతి, అద్వైతానంద తీర్థులు మొదలగువా రిట్టివారే. మన యీ శ్రీధరస్వాములు శ్రీ భాగవతములోని యీ క్రింది శ్లోకము నిట్లు వ్యాఖ్యానించిరి.

తచ్ఛ్రద్దధానాఃమునయో జ్ఞాన వైరాగ్యయుక్తయా
పశ్యన్త్యాత్మనిచాత్మానం భక్త్యాశ్రుత గృహీతయా. (1-2-13.)

శ్రీధర వ్యాఖ్య:

తచ్చతత్త్వం సపరికరయా భక్త్యైవప్రాప్యతఇత్యాహ
"తదితి" తదిత్యవ్యయం, జ్ఞాన వైరాగ్యయుక్త యేత్యత్రిజ్ఞానంపరోక్షం తచ్చతత్త్వమాత్మని క్షేత్రిజ్ఞేపశ్యన్తి, కింతత్? ఆత్మానం= పరమాత్మనం, శ్రుతేన—వేదాన్తాది శ్రవణేన, గృహీతయా=ప్రాప్తయేతి భక్తేర్విశ్వర్యముక్తం.

దీనిని మన పోతన్నగా రిట్లు తేటపరచిరి.

"వేదాన్త శ్రవణంబున గ్రహింపబడి జ్ఞానవైరాగ్యంబులతోడం గూడిన భక్తిచేత దత్పరులైన పెద్దలు క్షేత్రజ్ఞుండైన యాత్మయందు పరమాత్మం బొడగందురు. (1-58)

ఈ క్షేత్రజ్ఞుడగు జీవాత్మునందు పరమాత్ముని బొడగనుట ద్వైతుల పద్ధతియేనా? విచక్షణులు విచారింపగలరు.

సరి! అది యట్లుంచుడు. ప్రకృతములో మన పోతనామాత్యు లనుసరించిన విబుధులుశ్రీధరస్వాము లనుటలో మన వెనుకటివారు ఏకకంఠులుగా నుండుట పై యుదాహరణలవలన సోపపత్తిక మగుచున్నది. ఇట్లు ఈ మహాభాగవతమున జాలచోట్ల, చాలచోట్లేమి? అంతటనుగూడ ప్రశంసింపబడినవి. శ్రీ వాసుదేవుని దివ్యగుణ చరిత్రనామాదులు. అవి శ్రీధరస్వాముల వ్యాఖ్యానుసారముగా ప్రశంస నొనర్చుటలో మన పోతన్నగారొక సాంప్రదాయికమగు ఫక్కికను నిలువబెట్టి రనుట సువ్యక్తమగును. ఖాగా ఎవరి నామ భాషణములు యోగివరులకు, బ్రహ్మ ప్రాప్తిని గోరి

యోగము నభ్యసింపగోరువారికి ఉత్తమ వ్రతముతో అట్టి శ్రీ వాసుదేవుని తత్త్వ మేదియో విచారించి తెలిసికొందము.

**భీష్మ స్తుతిలో విషయత్రయము :**

ఈ వాసుదేవతత్త్వము, అవతారములు, భాగవత వైష్ణవము అను మూడు విషయములును "భాగవతము" అను పేరునందే యివి వ్యక్తము లగుచున్నవి. ఏమనగా భగవంతునకు సంబంధినదియు భాగవతమే. అప్పుడు వాసుదేవ తత్త్వము అర్థమగును. భగవంతునిదైన యవతారమును భాగవతమే. దానినిగురించి చెప్పునదియు భాగవతమే.

భాగవతులు శ్రీ వైష్ణవులు, భగవంతుని భక్తులు. వారిని గూర్చి తెల్పునదియు భాగవతమే.

ఇట్లు భాగవతమను పేరే వాసుదేవతత్త్వమును, అవతారములను, భాగవత శ్రీవైష్ణవమును తెల్పును.

అదియునుగాక భాగవతపు టుపక్రమములో మొదటి స్కంధ ములో భీష్ముడు శ్రీకృష్ణుని స్తుతించు ఘట్టమున నీ మూడు విషయములును వ్యక్తము లగును. గమనింపుడు.

"త్రిజగన్మోహన నీలకాన్తి తనువుద్దీపింప ప్రాభాత నీ
రజబంధుప్రభమైన చేలము పయిన్ రంజిల్ల నీలాలక
వ్రజ సంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుం జేరెడు వన్నెలాడు మది నావేశించు నెల్లప్పుడున్."

(1-218)

మొదటి పదములోనే "సర్వత్ర వసతిదీవ్యతి" యీ వాసుదేవ పద మున నర్థ మతి రుచిరదీప్తముగానున్నది. త్రిజగత్తులకును, సమస్త లోక ములను వాసుదేవుని తను నీలకాన్తి ఉద్దీపించుచున్నదట. "మా విజయుం

జేరెడు వన్నెలాడు" అనుటలో విజయ సఖుడైన వసుదేవుని సుతుడు వాసుదేవుడు వ్యక్త మగును.

ఈ విజయుని జేరుటలోనే భాగవత వైష్ణవ స్వరూపము వ్యక్త పరుపబడినది.

## వాసుదేవుని ప్రాచీన చరిత్రము

నీ మహానుభావు డెట ప్రశంసింపబడినాడో ఈ మహానుభావు డెంతటి అనాదినిధనుడో ఈతని చరిత్రమును మనము విచారింపవలసియున్నది.

ప్రకృత కాలమున పాశ్చాత్యుల పద్ధతి ప్రకారముగా శాసనాద్యాధారముల నిర్ణీతమగుట అత్యవసరము. శంఖమున బోసినగాని తీర్థముకాదు కదా! ఆ పద్ధతిలో బెస్ నగర శాసనము మన కన్నింటికన్న ముందుగా నుపయోగించుచున్నది. అచట — రాజపుటానాలోని "ఘొసుండి" యను చోట నొక గొప్ప హాలునకు చుట్టునున్న యొక గోడ శిథిలమైన స్థితిలో నగుపడును. ఆ గోడమీద శ్రీ వాసుదేవునియొక్కయు, బలదేవుని యొక్కయు పూజాస్థానమునకు చుట్టును కట్టబడిన దీ గోడయని వ్రాసి తెల్పబడియున్నది. ఆ శాసనాక్షరముల జూచినచో నది, చిట్టచివరకు B.C. రెండవ శతాబ్దమున కీవల దెంతమాత్రముకాదని తేలును.

మరియు నీ మధ్య క్రొత్తగా కనుగొనబడిన బెస్‌నగర్ శాసనము నందు "హెలియొడొరా (Heliodora) అను నొక యవనుల రాయబారి" ఒక స్తంభమును తాను వాసుదేవుని గౌరవించుటకై స్థాపించితిననియు దాని చివర గరుడుని బొమ్మకూడ నేర్పరుపబడినదనియు, నా గరుడ ధ్వజమును దేవదేవుడైన శ్రీ వాసుదేవుని పూజించుటకు లేదా గౌరవించుటకు గాను దా నేర్పరచితిననియు, దాను భాగవతుడ ననియు" తెల్పుకొనెను. ఇతడు "డియా" అనునతని కుమారుడు. తూర్పు మాల్వాదేశము నా కాలమందేలుచున్న భాగభద్రుని కొడుకు అంతిలకిలకునివద్దనుండి యవనుల

గ్రీకుల రాయబారిగా వచ్చెను. తక్షశిల యితని స్వస్థలము. తనను తన నోటితో "భాగవతుడన"ని తెల్పుకొనెను. ఈ "యన్తిలతిలక" అను పేరు బాక్ట్రో గ్రీకు (బాక్ట్రియన్సు గ్రీకులు) నాణెములమీద ముద్రింపబడియున్న "అన్తిలిడాస్" అనుదానితో చాలవరకు సరిపోవుచున్నది. ఈ పేరులోని యక్షరములబట్టియు నిది క్రీస్తుకు పూర్వము రెండవ శతాబ్దముకన్న బూర్వపు దనియే స్పష్టపడుచున్నది. ఇందువలన నా కాలమున వాసుదేవుడు అత్యధికముగా దేవదేవుడుగా బూజింపబడుచుండెననియు, తమ మతము భాగవత మతమనియు, వాసుదేవ మతానుయాయులు భాగవతులనియు, ఈ భాగవతమతమును గ్రీకులుగూడ స్వీకరించి గౌరవించి ఆ మతానుష్ఠానముల నొనరించిరనియు స్పష్టమే యగుచున్నది కదా! ఈ మతము-వాసుదేవుని దేవదేవునిగా బూజించునట్టి యీ భాగవత మతము ఇండియా యొక్క వాయవ్య భాగమున=గుజరాట్ మొదలయిన ప్రాంతములందు బాగా వ్యాపించినది. దాని వ్యాప్తి విశేషమువలన నానాటి గ్రీకులు మొదలగు విదేశీయులుకూడ ఈ మతమును స్వీకరించి తమను "భాగవతులు" అని చెప్పుకొనుట మిక్కిలి గౌరవముగా సంతోషముతో నొప్పుకొనిరి.

ఇంకను నానాఘాటునందలి యొక పెద్ద గుహలోని ౧ వ నంబరు శాసనములో "సంకర్షణ వాసుదేవులు" అను ద్వంద్వసమాసములో నీ రెండు పేరులు కలిసి కనుబడుచున్నవి. అచట ఇతర దేవతల పేర్లుకూడ ఆ ప్రస్తావనలో నున్నవి. ఒక యుత్సవ ప్రారంభమును నిరూపించుచున్న యీ శాసనము అక్షరములుకూడ క్రీస్తుకు పూర్వము మొదటి శతాబ్దమునకు సంబంధించినవిగా గన్పడుచున్నవి.

ఇంకొక విషయముగూడ ఈ సందర్భములో ముఖ్యముగా ప్రశంసింపక తప్పదు. B. C. నాల్గవ శతాబ్దములో నానారకములైన మతములు, మూఢ విశ్వాసములు, పూజలు నున్నట్లుగా "నిద్దేశ" మను బౌద్ధగ్రంథము తెల్పుచున్నది. ఇది వ్యాఖ్యాన గ్రంథమేయైనను పాలిభాషలోని బౌద్ధ

మత గ్రంథములలో ప్రధానముగానే యెన్నబడుచున్నది. అం దిట్లున్నది: "ఆజీవకుల దేవతానుయాయులు ఆ జీవకులయు నిఘన్త దేవతాను యాయులు నిఘన్త జటిల దేవతానుయాయులు జటిలులు పరిబ్బా(వ్రా)జక దేవతానుయాయులు. పరిబ్బా(వ్రా)జకులు, అవరుద్ధక దేవతానుయాయులు, అవరుద్ధకులు. అశ్లే ఏనుగ, గుఱ్ఱము, కాకి, కుక్క, వాసుదేవ, బలదేవ, పున్న (పూర్ణ), భద్ద (ద్ర), మానిభద్ద (ద్ర), అగ్ని, నాగ, సుపన్న (ర్ణ), యక్ష, అసుర, గన్ధబ్బ (ర్వ) మహారాజు, చణ్డ, సూర్య, ఇన్దియ. బ్రహ్మ, దేవ, దిశలుగా పేర్కొనబడుచుండిరి. (ఈ విషయమును ధర్మానన్ద కేశాంబి తెల్పెనని శ్రీరామకృష్ణ గోపాల భాండార్కర్ గారు వ్రాసిరి.)

బౌద్ధులు నాస్తికులు కనుక, వాసుదేవ, బలదేవ పూజకులకు కుక్క నక్కను పూజించు వారిలోను వాసుదేవ, బలదేవులను కుక్క, ఏనుగ, గుఱ్ఱము, కాకి మొదలగు వానితోను గలిపినా, మనము వాస్తవముగా బరి శీలించుచో నీ వాసుదేవుడు, అతని పూజ, అతని మతము ఇది యంతయు ఈ భరతభూమిలో గొప్ప భాగమున నెక్కువగా వ్యాపించిరనియు, వీని గొప్పదనము అవ్యాహతమును, అపరిహరణీయమును, అనిరాకరణీయమును అని తెలియును. ఎట్లనగా-బెల్వాల్కరు తెల్పినట్లుగా బౌద్ధమతగ్రంథములేని అష్టాధ్యాయిని రచించి B. C. ఏడవ శతాబ్దమునకు బూర్వమునందే యున్న పాణిని మహర్షి తన వ్యాకరణ సూత్రములలో "వాసుదేవార్జునాభ్యాం వుణ్" (4-3-98) అని సూత్రించినాడు. అట వాసుదేవుని భజించు వాడు వాసుదేవకు డనంబడునని దాని యర్థము. ఈ సూత్రమున కొకటి రెండు సూత్రములకు వెనుక "భక్తిః" అని సూత్రించినాడు. కాగా పై జెప్పిన యర్థమే (వాసుదేవః భక్తిరస్య-వాసుదేవకః) ఏర్పడక తప్పదు. ఇంకను గొంత పూర్వము "బుష్యంధక వృష్ణి కురుభ్యశ్చ" అను సూత్రముతో నీ వాసుదేవుడు వృష్ణి వంశములోని వాడని తెల్పినాడు. వృష్ణీనాం వాసుదేవోస్మి అని గీత తెల్పునుకదా! ఇట "వాసుదేవ" శబ్ద మేల ముందు వాడబడినదను ప్రశ్నకు పతంజలి మహర్షి ఆ సూత్రభాష్యములో

"నైషా క్షత్రియాఖ్యా సంజ్ఞైషా తత్ర భగవతః" అనెను. ఇందువలన వసు దేవగోత్రజుడైన క్షత్రియునిగా తెల్పునది మాత్రమే యిట వాసుదేవ శబ్ద మును ప్రయోగింపబడలేదనియు, తత్ర—ఆ వసుదేవ గోత్రజుడైన క్షత్రి యుడు భగవానుడేనని తెల్పుట కిట భగవానుని నామము "వాసుదేవ" యని యుపయోగింపబడెననియు వ్రాసెను. (ఇందువలన "ఏషా", "తత్ర" అను పదములను జాగ్రత్తగా పరిశీలించినచో మేము తెల్పిన యభిప్రాయమే కన్పట్టును.) మరియు ఋష్యన్ధక వృష్ణి కురుభ్యశ్చ (4-1-113) అను సూత్రభాష్యములో "వృష్ణో ఉ వకాశః—వాసుదేవః బాలదేవః" అని యుదాహరించుటవలన వృష్ణివంశజుడై బలదేవుని నిత్య సహవాసియగు, శ్రీ వసుదేవుని కుమారుడైన క్షత్రియుడే వాసుదేవుడని తేలుటయే కాక ప్రకృత సూత్రములో (4-3-93) భాష్యము "తత్ర" యను పదము వలన నిట నా వాసుదేవుని క్షత్రియుడుగా తెల్పుట తలంపుగాదు. భగ వానుడుగా అనగా పరమాత్మ యగు పరవాసుదేవునిగా దెల్పుటకై యిట సూత్రములో మొదట "వాసుదేవ" పద ముపయోగింపబడెనని స్పష్టమొనర్చెను. ఈ పతంజలి మహర్షి భాష్యమును, పాణిని మహర్షి సూత్రమును జక్కగా గ్రహించువారికి B. C. ఏడవ శతాబ్దమునకు బూర్వమే ఈ మహానుభావుడు వాసుదేవుడొక దేవదేవుడుగా, మతసిద్ధాం తమునకు ప్రధానలక్షణముగా, పరమపూజితుడుగా నుండెననియు, నాతడే భగవంతః డను పేర బరగుననియు, నతని యర్చనమే భాగవతతంత్రమను పేరున బరగు పాంచరాత్రాగమమనియు, నాతని గూర్చిన మతమే భాగ వత మతమనియు, నాతని భక్తులే భాగవతశబ్దమునకు ముఖ్యార్థ మనియు స్పష్టసిద్ధాంతమని తేలును. ఇక "శివభాగవతా"ది శబ్దములు వ్యతిరేక ముఖమున శివాదులు గౌణార్థములనియు, వారి భక్తులును అట్లే గౌణు లనియు తెల్పుచు పై ముఖ్యార్థమును వ్యతిరేకముఖమున దృఢపరచు చున్నవి.

నిజమున కిది యంతయు కేవల మనావశ్యకము. అసలు శ్రీమహా భారతమునందే శాన్తిపర్వములో నారాయణీయమున నీ వాసుదేవునిగూర్చి

కావలసినంత ప్రసంగ మున్నది. ఎవరి మతమునందైనను ఆ మహాభారతము **B. C.** 12 వ శతాబ్దమున కీవలిది కాదుకదా? కనుక నట మన గ్రంథములనుండియే యీ విషయము దృఢముగా షుమారు మూడువేల సంవత్సరములకు బూర్వమునుండి సుప్రసిద్ధముగా నున్నదని తేలుచుండగా నీ పాశ్చాత్యుల అరగొర మాటలతో, అసందర్భపు ప్రమాణములతో మనము నిరూపింపవలసిన పనిలేదు.

ఇంకొక విషయముగూడ మన మిట బ్రస్తావించుకొనక తప్పదు. ఈ వాసుదేవుని ప్రసంగము ఈ మహాగ్రంథములో పాంచరాత్రాగమమునకు సంబంధించియే కూర్పబడినది. పాంచరాత్రాగమములోని పరవాసుదేవుడు, వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహములు ఇవి యన్నియు నిందు ఆ యాగమోక్తమగు నర్చా విధానముతో సంబంధింపజేసి ఆ పాంచరాత్రాగమపు బేరు బేర్కొని ఇవి యన్నియు నిట సృష్టి ప్రక్రియా నిరూపణమున బ్రసంగించబడినవి, ఇందువలన వాసుదేవునకును పాంచరాత్రాగమమునకును ఘనిష్ఠమగు సంబంధము కన్పడుచున్నది. వాసుదేవుని ప్రధానముగా నేర్పరుచుకొనియే యీ పాంచరాత్రాగమము బయలుదేరినది. భగవద్గీతలోగూడ "వాసుదేవ స్సర్వమితి సమహాత్మా సుదుర్లభః." "వృష్ణీనాం వాసుదేవోస్మి" యనుటయే కాక మరొకచోట గూడ "వాసుదేవ" శబ్దము వాడబడినది. ఇందువలన గీతాశాస్త్రము పాంచరాత్రాగమము నాధారముగా గొనియే అది యేమి? అనగా పాంచరాత్ర తంత్రమే గీతగా బోధింపబడినదని స్పష్టము. పాంచరాత్రాగమమున బోధింపబడు సాంఖ్యము, జ్ఞానయోగము, భక్తియోగము, భక్త్యైక ప్రాధాన్యము కదమవానివలన భగవంతుని ప్రాప్తి కలుగదనుట యివి యన్నియు బాంచరాత్రాగమ సిద్ధాంతములే. మరియు గీతలో కర్మయోగ సహితమగు విజ్ఞానమునకే—అనగా జ్ఞానగర్భితమగు కర్మయోగమునకే ప్రాధాన్య మీయబడినది. "తయోస్తు కర్మసన్యాసాత్ కర్మయోగో విశిష్యతే" అని. పాంచరాత్రాగమము భాగవతమునుగూడ

వాసుదేవారాధనాత్మకమైన కర్మమునకే వాసుదేవతత్త్వ విజ్ఞానసహితమై యున్నదానికే ప్రాధాన్య మొసగినవికదా? కదమ యన్ని యుపాయ ములకన్న నవవిధ లక్షణములుగల భక్తియే పరమ సులభమును, భగవ త్ప్రాపకమును నగు నుపాయముగా బ్రహ్మదేవుడు నారదునితో ద్వితీయ స్కంధమున దెల్పియున్నాడు. ఇందువలన గీతయు భాగవతమును పాంచ రాత్రాగమైక మూలములే యనుట స్పష్టము.

ఇంకొకటి గీతయొక్క ఆచార్య సాంప్రదాయమును వినుడు.

"ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయం
వివస్వాన్మనవే, ప్రాహమను రిక్ష్వాకవేఽబ్రవీత్
సకాలేనేహమహతా యోగోనష్టః పరంతప"

అని. విష్ణువు వివస్వంతునకు, అతడు వైవస్వత మనువుకు, అతడు ఇక్ష్వా కునకు దెల్పినట్లున్నది గీతలో, ఋగ్వేదము దశమమండలములో "అష్టౌ పుత్రాస అదితేరాస" యను ఋక్కులో అదితియొక్క మొదటి కొడుకు విష్ణుడు, చివరి కొడుకు వివస్వంతుడు. పెద్దవాడు చిన్నవానికి తత్త్వోప దేశ మొనర్చుట యుక్తమేకదా! వివస్వంతునివలన నుపదేశమొందిన మనువు ఈ పాంచరాత్రాగమమునుండియే మనుస్మృతిలోని ధర్మములను దెల్పినటుల "అస్మాత్ప్రవక్షతే ధర్మాన్ మను స్వాయంభువ స్స్వయం"అను శ్లోకము తెల్పును. మనువువలన నిక్ష్వాకు వుపదేశమొందెననుట కుదాహర ణముగా శ్రీ రామాయణము బాలకాండలో నలువదియవ సర్గములో "వాసుదేవ" శబ్దమే కాక ఉత్తరకాండములో స్పష్టముగానే పాంచారా త్రాగమము, వాసుదేవ పరమాత్మైక సంబద్ధ మగునది ప్రశంసింపబడి యున్నది. ఏ చారిత్రికుల పక్షముననైనను రామాయణము భారతమున కన్న చాల ప్రాచీనమే కదా! అచటనే కల "వాసుదేవ" శబ్దము, పాంచ రాత్రాగమము. ఇవి వాసుదేవుని దేవదేవునిగాను, అనాదికాల, ప్రసిద్ధుని గాను అతని మతము, అతని పూజావిధానముగూడా అనాదికాలము

నుండియు ప్రవర్తించుచు సకల ప్రామాణికులైన ఆస్తికుల కత్యాదరణీయము లుగా నున్నవనియు బ్రకటించుచున్నవి.

మనము ఇంతదూరమువరకును విచారించిన శాసనాదికమంతయు శ్రీ వాసుదేవునియొక్క బాహ్య స్వరూపావధులుమాత్రమేకాని నిరవధికుడు, నిరవధిక మహిమోజ్జ్వలుడునగు నా మహానుభావుని యన్త స్వరూపము కాదు. ఇకను ఆ వాసుదేవ పరమాత్మయొక్క అన్తస్తత్వ పరిచయమునకై బ్రాకులాడుదము. అది తెలిసినగదా, అది పరిచితమైనగదా, దానిని భజించినగదా మన జన్మ సార్థకమగును. పరమాత్మ ప్రాప్తికల్గును.

## శ్రీ వాసుదేవ తత్త్వము

శ్రీ వాసుదేవుని స్వరూప తత్త్వము ఈ వ్యాస ప్రారంభము నందలి శ్లోకమువలననే యెరుగవచ్చును. "వసతి, దీవ్యతి" యని యొక వ్యుత్పత్తి "వాసయతి, దీవ్యతి" యని మరొక వ్యుత్పత్తి ఈ "వాసుదేవ" పదమునకు ఈ రెండు వ్యుత్పత్తుల మూలముగా వాసుదేవ పదము బోధించు నర్థమే ఆ శ్లోకములో దెలుపబడినది. "సర్వత్రాసౌవసతి", "సమస్తంచవసత్యత్ర" అని యీ రెండు వ్యుత్పత్తులకును క్రమముగా సంస్కృతములో నర్థము తెలుపబడినది. అంతటను నుండువాడు, అంతయు నితనియందాధారపడియుండును. అని వాని యర్థము. ఈ యర్థము లింతకు "వాసు" అన్నంతవరకే, మిగిలిన "దేవ" పదము "వెలుగొందువాడు" అను నర్థముతోబాటు ననేకార్థములు సమర్పించును. దివు ధాతువునకు— క్రీడ, విజిగీష, వ్యవహారము, ద్యుతి, స్తుతి, మోదము, మదము, స్వప్నము, కాన్తి, గతియు నర్థములు. కనుక నంతటను నిండియుండి ఇన్ని పనులను జేయుచుండుననియు, చతుర్వ్యూహములు, వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులను నాల్గు వ్యూహములును ఇచట స్పష్టముగా నిరూపింపబడినవి. అందులో ముఖ్యముగా స్వీకరింపబడిన వాసుదేవ ద్వాదశాక్షరి మంత్రమే యిట ప్రధానముగా నవలంబింపదగు మంత్రమనియు

దాని యర్థము ననుసంధించుచు నిరంతరము ప్రీతిపూర్వకముగా ధ్యానించుటవలననే వాసుదేవప్రాప్తి రూపమైన పరమ పురుషార్థములభించుననియు చెప్పబడినది: మోక్షమునకన్న కూడ నత్యధికమైనది శ్రీ వాసుదేవుని దివ్య మంగళ విగ్రహ సేవనమని పరమైకాన్తులగు భాగవతులు మోక్షమునుగూడ అభిలషింపక శ్రీపరవాసుదేవుని దివ్యమంగళ విగ్రహమును, ఆమహానుభావుని దివ్యచరిత్రమును కీర్తించుచుందురనియు (3-879), మరికొందరు భాగవతోత్తములు వాసుదేవుని దివ్యావతారములను యోగ మహిమతో ప్రత్యక్షమొనరించుకొని యనుభవించు ఆ మహనీయుని పలుకులు స్తుతించుచు ఆ దేవు మంగళ విగ్రహ దర్శనానుభవము నందలి ప్రీతిచే మోక్షమునుగూడ నభిలషింపక యుందురనియు (3-880). మోక్షముకన్నగూడ నిర్హేతుకమైన భగవత్సేవయే గరిష్ఠ మనియు నిట (3-878) జెప్పబడినది.

ఇక నీ వాసుదేవ తత్త్వమును భాగవతములో మన పోతనామాత్యు లెట్లు నిరూపించిరో కనుగొందము,

జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు అను నారు గుణములతో నిండియున్న దీ పరవాసుదేవ తత్త్వము. ఆ భగవానుడు ఈ జగమును సృష్టించుటకును, పాలించుటకును, ప్రళయ మొందించుటకును గర్త. ఆ మహానుభావున కీ కృత్యముల నొనర్ప సంకల్పము కల్గినపుడు నాల్గు రకములుగా దాను తన సంకల్పముతోనే యగును. ఈ రూపములను వ్యూహము లందురు.

ఈ వ్యూహములు పుట్టునవి కావు. ఆ యా కార్యములకై నాయా వాటిని పరవాసుదేవుడు అధిష్ఠించునపు డా యా వ్యూహ నామముల నొందును. (దీనిని ముందు వివరింతుము.) అవతారములకును వ్యూహములకును గల తేడా యిదియే. స్వేచ్ఛా కృతమగు పరమాత్ముని జన్మము నవతార మందురు. "అజాయమానో బహుధా విజాయతే" అను శ్రుతి. ఆ మహానుభావునకు, మనకు-జీవులకువలె స్వీయ పుణ్య పాపాత్మకమైన కర్మవశమున జన్మము లేదు. ఇక నేమి "సంభవామ్యాత్మ మాయయా"

అన్నట్లుగా సర్వేశ్వరేశ్వరుడగు నీ పరవాసుదేవుడు తన సంకల్పమువలననే మత్స్య, కూర్మాది రూపముల జన్మించుట అవతార మందురు. అట్లుగాక ఆ యా కార్యములకై ఆ యా వాటి నధిష్ఠించుటవలన నేర్పడునది వ్యూహము.

ఇట్లు నిత్యోదితు డగు పరవాసుదేవుడు నాల్గు వ్యూహములుగా నగును. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహము లని వాని పేరు. అందు మొదటిదగు వాసుదేవ వ్యూహమును శాన్తోదిత మందురు. రెండవది సంకర్షణ వ్యూహము, మూడవది ప్రద్యుమ్న వ్యూహము, నాల్గవది అనిరుద్ధ వ్యూహము. క్రమముగా వివరింతుము.

౧ వాసుదేవ వ్యూహము = శాన్తోదితు డగు వాసుదేవుడు నిత్యోదితు డగు పరవాసుదేవుడు. మహత్తత్త్వమును అధిష్ఠించినపుడు=పనిలో నుపయోగించుటకై ప్రేరేచినపుడు ఈ వ్యూహనామమున బిలువబడును. ఈయది కడమ వ్యూహముల కన్నింటికిని మొదటిది. ఈ స్వరూపము మరకతగిరివలె శ్యామలమై యుండును. క్షీరసాగర మీ వ్యూహమునకు నివాస స్థానము. పరవాసుదేవుడువలె నీ వ్యూహముగూడ షాడ్గుణ్యముతో పరిపూర్ణముగానే యుండును. ఈ వ్యూహము ఆధ్యాత్మికాధి భౌతికాధిదైవికములందు వేఱువేఱుగా గ్రహింబడును. ఇది ఆధ్యాత్మిక రూపమున చిత్త మందురు. ఆది భౌతిక రూపమున మహత్తు ఆధిదైవిక రూపమున వాసుదేవుడుగా నుపాసింపనగును. ఈ వ్యూహమున కధిష్ఠాత క్షేత్రజ్ఞుడు. (దీని యర్థము–జీవుల కర్మల పరిపాకదశవలన నీ మహాత్ముడు సృష్టింపవలెనని తలంపు కల్గి మహత్తత్త్వమును ప్రేరేచునని.)ఇది సత్త్వగుణ ప్రధానముగా నుండును. ఏ విధమైన దోషములును లేక నిత్యమై యుండును. శాంతముగా ఊర్మిషట్క రహితముగా–కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యము లను అరిషడ్వర్గము లేకుండ నుండునని భక్తులు దీనిని సేవించుచుందురు.

౨ సంకర్షణ వ్యూహము—ఇది వెనుకటి వాసుదేవ వ్యూహము నుండి యేర్పడినది. రెండవది, ఈతనియందు వెనుక జెప్పిన ఆరు గుణము లలో విజ్ఞానము, శక్తి యను రెండు గుణములు ప్రధానముగా నుండును. తెల్లగా అమృతపు నురువువంటి దేహమును, నల్లని వస్త్రమును కలిగి హాల మును ధరించి యుండును. ఈ గురుతులనుండియే బలరాముడు సంకర్షణు డుగా గుర్తింపబడినాడు. జీవుల నందరను సంకర్షించుటవలన నీ వ్యూహము సంకర్షణ మనబడగా కంసుని భయమున జెదరిపోయిన యాదవుల నందర నొకచోటికి సంకర్షించుటవలన బలరాముడు సంకర్షణు డనబడెను. సకల జీవులకును ఇత డధిష్ఠాత. ఈతని యధిష్ఠానము అహంకారము. రుద్రుడీ వ్యూహమున కధిష్ఠాత. ఈతడు భూతేన్ద్రియ మానసమయుడు. కర్తృ త్వము, కారణత్వము, కార్యత్వము, శాన్తత్వము, ఘోరత్వము, మూఢ త్వము మొదలగు లక్షణము లితనికి గలవు. నివాస మితనికి పాతాలము. అచట ముప్పదివేల యామడల వెడల్పున దోకను జుట్టజుట్టుకొని మహో గ్రమగు శరీరముతో అనన్తు డను సర్పాకారముతో విలసిల్లెడు నాదిశేషు డితడు. ఈతని వేయిపడగలందును ఆవగింజవలె ఈ ధరామండలముండును. ఈ మహనీయున కీ లోకములను సంహరింప దలంపు గల్గినపుడు అదివరలో మహా శాన్తుడుగా నున్నను ఇత డపుడు మహా ఘోరమగు క్రోధముతో ఏకాదశ రుద్రులను-మహా రౌద్రము కలవారిని, మూడు కనులవారిని, త్రిశూలముల జేతపట్టినవారిని సృజించును. ఆ పాతాళమందలి నాగేన్ద్రులు ఈ మహనీయుని నిరంతరము మ్రొక్కి సేవించుచుందురు. అచటి నాగ కన్యకలు అగరు, చందన, కుంకుమపంకముల ననులేపన మీతని కొనర్చు చుందురు. అప్పు డీతని దర్శన, స్పర్శనాదుల మూలమున మదనావేశము విజృంభింపగా చిరునగవుల వెదజల్లుచు నభిలాషతో సవ్రీడముగా నీతని జూచుచుందురు. అనన్తగుణు డగు నీ యనన్తుడు అప్పుడు క్రోధము నుప సంహరించి శాన్తుడై లోకముల క్షేమమును గోరుచుండును. సుర నర గరుడోరగాదులు తనొనరించు స్తుతులవలన సంతోషాతిశయముగల్గి బ్రహ్మా

గన్న వెట్టుచు గూర్కును. నారదుడు, తుంబురాదులతో గూడి బ్రహ్మ దేవుని సభయందీతని గొనియాడుచుండును. ఈ వ్యూహమునుండి మూడవదగు—

౩ ప్రద్యుమ్న వ్యూహము పర్పడును. ఈతనికి వెనుకటి యాఱు గుణములలో బలము, ఐశ్వర్యమును ప్రధానములు. తాపింఛము (చీకటి చెట్టు పువ్వు) వంటి శరీరపు ఛాయ. కనుకనే అట్టి శ్యామలవర్ణ సుందరుడగు శ్రీకృష్ణ కుమారుడు ప్రద్యుమ్నుడు ఈ వ్యూహమని గుర్తింపబడినది. ఈతని యధిష్ఠానము బుద్ధి. సకల ప్రాణి హృదయములందును ఈతడుండును. దీనికి అధిష్ఠాత బ్రహ్మదేవుడు. ఈ మూడవ వ్యూహమునుండి నాల్గవదైన—

౪ అనిరుద్ధ వ్యూహము పర్పడినది. ఈతనియందు వెనుకటి గుణములలోని వీర్య, తేజస్సులు అధికముగా ప్రధానములు. ఈతడు శరత్కాలమునందు వికసించిన నల్లకలువపూవువంటి చాయతో నుండును. ఇట నధిష్ఠాత చంద్రుడు. హృషీకము (వస్తువును గోచరించు నన్తరిన్ద్రియము) మనసు ఇతని యధిష్ఠానము. కనుకనే ఇతడు హృషీకేశుడు. ఇతడు పరవాసుదేవుడే కనుక నితనివలెనే అతనినిగూడ హృషీకేశు డందురు. ("ఏవముక్తో హృషికేశో గుడాకేశేన" అని భగవద్గీత.) ఈ యనిరుద్ధవ్యూహమే యీ సమస్త జగ దుత్పత్తిని నిర్వహించును.

ఇట్లు నాల్గు వ్యూహములుగా నున్నదియు నా మహానుభావుడైన భగవానుడు పరవాసుదేవుడే. అతడు పరవాసుదేవ తత్త్వమున స్వాయముగా సూత్మ మనబడును. ఈ వాసుదేవాదులు నల్గురు వ్యూహములు. మత్స్య, కూర్మాది అవతారములు విభవము. ఈ విభవమును—రామకృష్ణాద్యవతారమును భక్తి శ్రద్ధలతో నర్చించి క్రమాభివృద్ధితో వ్యూహముల నొందును. వానినిగూడ భక్తి వృద్ధితో ధ్యానార్చనాది విధానమున సేవించి సూత్మము నొందునని పాంచరాత్రాగమ ప్రక్రియ. ఈ యోగమోక్షమగు

విధానముననే ఈ మహానుభావు నర్చింపవలెనని "చతుర పాంచరాత్రోక్త హరి సమారాధన క్రియలను" అను మాటతో పోతనామాత్యులు తెల్పిరి.

## అ వ తా ర ము లు

అసలు ఈ వాసుదేవుని యవతారములను మన మేల ప్రస్తావించుకొనవలెనో తెలిసికొందము. పోతనామాత్యులే ఆ విషయము నిట్లు తెల్పుచున్నారు.

"ఆత్మ రూపకుడగు హరికథామృతమును
కర్ణపుటంబుల గాంతుదీర
గ్రోలుచుండెడు ధన్యులు కుటిల బహుళ విషయ మలినీ కృతాంగముల్
వేగ విడచి విష్ణుదేవుని చరణారవిందయుగముకడకు జనుదురు సిద్ధంబు గౌరవేన్ద్ర." (2–36)

మరియు

పరికింప మత్స్యరూప స్వభావములను, మహిమావతార కర్మములు దెలియ దత్త్వ విజ్ఞానంబు దలకొని మత్ప్రసాదమున గల్గెడి...(2–253)
శ్రీ శుకయోగీన్ద్రుని నోటినుండి భగవానుని యవతారకథలను విందము :–

అసలు అవతారము లన నేమియో యొకసారి విచారించి తెలసికొందము. జ్ఞానేచ్ఛా క్రియా శక్తు లెట పరాకాష్ఠ నొందునో అది యవతార మందురు. "అవతార" పదపు నర్థమును వ్యుత్పత్తినిబట్టి విచారించుచో పైనుండి క్రిందికి దిగుట యని. కాగా—పరమపద నివాసుడగు పరమాత్మ, వాసుదేవుడు, అటనుండి-నిత్యవిభూతినుండి లీలా విభూతి-ఈ లోకములోనికి దిగినపుడు అవతార మని పర్యవసానము. అస్లేల యా మహానుభావుడు దిగవలసివచ్చెనో? అనగా నిత్యానందమయము, సర్వోన్నతము, దుఃఖలేశముకూడ లేనిది అయినది నిత్యవిభూతి. శుద్ధసత్త్వమయము. అట

మిశ్రసత్త్వమే లేదు. ఇక రజ స్తమస్సుల యునికినిగూర్చి ప్రశ్న యేది? అట్టి దివ్యమగు నిత్యవిభూతినుండి యీ లీలా విభూతికి—వెనుకటి విభూతికి అన్ని విధములను ప్రతికోటిగా అనగా విరుద్ధముగా సతత దుఃఖమయము సర్వాధమము. సుఖాభాసము తప్ప సుఖలేశముకూడ లేనిది. రజస్తమస్సులతో మిశ్రితమగు సత్త్వ మటనట నుండునదియు, నధికముగా రజస్తమస్సుల తోనే నిండియున్నదియు నగు నీ లీలా విభూతిలోని కేల వాసుదేవుడు దిగవలసివచ్చెను? చక్కగా కాళ్ళు కడుగుకొని చంద్రకాన్త మణిమయమైన కుట్టిమమున నుండువాడు బురద వూబిలోనికి దిగునా? అని యాశంక కలుగును.

దానికి పాండవుల తల్లి, వాసుదేవుని మేనత్త కుంతీదేవి యిట్లని సమాధాన మిచ్చినది.

జలరాశి నడుమ దిరిగెడు కలము క్రియ౯ భూరిభారకర్శితయగు నీ
యిల గావ నజుడు గోరినగలిగితివని కొందరంద్రు గణనాతీతా—(1-

ఎవడైన నొక బాలుడా వూబిలో పడి లేవలేక, బైటికి రాలేక కొట్టుకొనునపుడు కరుణాళు డయ్యేనేని చంద్రకాన్త మణికుట్టిమమునందున్నను వెంటనే యూబిలోని కురికి బాలుని రక్షించియే తీరును. సామాన్యముగా కృపాళు డగువాడే యిట్లొనర్చుచుండ పరమ కృపాళు డగు పరమేశ్వరుడు వాసుదేవు డూరకొనునా? ఒకని విషయములోనే యట్లుండగా ఈ యనేక కోట్లమంది విషయములో నిక జెప్పనక్కర లేదుకదా! అయితే భగవాను డవతారమెత్తి భూభారమునుడిపె ననిన నేమి? చాల మందిని చంపుటయో, చంపించుటయో యింతయేకదా! అంతమాత్రమున రక్షించుట యెట్లగును? అట్లే యగుచో దానవ, రాక్షసాసురు లొనర్చిన దియు రక్షణమే. వారును లోక రక్షకు లనియే పేర్వడయరేమి? అని తోచవచ్చును.

ఇందుకే పోతన్నగారు—

"అంగవ్రాతములో జికిత్సకుడు దుష్టాంగంబు ఖండించి శేషాంగ
శ్రేణికి రక్ష సేయు"

అన్నారు. దుష్టాంగములవంటివారైన ఆసుర రాక్షస దానవాదులను సంహారించినచో మిగిలిన దేవతా, మహర్షి, సాధుపురుషులకు, వారివారి క్రియలు-భగవదర్చన, జప, తపో, ధ్యాన, సమాధ్యాదులు నిర్విఘ్నముగా నెరవేరగలవు. భగవానుని తత్త్వజ్ఞానము అందరియెడను వ్యాపింపగలదు. అవతారకథలు విస్తరించి కీర్తింపబడగలవు.

అల్పులును మందబుద్ధిబలులు అల్పతరాయువు లుగ్రరోగ సం
కలితులు మందభాగ్యులు సుకర్మము లెవ్వియు జేయజాల మీ
కలియుగమందు మానవులము. (1-44) అన్నట్లుగా—

ఇట్లున్న మనము తరింపవలెనన్నచో, దానికై, శ్రవణ, వందనార్చన, పాదసేవన, కీర్తన సఖ్య ధ్యాన స్మరణాత్మ, నివేదనముల నొనర్పవలెనన్నచో నా మహనీయుడు, కృపాకూపారుడు పరమపదాధి నాయకుడు శ్రీ వాసుదేవు డీ లోకమునకు దిగిరాక తప్పునా? మన కనుల కగుపడదిగు దివ్య మంగళ సుందర విగ్రహముల ధరింపక తప్పునా? మన మనో మోహనకరములగు దివ్య అద్భుత, మంగళకర లీలల నాచరింపక తప్పునా? అట్లు రాలేదా? ధరింపలేదా? ఆచరింపలేదా? అట్లే వచ్చినాడు. అవతారముల ధరించినాడు. దివ్యసుందరలీలల ప్రదర్శనము నాచరించినాడు. మనలనందరను సమకాలికులను ప్రత్యక్షముగాను, భిన్న కాలికులను శాబ్దికముగాను గోచరించి తరింపజేసినాడు, చేయుచున్నాడు, చేయనున్నాడు. కనుక నాయవతార కథా కథన మత్యంతావశ్యక మనుటలో సంశయములేదుకదా?

ఇక ఇపుడా మహానుభావుని యవతారములను చెప్పుకొందము. అవతారములు సామాన్యముగా రెండు రకములుగా భాగవతమున గన్పడు

చున్నవి. అంశావతారములని, కలావతారములని, మరికొందరు (వల్లభ, చైతన్యాదులు) పూర్ణావతారములని యొక విభాగమును గల్పింతురు. మత్స్య కూర్మాద్యవతారములు అంశావతారములనియు, ఋషభ, పరశు రామాద్యవతారములు కలావతారము లనియు పెద్దలు తెల్పుదురు. "అంశావతారా అన్యేతు కృష్ణస్తు భగవాన్ స్వయం," అనుటనుబట్టి సర్వ శక్తులను బ్రకటించిన యీ కృష్ణావతారము పూర్ణావతారమే ఇందువలన "పుండరీకాక్షుం డగు నారాయణుండు సమస్త భూభార నివారణంబు సేయం దన మేని కేశద్వయంబు చాలునని యాత్మప్రభావంబు తెలుపు కొరకు నిజకళాంశ సంభవులైన రామకృష్ణుల దేహవర్ణంబులు శ్వేత కృష్ణంబు లని నిర్దేశించుకొఱకు సితాసిత కేశద్వయ వ్యాజంబున రామ కృష్ణాఖ్యల నలరి యవతరించెను." (2-176) అని భాగవతములో పోతనామాత్యుని నుడువు లగుపడుటవలన శ్రీకృష్ణావతారము అంశావతార మను కొనగూడదని స్పష్టము.

ఈ యవతారములు దశావతారము లనియు, ఏకవింశత్యవతారము లనియు, మన్వంతరావతారము లనియు భాగవతమున గీర్తింపబడినవి.

ఈ యవతారముల ప్రసంగమును బ్రహ్మదేవుడు నారదునితో జేయు నాటికే వరహాద్యవతారములు కొన్ని కడచినవి. ఇక మన్వన్తరావతారములు అంగీకరించినవి కొన్నియు, మరికొన్ని యంగీకరింపగలవియుగా నున్నవి. ఆ సమయమున ధన్వన్తరి, పరశురామాద్యవతారములు నడచు చున్నవి. రాబోవు కాలమున శ్రీరామా ద్యవతారములు నడువనున్నవి.

## మన్వన్తరావతారములు :

౧ మొదటి మనువు స్వాయంభువ మనువు. అతడు శతరూప యను పత్నితో జిరకాలము రాజ్య మేలెను. అతనికి ఆకూతియు, దేవహూతియు నిరువురు కూతులు. అతడు ఆకూతిని రుచికిని, దేవహూతిని కర్దమునకు నిచ్చి పెండ్లి చేసెను. కొంత కాలమున కా మనువు విరక్తి

కలిగి తపసొనర్చి భగవాను డగు శ్రీ వాసుదేవుని మన్త్రోపనిషదర్థంబుల స్తుతించుచుండగా—

రక్కసులు దినగగడగిన వెక్కసముగ యజ్ఞనామ విష్ణుడు వారిం
జక్కడచె జక్రధారల. (8—12)

ఈ యజ్ఞు డెవరో యెరుగుదురా? ఆకూతికి రుచివలన జనించిన మహాను భావుడే. ఇది మొదటి మన్వన్తరమునందలి శ్రీహరియొక్క అంశమున గల్గిన యజ్ఞావతారము. ఈతడే ఇంద్రుడుగాగూడనుండి తన కొడుకులతో గూడి స్వర్గ మేలెను. ఈనాడు వేరుగా నింద్రుడు లేడు.

౨ ఇక రెండవ యవతారము—కర్దమునివలన దేవహూతి (మొదటి మనువు కూతురు) యందు కపిలుఁడను పేర నవతరించి తల్లి దేవహూతికి సాంఖ్యము, భక్తి యోగము మొదలగునవి యుపదేశించెను. ఆసురి యను బ్రాహ్మణునకు తత్త్వగ్రామ వినిర్ణయంబుగల సాంఖ్యం బుపన్యసించె. (ఈ మహానుభావు నుపదేశమునందే వ్యూహ చతుష్టయ ప్రకారము పాంచ రాత్రాగమ ప్రశంస, తదుక్త విధానమున నర్చన మొనర్పవలయుటయు దెల్పబడినది.) ఈ రెండును మొదటి మనువునాటి యవతారములు.

౩ ఇక రెండవ మనువు స్వారోచిషుడు. ఈతని తండ్రి సప్తార్చి. అతని పాలనకాలమున "వేదశిరు డను విప్రుని దయితకు—"తుషిత"కు పుత్త్రుడై తోయజాక్షు డవతరించెను. కౌమారక బ్రహ్మచారి యగుచు నతడు సలిపె వ్రతము." (8. 14.)

౪ మూడవ మనువు ఉత్తముడు. ఇతడు స్వాయంభువ మనువునకు పౌత్రుడు. ఇతని కాలమున ధర్మునకు సూనృత యను భార్యయందు సత్య సేను డను బేరున వాసుదేవు డవతరించెను. దుష్ట స్వభావులైన దనుజ యక్షపతులను జయించి సత్త్యజిత్తును అప్పటి యింద్రునకు సఖాయ మొనర్చెను.

౪ నాల్గవ మనువు, ఉత్తముని భ్రాత తామసుడు. ఇతని కాలము ననే పైని వర్ణించిన "హరి" యను ఆదిమూలావతారము నడచినది.

౫ అయిదవ మనువు, ఆతామసుని తమ్ముడు రైవతుడు. అతని కాలమున "శుభ్రి"డను వాని భార్య "వికుంఠ" కడుపున వైకుంఠుడను పేరున నవతరించెను. వైకుంఠ మను లోకమును నిర్మించెను. అది సకల లోకములకును సేవనీయముగా నొనర్చెను. శ్రీ రమాదేవి యా లోకమునం దెదురుకోలిచ్చి శ్రీ వాసుదేవుని గౌరవించినది. ఇది కళావతారము.

౬ ఆరవ మనువు, చాతుషుడు. ఆ కాలమున "వైరాజు" నకు "సంభూతి" యందు "అజితుడు" అను పేరుతో అవతరించెను. అతడే కూర్మరూపముతో జలధిలో మందరము మునిగిపోకుండ ధరించి అమృత మును మథింప సాహ్యామొనర్చెను. అమృతము దేవతలకు లభించిన దా మహనీయుని మూలముననే. ఇది అంశావతారము.

౭ ఏడవది యగు వైవస్వత మన్వన్తరము ప్రకృతము: నడచుచున్న ఈ వైవస్వత మనువును, శ్రాద్ధదేవు డనియు నందురు. ఈ కాలమున కశ్య పున కదితి గర్భమున వామనుడన నవతరించి, బలిని యాచించి మూడడు గుల మేర పుచ్చుకొని విరాడ్రూపమున ద్రివిక్రముడై భూమ్యాకాశముల రెండు పాదముల నాక్రమించెను. మూడవ పాదము బలి శిరస్సున నిడి యతనిని సుతలమున కడగద్రొక్కెను. ఈ యవతారము ఋగ్వేదమున నొకటి రెండు పర్యాయముల ప్రశంసింపబడినది.

"యస్యోరుషు త్రిషు విక్రమణేషు అధిక్షియన్తి భువనాని విశ్వా" అను ఋక్కు. "సమస్త భువనములును శ్రీ మహావిష్ణువుయొక్క మూడు అడుగులందును అడగియున్నవి" అను నర్థముతో నీ త్రివిక్రమావతార మును బ్రశంసించినది,

"ఇదం విష్ణు ర్విచక్రమే త్రేధాని దధేపదం" అని యజుర్వేదము. "విష్ణువు మూడు రకములుగా తన యడుగు నుంచెను" అని తెల్పును. ఇంతవరకీ యవతారములు కడచినవి.

౯ ఇక రాబోవు మన్వన్తరము లందలి యవతారముల కీర్తింతము సూర్యసావర్ణి యనువాడు ఎనిమిదవ మనువుగా నగుటకై యిపుడు తప నొనర్చుచున్నాడు. అతడు సూర్యునకు ఛాయయం దుదయించెను. ఆ కాలమున "వేదగుహి" కి "సరస్వతి" యను పత్నియందు "సౌర్వభౌము డ"ను పేరుతో నవతరించును వాసుదేవుడు. వామనావతార కాలమున బలిచక్రవర్తి వద్దనుండి తీసుకొన్న దేవేంద్ర పదవిని తిరిగి యతని కిచ్చి అత నిని దేవేంద్రునిగా ప్రతిష్ఠించును.

౧౦ తొమ్మిదవ మనువు వరుణుని కొడుకు దక్షసావర్ణి కాలమున 'ఆయుష్మన్తు'నకు 'అంబుధార' యను పత్నియందు ఋషభుడను భగవ త్కళావతార మేర్పడును.

౧౧ పదవ మనువు ఉపశ్లోకుని సుతుడు బ్రహ్మసావర్ణి. అతని కాల మున విశ్వసృజు నింట విశూచికి విష్వక్సేనుడుగా నవతరించును. శంభుడను నింద్రునితో జెలిమి సేసి జగమును కాపాడును. ఇది అంశావతారము.

౧౨ పదునొకండవ మనువు ధర్మసావర్ణి. అపుడు సూర్యాకునకు "ధర్మసేతు" వను పేరుతో భగవాను డవతరించి జగములను దయతో రక్షించును.

౧౩ పండ్రెండవ మనువు భద్రసావర్ణి. ఆ కాలమున సత్యాతపసు డను నతనికి సూనృత యను భార్య యందు "స్వధాముడు" అను పేరున లోకరక్షకై వాసుదేవు డవతరించును.

౧౪ పదమూడవ మనువు దేవసావర్ణి. ఈతని సమయమున దేవ హోత్రి భార్య బృహతికి భగవానుడు "యోగవిభుడు" అను పేరున నుద యించును. ఇంద్రుని సుఖపెట్టును.

౧౪ పదునాల్గవ మనువు ఇంద్రసావర్ణి. ఈతని మన్వన్తరమునందు సత్రాయణునకు వితాన యను భార్యయందు వాసుదేవుడు "బృహద్భానుడు" అను పేరున నవతరించును. యజ్ఞాది రూపమైన కర్మకాండమును విస్తరింపజేయును. ఇట్లీ పదునాలుగు మన్వన్తరము లందలి భగవ దవతారములను పరిశంసించితిమికదా ! ఇక కడమ అవతారములను కీర్తింతము.

నిజమున కీ యవతారముల కన్నింటికినిగూడ మొదటి యవతారము పురుష సూక్తమున బ్రతిపాదింపబడినట్లు వేయితలలతో నుండి ప్రకృతిని ప్రవర్తింపజేయునట్టి—

౧ ఆదిపూరుష రూపము-విరాడ్రూప మన్నమాట. ఇది యన్ని యవతారములకును మూలమైనది. దీనియంశాశముతో దేవతలు, తిర్యక్కులు, నరులు మొదలగువా రందరు సృజింపబడుచుందురు. ఆ మహానుభావుడే మొదట కౌమారసర్గమునందు బ్రహ్మణుడై దుశ్చరమగు నఖండిత బ్రహ్మచర్యము నాచరించెను.

౨ తరువాత వరహావతారమును తెలిసికొందము. మొదటిదగు విరాడ్రూపము కాలమున హిరణ్యగర్భునుండి యేర్పడిన సనకసనందనాదులు శపింపగా శ్రీహరి ద్వారపాలకులు జయవిజయులు కశ్యపుని భార్య దితి కడుపున హిరణ్యాక్షు, హిరణ్యకశిపులుగా బుట్టిరి. వారిలో హిరణ్యాక్షుడు రసాతలమునకు భూమిని చాపచుట్టగా జుట్టికొని పోవుచుండగా వరాహ రూపమున వాసుదేవుడు వానిని సంహరించి భూమిని రసాతలమునుండి యుద్ధరించెను. ఈ విషయము "ఉద్ధృతాసి వరాహేణ కృష్ణేన శతబాహునా" అని యజుర్వేదము తెల్పును. ఈ యవతారమునందే భూమి దేవి శ్రీ యజ్ఞవరాహునితోడి సమావేశమువలన నరకాసురుని కనెనని చెప్పబడినది.

౩ పుత్రార్థియై తపమొనరించు నత్రితో "నేను నీకు దత్తుడను" అని పల్కుటవలన "దత్తాత్రేయు"డని పేరు కల్గిన యవతారము ఏర్పడినది. హైహయ వంశ్యులైన కార్తవీర్యార్జునాదులు ఆ మహానుభావునివలన నష్ట విభూతి సంపాదక మగు యోగము బడసిరి. ఈ మహనీయుడే అలర్కుడు, ప్రహ్లాదుడు మొదలగువారికి ఆత్మ విద్యను బోధించెను,

४ బ్రహ్మదేవుడు కల్పాదికాలమున సృష్టిజేయు తలంపుతో తప మొనర్చుచు "సన" యనెను. అది కారణముగా నల్వు రవతరించిరి. వారే "సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులు." వీరు బ్రహ్మకు మానస పుత్రులు. శ్రీహరి కళలతో దనరి యుందురు. వారి సంప్రదాయము నుండియే విష్ణుతత్త్వజ్ఞానము ఈ లోకమున బ్రవర్తించినది. వారు నల్వు రుగా గన్పడినను నొక్కరుగానే గణింపబడుదురు.

౫ ధర్మునకు దక్షుని కుమార్తెయైన మూర్తివ యందు నర నారా యణు లవతరించిరి. వారు బదరికావనమున దపమొనరించుకొనుచుండగా నింద్రుడు తపసు చెఱచుటకై అప్సరసల బంపెను. వా రీ వనమునకు వచ్చి ఆటపాటల విహరించుచు తపసు జెఱుప బ్రయత్నించిరి. వారిని శపింప సామర్థ్య మున్నను అది తపోబాధకము కనుక దానిని వీడి నారాయణుడు తన తొడజీరి దానినుండి యొక్క చక్కని చుక్కను నిర్మించెను. ఊరువుల నుండి పుట్టెను గనుక నూర్వశి యనబడిన యామె చక్కదనమున కోడి సిగ్గుపడి యింద్రు డంపిన వనితలు తొలగిపోయిరి. ఇట్లు వీరిరువురును కామ క్రోధములను జయించిరి.

౬ ఉత్తానపాదు డను మహారాజునకు సుమతి గర్భమున ధ్రువు డన నవతరించెను. సవతి తల్లి సురుచి యాడిన మాటలవలన వగగుంది గొప్ప తపసొనరించి, సశరీరముగా నూర్ధ్వలోకముల కేగి మింట ధ్రువపదమున నిలచెను. పైనున్న భృగు ప్రభృతులు, క్రిందనున్న సప్తఋషులును తనను స్తుతించుచుండ నా మహాత్మ డిప్పటికిని నక్షత్రరూపమున గన్పడుచునే యున్నాడు.

౭ వేనుడు, బ్రాహ్మణుల మాటల ధిక్కరించి వారి యాగ్రహమున జనిపోయెను. అపు డరాజకమువలన లోకము పడు బాధల తొలగించు టకై వేనుని బాహువును మహర్షులు మథింపగా నారాయణాంశమున "పృధుచక్రవర్తి" యవతరించెను. తనవలెనే లక్ష్మి యంశమున బుట్టిన యామెను బెండ్లియాడెను. గోరూపధారిణియైన భూదేవినుండి లోకము లోని యందరికిని గావలసినవానిని పిదుకుకొనునట్లొనర్చెను. సనత్కుమారు నుండి యధ్యాత్మ తత్త్వము నుపదేశమొంది ప్రజలలో ప్రబోధమొనరించి పరమపదమున కేగెను.

౮ ఎనిమిదవది ఋషభావతారము. ఇది వెనుక మన్వన్తరములలో తొమ్మిదవ మనువునాటి యవతారము కాదు. అట అంబుధార, ఆయుష్మన్తులు తల్లిదండ్రులు. అతడు వేరు అది తొమ్మిదవ మన్వన్తరమున రానున్నది ఇది ఆగ్నీధ్రుని కుమారుడు నాభికి మేరుదేవియందు హరి వృషభావతారము. ఇత *డురుక్రము డని ప్రసిద్ధిపడసినాడు. ఇతడు జడస్వభావమైన యోగముతో జరించెను. ప్రశాన్తాన్తఃకరణుడై, పరిముక్తసంగుడై యత డుండగా అదియే పరమహంసల కభిగమ్యమగు పద మదే నని పరమర్షులు తెల్పిరి. ఈ మహానుభావుని జడయోగము, అవధూతప్రవృత్తిలోని యన్తరార్థము నెఱుగక అర్హ'తులు, జైనులు విపరీతముగా గ్రహించి అవైదికమై శిష్టులకు పరిగ్రహింపరానిదగు మార్గము నవలంబించిరి.

౯ తొమ్మిదవ యవతారము హయగ్రీవావతారము. బ్రహ్మదేవుడు యజ్ఞ మొనరించునపుడు సకల వేదమయుడును, సకలాన్తరాత్మయునగు యజ్ఞపురుషుడు శ్రీ వాసుదేవుడు సువర్ణ చ్ఛాయతో ''హయగ్రీవుడు''గా నవతరించెను. ఈ మహనీయుని నాసికా వివరములనుండియే వేదములన్నియు నేర్పడినవి.

౧౦ మత్స్యావతారము పదవది. శ్రాద్ధదేవు డను మారు పేరుగల వైవస్వత మనువునకు యుగాన్త సమయమున చిన్న చేపగా మొదట నగుపడి కొద్దికాలములోనే సముద్రమునతప్ప మరొకయెడ నుండుట కవకాశము లేనంత గొప్ప మత్స్యముగా బెరిగెను. ప్రళయ రాత్రిమున నిదురించు బ్రహ్మముఖమునుండి బయల్పడిన వేదములను సోమకు డను రాక్షసు డపహరింపగా వానిని సంహరించెను. ఆ వేదములను చిక్కువడకుండ బ్రహ్మదేవునకు దెచ్చియిచ్చెను. అంతేకాక మనువు మొదలగువారున్న నావను "ప్రలయ పయోధిజలము"న మునుగకుండ అనిమిషుడై రక్షించెను.

---

* ఈ యవతారము "ఉరుక్రమస్య సహి బంధురిత్థా" యని ఋగ్వేదము ప్రశంసించిన దనెదరు. "శంనో విష్ణు రురుక్రమః" అని యజుర్వేదముకూడ శాన్తిమంత్రములో ప్రశంసించినది.

౧౧ పదునొకండవది నరసింహావతారము.

౧౨ పండ్రెండవదగు హంసావతారమున శ్రీవాసుదేవుడు తన తత్త్వ మును దన యారాధనమును సరిగా బోధించి తన భక్తుల చరిత్రమును భక్తి మార్గపు ప్రాశస్త్యమును దెల్పు శ్రీ భాగవత మహాపురాణమును దేవర్షి నారదున కుపదేశించెను. ఆత్మతత్త్వ ప్రదీపకమైన యా భాగవతమునే ఆతడు నిరన్తరము నాస్వాదించుచు—

౧౩ పదమూడవదగు తన యవతారమున—అనగా నారదావతార మున దేవర్షియై కర్మనిర్మోచకమైన వైష్ణవతన్త్రమును నారద పాంచ రాత్రమను పేర తెల్పెను. భగవదుపదిష్టమగు భాగవత పురాణమును వ్యాసున కుపదేశించెను. అదియే శ్రీ శుకులద్వారా పరీక్షిత్తున కుపదేశింప బడి సూత శౌనకాది సంప్రశ్నోత్తరములుగా నైమిశారణ్యమున బ్రవచింప బడి యీనా డిట్లు మన పోతరాజుగారి ద్వారా మన నందరను తరింప జేయుచున్నది.

౧౪ పదునాల్గవదగు ధన్వన్తరి యవతారమున దన పేరు తలంచి నంతమాత్రముననే రోగముల నన్నింటిని నివారించుచు నాయుర్వేదమున జనుల కారోగ్య సౌఖ్యమును గల్గించెను.

౧౫ పదునైదవదగు పరశురామావతారము భృగువంశములో జమ దగ్ని భార్యయైన రేణుకయందు అవతరించెను. హైహయ వంశ్యులైన కార్తవీర్యార్జునాది రాజులు ప్రజలకు కంటకులుగా నుండగా వారి నంద రను సంహరించెను. ఆ వరుసనే లోకకంటకులను దునుమాడ సంకల్పించు కొని రాజు లందరను ముయ్యేఁడుమారులు వెదకి వెదకి చంపెను. బ్రాహ్మ ణులు తనను యాచింపగా నీ భూమండల మంతయు వారికి దానమొస గెను. ముందు మన్వన్తరమున-ఎనిమిదవ మనువు సూర్యసావర్ణి మనువు కాలమున సప్తర్షిపదము నలంకరింపగలడు.

౧౬ పదునారవది శ్రీరామావతారము.

౧౭ పదునేడవది బలరామావతారము. వసుదేవుని భార్యలలో మొదట దేవకి కడుపునబడి భగవదాజ్ఞవలన యోగమాయచే నా గర్భము

సంకర్షింపబడి రోహిణి యను వసుదేవుని భార్యయం దుంచబడియెను. ఆమె యందు జనించిన యీ కుమారకుడు బలవిభవంబున బలుండనియు, శరీర ధావళ్య సౌందర్యంబుల రాముండనియు, గర్భ సంకర్షణంబున నుదయించుటం జేసి సంకర్షణుం డనియు బిలువవంబడు. ఈతడు సుధాఫేన ధవళమగు రూపమును, నీలాంబరమును, హలమును ధరించుటం జేసియు జీవ సంకర్షణమువంటి సకల యాదవ సంకర్షణ మొనరించుటవలనను రెండవదగు సంకర్షణ వ్యూహముగా గుర్తింపబడును.

౧౮ పదునెనిమిదవది శ్రీకృష్ణావతారము.

౧౯ పందొమ్మిదవది వ్యాసావతారము. ప్రతి యుగమునందును అల్పహృదయులు, అల్పతరాయువులునైన మనుజులు వేదములను సరిగా గ్రహింపజాలరని వేదశాఖలను ఈ యవతారముననే విభజించినది. పరాశరునివలన సత్యవతియందు శ్రీమన్నారాయణు నంశమున నీ యవతారము కల్గినది. అష్టాదశ మహాపురాణములు, అష్టాదశోపపురాణములు, మన ప్రకృతపు శ్రీ మహాభాగవతము, మహాభారతము, హరివంశము, బ్రహ్మసూత్రములు ఇవి యన్నియు నిర్మించెను. "వ్యాసోచ్ఛిష్ట మిదం జగత్" అనియు "వ్యాసో నారాయణో హరిః" అనియు నేర్పడిన యాభాణకములు ఈ మహానుభావుని గొప్పదనమును స్పష్టపరచును.

౨౦ ఇరువదవ యవతారము బుద్ధావతారము. పరమ లుబ్ధులై, అనృతపరాయణులై, మ్లేచ్ఛాచారములతో పాషండ మతాభిమానము కల్గి లోకాపకార మొనరించు దైత్యులను మోసపుచ్చి సంహరించుటకై అజినుని సుతుడైన బుద్ధుని యవతారమును ధరించెను వాసుదేవుడు. ఆ దైత్యుల యాచార వ్యవహారములను జెడగొట్టెడు ఉపదేశముల నొనరించెను. వారిని మాయించెను.

౨౧ ఇక నిరువదియొకటవది కల్క్యవతారము. పరమాత్మయగు శ్రీ వాసుదేవుని స్మరింపక వేదవిహితములగు యజ్ఞ యాగాదుల యనుష్ఠానమ్ము మాని సత్యము నాదరింపక పాషండులై యున్న బ్రాహ్మణులును, అంతటి దుష్టులైన శూద్రరాజులును విజృంభించి లోకమున కపకారమొనర్చుచుండగా వాసుదేవుడు విష్ణుయశునకు కల్కిరూపమున నవతరించి

అశ్వారూఢుడై, ఖడ్గధారియై వారి నందరను సంహరించి . అధర్మమును అడంచును. ధర్మమును నిలువబెట్టును.

ఇవి భగవానుడైన వాసుదేవుని యేకవింశ త్యవతారములు. ఇట్టి నేకములగు నవతారములు మనము వర్ణింపనలవికానన్ని యింకను ఉన్నవి. వీనిని సాక్షాత్తు పరమపదనాథుడైన ఆ వాసుదేవుడే తానే లెక్కపెట్టజాల నని ముచుకుందునితో "ధూరజంబులనైన భూనాథ! యెన్నంగ జనుగాని నా గుణజన్మ కర్మ నామంబులెల్లను నెన్నంగ నెవ్వరు జాల రది యేల నాకును నలవికాదు" అనెను. అస లీ విషయము ఋగ్వేదములోనే విష్ణు సూక్తములో నిట్లు తెల్పబడినది: "విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచం యః పార్థివాని విమమే రజాంసి" అని తెల్పబడినది. భాగవతములోగూడ ఇట్లన బడినది: "విష్ణోర్ను వీర్యగణనాం కతమోఽర్హతీహాయః పార్థివాన్యపి కవిర్విమమేరజాంసి".

## భాగవత వైష్ణవము

వాస్తవముగా నాలోచించుచో శ్రీ భాగవత శ్రీ వైష్ణవమును, భగవద్రామానుజ శ్రీ వైష్ణవమును భిన్నములుగా నుండజాలవు. ఉండుట కవకాశములేదు. ఏమనగా రెండునుగూడ నొక పాంచరాత్రాగమమా ధారముగానే యేర్పడినవి. శ్రీ భాగవతమట్టిదని ఇదివరలోనే గ్రంథమునుండి నిరూపించియుంటిమి. భగవ ద్రామానుజుల పంచరాత్రాధికరణపు భాష్యమువలనగూడ వారి మతము తదాగమైక మూలమని స్పష్టము.

శ్రీ శుకయోగీన్ద్రులు పరీక్షిన్మహారాజుతో—

ఆ హరినామ సంస్మరణ మొక్క ముహూర్తమాత్రము చాలు ముక్తిదమౌ నృపా (2–8) అని యుపదేశించిరి.

"గోవిందనామ కీర్తనగావించి భయంబుదక్కి ఖట్వాంగధరిత్రీవిభుడు చూరగొనియెను గైవల్యము తొల్లి రెండు గడియలలోనఁ" (2–11) అని యుదాహరణము తెల్పిరి. అంతిమకాలమున భగవానుని స్మరణ మెంతటి సద్యోముక్తిదమై ప్రాధాన్యము వహించుచున్నదో ఆ విషయము నజామిళోపాఖ్యానములో (6 స్కం.) యమ విష్ణుదూతల సంవాదముతో

సంపూర్తిగా విస్తరించి ప్రదర్శించిరి. ఇందువలన వెనుక జెప్పినట్లుగా భగవన్నామ సంకీర్తనము అంతిమకాలమున దాని యావశ్యకతయుగూడ బోద్ధ్యవుల మనసునకు జాల చక్కగా పట్టును. శ్రీహరి నామసంకీర్తనము అత్యంత మావశ్యక మను శ్రీ వైష్ణవ విశేష లక్షణ మట పరిదర్శితము. దానికంగములుగా అహింసా స్వధర్మానుష్ఠానాదికమంతయుంనుడవచ్చును. ఒకవేళ లేకున్నను శ్రీ వాసుదేవ సంకీర్తన మొక ముహూర్తకాలము ప్రాణభీతితో నొనర్చినను అది యమదూతలనుండి సద్యోముక్తిని కల్గించి తీరునని ధృవపరుపబడినది. ఆ తరువాత మన గత జీవితము విషయములో నిర్వేదము కల్గును. తదనంతరము తత్త్వ విజ్ఞానము కల్గును. శ్రీ వాసుదేవునందు వెంటనే భక్తి జనించును. అతడు దాని ననుష్ఠించి పరమపదమునకు బోయి క్రమ ముక్తి భాగ్యము నందగల్గును. ఈ యర్థ మీ యజామిళ చరిత్రమునందు సువ్యక్తమగును. అతడు మరణకాలమున దన బిడ్డ మీది ప్రేమతో తన బిడ్డనే "నారాయణ నారాయణ" యని పిలచెను. అది భగవానుడగు విష్ణుని నామమేకదా! కనుక వెంటనే విష్ణుదూతలరుగుదెంచి యమదూతల బారద్రోలి సద్యోముక్తి నతనికి గల్గించిరి. ఆ తరువాత నతనికి తన గత చరిత్రమునుగూర్చి చాల నిర్వేదము కల్గినది. వైరాగ్య మేర్పడినది. "వైష్ణవజ్ఞానదీపం బాత్మస్నేహంబున దోచిన"ది. (6-151)

> హరిభక్తులతో మాటలు ధర నెన్నడు జెడని పుణ్యధనముల మూటల్
> వరముక్తికాంత తేటలు నరిషడ్వర్గములు చొరని యరుదగుకోటల్"
>
> (6-153)

అనుచు నా బ్రాహ్మణుడు తత్త్వవేత్తయైనాడు. భక్తియోగము నాశ్రయించినాడు. ఏమయినాడు? "సువర్ణమయమైన విమానంబెక్కి సకల మహానంద భోగభాగ్యానుభవా కుంఠితంబైన వైకుంఠ నగరంబునకు శ్రీమన్నారాయణ పదారవింద సేవాచరణ పరిణామస్థితికింజని"నాడు. (6-155). "ఇట్లు విప్లావిత స్వధర్ముండైన దాసీపతి గర్హిత కర్మంబుల చేత బతితుండయ్యును, హతవ్రతుండునై నరకంబున దూలుచుండి భగవన్నామ గ్రహణంబున సద్యోముక్తుం డయ్యెను." (6-155) కావున—

కర్మంబులెల్ల బాయను
మర్మము దెలుపంగలేరు మధురిపుపేరే
పేర్మి బఠించుటకంటెను." (6-156). ఇందులో గల సారమేమో
గమనించండి.

"పుత్రోపచారితమైన విష్ణునామ మవసానకాలమ్మున ననుభవించి శార్ఙి నిలయంబు జేరె నజామిళుండు." (6-158)

ఇక "నిట్లు సద్భక్తి కల్గిన నేమి చెప్ప." . (6-158). "కోరిన వారికినెల్లను చేరువ గైవల్య పదవి శ్రీవరుని మదిం గోరనివారల కెల్లను దూరము మోక్షాప్తి యెన్ని త్రోవలనైనన్." (6-159).

కాగా భగవన్నామమును గీర్తించిన సద్యోముక్తి కల్గునని యజామిళ చరిత్రము తెల్పినది. అంతేకాదు అవసానకాలమున నా శ్రీహరి స్మరణ మెంత యావశ్యకమోకూడా వ్యక్తపరచినది. ఈ నామస్మరణమున నతడు ధర్మాత్ముడై పరమాత్మయందు శాన్తినొందుట గమనించినచో—

"అపిచేత్సదురాచారః భజతేమామనన్యభాక్
సాధురేవ సమన్తవ్యః సమగ్వ్యవసితోహిసః
క్షిప్రంభవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి,
కౌన్తేయ ప్రతిజానీహినమే భక్తః ప్రణశ్యతి"

అను గీతావచనము అక్షరాల యథార్థమని మనకు ఋజువగునుగదా!

ఇట ధర్మాత్మత యన నేమి? పరమాత్మయగు వాసుదేవునియందు భక్తియే. "వాసుదేవునియందు బ్రయోగింపబడిన భక్తియోగంబు వైరాగ్య విజ్ఞానంబుల బుట్టించు......" "అపవర్గపర్యన్తంబైన యీ పరమధర్మంబు నకు మాధవుండు సంతోషించుటయే సిద్ధి." మాధవుండు సంతోషించున దేది? వినుడు ప్రహ్లాద సూక్తిని—

"చాలదు భూదేవత్వము
సాలదు దేవత్వ మధిక శాన్తత్వమునున్
చాలదు హరి మెప్పింపవిశాలోద్యములార భక్తిసాలినభంగిన్"
(7-244)

ఇట్లు వాసుదేవ ప్రీతికరమైన ధర్మము శ్రీహరి భక్తియే యని తేలినది. కనుక శ్రీ వాసుదేవునియందలి భక్తియే భాగవత వైష్ణవుల ప్రధాన విశేష లక్షణము. ఆ భక్తి నిట్లొనర్పవలెనని పరమభాగవతులలో మొట్ట మొదట గీర్తింపబడు ప్రహ్లాదుడు తెల్పుచున్నాడు.

తనుహృద్భాషల సఖ్యముఙ్ శ్రవణముఙ్ దాసత్వముఙ్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయుఙ్ సంకీర్తనల్ చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్ముఙ్ హరిఙ్ నమ్మి స
జ్జనుడై యుండుట భద్రమంచు దలతుఙ్ సత్యంబు దైత్యోత్తమా.
(7-167)

ఈ భక్తిమార్గమునే అన్వయ పద్ధతిలో నిట్లు దెల్పినారు :

కమలాక్షునర్చించు కరములుకరములు శ్రీనాథు వర్ణించు జిహ్వాజిహ్వ
సురరక్షకుని జూచు చూడ్కులుచూడ్కులు శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులువీనులు, మధువైరి దవిలిన మనముమనము
భగవన్తు వలగొను పదములు పదములు, పురుషోత్తమునిమీది బుద్ధి బుద్ధి.
దేవదేవుని జింతించు దినముదినము, చక్రహస్తుని బ్రకటించు చదువు చదువు,
కుంభినీవు జెప్పెడి గురుడుగురుడు, తండ్రి! హరి జేరుమనియెడు తండ్రి తండ్రి.
(7-169)

వ్యతిరేక క్రమమున—

కంజాక్షునకుగాని కాయంబు కాయమే పవనకుంభిత చర్మభస్త్రిగాక
వైకుంఠు బొగడని వక్త్రంబు వక్త్రమే ఢమఢమ ధ్వనితోడి ఢక్కగాక
హరి పూజనములేని హస్తంబు హస్తమే తరుశాఖ నిర్మితదర్విగాక
కమలేశు జూడని కన్నులు కన్నులే తనుకుడ్య జాలరంధ్రములుగాక
చక్రిచిన్తలేని జన్మంబు జన్మమే తరళ సలిలబుద్బుదంబుగాక

విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుడే పాదయుగముతోడి పశువుగాక.
(7-170)

శ్రీ రుక్మిణీమాతయు నీ విషయమునే స్వవిషయమున వాచ్యముగాను, అస్మదాదుల విషయమున వ్యంగ్యముగాను సాక్షాత్పరోక్షముల నన్వయించునట్లుగా తెల్పెనుగదా! (10-1076-1713.) *దృప్తప్రసన్న యగు శ్రీ రుక్మిణీమాతయేకాక ఆర్త ప్రపన్నులగు గోపికామ తల్లులుకూడ నెట్లనిరో గమనించండి.

నీ పాదకమలంబు నెమ్మి డగ్గరగాని తరలిపోవంగ పాదములురావు,
నీ కరాబ్జంబుల నెఱినంటితివగాని తక్కినపనికి హస్తములుసొరవు,
నీ వాగమృతధారనిండ గ్రోలగగాని చెవులను భాషలు సేరివినవు,
నీ సుందరాకృతి నియతిజూడగగానిచూడ వన్యంబుల జూడ్కికనులు,
నిన్నుకాని పలుక నేరవు మా జిహ్వ లొల్లననుచు బలుకనోడ వీవు
మా మనంబులెల్ల మఱసి దొంగిలితివి ఏమిసేయువారమింక గృష్ణ.
(10-992)

ఈ తీరున సకలేన్ద్రియములును సర్వేశ్వరుడును శర్వపితామహాదుల కునుగూడ అవిభావ్యుడగు శ్రీ వాసుదేవ పరమాత్మయందే తమ తమ కృత్యము లన్నియు సమర్పింపక తప్పనట్టి స్థితియే భాగవత వైష్ణవము లోని ప్రధానమగు నన్తరార్థము. మన మనసులో నీ రకముగా నిరన్తర మగు ధ్యాన ముండుట అత్యావసరము.

ఏ నీ గుణములు కర్ణేన్ద్రియంబులు సోక దేహతాపంబులు దీఱిపోవు
నే నీ శుభాకార మీక్షింప గన్నుల కఖిలార్థలాభంబు కలుగుచుండు
నే నీ చరణసేవ లే ప్రొద్దు జేసిన భువనోన్నతత్వంబు పొందగలుగు
నే నీలసన్నామ మే ప్రొద్దు భక్తితో దడవిన బంధసంతతులువాయు
నట్టి నీయందు నా చిత్త మనవరతము నచ్చియున్నది నీ యాననాన లేదు

---

* అని యిట్లు భగవంతుండైన హరి తన్ను బాయక సేవించుట ప్రియురా లను పట్టంపుదేవి నని యెడి రుక్మిణి దర్పంబు నేర్పున హరియించి (10-ఉ. 236) ఇందువలన శ్రీ రుక్మిణీమాత దృప్తప్రసన్న యని తేలినదికదా!

కరుణ జూడుము కంసారి ఖలవిదారి, శ్రీయుతాకార! మానినీ
చిత్తచోర!
(10–పూ. 1706)

అట్టి యార్తియు నిరన్తర ధ్యానమును రెండును భాగవత వైష్ణ
లగు గోపికలు శ్రీ రుక్మిణీమాత మొదలగు వారియందున్నది కనుక
ారందరును తరించి యా లక్షణములే తరణోపాయములని మనకు వ్యక్త
రచియున్నారు.

అందు ప్రహ్లాదుని "పాపసంచయములు పాయు నిన్ను, ముక్త
ంధుడవై నన్ను డగ్గఱెదవు" అని శ్రీ నృసింహమూర్తి కటాక్షించెను.

ఇకను లోకమాతను శ్రీ రుక్మిణీదేవిని "సురుచిరలీలఁ దెచ్చెద
బాలఁ" అని పలికి తెచ్చి కళ్యాణ మొనర్చుకొని చేపట్టెనుకదా! ఇక
భక్త భాగవత శిరోమణులగు గోపికల విషయములో—

కరుణాలోకములఁ బటాంచల కరాకర్షంబులఁ మేఖలా
కర బాహుస్తనమర్శనంబుల నఖాంకవ్యాప్తులఁ నర్మవా
క్స్ఫురిరంభంబుల మంజులాధరసుధాపానంబులఁ గాన్తలఁ
గరగించెఁ రతికేళి గృష్ణుడు కృపఁ గందర్పు బాలార్చుచుఁ.
(10–పూ. 1005)

అని పోతనామాత్యులు వారి కృతార్థతను స్పష్టపరచిరికదా.

ఈ యందరి కృతార్థతలకును స్వామిని గూర్చిన నిరన్తరాను
ధ్యానము పరమమైన ఆర్తితోడ గూడినది. తొలగిపోయిన, లేక స్వామి
కనుపడకపోయిన నేమౌదుమో యనునంతటి వియోగ భీరుత్వము ఏర్పడ
వలయును. అదియేకదా పరమభక్తి యందురు. "పునర్విశ్లేష భీరుత్వం
పరమాభక్తిరిష్యతే" అనికదా పెద్దల ప్రమాణోక్తి.

అయితే అజామిళు డొకటి రెండు పర్యాయములు అబుద్ధిపూర్వక
ముగానే స్మరించినను అతనికే రక్షణ దొరకినదికదా! గజేన్ద్రుని విషయ

మట్లు కాలేదేమి? అత డెంతో కాలము బుద్ధిపూర్వకముగానే తలంచినను, నుతించినను—

ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపలనుండు లీనమై
యెవ్వనియందు డిందు పరమేశ్వరు డెవ్వడు మూలకారణం
బెవ్వ డనాదిమధ్యలయు డెవ్వడు సర్వము తానయైన వా
డెవ్వడు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేడెదన్. (8–73)

అని చాలమారులు శరణు జొచ్చినను పరబ్రహ్మ లక్షణములలో జగజ్జన్మ స్థితి లయ కారణత్వములతో గీర్తించినను వాసుదేవుడు ప్రత్యక్షము కాలేదేమి? రాలేదేమి? కాపాడలేదేమి?

వినుడు. గజేన్ద్రునకు చాలకాలమువరకును స్థిరనిశ్చయములేదు. చూడండి.

కలడందురు దీనులయెడ కలడందురు పరమయోగి గణములపాలన్
కలడందు రన్నిదిశలను కలడు కలండనెడువాడు కలడోలేడో.
(8-867)

ఇంకను స్పష్టముగా—

వినుదట ! జీవులమాటలు
సనుదట ! చనరానిచోట్ల శరణార్థుల కో
యనుదట ! పిలచిన, సర్వముగనుదట ! సందేహమయ్యె గరుణా
వార్థీ ! (8-91)

వీని యన్నింటివలనను సందేహమే గజేన్ద్రుని తలంపులో నున్న దనుట తెలియవచ్చునుకదా ! అతనికి చాలకాలమువరకును స్థిర నిశ్చయముతో అకించన శరణాగతి కుదురలేదు.

లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె ప్రాణంబులా
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చె దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్

నీవే తప్ప నితః పరంబెరుగ మన్నింపదగుఁ దీనునిఁ
రావే యీశ్వర ! కావవేవరద ! సంరక్షింపు భద్రాత్మకా !

(8-90)

అని యకించన శరణాగతినాటికి ఆతనికి సంశయము వీడలేదు. తర్వాతనే కదా "సందేహమయ్యె" అన్నది, కనుకనే "సంశయము తొలగువరకును అతనికి రక్షణ దొరకలేదు. శ్రీ వాసుదేవుడు "సంశయాత్మా వినశ్యతి" యని నిస్సంశయముగానే గానమొనర్చెగదా ! భగవద్విరోధులైన హిరణ్యాకశిపు ప్రముఖులుకూడ నిశ్చయాత్మక బుద్ధితోనే వాసుదేవునితో విరోధించిరి. అజామిళు డబుద్ధిపూర్వకమైనను సంశయముతో బిడ్డను బిలువలేదు. నిశ్చయముగానే పిలచెను. అందుననే అతనికి వెంటనే ముక్తి దొరకెను. యమదూతలనుండి సద్యో రక్షణము లభించినది. ఇక ప్రహ్లాదునకు గజేన్ద్రునివలె అస్థిరబుద్ధిగాని, సంశయముగాని లేదు. స్థిర నిశ్చయమే. అతని మాట యిది—

కల డంబోధి, కలండుగాలి, గల డాకాశంబునం, గుంభినిం
గల, డగ్నిఁ దిశలం బగళ్ళ నిశలఁ ఖద్యోతచంద్రాత్మలఁ,
గల డోంకారమునం, ద్రిమూర్తుల, ద్రిలింగ వ్యక్తులందంతటం
గల డీశుండు, కలండు, తండ్రి ! వెదకంగానేల యీయాయెడఁ.

ఇందుగల డందులేడని సందేహమువలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన నందందే కలడు దానవాగ్రణి వింటే.

(7-274, 275)

గజేన్ద్రుడు "కలడో? లేడో? సందేహమయ్యెఁ" అని సంశయపడుచుండగా నీ మహానుభావుడు = ప్రహ్లాదుడు, "కలడు, కలడు, కలండు, వెదుకనక్కఱ లేదు. చక్రి సర్వోపగతుడు సందేహము వలదు" అని రాయి గ్రుద్ది వాసుదేవుని అస్తిత్వ నిశ్చయము ను ప్రకటించినాడు. కనుక గజేన్ద్రునకు సంశయ బుద్ధినిబట్టి వెంటనే రక్షణ లభించలేదు. భాగవత శ్రీ వైష్ణవు లందరు నీ

విషయమును ముఖ్యముగా గమనింపవలెను. భగవానుని విషయములో రక్షణ విషయములో సంశయ మెంతమాత్రము పనికిరాదు. మహా విశ్వాస పూర్వకముగా వాసుదేవుని భజించితీరవలెను. అవిశ్వాస మేమాత్రము కూడా పనికిరాదు. "అన్యాస్య సాధ్యే స్వాభీష్టే మహా విశ్వాసపూర్వకం... శరణాగతిః" అని సూక్తి. మహా విశ్వాసముతో భజించుటయే ప్రపత్తి. ఇది భాగవత శ్రీ వైష్ణవమున నత్యంత ప్రధానతమమని యిప్పటికి స్పష్టపడి నదికదా ! విరోధమునసైనను విశ్వాసమున్నచో నతనికి రక్షణ ముండును. "అసన్నేవ స భవతి అసద్బ్రహ్మేతి వేదచేత్" అను శ్రుతినిబట్టి అతడు అస త్పురుషుడు, కనుకనే వేననకు ఈశ్వరాస్తిత్వమున దలంపేలేదు. అతడు నాస్తిక్యముతోనే నాశనమైనాడు. ఇకను హిరణ్యకశిపుడు మొదలగువారు విరోధులైనను ఈశ్వరుని యస్తిత్వమున దృఢ నిశ్చయము కలవారే కనుక సత్పురుషులే. "అస్తిబ్రహ్మేతిచే ద్వేదసన్తమేనం తతోవిదుః" అని శ్రుతి ప్రమాణించునుగదా ! బ్రహ్మయున్నదని తెలిసినంతనే సత్పురుషుడగు నన్నపుడు ఆ బ్రహ్మ యంగమర్శనమున నెంతటి సత్పురుషత్వము సంభవింప నగునో యోజింపుడు. కనుకనే "అతడు రణమున నేడు నాయంగమర్శ నమున నిర్మల దేహుడై నవ్యమహిమనపగతాఖిల కల్మషుడై తనర్చి పుణ్యలోకంబులకు నేగు పుణ్యచరిత" (7–379) అని నృసింహరూపు డైన వాసుదేవుడు సెలవిచ్చినాడు. ఇపుడు శ్రీ వైష్ణవునకు బ్రధాన లక్షణము భగవానుడగు వాసుదేవుని యస్తిత్వ నిశ్చయము, రక్షించునను విశ్వాసమునుకూడనని తెలియవలెను. "రక్షిష్యతీతి విశ్వాసః" అనికదా శరణాగతిలోని ప్రకారము. ఇట్లు వాసుదేవునందు మహా విశ్వాసముతో నుండుటయే భగవద్రామానుజమునుల సిద్ధాన్తములోగూడ శ్రీ వైష్ణవుల లక్షణము.

అయితే ప్రహ్లాదుని విషయమున నొక శంక కల్గుచున్నది. అతనికి విశ్వాసమున్నదంటిరికదా ! అతడు చిరకాలము స్మరించినను రక్షణము, ముక్తి దొరకలేదేమి?

పరమాత్మయే ఈ యాశంకను దీర్చినాడు.

"సకలభూతములందు సంపూర్ణుడగు నన్ను యజ్ఞేశునీశ్వరునాత్మనిల్పి
కర్మచయములెల్ల ఖండించి పూజనమాచరింపు మీశ్వరార్పణముగ
భోగముల నశించు బుణ్యంబు వ్రతముల పాపసంచయములు
బాయు నిన్ను. (7-372)

ప్రారబ్ధకర్మము ప్ర దునకు మిగిలియున్నది. అందువలన నతనికి వెంటనే భగవత్ప్రాప్తి కలుగలేదు. అత డనుభవింపవలసిన ప్రారబ్ధ కర్మ తీరుటకే తండ్రి బాధలపెట్టినంతకాలము అత డనుభవించుచుండగా స్వామి యూరకున్నాడు. అతనికి కర్మ తీరగనే భగవత్ప్రాప్తి కల్గునని తెల్పినారు.

కనుక గజేన్ద్రునకు నిశ్చయబుద్ధి కుదురనంతవరకును పరమేశ్వరుడైన వాసుదేవుడు అతనిని రక్షింపక ఊరకున్నాడు. అతనికి నిశ్చయబుద్ధి యేర్పడినతోడనే ఆ పరమాత్మ విష్ణుదేవుడు ఆపన్న ప్రసన్నుడు తానెంత దూరముననున్నను, ఎట్టి రాగూడని తీరులోనున్నను, వినరాని వరుసలోనున్నను (చూ. "అలవైకుంఠపురంబులో") విన్నాడు. పరువెత్తుకొనివచ్చినాడు, కాపాడినాడు. ఈ విశిష్ట విషయమును మన పోతన్నగారెంత చక్కగా వ్యక్తపరచిరో గమనింపుడు.

అదివరకు "సందేహమయ్యెడి" అనుచున్న గజేన్ద్రుడు—

"ఓ కమలాక్ష ! యో వరద ! యో ప్రతిపక్ష విపక్షదూర ! కు
య్యో కవియోగివన్ద్య ! సుగుణోత్తమ ! యో శరణాగతామరా
నోకహ ! యో మునీశ్వర మనోహర ! యో విమలప్రభావ ! రా
వే ! కరుణింపవే ! తలపవే ! శరణార్థిని నన్ను గావవే ! (8-92)

"అరక్షిత రక్షకుండైన యీశ్వరుండాపన్నుండైన నన్నుగాచుగాక"
(8-93)

యని కమలాక్షునందు శ్రీ వాసుదేవ పరమాత్మయందు దృఢనిశ్చయమును గుదుర్చుకొని శరణార్థియై అతని యీశ్వరత్వమును, సర్వసామర్థ్యమును,

అరక్షిత రక్షకత్వమును, ఆపన్న ప్రసన్నత్వమును *నిస్సందేహముగా భావిం
చెనో లేదో? ఆ వెంటనే భగవానుడు — ఈ పేరు లా దశలో చాలవు. ఇక
నేమి? ఆపన్న ప్రసన్నుడే—

"సిరికిం జెప్పడు, శంఖచక్రయుగముం జేదోయి సంధింపడు, ఏ
పరివారంబును జీరడు, అభ్రగపతిం బన్నింపడు, ఆకర్ణికాన్తరధమ్మి
ల్లము జక్కనొత్తడు (ఇది యంతయు సరే) వివాదప్రోత్థిత శ్రీకుచో
పరిచేలాంచలమైన వీడడు (ఏల?) గజప్రాణావనోత్సాహియై.

(8-96)

అంతేనా?

ఆకాశమున దాను వేంచేయునపుడు ఇన్ద్రాది దేవతలు నమస్క
రించినను వానిని గైకొనలేదు. అసలు వారిని కడకంటనైన జూడలేదు.
మకరిని ద్రుంచి కరిని గాపాడునంతవరకును ఆ మహానీయున కారాటము
పోలేదు. ఆపదలోనుండి శరణాగతుడైన గజేన్ద్రునికన్నగూడ రక్షకుడగు
నీ మహానీయునకు—వాసుదేవునకు దాసుడు శరణార్థి రక్షింపబడువరకును
మనసు కుదుటబడదు. ఆ తండ్రికి ఈ బిడ్డలందుండు వాత్సల్యమట్టిది. ఈ
విశిష్ట స్వభావమును "తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా
మ్యహం" అన్న శ్రీ సూక్తితోగూడ శ్రీ వాసుదేవునందు నిత్యమును
మహావిశ్వాసముతో ననుసంధించుకొనుట భాగవతులైన శ్రీ వైష్ణవులకు
అత్యన్త విశిష్టమైన స్వరూపము. పరమాత్మయు సర్వరక్షకుడును ప్రపన్న
పారిజాతమును సర్వేశ్వరేశ్వరుడునునైన శ్రీ వాసుదేవునందే మహావిశ్వాస
ముతో నిత్యము శరణాగతులగుట-ప్రపత్తి నొనర్చుట [illegible] భాగ
వత శ్రీ వైష్ణవమని ముఖ్య తాత్పర్యము.

—:o:సంపూర్ణం:o:—

*మూలమునం దా క్రమము లేకున్నను పోతన్నగారు తన తెనుగుసేతలో
మొదల నంతయు గజేన్ద్రుని సంశయమును, జిట్టచివర కతనికి నిశ్చయ బుద్ధియు
నా వెంటనే పరమేశ్వరుని రక్షణమును, పద్యముల క్రమమును తీర్చిదిద్దినాడు.
ఇట్టి విశేషముల [illegible] పలుచోట్ల మన మహాకవి కూర్చియున్నాడు. గమనింప
వలెను.